# వి ష య సూ చి క

341 అల్లోపతి ఇంజక్షనులు
97 ఆయుర్వేద ఇంజక్షనులు
25 స్పెషల్ ఇంజక్షనులు
25 అల్లోపతి కాంపౌండింగులు
20 అల్లోపతి పేటెంటు ఔషధములు
24 ఆయుర్వేద కాంపౌండింగులు



# అల్లోపతి ఇంజక్షనులు

# అనుక్రమణిక

## A

B

## C

## D



## E



## F

## I



## K



## L

## M

## N

పుట

## S

## U



## V

---

## ఆయుర్వేద ఇంజెక్షన్లు



ಸಿರಿಂಜ

(2)



సిరంజీలోనికి మందును తీసికొనుట.



సిరంజిలోనికి మందును తీసికొనుట మరొక విధము.

(4)



సిరంజీలోనుంచి వాయువును తరిమివేయుట
ఇయ్యది ముఖ్యావసరము.










సరియైన పద్ధతి

ఇప్పుడు రక్తనాళములోనికి సిరంజి సూది

సవ్యముగా ప్రవేశించియున్నదను విషయమును గమనించుము

(6)





సరియైన పద్ధతి

రక్తనాళమునందు సిరంజి సూది ఇప్పుడు

సరియైన పద్ధతిలో గుచ్చబడినది.




తప్పు పద్దతి
రక్తనాళమునందు సిరంజియొక్క నూది,
ఇప్పుడు తప్పు పద్ధతిలో గుచ్చబడినది.




తప్పు పద్ధతి
రక్తనాళమునందు గ్రుచ్చబడిన సిరంజి నూది
ఇప్పుడుగూడా సరియైన స్థానమున ప్రవేశించక
తప్పు పద్ధతిగానున్నదను విషయమును చక్కగా గుర్తించుము



పిరుదుల కండరములందు ఇంజక్షను యిచ్చుటకు
తగిన తావులను గుర్తించుము.



చేతియొక్క రక్తనాళమునందు ఇంజక్షను ప్రయోగించుటకు అనువైన రక్తనాళమును గుర్తించుము.



కండరములోనికి ఇంజక్షను యిచ్చుట.



చేతి మడతవద్ద రక్తనాళమునందు ఇంజక్షను ప్రయోగించుటకు పూర్వము వ్రేళ్ళతో రక్తనాళమును సర్దుచు సరిచూచుకొనుట.



పాదము ప్రక్కన యేర్పడిన దుష్ట వ్రణములను
మాన్పుటకు కాలియొక్క రక్తనాళమునందు ఇంజక్షను
ప్రయోగము గావించునట్టి పద్ధతిని గమనించుము.



మోచేయివద్ద రక్తనాళముల సంబంధమైన రుగ్మతవల్ల
యేర్పడిన దుష్ట రక్తపుగడ్డకు చేయబడు
ఇంజక్షను చికిత్స.



చేతి మణికట్టువద్ద రక్తనాళముల సంబంధమైన రుగ్మతవల్ల యేర్పడిన దుష్టతత్వపు గడ్డకు చేయబడు ఇంజక్షను చికిత్స.



పురీషమార్గమున యేర్పడిన మూలవ్యాధిని నివారించుటకు
చేయబడు ఇంజక్షను చికిత్సయం దొకవిధము.



మోకాలిపై ఇంజక్షను చేయుట.



రక్తనాళములోనికి యెక్కువ పరిమాణముతో
ఔషధద్రవము యెక్కించు విధానము.



250 CCగాని యింతకుమించిన పరిమాణముతో గాని గ్లూకోస్ ద్రవము రక్తనాళమున కెక్కించు విధానము.



రక్తనాళిములోనికి ఇంజక్షనుచేయు విధానము.



బ్రహ్మదండి నాళములోనికి ఔషధద్రవము
నెక్కించు విధానము.

# నా మాటలు



ఈ గ్రంథమును మొదట వ్రాయుటకు నన్ను సర్వ విధముల ప్రోత్సహించి, తమ యమూల్యములగు సలహాల నొసంగిన ఆయుర్వేదకేసరి వి. ఎల్. ఎన్. శాస్త్రి, ఎ. ఐ. ఎ. డి. ఎఫ్, రిజిస్ట్రారు, నందంపూడి అగ్రహారం, అంబాజీపేట పోస్టు, అమలాపురం తాలూకా, తూర్పు గోదావరిజిల్లా వారికెంతయు నా అభివందనాలు. వారి సలహా నా అనుభవమును రెండింటిని సమ్మిశ్రితము చేసి నీ "ఇంజక్షన్ గైడ్" నీ విధముగా చదువరుల కందించితిని. ఇందలి గుణగ్రహణములు చదువరులే నిర్ణయింతురుగాక.

ఇందులోగల అల్లోపతి ఇంజక్షనులు, ఆయుర్వేద ఇంజక్షనులు, అల్లోపతి కాంపౌండింగు, ఆయుర్వేద కాంపౌండింగు అనుభవ పూర్వకముగా వ్రాయడమైనది. ఆయుర్వేద కాంపౌండింగులో ఆసవారిష్ట చూర్ణములతో స్వయముగా చేసి చూచి వ్రాయడమైనది.

ఇట్లు
డాక్టర్. డి. హనుమంతరావు,
ఆయుర్వేద వైద్యశాల, సికింద్రాబాద్.

# మామాట

ఇదివరలో, అనేక ఆంగ్లేయ వైద్యసంబంధమగు పుస్తకములు తెలుగున వ్రాయించి ఆంధ్రుల కందించి వారి ఆదరాభిమానములకు పాత్రులమైతిమి. తెనుగున ఇంజక్షనులు చేయుపద్ధతిగల పుస్తకములు బొత్తిగా లేనందున ఇంజక్షను గైడు పేరుతో మొదటికూర్పు మీ కందించి యుంటిమి. ఇప్పుడు అనేకమైన నూతన ఇంజక్షనుల తోను, విషయములతోను ఈ ఎనిమిదవకూర్పు మీ కందించ గలిగినందులకు మిక్కిలి సంతోషించు చున్నాము.

ఇందల్లోపతి ఇంజక్షనులు, ఆయుర్వేద ఇంజక్షనులు, అల్లోపతిమిక్చర్సులు, ఆయుర్వేద కాంపౌండింగు టానిక్సు యిందిమిడ్చి, అనుభవనీయులును, సుప్రసిద్ధ వైద్యులును నగు డాక్టర్ డి. హనుమంతరావు ఎ ఎ పి. ఎ, సికింద్రాబాద్ వారిచే మొదట వ్రాయించి, దీనికిగల సర్వహక్కులను వారిచే పొందియున్నాము. గాన యిందు కొంతగాని, అంతయుగాని, మార్చిగాని, మార్పుచేయకగాని అచ్చొత్తించు వారిపై మాకు కలిగే నష్టమును సివిల్, క్రిమినల్ చర్యలద్వారా రాబట్టుకొనబడునని ఇందుమూలముగా యెల్లరకును తెలియపర్చడమయినది.

ఇట్లు
కొండా శంకరయ్య
ప్రకాశకులు
కాపీరైటు హక్కుదారులు.

సికింద్రాబాద్,
[illegible]—1960

## ఇంజక్షన్ చేయవలసినప్పుడు
# తీసుకోవలసిన జాగ్రితలు



ఇంజక్షన్ చేయుటకుముందు గమనించవలసిన విధులు:-

సిరంజి సూదిని వేడినీళ్ళలో బాగుగా మరగించి, వేడినీళ్ళను సిరంజిలోనికి లాగి వదలిపెట్టవలెను. సిరంజీ యొక్క అన్నిభాగములను వేరువేరుగాజేసి వేడినీళ్ళలో మరగించవలయును. అట్లు మరగించిన తరువాత మసలి చల్లారిన నీళ్ళతో శుభ్రముగ కడిగిన పిమ్మట, శుభ్రముగా నున్నట్లుచూచి ఇంజక్షన్ నిచ్చుట చాలమంచిది. అంత జాగ్ర తగా శుభ్రము చేయనియెడల ఇంజక్షన్ చేసినచోట వాపు, బాధ, పోటు యేర్పడును. రోగికి ఇంజక్షన్ చేసేచోట కార్బాలికుసబ్బుతో శుభ్రముచేసి టించరుఅయిడిన్ వ్రాసి ఇంజక్షన్ చేసిన యేబాధయు లేకుండ నుండును. తరువాత ఇంజక్షన్ పెట్టెయందు గల అంపుల్సును రంపముతోకోసి సిరంజిలోనికి యంప్పుల్సులోపలగల మందును లాగుకొన వలయును. సిరంజిని పైకియెత్తి గాలిబుడగలు లేకుండ చేయవలయును. గాలి బుడగలుయుంటే చాల ప్రమాదము సంభవించును. గనుక ఈ విషయమునందు చాల జాగ్రతగా యుండి గాలిబుడగలు లేకుండ తరిమివేయవలయును. చేతులు శుభ్రముగా కడుగుకొని సిరంజీని నిట్టనిలువుగ

చేబట్టి మందును రెండుమూడు చుక్కలు మందు పైకి వదలిన సిరంజీలోని గాలిబుడగలు గాలిమొత్తము సిరంజి నుండి బయటికి వెడలిపోవువరకు పిష్టనును పైకి నెమ్మదిగా నొక్కి పిదప అంతయు సరిచూచుకొని ఇంజక్షనియ్యవలెను. అట్లిచ్చిన తర్వాత సూదిని, సిరంజీని డెటాల్‌తో శుభ్రముచేసి సూదియందుండు సన్నని తీగకు తెల్లవాజులేను వ్రాసి, సూది బెజ్జములోనికి యెక్కించ వలయును. సూదికి త్రుప్పుపట్టకుండ నుండును. సూది యెల్ల వేళలయందు విడిగా నుండవలయును. సూది మొద్దుబారిన యెడల మరొక క్రొత్తసూదిని మార్చవలయును. అట్లు మార్చక బలవంతముగా చేయుచో ఇంజక్షన్ చేసినచోట అమితమగు బాధ కలుగును. ఇంజక్షన్ చేసే ముందు డెటాల్‌తో ఆ స్థలమును శుభ్రము చేసిన చాలా మంచిది.

ఇంజక్షన్ చేయుటకు కావలసిన పరికరములు.

2 CC సిరంజి పెట్టె ఒకటి.
5 CC సిరంజి పెట్టె ఒకటి.
10 CC సిరంజి పెట్టె ఒకటి.
పరిశుభ్రమయిన అర్ధపౌను తెల్లని దూది.
రెండు ఔన్సులు టించరు అయిడిన్.
నాలుగు ఔన్సుల కార్బాలికు సబ్బు.

స్ఫిరిటు ల్యాంపు ఒకటి. డిస్టిల్డు వాటలు 10 CC అర్ధడజను తెల్లవాజులేను మెడికల్ సంబంధమునకు పనికివచ్చునది. సిరంజిపెట్టె తుప్పుపట్టకుండ దాచుకొన వలయును. సూదులు, సిరంజీలు అన్నివేళలయందు శుభ్ర ముగా నుంచుట మంచిది. వ్యాధిగలవారి కప్పటికప్పుడు ఇంజక్షను యిచ్చుటకు వీలుండును. ఇంజక్షను అంపుల్సుపై 1CC 2CC 5CC 10CC అని వ్రాసియుండును. 1CC అనగా (ఒక క్యూబికు సెంటుమీటరు) ఒక క్యూబికు సెంటు మీటరు పరిమాణముగా స్వచ్ఛమయిన నీరు ఒక గ్రాము బరువుయగును. 17 చుక్కల ద్రవ పరిమితి యనియందురు. సూదిని చర్మముక్రింద గుచ్చి ఔషధము విడచుదానిని హైపొడ్రమిల్ ఇంజక్షన్ అసబడును. ఇది చేతిదండ చర్మ మునకు తీయుచుందురు. సూదిని మాంసకండరములోనికి గుచ్చి ఔషధము విడచుదానిని ఇంట్రి మస్కులర్ ఇంజ క్షన్ అందురు ఇది పిఱ్ఱపై ఉంపు గట్టి కండరములోనికి తీయుచుందురు. సూదిని చేతిపైనుండు పెద్దనరము రక్త నాళములోనికి విడచుదానిని ఇంట్రివీనస్ ఇంజక్షన్ అందురు. ఈ ఇంజక్షన్ చేతిమడతవద్ద పెద్దసిరాలోనికి యెక్కించవలయును. ఈ ఇంజక్షన్ చాల ప్రమాదమం దురు. జాగ్రతగాచేసిన చాల బాగుగానుండును. ఈ సూది మందు చర్మముక్రిందకు పోయిన ఉబ్బుట, పోట్లు, మంటలు గలుగును. చాల జాగ్రతగా అనుభవముతో చేసిన యెడల

త్రిము అపాయము గలుగదు. ఇంట్రావీనస్ ఇంజక్షన్ నెమ్మదిగా చేసిన చాలమంచిది. మన గ్రామములలో యీ మూడు విధముల ఇంజక్షనులు చేయుచుందురు.

హైపొడ్రమిక్ ఇంజక్షన్ చర్మముక్రింద విడచుటకు సూదిని చర్మములోనికి యేటవాలుగ గ్రుచ్చవలయును. దీనినే చర్మవస్తి ఇంజక్ష ననబడును. ఇంట్రా మస్క్యులర్ ఇంజక్షన్ చర్మముక్రింద ఇచ్చు ద్రవముకంటె శరీరము లోనికిపోయి హెచ్చుగా పనిచేయును. సామాన్యముగా ఈ ఇంజక్షన్ పిఱ్ఱపైనుండు కండరములోనికి యివ్వవలయును. రోగిని బోర్లగా పరుండబెట్టి సూది యెముకలకు తగులకుండ యివ్వవలయును. ఎముకలకు తగిలిన నమిత మగు బాధ కలుగును. కాలు నరము సమీపమున పడిన యెక్కువబాధ కలుగును. జాగ్రతగా స్థలము నిర్ణయించి యివ్వవలయును. చర్మమునకును, సూదికిని ఎనిమిది డిగ్రీలు వాటముగా నుండునట్లు చూచుకొని కండరము లోనికి లోతుగా సూదినిగ్రుచ్చి మందును వదలుదానిని ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్ యని యనబడును. దీనినే కండరవస్తి అందురు. ఇంట్రావీనస్ ఇంజక్షన్ ద్రవము శరీరములో వెంటనే పనిజేయవలెనన్న ఔషధము రక్త నాళములోనికి యెక్కించుట మంచిది. ఔషధములు చర్మము క్రిందను కండరములోనికి చక్కగా యివ్వవచ్చును. ఈ ఇంజక్షన్ సామాన్యముగా చేతియొక్క పెద్దసిరాలో జేసె

దరు. రోగిని బల్లపై పరుండబెట్టి చేతిని చాచవలెను. దండపైన త్రాడునుగాని, రబ్బరునుగాని చుట్టి నరములు ఉబ్బునట్లుగా కట్టవలయును. బాగా తేలిన పెద్దనరమును గమనించి కార్బాలిక్ సబ్బుతో శుభ్రముజేసి వెంట్రుకలు లేకుండ చూచుకొని టించరు అయిడిన్ రుద్దవలయును. సిరంజిని నిటాలుగా పట్టి దానిలోని గాలిబుడగలు యేమా-త్రమును లేకుండ జూచి, ఒకానొక సమయమున నున్న యెడల వాటిని తరిమివేసి ఇంజక్షను చేయవలెను. గాలి బుడగలే యున్నయెడల యవి వెంటనే రక్తములోనికి ప్రవేశించి ప్రాణాపాయము గలుగజేయును. గనుక ఈ ఇంజక్షన్ చేయువారు బహు ఆలోచనతో గమనించి చేసిన చాలమంచిది. పొంగిన నరమును చేతితో నొక్కి ఆ నరమును గుర్తెరిగి సూదిమొనను అర అంగుళమువరకు పోనియ్యవలెను. చేతిని కదలనివ్వకుండగ చూచుకొనవలెను. సూది సరాసరి రక్తనాళములోనకు ప్రవేశించిన వెంటనే చేతికి కట్టిన కట్టును విడువవలయును. ఇంజక్షన్ ఔషధమును చాల నెమ్మదిగా విడువవలెను. ఆతురతకొలది ఔషధమును తొందరగా యెక్కించగూడదు. సామాన్యముగా ఒక నిమిషమునకు 1 CC ఔషధము యెక్కించవలెను. ఒకవేళ రక్తము సిరంజీమొనకు రానియెడల వెంటనే సూదిని బయటకులాగి యింకొక చేతినరమునకు యెక్కించ వల

యును. రక్తము సిరంజీమొనకు వచ్చినపిదప చూచి ఔష ధము వదలుచుండవలెను. రక్తము సిరంజీ మొనకు రానిదే ఔషధమును విడువరాదు. విడచినయెడల గొప్ప ప్రమాదము సంభవించును. ప్రమాదమేకాక ప్రాణాపా యముకూడ కలుగుటయందు యేమాత్రము సందేహము లేదు. ఔషధము సరిగా రక్తసిరాకు యెక్కినవెంటనే ముక్కులలోనికి, నోటిలోనికి అవుషధముయొక్క వాసన అప్పటికప్పుడె కనిపించును. అప్పుడు డాక్టరుగారు గాని, ఇంట్రవీనసు ఇంజక్షను యిచ్చేవారుగాని, ఇంజక్షణా రక్త నాళమునకు సరిగా ప్రవేశించినదని గ్రహించుకొనవలెను. పాషాణ సంబంధమయినవి సల్ఫర్ సనాల్ యిత్యాదులను బాగా, వాడుటకు అనుభవముతో యెరుంగవలెను. ఆ ఇంజక్షనులు తొందరలో ప్రాణాపాయమును గలుగజే యును. మనము యేఇంజక్షనులు చేసేవేళలయందు ఆ ఇంజ క్షనులు చేయుటయెరింగి వాటి గుణములను తెలిసికొని, వాటి మోతాదులు గమనించి ప్రకృతి, రోగిబలము, వారికి యింతకుముం దేవ్యాధిగలదో, ఆ వ్యాధికి యే యే అవుష ధము లుపయోగించిరో యెందుచేత మరల యీవ్యాధి అంకు రించినదో, పూర్వమందు సుఖవ్యాధులేవైన శరీరమునందు జీర్ణించియున్నవా, యెన్నాళ్ళక్రితమని వాటి స్థితిగతులు తర్జన భర్జనజేసి యింజక్ష నిచ్చుట మంచిది. అట్లు కారణము విచారించకుండ కంగారుపడి ఇంజక్ష నిచ్చిన అపాయము

కలిగి చెడ్డవైద్యుడను పేరు వెనువెంటనే తన యూరంతయు ప్రాకిపోయి, తన జీవనోపాధికి దెబ్బకొట్టి, తన కీర్తిని మంటగలిపి, తన ఆసుపత్రిని గబ్బిలములశాలగా మార్చి వేయును. కాబట్టి ఎంత పేరుమోగిగిన డాక్టరైనను తన విధిని నిర్వహించుటలో యేమరుపాటు యెంతమాత్రమును పనికిరాదు. ఇంజక్షన్ యెందుకిచ్చుచున్నావో తెలియునా? రోగిని నిరోగిని చేయుటకు. వేళ ననుసరించికూడ ఇంజక్షన్నిచ్చుట మంచిది. రోగి కన్నులు మూతలుబడి ఔషధము మ్రింగుటకు అశక్తుడై యున్నపుడు నీ ధైర్యమును పురస్కరించుకొని ఇంజక్షను నియ్యవచ్చును. అంతమాత్రముచేత నేమియుగాదు. నీ హస్తమే శుభహస్తమయినచో నీ యదృష్టమును హరిహరు లడ్డలేరు.

ఈ కాలములో ప్రతివ్యాధికి ఇంజక్షనిచ్చుటయే మంచిదని యందురు. కాని, ఇంజక్షన్ నిచ్చిన యెప్పటి కప్పుడు వ్యాధిబాధలు నివారించునేగాని దానికి మానవ లోకమునందు హెచ్చుస్థాయిలేదు. ఇప్పుడిపు డుద్భవించుచున్న నూతన వ్యాధులకు పాత ప్రిణాళిక లేమి పనికి వస్తవి? క్రొత్త సరిక్రొత్త వ్యాధు లుద్భవించుచున్నవని పెద్ద లనుచున్నారు. కాలము మారినందువలననో, మన వారి ప్రవర్తనలే సరిగా లేనందువలననో క్రొత్తరోగములే కానవచ్చుచున్నవి. నేను మా తాత తండ్రులనుండి అనువంశికముగా వచ్చుచున్న వైద్యవిద్యను బురస్కరించుకొని

ఆయుర్వేదమే గొప్ప పటుత్వముగలదని నేను చెప్పుటకు సాహసించుచున్నాను. నవభారతావనిలో ఆయుర్వేద ఇంజక్షణాలు కూడ యవతరించి సర్వరోగ నివారణము లగుచున్నవి. అందుకనే ఆయుర్వేదశాస్త్ర మన్ని శాస్త్రముల కన్న మిన్నయని చెప్పకతప్పదు. మన భారతీయులు ఆయుర్వేదమును పునరుద్ధరించి ఆయుర్వేద శాస్త్రమున కఖండ యశోవిశాలమగు కీర్తి నార్జించి, తమ యశశ్చంద్రికలు దిక్తటములయందు పిక్కటిల్లునట్లు జేయుదురుగాక యని ప్రార్థించుచు నింతటితో విరమించుచున్నాడను.

ఇట్లు
గ్రంథకర్త.



# ఇంజక్షన్ విధానము ఆయుర్వేద సమ్మతమా?



"ఇంజక్షన్" అనగా సామాన్యార్థము తగిన పని ముట్టుతో శరీరములోనికి ఔషధద్రవమును ప్రవేశపెట్టుట. పిచికారీలతోగాని, అటువంటి పనిముట్టుతోగాని ప్రవేశపెట్ట బడు పద్ధతినే వైద్యశాస్త్రమున ఉపయోగింపబడు పదము "ఇంజక్షన్" అనుమాట వాడుకలో నున్నది.

వేదకాలము మొదలు వాగ్భటుని కాలమువరకు మనదేశమున ఆయుర్వేద వైద్యాంగములగు "సూచీముఖ యంత్ర" "శల్యతంత్రము" మొదలగునవి మిక్కిలి ఉచ్ఛ దశలో నున్నట్లును, సుశ్రుతాది శస్త్రచికిత్సా నిపుణులు గొప్ప గొప్ప రోగములకు శస్త్రచికిత్సలు సూచీముఖ యంత్ర ప్రయోగములు జయప్రదముగా జరిపినట్లు చరిత్ర కాధార ములు కనబడుచున్నవి. రెండువేల సంవత్సరములకు పూర్వమే శస్త్రచికిత్సయందు సూచీముఖ యంత్ర ప్రయోగ ములయందును పూర్వాచార్యులకు గల నైపుణ్యమునుజూచి ఈ కాలపువారు ఆశ్చర్యమును పొందుచుండ అత్యంతము స్వల్పవిషయమగు "ఇంజక్షన్"ల పద్ధతి ఆయుర్వేదమున

లేదనుటగాని, దేశీయవైద్యులు వీనిని వాడరాదనుటకుగాని వీలులేదని అంగీకరింపక తప్పదు.

సూచికాభరణరసము, సూచీముఖరసము, పాశుపతాస్త్రరసము, బ్రహ్మాస్త్రరసము, అఘోరాస్త్రరసము ఈ మొదలగు ఔషధములను "సూచీ" వ్యధనముచే వాడుచుండినటుల నిదర్శనములు కనుపించుచున్నవి. వీనిని బ్రహ్మద్వారమునగాని, తాలు ప్రదేశమునగాని, శిరస్సునగాని చీరి సూదితో యిట్టి ఔషధములను ప్రవేశపెట్టుచుండెడివారు. ఇట్టి ఔషధములు రక్తములో కలియుట తోడనే అపాయస్థితియందున్న వ్యాధికూడ ఆరోగ్యము పొందునని కొన్ని ప్రాచీన ఆయుర్వేద గ్రంథములయందు చెప్పబడినది. వీని వాడుక నేటికిని ఆయుర్వేదవైద్యమున గలదు. వీని ఫలితములను మనము చికిత్సాచరణమునకును గొనుచునే యున్నాము.

ఇందుకు ఉదాహరణము.

శ్లో॥ యావత్సూచ్యా ముఖేలగ్నం । కూప్యానిర్యాతి భేషజం
తావన్మాత్రో రసోదేయో । మూర్ఛితే సన్నిపాతిని॥
క్షురేణ ప్రచ్ఛితేమూర్ధ్ని । తత్రాంగుళ్యాచ ఘర్షయేత్
రక్తభేషజ సంపర్కా । న్మూర్ఛితోపిహి జీవతి॥
(సూచికాభరణరసము-బసవరాజీయము ద్వితీయ ప్రకరణము)
బ్రహ్మద్వారేక్షురేణైవ । క్షతం గుంజావిమర్దితం ॥
(సూచీముఖరసము-బసవరాజీయము ద్వితీయ ప్రకరణము)

బ్రహ్మద్వారే వికేర్ణలోహిత । లవేసంజైకమాత్రింద
దేత్॥

(సూచీముఖరసము-రసరత్న సముచ్చయము ఉత్తరఖండము
C H 12)

ఈ ఔషధములకు రక్తసంయోగము కలిగి శరీర మంతట త్వరితగతిని వ్యాపించి రోగహర మగుచున్నది. ఇందు సూదితో ఔషధప్రమాణ నిర్ణయము జరుగుచున్నది.

నవీన వైద్యములోని ఇంజక్షన్ విధానము దీనిపై అభివృద్ధి చేయబడినది. ఔషధములు రక్తముతో కలియుటచే వెంటనే సర్వశరీరమున వ్యాపించుచున్నది.

---

# పచ్చపొడుచు విధానము

అతి ప్రాచీనకాలమునుండి పచ్చపొడుచు ఆచారము మనదేశమునందే గాక, విదేశములందు కూడ ఆచరణలో నున్నట్లు తెలియుచున్నది. మందుల నమ్మె దేశదిమ్మరులు కొందరు పచ్చపొడుచుట వృత్తిగా పెట్టుకొని వీధులవెంట యింకునిమిత్తమయి తిరుగుచు మందుల నమ్ముచుందురు. నేటికి మనము వీరిని చూచుచునే యున్నాము. అనేకులు వీరిని పిలిచి సొమ్మిచ్చి పచ్చ పొడిపించుకొందురు. దేహమంతయు పచ్చలు పొడిపించుకొనుటవల్ల శీతోష్ణమునుండియు, విషకీటకముల బాధల

నుండియు శరీరము రక్షింపబడుననియు, మరియు శరీరమునకు అలంకారమును, యుద్ధమున భీకరస్వరూపమును కలుగునని కొందరి నమ్మకము.

రెండు మూడు సూదులు కట్టగాకట్టి కాకరాకు పసరునగాని, సొరాకు పసరునగాని సూదులు ముంచి ఆ సూదులచే శరీరభాగమందు పొడుచుటకే పచ్చ పొడుచుటయందురు. అంతట ఆ పొడుపులకు నెత్తురుచెమర్చి క్రమముగా ఆరిపోవును. కొందరికి ఆనాడో లేక మరునాడో జ్వరము కూడ వచ్చును. ఈ పచ్చపొడుచు ఆచారము కేవలము అనాగరిక పద్ధతనియు, మూఢాచారమనియు కొందరు నిరసించుచున్నను, ఇందేదో కొంత అర్థ ముండుటచేతనే నేటివరకు ఈ ఆచారము రూపుమాయకున్నది. చిరకాలగతమయిన చలిజ్వరముచే, ప్లీహాభివృద్ధినొంది బాధపడుచుండు ఒకానొక స్త్రీ చేతిదండమీద తన పేరు పొడిపించుకున్నంత మాత్రమున ఆరోగ్యవతి యైనదని కొందరు స్వయముగా నెరిగి చెప్పియున్నారు. ఈ పద్ధతి ఆరోగ్య రక్షకమను నమ్మకముతోపాటు వ్యాధి నివారకముకూడ నుండుటజూడ ముసలమ్మలచే నాచరింపబడు ఈ మోటువ్యాపారము గూడ "ఇంజక్షన్" పద్ధతికి ప్రాతిపదికగా నున్నదని మనము అంగీకరింపవలసి వచ్చుచున్నది. నేడు హెచ్చుగా చెప్పబడుచున్న "ఫారన్‌ప్రోటీన్ థిరపీ" రహస్య మింతకంటె వేరైనది కానేరదు.

"సూచీముఖ యంత్రము" ద్వార రక్తములోనికి ఔషధ ద్రవమును ఎక్కించుటయే యిందు ప్రధాన కర్మ. అందుకే అల్లోపతీయులు రక్తనాళములోనికి ఎక్కించుచునే యున్నారు.

వివిధ వ్యాధులకు ఇంజక్షన్ రూపమున మందులను వాడు పద్ధతి పూర్వీకులకు తెలియకపోలేదు. చరక, శుశ్రుతాదులనుండియే భిన్నభిన్న శాఖలుగ వివిధ వైద్య పద్ధతులు బయలు వెడలినవి. ఇందునుగురించి వర్ణన ఆయుర్వేదములో లేదనియు యెక్కువగా ప్రజలు సందేహించుచున్నారు. కాని యిది నిజముకాదు. మన శాస్త్రములోను ఈ పద్ధతి స్పష్టముగా నిరూపించబడి యున్నది. రసశాస్త్రములో ఇట్లు చెప్పబడినది :

"రక్తభేషజ సంపర్కాన్ మృతావస్థోపి జీవతి"

కొన్ని సంవత్సరముల క్రిందట, బెంగాల్ ఆయుర్వేద రిసెర్చి అధ్యక్షుడు శ్రీ జగదీశ చంద్రబోసు మన సూచికాభరణ రసముతో ఒక కప్పకు ఈ ఔషధమును సూదితో ప్రయోగించి దాని జీవముపైనను, హృదయగతి పైనను ఆశ్చర్యకరమయిన బలమును కలుగజేసిన విషయము మనకు విదితమయి యున్నది. ఈ విధముగానే పాశ్చాత్యవైద్యులు సూదులద్వార ఔషధముల ఉపయోగించుచుండుట విదితము. ఇట్టి ప్రయోగములయందు

ప్రాచీన కాలమునాటి ఆర్యులు నేర్పరులనుట కనేక ప్రమాణములు కనబడుచున్నవి. నవీనయంత్ర శస్త్రముల స్వరూపము, ప్రయోజనము పరిశీలించి చూచినచో నేటివన్నియు చాలవరకు ప్రాచీనకాలపు ఆయుర్వేదశాస్త్రము ననుసరించి ఏర్పడినవేననికూడ తెలియగలదు. ఈ విషయములు విస్తారముగా తెలిసికొనగోరు మా వైద్యసోదరులు నాతో ప్రత్యేకముగా కలసి మాట్లాడవచ్చును. గ్రంథవిస్తరభీతిచే నెక్కువగా వ్రాయక ముఖ్యమయిన విషయములనే వ్రాసియున్నాడను.

నేటి విదేశవైద్యములో వాడుకలోనున్న యంత్రశస్త్రములన్ని ఆయుర్వేదము ననుసరించి ఏర్పడినట్లు తెలియుచున్నది. ఇందు ముఖ్యముగా చూడదగినగ్రంథము "సర్జికల్ ఇన్స్టుటుమెంట్సు ఆఫ్ హిందూస్" అను గ్రంథము శ్రీ గిరీంద్రనాథ్ ముఖర్జీ బొంబాయి నివాసి రచించినది.

ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఇట్టి పనులకు తగు యంత్రసాధనములు లేవని వాదసౌకర్యమునకై అంగీకరించినను, అవసరమునుబట్టి నూతన యంత్రపరికరముల నిర్మించుకొనుటకుగాని వాడుటకుగాని శాస్త్రకారులు అనుజ్ఞయిచ్చియే యున్నారు. నేడు ఇంజక్షనులకై వాడబడు పలురకముల పిచికారులు దేశకాల పరిస్థితులనుబట్టి అందరును పరిగ్రహింప తగినవేననుటగూడ శాస్త్రరీత్యా పైవాక్య

ములవల్ల సిద్ధించుచున్నది. ఈ పరిస్థితులలో ఔషధమును శరీరములోనికి ప్రవేశపెట్టు సూచీముఖ యంత్రసాధనము మనకు లేదని చెప్పువారుండరు. ఇక నీ విషయము ఆయుర్వేద శాస్త్రసమ్మతమే యగుచో ఆ శాస్త్రమునందు చెప్పబడిన సాధనములతో ఔషధములను ఏల వాడుచున్నారను ఆక్షేపణ రాగలదు. ఈ ప్రశ్నకు లోక ప్రవృత్తియే సమాధాన మీయగలదు. దేశ కాల పరిస్థితులనుబట్టి మార్పునొందని దేదియునులేదు. చైతన్యమయమగు లోకము యెడతెగక అభివృద్ధి నొందుచున్నప్పుడు లోక శ్రేయమును గోరి ప్రవర్తిల్లిన శాస్త్రములు అభివృద్ధి నొందుచుండుట సహజము. నేటి సిరంజీ నిర్మాణము నాజూకుగా నున్నప్పుడు మనము దానిని వాడుట తప్పగునేని ఇట్టి సౌకర్యములను ఉపయోగించుకోలేని మనము ఈ కాలమున ఉండుటయే ఒక తప్పుగా పరిగణించుకొనవచ్చును. మానవ బాధానివారణమే వైద్యశాస్త్ర ప్రయోజనము. అసలు ఈ పద్ధతి మంచిది కాదని వాదించు వైద్యులులేరు. ఇందు నమ్మకముండి వాడగోరువారు ఆయుర్వేద సూచీముఖ యంత్రముద్వార ఔషధముల ప్రయోగించి ప్రజాసామాన్యమునకు మనవైద్యముపై ఆదరాభిమానములు, పురోభివృద్ధికి వలయు మార్గముల ననుసరింపజేయవలసి యున్నది.

ఆయుర్వేద ఇంజక్షనులు తయారుచేసే సంస్థలు నేడు దేశమున బహు ప్రచారములో నున్నవి. ఆయుర్వేద

వైద్యులందరును విరివిగా కొలదికాలమునుండి ఉపయోగించుచునే యున్నారు. శాస్త్రరీత్యా వీని పుట్టుపూర్వోత్తరములు విచారించి ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఇంజక్షన్ పద్ధతి నిరూపింపబడియున్నదో లేదో లోకమునకు తెలుపవలసిన బాధ్యత యిప్పుడు మనందరిపైకలదు ఇట్టి విమర్శనకు గడంగుటకుముందు ఇంజక్షన్ శిక్షణ పొందుట ముఖ్యావసరమైయున్నది. ఇంజక్షన్ విధానము ఆయుర్వేద శాస్త్రమునకు క్రొత్తకాదు. ఆయుర్వేద వైద్య శాస్త్రీను సారముగా వాటి రసవీర్య విపాకాదులను పరిశీలించి వాడుటకు ఈ శాస్త్రమర్యాదల నెరిగినవా రెవరును అభ్యంతర పెట్టజాలరు.



# పెద్దల అభిప్రాయములు



Dr. ఆచంట లక్ష్మీపతి B. A. M. Bc. M. గారి
అభిప్రాయము.

వివిధ వ్యాధులకు ఇంజక్షనుల రూపమైన మందులను వాడుపద్ధతి పూర్వీకులకు తెలియకపోలేదు. చరక సుశ్రుతాదులనుండియే భిన్నభిన్న శాఖలుగల వివిధ వైద్య పద్ధతులు బయల్వెడలినవి.

సూతికాభరణ మను ఔషధమును రక్తములోనికి ప్రవేశ పెట్టబడు పద్ధతి చెప్పబడియున్నది.

స్వర్గీయ ఆయుర్వేద పునరోద్ధారక

పండిత D. గోపాలాచార్యులు గారు ద్వితీయ ద్రావిడ వైద్య మహాసభ తిరువహీంద్రపురం అధ్యక్షోపన్యాసం.

పిచికారీద్వారా ఔషధమును రక్తములోనికి ప్రవేశ పెట్టబడు పద్ధతిని డాక్టరులు క్రొత్తగా కనిపెట్టియున్నారనియు, దాని ప్రచారమును ఆరోజు కారోజు వృద్ధిచేయుచున్నారనియు ఇందునుగురించిన వర్ణన ఆయుర్వేదములో లేదనియు యెక్కువగా ప్రజలు సందేహించుచున్నారు.

## త్ర్యంబకలాల్ త్రిభువనముని గుజరాత్ వైద్య సమ్మేళన అధ్యక్షోపన్యాసము.

సూదులచే ఔషధముల ఉపయోగము. ప్రకృత కాలమున పాశ్చాత్యవైద్యులు సూదులనుండి ఔషధముల నుపయోగించుట విదితము. ఇట్టి ప్రయోగములయందును ప్రాచీన కాలముననే ఆర్యులు నేర్పరులనుట కనేక ప్రమాణములు కనబడుచున్నవి. అందు రసరత్న సముచ్చయ మందలి సన్నిపాత ప్రకరణమందిట్లు నిరూపితము. తీవ్ర సన్నిపాత వ్యాధియందు తాలు (చెలివెలు) ప్రదేశమున చిల్వ మిక్కిలి వాడియైన మొనగల సూదిచే ప్రయత్న పూర్వకముగ సూచికాభరణము నుపయోగించునది. బ్రహ్మ ద్వారమున చీలి నెత్తురు వచ్చినమీద సూచీముఖరసమును ఉపయోగించునది.

ఉపోద్ఘాతము, రసప్రదీపిక పుట (XVI)

1. M. విశ్వేశ్వరశాస్త్రి H. P. I. M. ప్రిన్సిపాల్ ఇండియన్ మెడికల్ కాలేజి, మద్రాసుగారి అభిప్రాయము కూడ యింతే.

2. అరవింద కెమికల్ వర్క్సు, ప్రముఖ ఆయుర్వేద ఇంజక్షనులు తయారుచేసే సంస్థకు చెందిన M. P. వారియొక్కయు.

3. ది. అపొల్లో ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్ బరోడ వారియొక్కయు.

4. ఆంధ్రదేశమున గల ప్రముఖ ఆయుర్వేద ఇంజక్షనులు తయారుచేయు సంస్థయొక్క కర్త వైద్య విద్వాన్ దూబగుంట సుబ్రహ్మణ్యం ఇండియన్ మెడిసన్ హౌసు విజయవాడ వారి యొక్కయు,

5. హోమియోపతి మెడికల్ హాల్ Dr. B. L. నారాయణరావు, కింతాడ కోటపాడు, విశాఖజిల్లా వారి యొక్క అభిప్రాయ మేమన,

ఆయుర్వేదములో ఇంజక్షన్ వైద్యవిధానమున్నది. ఇది చాలాకాలము క్రిందటనే ఆచరించబడినది. ఇప్పుడు క్రొత్తగాదని నా అభిప్రాయము.

6. సంపాదకుడు ధన్వంతరి మాసపత్రిక. వేటూరి శంకరశాస్త్రి, ఆర్షరసాయనశాల, ముక్త్యాల, క్రిష్ణాజిల్లా వారి యొక్క అభిప్రాయముకూడ యింతే.

7. లేడీడాక్టర్ కమలారాణి పబ్లిసిటీ కార్యదర్శిని ఆలిండియా మెడికల్ Exhibition Xth. Grand Session of U. P. Provincial Homoeopathic Medical Conference బేరిలి U. P. గారి యొక్కయు,

8. Dr. C. P. Samuel B. Ph. C. A. V. M. మెంబర్ of ది ఆల్ ఇండియా మెడికల్ సొసైటి కాశ హస్తిగారి యొక్కయు,

9. వైద్యభిషక్ G. రామశర్మ R.M.P. అనంత పూర్‌గారి యొక్కయు,

ఇంకా ఎందరెందరో ఆయుర్వేదోద్ధారకులగు పెద్ద లగు వారలు ఆయుర్వేద వైద్యవిధానమునకు ఇంజక్షన్ విధానము నూతనము కాదనియు, ప్రాచీన కాలమునుండి వాడుకలోనే యున్నదని అభిప్రాయపడియున్న విషయము మీ అందరిముందు నిరూపించియుంటిని. నా అభిప్రాయము వీరితో ఏకీభవించుటకు నా సర్వశక్తిని ఆయుర్వేద ఇంజక్షన్ వైద్యాభివృద్ధి చేయుటయే నా ప్రథమ కర్తవ్యము.

## ఆయుర్వేద వైద్యసోదరుల కొరకు
## విజ్ఞప్తి

నేడు మన భారతదేశమున "ఆయుర్వేద ఇంజక్షన్" విధానము ప్రచారములోను, వ్యాధి నివారణలోను ప్రధాన పాత్ర వహించుచున్నది. నూతన పోకడలతో ఆయుర్వేద వైద్యాభివృద్ధి చేయుట ప్రతి ఆయుర్వేద వైద్యుని కర్తవ్యము. ఇందుకుగాను ఆయుర్వేద వైద్యసోదరులందరు ఆయుర్వేద సమ్మతమైన "ఇంజక్షన్" శిక్షణ పొందుట ముఖ్యావసరమని వైద్యసోదరుల ప్రోత్సాహముచేత "ఆయుర్వేద ఇంజక్షన్ శిక్షణకేంద్రము" స్థాపించ బడినది. సులభముగా ఇంజక్షన్ శిక్షణ పొందుటకు నాచే రచియింపబడిన "ఆయుర్వేద & అల్లోపతిక్ ఇంజక్షన్ గైడ్" ముఖ్యముగా ఈ శిక్షణకు అవసరముండును.

పూర్తివివరములకు 0-4-0 అణాల పోష్టుబిళ్ళలు ఈ క్రింది విలాసమునకు వ్రాసి తెలుసుకొనవచ్చును.

డాక్టర్, డి. హనుమంతరావు,
ఆయుర్వేద సూచీముఖ యంత్రశిక్షణ కేంద్రము,
2146, లాలాగుడిబజార్, సికింద్రాబాదు.

# వ్యాధియొక్క సాధారణమైన పరిస్థితుల యందు ఇంజక్షను చేయుటకు అనువగు వేళలు.

ఉదయము, సాయంకాల సమయములందు, ఇంజక్షన్ చేయుట ఉచితము.

క్షయవ్యాధికొరకు "స్ట్రెప్టొమైసిన్" వంటి ఇంజక్షనులను యిచ్చుట మంచిది.

సాధారణమైన అన్ని పరిస్థితులయందు భోజనమైన వెంటనే ఇంజక్షన్ చేయరాదు. అట్లు చేసినచో ఔషధము గాని, తత్వముగాని వెంటనే వికటించవచ్చును. భోజనమైన పిదప రెండు మూడు గంటల వ్యవధికి పిదప ఇంజక్షన్ చేయుట మంచిది. క్వినైన్ సంబంధముగా తయారగు ఇంజక్షన్ జ్వరము జారకపూర్వము ఈయరాదు. జ్వరము జారుటకు పూర్వము ఒకగంట ముందుగాని, పూర్తిగా జ్వరము జారినవెనుక ఒక గంటకుగాని యిచ్చుటచే వ్యాధి తిరిగి రాకుండ చేయుటకు వీలుగానుండును.

శరీరమున జ్వరము నిలచియుండగా క్వినైన్ సంబంధమైన ఇంజక్షను యిచ్చుటవల్ల వాంతులు, తాపము, భ్రాంతి, నిద్రాభంగము, ఆయాసము మొదలగు అనేక లక్షణములు సంప్రాప్తించుటకు అవకాశము మెండుగా గలదు.

ఇంతియేగాక అట్టి పరిస్థితులలో వ్యాధిని, పై లక్షణములను గూడా తగ్గించుటకు నాలుగైదు రోజులు శ్రమపడవలసి యుండును. కాని యిది నిజముకాదు. మన శాస్త్రములో ఈ పద్ధతి స్పష్టముగా నిరూపించబడియున్నది.

పరిస్థితిని గమనించక అవకతవకగా యిచ్చిన పై ఇంజక్షన్‌వల్ల కొద్దిగా స్వస్థత చేకూరినట్లు గానుపించినను, స్వల్పమైన వ్యవధికి పిదప మరలమరల జ్వరము తీవ్రత నొంది అనేక యిబ్బందులు కల్పించవచ్చును.

ఇట్టి జ్వరమునకు క్వినైన్ నందుగల పైత్య గుణములులేని ఇంజక్షన్ యివ్వవలసియుండును క్వినైన్‌ను బాలురకు బలహీనులగు వారలకు పైత్య స్వభావము (తత్వము) గలవారలకు గర్భిణీస్త్రీలకు యివ్వరాదు. చాల వరకు "సింకోనిన్" క్వినార్సినాల్ వాడవలసియుండును. "సింకోనిన్" యందు క్వినైన్ గుణములులేవు జ్వరము పయిన ఇంజక్షన్ యివ్వవలసిన క్వినార్సినాల్ బాగుగా తోడ్పడును. కొద్ది జ్వరముపయి సందేహములేక యివ్వవచ్చును. యిందు క్వినైన్ గుణము కనుపించదు దీనినికూడ, క్వినైన్‌తో తయారుచేయుదురు. గాని యిందు క్వినైన్ యొక్క చెడుగుణములు కనుపించవు. "క్వినైన్" పడని వారలకు యెన్నడు క్వినైన్ ఇతర ఔషధములతో చేర్చక

యివ్వరాదు. మలేరియా జ్వర నివారణమునకు క్వినైన్‌కు మించినది కనుపించదు. మలేరియా క్రిములను సంహరించుటకు క్వినైన్ బాగుగా తోడ్పడును. క్వినైన్‌తో ఆర్సెనిక్ (పాషాణసంబంధము) చేర్చి యుండునట్టిది సాధారణమైన క్వినైన్ ప్రయోగముకంటెను దీని శక్తి అధికమని యెంచబడుచున్నది.

## ఇంజక్షన్ చేయు వైద్యుడు శుభ్రముగా నుండుట యవసరము

ఇంజక్షన్ వైద్యముచేయు వైద్యుడు శుభ్రముగా నుండుట చాల అవసరమై యున్నది ఇంజక్షన్ చేయునప్పుడు చేతులు, ఇంజక్షన్ పరికరములు శుభ్రముగా నుంచుట, చేతులను 'లైఫ్‌బాయి సబ్బుతోగాని, డిటాల్‌తోగాని' శుభ్రము చేసికొనుట యవసరము.

రోగికి ఇంజక్షన్‌చేయు స్థలమున లైఫ్‌బాయిసబ్బుతోను, డిటాల్‌తోను కడిగి తర్వాత దూదిని స్పిరిటులో ముంచి బాగుగా రుద్దిన ఆ భాగము బాగుగా శుభ్రమగును. పిదప అట్టి స్థలమున ఇంజక్షన్ చేయవలయును. ఇంజక్షన్ చేసిన తర్వాత ఆ స్థలమును బాగుగా రెండు నిమిషముల పాటు రుద్దుచుండిన మందంతయు తొందరగా శరీరము

నందు ప్రవేశించి రక్తమున కలసిపోవును. ఇంజక్షనుచేసిన తర్వాత సూదులను సిరంజియొక్క భాగములను మరగించుటగాని, లేదా స్పిరిట్‌నందు యుంచుటగాని మంచిదే. ఇట్లు చేయనియెడల రోగి రక్తకణములలోయుండు క్రిములు గాని లేదా దుష్ట పదార్థముగాని నిలువ యుండి మరల వేరే వారికి ఇంజక్షన్ చేసినపుడు యితరవిధములైన వ్యాధులు, బాధ సంభవింపవచ్చును. సూదులు మొద్దుబారిన వాటితో ఇంజక్షన్ యివ్వరాదు. అట్లు చేసినచో రోగికి బాధ యేర్పడి ఇంజక్షన్ చేసిన స్థలమున నొప్పి యేర్పడును. మొద్దుబారిన సూదిని తీసి క్రొత్తదానితో చేసిన మంచిది. ఇంజక్షన్ చేసిన వెంటనే మరగించి సూదియందుగల రంధ్రమున సన్నని తీగె వుంచుటవలన సూదికి త్రుప్పు, దుమ్ము పట్టక శుభ్రముగా యుండును. ఇంజక్షన్ చేసినచో యేమాత్రము నొప్పిలేకుండ నిదానముగా ఇంజక్షన్ చేయుచుండవలెను. ఇంజక్షన్‌నుండి వారికి యే బాధలు రాకుండ కాపాడుట వైద్యుని కర్తవ్యము. వైద్యుడు ఈ విషయముల యందు ముందుగా కడు జాగ్రత్త పడవలసియుండును.

---

## ఇంజక్షన్ కడుజాగ్రత్తతో చేయుట

ఇంజక్షన్ ద్రవము (అనగా) మందు పలుచనిదైనచో సన్నని సూదులు వాడవలసి యుండును. (అనగా)

No. 16 & 18 & 24 & 26 Needles పలకు వాడవలసియుండును. ఇంజక్షన్ మందు ఆయిల్ Oil సంబంధమైన యెడల యెక్కువనెంబరు సూదులు వాడవలసియుండును. సుమారు No. 12 No. 14 No. 1 No. 2 Needles వాడవలయును. ఇట్లు వాడుటవలన ఇంజక్షన్ సిరంజినందుండు మందు తొందరగా శరీరమునందు ప్రవేశించును.

ప్రతివారికి ఇంజక్షన్ చేసిన తర్వాత అయిదు నిమిషములపాటు విశ్రాంతి యిచ్చుట మంచిది. ఇంజక్షన్ చేసిన వెంటనే రెండు నిమిషాలపాటు టించర్ అయోడిన్ బాగుగా పూయుటవలన, ఇంజక్షన్ యిచ్చిన భాగము నొప్పి లేక యుండును. గుండె బలహీనముగలవారలకు రక్తము సరిగా ఆడని వారలకున్ను ఇంట్రావీనస్ ఇంజక్షన్ చేయరాదు చేసినయెడల ప్రాణాపాయము సంభవించును. గుండెను నిలిపివేయును. చిన్నవయస్సు గల పిల్లలకు యెన్నడు ఇంట్రవీనస్ ఇంజక్షన్ చేయరాదు. ప్రతి వ్యాధులందు రక్తము సరిగా ఆడుచున్నట్లు గ్రహించుటకు ఉదయము స్టెతస్కోప్పు ద్వారా పరీక్షించవలయును. తరువాత ఇంట్రావీనస్ ఇంజక్షన్ యివ్వవలయును. పరీక్షించనిదే ఇంట్రావీనస్ ఇంజక్షన్ యివ్వరాదు.

ఇంట్రవీనస్ ఇంజక్షన్ చేయుటయందు వైద్యుడు ముందు కడుజాగ్రత వహించవలయును. యే వ్యాధియందైనను అవసరముకొద్ది త్వరపడి ఇంట్రవీనస్ ఇంజక్షనులు

చేయరాదు. అవసరముకొద్ది చేయు ఇంజక్షన్‌ను చర్మవస్తి, కండరవస్తి ఈ రెండే యెక్కువ చేయుదురు. ప్రతిదినము ఇంట్రవీనస్ ఇంజక్షను చేయరాదు. రెండు మూడు దినముల వ్యవధిపైన అవసరమును గమనించి చేయవలయును. యే ఇంజక్షన్‌నైనను డబ్బుకు ఆశించి మాటిమాటికి చేయరాదు. చేసిన రోగికి రోగమునకు శ్రమతీవ్రత, ఆయాసము కలుగుటయేగాక రోగికిగల రోగము నివారించక యితరబాధలు సైతము సంభవించును. ఇప్పటికే చాలవరకు వైద్యులు వ్యాధియొకటి మందొకటి యిచ్చి వ్యాధులను నివారించలేక నమ్మకములేని వైద్యులగుచున్నారు. యెందుకగుచున్నారనిన: యే వ్యాధికి యే ఇంజక్షన్ యివ్వవలయునో వారికి తెలిసియున్నను అప్పటికి వారివద్ద వ్యాధికి తగిన ఇంజక్షన్ లేనందున (లేదా) లభించనందున ధనాభావముచే యేదోఒకటి వాడుటచే ఈ చెడ్డపేరు వచ్చుచున్నది. రోగి వైద్యునియొక్క ఇంజక్షన్‌పై నమ్మకము లేనివాడగుచున్నాడు. ఇట్లు డబ్బుకాశించిన వ్యాధులు యెన్నటికిని నివారించుట కష్టము రోగికిచ్చెడు ఇంజక్షన్ లన్నియును, ఒకే స్థలమున గ్రుచ్చరాదు. స్థలములు మార్చుచు యిచ్చుచుండవలయును. ఒకే స్థలమున ఇంజక్షన్ యిచ్చుచుండిన గడ్డకట్టుచు మిక్కిలి నొప్పి సంభవించును. ఇంజక్షన్ (అనగా) సూదియొక్క రంధ్రముద్వారా శరీరములోనికి ఔషధము సులభముగా ప్రవేశపెట్టగల సదుపాయము.

# అజాగ్రితగా ఇంజక్షన్ చేసిన సంభవించు అపాయములు

ఇంజక్షన్ చేయుటకుముందు వైద్యుడు యెంతయు జాగ్రత్తపడవలసి యుండును. ఇంజక్షన్ యిచ్చు స్థలము సరిగా నిర్ణయించి సూదిని నరమునకు తగులకుండ గ్రుచ్చ వలయును. సూది పొరపాటున నరమునకుగాని, ఎముకలకు గాని, నరము మొదలగువాటికి గాని తగిలిన యెడల రోగి శరీరమునకు అమితమగు బాధలు ఏర్పడును. కొన్ని పరి స్థితులయందు గడ్డకట్టి నొప్పికలిగి కొన్ని దినములకు కురుపుగా యేర్పడును. ఇట్లయినచో దీనికి తగు శ్రద్ధతో చికిత్స చేయవలసియుండును. చాలవరకు నొప్పిగల స్థల మున గోధుమ పొట్టుతోను, ఉప్పుతోను కాపడము చేయ వలయును. పుండుగా మారినదానికిమాత్రము 'అయోడెక్సు' ను పైన రాయుటకు ఉపయోగపడును. "డిటాల్"తో పుండును శుభ్రపరచుటవలన పుండును నివారించుటకుగాను దానియందు గల మాలిన్యమును వెడలగొట్టుటకు బాగుగా తోడ్పడును. శరీరమున మాంసము కుళ్ళినప్పుడే (సెప్టిక్) అనుచుందురు. పుండు మానుటకుగాను పుండు తగ్గించే ఆయింటుమెంట్లను వాడవలసి యుండును. పుండునుండి చీము నివారించుటకుగాను యితర విధముల ఇంజక్షనులు చేయవలసి యుండును. చాలవరకున్ను థియా సల్ఫేట్లు

ఆఫ్ సోడియం బాగుగా ఉపయోగపడును. స్థలము నిర్ణయించి ఇంజక్షను చేసిన యెడల యేవిధమైన బాధలు సంభవించనేరవు. సూదులను, సిరంజిని మరగించనియెడల కూడ (సెప్టిక్) కావచ్చును. ఎన్నటికిని యే స్థలమున ఈయదగిన ఇంజక్షను లా యా స్థలములందే యీయవలసి యుండును.

---

## ఇంజక్షన్ చేయునప్పుడు గాలి బుడగలు సిరంజినం దే మాత్రము లేకుండా చేయుట ముఖ్యావసరము

ఇంట్రవీనస్ ఇంజక్షను చేయునప్పుడు సిరంజినందు యేమాత్రము గాలి బుడగలు లేకుండ జాగ్రత పడవలెను. సిరంజినందు గాలిబుడగలు ఇంజక్షను ఔషధముద్వారా శరీరమునగాని ముఖ్యముగా రక్తనాళములోనికి ప్రవేశించిన మాత్రమున అప్పటి కప్పుడే ప్రాణాపాయము సంభవించక తప్పదు. సిరంజీని నిటారుగా నిలబెట్టి గాజుకడ్డీని నెమ్మదిగా పైకి నొక్కుచు రెండు మూడు చుక్కల మందు సూదిమొననుండి పైకి విడిచినపిదప గాలి బుడగలు సిరంజీనందు లేవని వైద్యుడు గ్రహించవలయును. ఇట్లు గాలి బుడగలు లేనట్లు బాగుగా చూచి, ఇంజక్షను చేయ

వలయును సిరంజినందు యేమాత్రమైన గాలిబుడగ లుం
డినయెడల అవి రక్తనాళము ద్వారా హృదయమున ప్రవే
శించి ప్రాణాపాయము కలిగించును. గాన దీనియందు,
బాగుగా జాగ్రతపడవలయును. క్రొత్తవారికి ఈ ఇంట్రి
వీనస్ ఇంజక్షన్ ప్రయోగము కష్టమైనదని చెప్పవచ్చును.
గాని ప్రాక్టీసు గలవారలకు సులభమైన దనవచ్చును.
ఎవ్వరైనను ఇంట్రివీనస్ ఇంజక్షన్ చేయునప్పుడు ఈ
విషయములయందు జాగ్రత పడవలయును.

---

## ఇంజక్షనే సూచీముఖ యంత్రము

సూచీముఖ ఔషధ ప్రయోగమని మన పూర్వులు
భావించుదానినే ఆంగ్లేయ వైద్యమునందు ఇంజక్షన్ అను
చున్నారు. సూచీముఖయంత్ర విద్య ఆంగ్లేయులకు మన
సిద్ధాంతమునుండే లభించినటుల కనబడుచున్నది. మన
వైద్య పరిశోధకులు, మాధవుడు, శుశ్రుతుడు, అశ్వినీ
కుమారులు, మహర్షులు దీనిని కనిపెట్టియున్నారు. పూర్వము
మనవారలు దీనిని ఎరిగియే యున్నారు. దీనిని ఆయుర్వేద
వైద్యులు సూది మందనిరి. ఆంగ్లేయులు ఇంజక్షన్ విద్య
యని యనుచున్నారు. ఇంజక్షన్ చేయుటకు ప్రతి ఆయు
ర్వేద వైద్యునకు హక్కు కలదు. సూచీముఖ వైద్యము

ప్రతివారికిని చేయకూడదనియు, అవసరమును బట్టియు ఔషధము తొందరగా గుణమునిచ్చుటకుగాను, ప్రమాద స్థితియందు అప్పటికప్పుడే బాధలు నివారించుటకును విష సంబంధమైన ఔషధము మ్రింగిన వేళలందును, వ్యాధిచే స్పృహ తప్పినప్పుడున్ను ఈ సూచీముఖ ప్రయోగ చికిత్స చేయవచ్చును. ఔషధ ద్రవమును సిరంజీ సహాయముచే శరీరములో సూదిద్వారా ప్రవేశపెట్టుదానినే సూచీముఖ ప్రయోగమని నా అభిప్రాయము. దీనిని అల్లోపతి డాక్టర్లు ఇంజక్షన్ యని పేరు పెట్టినారు. ఆయుర్వేదమున సూచీ ముఖ యంత్రమని దానికి పేరు కలదు. ఆయుర్వేద వైద్యులు ఇంజక్షన్ విధానము మన విద్యకాదని కొందరు అనుచున్నారు. ఇట్టిది మన ఆయుర్వేదమునందు చూచిన, తప్పక ఇంజక్షన్ విద్య మనదేనని ప్రతివారు ఒప్పుకొనక తప్పదు.

---

## ఇంజక్షన్‌లు యెన్ని విధములు

### (వాటిని ఉపయోగించు స్థలములు)

1. ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్, దీనిని కండరములో లోతుగా చాలవరకు చేయుచుందురు. పిఱ్ఱపై యుండు గట్టి కండరమునందును, భుజమున కండరమునందును చేయుచుందురు.

2. హైపోడర్ మిక్ ఇంజక్షన్ దీనిని చర్మము క్రింద చేతిదండ ముంజేతి వరుసలో చేయుచుందురు చేతి పై భాగము, పిరుదుల యందును, వీపుల యందును, కాలి మడమల స్థానముల యందును దీనిని చేయ వచ్చును. ఇట్టిది ముఖ్యముగా చేతిదండ చర్మమునందే చాలవరకు చేయుచుందురు.

3. ఇంట్రవీనస్ ఇంజక్షన్ : దీనిని రక్తనాళమున చేయు దురు. చేతియందు రక్తనాళము గనుపించని యెడల కాళ్ళయందు గల రక్తనాళమునకు కూడ చేయుదురు. చేతియందు యెక్కడి సిరలయందైనను తెలిసి చేయ వచ్చును.

4. చర్మము కోసి సిరలయందు ఇంట్రవీనస్ ఇంజక్షన్ చేయుట : దీనిని చాలవరకు కలరా వ్యాధులయందు నరము కనిపించనివారలయందు చేయుచుందురు. ఇట్లు చేసినప్పటికిని పిదప దీనిని మాన్పవచ్చును.

5. ఇంట్రస్పినల్ ఇంజక్షన్ : దీనిని వీపుభాగమున వెన్ను బొక్కయందు బ్రిహ్మదండి నాళమున ఇంజక్షన్ చేయుదురు.

6. ఇంట్రడర్మల్ ఇంజక్షన్ : దీనిని చర్మమునందు గల పొరలలో చేయుదురు. ఇట్టివే కలరా, మసూచికలయం దును టీకాలుకూడ చేయుచుందురు.

7. ఇంటార్రి ఎబ్డామినల్ ఇంజక్షన్ : దీనిని చిన్నపిల్లలకు ఇంట్రవీనసు పద్ధతి యివ్వలేని యెడల దీని సహాయముతో చేయుదురు. నాభిక్రింద చర్మము కోసి (పెరిటోనియ) యందు ఇంజక్షన్ చేయుచుందురు.

8. ఇంట్రసిరిబ్రల్ ఇంజక్షన్ : దీనిని కపాలమునకు వెనుకగా రంధ్రముచేసి సూదిని గ్రుచ్చి మందు విడుతురు. ఇది మహా కష్టసాధ్యమైనది. దీనిని చాలవరకు యే చిన్నచిన్న డాక్టర్లు చేయలేరని చెప్పవచ్చును.

9. రెక్టాల్ ఇంజక్షన్ : దీనిని ఆసనము ద్వారా పిచికారి సహాయముతో మందు ఎక్కించుదానినే ఏనిమా యనుచున్నాము.

10. సింపుల్ ఇంజక్షన్ : దీనిని శరీరమునందు గల అన్ని రంధ్రములయందు ఔషధము వేయుచున్నారు.

ఈ పై వ్రాసిన ఇంజక్షన్లలో చాలవరకు చూడ సామాన్యులకు నాల్గు విధములు వాడుకలో గలవు. ఇతర విధములైనవి మనవారు వాడుకజేయలేరు. వీటిని చాలవరకు "స్పెషలిస్టు డాక్టర్లు" వాడుచుందురు. పూర్వము నుండియు యిప్పటివరకు ఇంజక్షన్ పద్ధతిని బోలిన ప్రయోగ పద్ధతులవంటివి మన దేశమునందు కొన్ని విషయములు గలవు. చేతిపైనగాని, యితరచోట్లగాని గుంట గలగర పసరుతో సూదిసహాయమున పచ్చబొట్లని వేయుట కలదు. ఇట్టివి

కూడ ఇంజక్షన్‌కు సంబంధించినవేనని చెప్పుకోవచ్చును. నొప్పిగల స్థలమున పచ్చవేయుచుండుట ఔషధమును శరీరమున మర్దన చేయుదానివలె యిదికూడ ఒక విధమైన చికిత్స యని చెప్పుకోవచ్చును. ఇంజక్షన్ చేయుటకు ప్రతి ఆయుర్వేద వైద్యునకు హక్కుగలదు. దీనిని నిషేధించుటకు ప్రభుత్వము కూడ నిరాకరించలేదు. ఎందుకు నిరాకరించదని అందురు. ఈ ఇంజక్షన్ విద్య మనదే; మన వారుకూడ చేయుచుండిరి. ఇది మన ఆయుర్వేద శాస్త్రమందు కలదని చెప్పవచ్చును. అల్లోపతిడాక్టర్లు మేము తప్ప యితర విధముల వైద్యులు ఇంజక్షన్ యివ్వరాదనిరి. వారికే ఈ ఇంజక్షన్ విద్య లభించెనట. బాగుగా చూచినచో ఈ ఇంజక్షన్ విద్య ఆయుర్వేదమునందు కలిగి యున్నందుననే దానిని మనము సూచీముఖ యంత్రమని యనుచుంటుము. అదియే ఇంజక్షన్ విద్య. మన ఆయుర్వేదమునందు అస్త్రములని అనేకవిధములు గలవు. వీటిని మనవారలు, మహర్షులు, ఋషులు కనిపెట్టి యుండిరి. వీనినే మనము ఇంజక్షన్ యని భావించుచున్నాము. ఇంజక్షన్ సూచీముఖ ప్రయోగమని యనవచ్చును. వీటిని యిప్పుడు సుమారు పది సంవత్సరములనుండి అమలులోకి తెచ్చియున్నారు. ఆయుర్వేద ఇంజక్షన్‌లు చాల తక్కువగా యున్నవి. ఇట్టివి యింకా చాలవరకు వాడుకలోలేవు. ఈ ఆయుర్వేద ఇంజక్షన్‌లను మనవారలు పరిశోధించి వీనియందు గల

గుణములు బైలుపరచియున్నారు. ఆయుర్వేద ఇంజక్షనులు అవతరించిన నాటినుండి, మన ఆయుర్వేద వైద్యులు గర్వ పడవలసినదే. ఆయుర్వేదమునందు యింకా చాలవరకు క్రొత్త ఇంజక్షనులు కనుగొనుచునేయున్నారు. కొన్ని విధ ములైనవి మాత్రము యిప్పటికి బాగుగా గుణము నిచ్చు చున్నవి. ఆయుర్వేద వైద్యులు తప్పక ఆయుర్వేద ఇంజ క్షనులను వాడి వాటి గుణములు కనుగొని ఆయుర్వేదము వృద్ధిగావించగలరని నేను ఈ గ్రంథమును ఈవిధమున వ్రాసి, మీకందించితిని. ఇది నా ప్రార్థన.

---

## "స్టెర్ లైజ్" (అనగా) నేమి ?

"స్టెర్‌లైజ్" (అనగా) సూదులు, సిరంజి భాగము లను నీటియందు మరగించి శుభ్రపరచునట్టివానినే స్టెర్‌లైజ్ అనుచుందుము. ప్రతిఒకట్ ఇంజక్షన్ చేయునప్పుడు ముందుగా సిరంజిని దూదిని స్టెర్‌లైజ్ చేయుట ముఖ్యావ సరము. "స్టెర్‌లైజ్" చేయక ఇంజక్షన్ చేయుట ప్రమాద కరమని గట్టిగా భావించవచ్చును. ఇంజక్షన్ పరికరములను మరగించి, బాగుగా శుభ్రముచేసి, ఇంజక్షన్ చేయవలెను. దీన్నిని అల్లోపతివారు స్టెర్‌లైజ్ అని అనుచున్నారు. మనశాస్త్రములు దీనిని "మరగించుట" యని అనుకొనుచుం

దురు. సిరంజి భాగములను విడదీసి సూదులయందు గల తీగలను లాగి, సిరంజిని పెట్టెయందు నుంచి అందు నిండుగా నీళ్లుబోసి, స్పిరిట్ ల్యాంప్ దీపముపై గాని, "స్టౌవొయ్యి" ముందుగాని కుతకుత నీళ్ళు మసలువరకు నుంచి తర్వాత తీసి, చల్లార్చి శుభ్రపరచి, ఇంజక్షన్ చేయవలయును. సిరంజీని, సూదులను మరగించిన తర్వాత చేతులతో తీయకూడదు. చిమట సహాయముతో తీయుచుండవలయును. మరగించిన తర్వాత చల్లార్చిన వెంటనే ఉపయోగించుకొనవచ్చును. ఇంజక్షన్ చేయబడని అన్ని వేళలయందును సూదియందు తీగను యుంచుట మంచిది. ఎన్నటికిని, సిరంజిని అశుభ్రతలో వుంచిన, మలినముచే త్రుప్పుకలిగి యుండును. అన్ని వేళలయందును, సిరంజి సూదులను శుభ్రపరచి యుంచుట ముఖ్యావసరము. ఇంజక్షన్ చేయునప్పుడు చేతులను కూడ స్టెరిలైజ్ చేయుట, (లేదా) డిటాల్ సహాయముతో శుభ్రపరచుట అవసరము. ఇంజక్షన్ విధానమందు ప్రతి వైద్యుడును ప్రతి అంశమునందును శ్రద్ధ వహించి కడు జాగరూకతతో మెలగుట ఉచితము.

---

# DETTOL

## ANTISEPTIC

## డిటాల్ యొక్క ఉపయోగములు



పై ఔషధద్రవము శుభ్రము చేయుటకు గాను ఉపయోగపడును. ఇది క్రిములను, విషపదార్థములను పోగొట్టునట్టిది. శరీరమునకు మృదుత్వమును గలుగజేయునట్టియు, ప్రత్యేకముగా దుర్వాయువులను, దుష్ట క్రిములను పోగొట్టుటకు ఇది బాగుగా తోడ్పడును. ఇది వైద్యులకు అనేక విధములుగా పనికివచ్చుచుండును. ఆసుపత్రులకు (వైద్యశాలలకు), శిశురక్షణ శాలలకు, డాక్టర్లకు, వైద్యులకు, గృహస్థులకు, మునిసిపాలిటీలకు అనేక సందర్భములయందు శుభ్రతకు బాగుగా తోడ్పడును. దీనియందు మంచి వాసన గలిగి యుండును. చర్మము, దంతములు దీనితో కడుగవచ్చును వస్త్రములపై మచ్చలుపడునట్టు చేయును. ఈ మందులో అనేకవిధములైన దుష్టక్రిములను సంహరించు శక్తి గలిగియున్నది. దీనిని నీటితో మిశ్రితముచేసి కడుగుట కుపయోగించవలెను. గాయములు, పుండ్లు పరిశుభ్రముగా నుండనిచ్చును. వ్యాధిగ్రస్తుల గదులయందు దీనిని చిలికిన యెడల మంచి వాసన గలిగి అంటువ్యాధులను అంటనీయకుండ కాపాడును. అంటువ్యాధుల యందు రోగియొక్క గుడ్డలు దీని నీటితో ఉతుకవచ్చును. వ్యాధి

గ్రస్తుని అవయవములను దీనితో కడుగవచ్చును. మాలిన్యము గల పదార్థమును తీసివేయుటకు బాగుగా తోడ్పడును. ఆరోగ్యవంతులు దీనితో స్నానముచేయుటకుకూడ బాగుగా ఉపయోగపడును. వేడినీరు మిశ్రితము చేసి, ఎనీమాలకు ఈ మొదలయినవాటికి ఉపయోగించవచ్చును. దీనితో గృహములు, గదులు శుభ్రము చేయుటవలన, క్రిమి జాడ్యములు, అంటుజాడ్యములు నిరోధించుటకు బాగుగా ఉపయోగించును. చెవులో చీముకారు వ్యాధికి, దీనితో కడుగుచుండిన అందుగల క్రిములను సంహరించును. ఇతర విధములైన అనేక అంటుజాడ్యములందు దీనితో కడుగుటవలన అంటువ్యాధులు విస్తరించక సమసిపోవును. ఈ మందు ఒక గ్లాసులో పదిచుక్కలు పోసి, వేడినీరు కలిపి నోటితో పుక్కిలించి ఉమ్మివేసిన యెడల నోటి యందు గల దుర్వాసన నివారించును. విషపదార్థములను నివారించుటకుగాను బాగుగా గుణము నిచ్చుచుండును. సిరంజీలు, పిచుకారులు, సూదులు, ఆపరేషన్ చేయు కత్తులు, చిమటాలు, యితర విధముల వైద్య పనిముట్లు మొదలగునవి కడుగుటకుగాను బాగుగా ఉపయోగపడును. చర్మ వ్యాధుల యందును, కడుగుటవలన, శుభ్రముచేయును. దీనియందు యింకా చాల గుణములు కలగియున్నవి.

N. B. ఈ మందు కడుపులోనికి మాత్రము త్రాగకూడదు. త్రాగినచో ప్రమాదము కలుగును.

# సాధారణముగా అవసరమగు ఇంజక్షన్ సిరంజీలు, మొదలైన పరికరములు

(సూదుల నెంబర్లు)

1 Box No. 16 Needles, 1 Box 12 సూదులు గల పెట్టె No. 14 గలవి. No. 1 సూదులు రెండు No. 18 గల సూదులు (12) ఈ సూదులు నెంబర్ల ప్రకారం లభించుచుండును.

(సిరంజీ పిచికారీలు)

| 1 | 1 | 1 | 1 | లభించును. |
|---|---|---|---|---|
| 1-CC | 2-CC | 5-CC | 10-CC | |

ఫ్రోక చిమట, నాలుగు స్టీల్ సిరంజిపెట్టెలు, ఒక స్పిరిటు ల్యాంపు (మరగించుటకు), కొంత కాటన్ కార్బాలిక్ Soap, ఒక బాటలు డిటాల్, ఒక బాటలు రెక్టిఫైడ్ స్పిరిట్, అరపౌను టించర్ అయోడిన్ ] ఈ వస్తువులు వైద్యులకు నిత్యావసరమై యుండును గాన ప్రతి వైద్యునివద్ద ఈ వస్తువులు ఉంచుట చాల అవసరమై యుండును.

ఇంట్రవీనస్ ఇంజక్షన్ చేయుటకు ఒక రబ్బరు, నరము ఉబ్బుటకు చేతికి కట్టుటకుగాను ఇది ఉపయోగపడును.

## ఇంజక్షను చేయుటకు పూర్వము అంపుల్సు కదలించుట ముఖ్యము

ప్రతిఒక్క ఇంజక్షను చేయునప్పుడు, ఇంజక్షను అంపుల్సును బాగుగా రెండుమూడు మార్లు కదలించి, చిన్న రంపముతో కోసి, సిరంజి మొన (సూదిని) అంపుల్సునందు నుంచి, పిస్టను రాడును వెనుకకు లాగుచుండిన అంపుల్సు నందుగల మందంతయు సిరంజిలోనికి ప్రవేశించును. అంపుల్సును కదలించనిదే మందును సిరంజీలోనికి లాగ కూడదు. అంపుల్సు (అనగా) ఇంజక్షన్ మందు గల గాజు బుడ్డి, చాలవరకు అంపుల్సు అర CC నుండి 20 CC వరకు ఇంతకు యెక్కువకూడా లభించుచుండును. అర CC నుండి 2 CC వరకు చర్మముక్రింద ఇంజక్షన్ చేయుచుందురు. 1 CC నుండి 10 CC వరకు కండరములో ఇంజక్షను చేయుచుందురు. 2 CC నుండి 20 CC యింతకు యెక్కువ కూడ ఇంట్రవీనస్ రక్తనాళమున ఇంజక్షను చేయుచుందురు.

## "వయల్స్" ఔషధ ద్రవ్యముతో నింపి రబ్బరుమూతతో లభించు బుడ్లు

వీటిని చాలవరకు వయల్స్ లేదా బల్బు అని కూడా అనుచుందురు. వీటియందు చాలవరకు పౌడరు రూపక

ముగా ఔషధము లభించుచుండును. పౌడరు మాదిరిగా నుండు బుడ్లయందు డిస్టిల్డ్ వాటర్‌తోగాని, నార్మల్ సైలైనుతో గాని మిశ్రితము చేయుచుందురు. కొన్ని ఇంజక్షన్ ద్రవ్యములు మాత్రము ద్రవపదార్థముగానే లభించుచుండును. ఇంకను కొన్ని పౌడర్లున్ను, కొన్ని ద్రవరూపముగాను, కొన్ని ఆయిల్ రూపముగాను లభించుచుండును. ప్రయోగమునకు పూర్వము వీటినికూడ కదలించి, ఇంజక్షన్ చేయుట మంచిది. రబ్బరు మూతకు సూదిసిగ్రుచ్చి వయల్ నందుండు మందును వలసినంత సిరంజిలోనికి లాగవలయును. రబ్బరుమూతగల బుడ్లయందు గాలి చొరనేరదు. సీలు బాగుగా బిగించియుండును.

## ఇంజక్షన్ అంపుల్సుతోనుండు పెట్టె దానిపైనుండు వివరములు

అంపుల్సుగల పెట్టెపైన ఔషధము యొక్క పేరు, ఒక అంపుల్సున కెన్ని CCలు, అంపుల్సునందు యెన్ని గ్రెయినుల ఔషధముండును, అంపుల్సునందుగల మందు యొక్క ఉపయోగములు, వాటి వాడుక, యే స్థలమున ఇంజక్షన్ చేయవలయును, ఇంజక్షన్ తయారుచేయబడిన తేది, యెన్ని నెలలవరకు ఇంజక్షన్ ఔషధము నిలువయుండును, యెన్నిదినముల కొకతూరి ఇంజక్షన్ చేయవలయును,

కంపెనీవారి లైసెన్సు నెంబరు మొదలగు యీ యన్ని వివరములను ఇంగ్లీషు అక్షరములతో వ్రాసియుండును. ఇందు కొన్ని కంపెనీలవారు, పై వివరములలో కొన్ని మాత్రమే క్లుప్తముగా వ్రాయరు. వీటిని మనము, ఇంజక్షన్ చేయుటకు ముందు చదివి గ్రహించుకొనవలయును. ఇంజక్షన్ పెట్టెయందు చిన్నరంపము లభించును. ఇది అంపుల్సు కోయుటకు ఉపయోగపడును.

సాధారణముగా ప్రతి ఇంజక్షన్ పెట్టెయందు మందు యొక్కగుణము, మోతాదు మొదలగు వివరముల సూచించునట్టి ఒక కాగితము నుంచబడి యుండును.





# ఇంజక్షన్ గైడ్



## 1. థియోసల్ఫేటు ఆఫ్ సోడియం

## Thio Sulphate of Sodium

ఇంట్రిమస్క్యులరు ఇంజక్షన్ (అనగా) కండరము లందు యీయవలసిన ఇంజక్షన్.

2 CC ద్రవములో 15 గ్రైనులవరకు, పై ఔషధము చేరియుండును. "సాల్వార్సన్" లేక "నియోసల్వరుసనల్" మొదలగు పాషాణ సంబంధమైన ఇంజక్షన్లను "సిఫిలీస్" అనగా సవామేహ సంబంధమైన జబ్బులకు వాడవలసి వచ్చినచో, సూదిని రక్తనాళములోనికి గుచ్చినప్పుడు రక్తనాళములోనికి పోవలసిన ఔషధము పొరపాటున చర్మముక్రిందికి గాని, కండరములోనికి గాని ప్రవేశించుటచే వాపు, మంటలు, పోట్లు, బాధ మొదలైనవి కలుగుట సహజము గాన అట్టి ప్రమాదస్థితిని తొలగించుటకు పై "థియోసల్ఫేట్ ఆఫ్ సోడియం" ఇంజక్షన్ ప్రయోగించి రక్తనాళమునందు ప్రవేశింపవలసిన ఔషధము చర్మములోనికో, కండరములోనికో పోవుటచే యేర్పడిన పై బాధలను వెంటనే నివారింపవచ్చును. బాధ యేర్పడిన

స్థలమునకు చుట్టు సోడియం థియోసల్ఫేట్ ద్రావమును కొద్ది మోతాదులలో రెండు మూడు ఇంజక్షన్‌లు వాడిన యెడల విరుగుడుగా పనిచేసి వెంటనే బాధల నివారించును. పొరపాటువలన శరీరమునకు బాధ యేర్పరచిన పాషాణ సంబంధమైన ఇంజక్షన్‌ల ప్రమాదమును తొలగించునట్టి శక్తివంతమైన థియోసల్ఫేట్ ఇంజక్షన్ యొక్క ప్రయోజనమును ప్రథమమున వివరించడమైనది. ఇంట్రవీనస్ ఇంజక్షన్ చేయు వైద్యులు తప్పక పై ఇంజక్షన్ దగ్గర నుంచుకొనుట చాల మంచిది.

## 2. కాల్షియం గ్లూకోనేట్

## Calcium Gluconate

ఇంట్రవీనసు అండ్ మస్క్యులర్ ఇంజక్షన్.

10 CC వరకు ఇంట్రవీనసు 5 CC వరకు ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్‌ను, క్షయవ్యాధులకు, శరీరమున సున్నపుధాతువు తగ్గినపుడు కలుగుచుండెడు దగ్గు, బలహీనత, జ్వరములు, శ్వేతప్రదరములు, రక్తప్రదరములు, బలహీనత కలిగిన స్త్రీలకు ముక్కునుండి రక్తముపడుట తగ్గును. క్షయవ్యాధులందు కలుగు రక్తకాసలు, రక్తస్రావములను నివారించును. "శ్యాండోజ్ కంపెనీ" వారిది చాల మంచిది. వ్యాధిని గుర్తెరిగి, ఇంజక్షన్ చేయుచుండవలయును. బైకాల్షియం (BI) కంపెనీ వారిది పైమాదిరిగానే పని

జేయును. క్షయవ్యాధులకు ప్రత్యేకముగా వాడుక చేయుదురు. బలహీనము గలవారికి గమనించి ఇంజక్షన్ చేయవలయును. గుండెదడ గలవారికి కూడ జాగ్రత్తతో చెయవలయును.

N. B. వివరములు విపులముగా కాల్షియం శాండోస్ నందు చూడుము.

3. కోలాయిడు కాల్షియం విత్ విటామిన్ డి.
Coll oid calcium with vitamin D Injection
ఇంట్రామస్కులర్ అండ్ హైపొడర్మక్ ఇంజక్షన్.

2 CC, 2 CC లభించును. 5 మిల్లిగ్రాము, కాల్షియంతో 500 యూనిట్లు విటామిను డి కలిపి తయారు చేయుదురు. క్షయవ్యాధికి కాల్షియం తక్కువవున్నయెడల ఈ ఇంజక్షన్ యిచ్చిన మంచి పనిజేయును. రక్తకాసలు నివారించుటలో మంచిగ పనిచేయును. గర్భిణీ స్త్రీలకు కలుగు వాంతులు (డోకులు) నివారించి గర్భములోగల శిశువును ఆరోగ్యవంతునిగా వృద్ధి జేయుటయందు మంచి గుణము కలది. క్షయవ్యాధులకు అమృతమువలె పని జేయును. ప్రతిదినము ఈ ఇంజక్షన్ యివ్వరాదు. మూడు దినముల కొకసారి యిచ్చుచుండవలయును. అర్ధ తలనొప్పి గలవారికి పన్నెండు ఇంజక్షన్లిచ్చిన మంచి పనిజేయును. వీర్యనష్టమును నివారించి, శ్వేతప్రదరములను నశింపజేసి

బలము, పుష్టి గలుగజేయుటయేగాక శరీరమందలి సకల ధాతువులకు శక్తి నిచ్చును.

## 4. కాల్షియం క్లోరైడ్

## Colcium Chloride

ఇంట్రివీనస్ అండ్ ఇంట్రిమస్క్యులర్ ఇంజక్షన్.

ఒక ఇంజక్షన్‌లో నూటికి అయిదుపాళ్ళు ఔషధ ముండును. నూటికి పదిపాళ్ళుగల ఇంజక్షన్‌కూడ లభించును. 2 CC, 5 CC, 10 CC సీసాలు వ్యాధి పరిస్థితినిబట్టి బలమునుబట్టి వాడవలెను. ఆపరేషన్ చేసినవెంటనే వచ్చు రక్తమును తగ్గించుటకు ఈ ఇంజక్షన్ యిచ్చుచుందురు. గాయములు, దెబ్బలు తగిలినప్పుడు వెడలుచుండెడి రక్తమును వెంటనే తగ్గించును. ముక్కు బెదరి కారునట్టి రక్తకాసను వెంటనే తగ్గించును. రక్తాతిసారములను తగ్గించును. రక్తస్రావముల నివారించును. శరీరములో నుండు అవయవములనుండి వెడలు రక్తస్రావముల నివారించును. ప్రసవానంతరము గలుగు రక్తస్రావములు నివారించుటలో మంచి గుణముకలదు. గర్భిణీతోడున్న స్త్రీలకు గలుగు బలహీనతను రూపుమాపును. సిఫిలీసు మేహవ్యాధి వల్ల గలుగు మచ్చలు మొదలైనవాటిని మాయము జేయును. ఇంజక్షనులు 2 CC మొదలు 10 CC వరకు హెచ్చించ

వలయును. క్షయవ్యాధి గలవారికి సాయంత్రము ఇంజక్షన్ యిచ్చిన చాల మంచిగుణము కలుగును. కండరములోనికి ఇంజక్షను యిచ్చిన నొప్పికలిగించును. ఈ ఇంజక్షన్‌వలన వాంతులు, గుండెదడ కలుగును. అట్లు కలిగిన యెడల కొన్ని దినములు ఈ ఇంజక్షను ఆపుజేసి వ్యాధికి తగిన ఔషధమును సేవించుచుండవలయును. ఇంట్రవీనస్ ఇంజక్షను యిచ్చినయెడల తలనొప్పి, శరీరమందంతట మంటలు మొదలైనవి లేచును. లేదా లేవకయుండవచ్చును. గనుక చాల ఆలోచనతో గమనించి ఇంజక్షనుచేసిన చాల మంచి గుణ మియ్యగలదు. జాగ్రతతో ఇంజక్షను చేసిన పై వ్యాధులు తప్పక నివారణ మగును.

## 5. కోలాయిడ్ అయోడిన్.

## Coloid Iodine

### చర్మముక్రింద చేయు ఇంజక్షను

1 CC ద్రవముగల అంపుల్సు వాడుకొనవలయును. జ్వరము యెక్కువ వున్నయెడల ప్రతిదినము 1 CC వాడ వలయును. న్యూమోనియా, ఊపిరితిత్తుల సంబంధమైన వ్యాధులకు వాడుక చేయవలయును. జ్వరమును తగ్గించి, ఊపిరితిత్తుల బాధలు నివారించును. బాలింతలకు కలుగు సూతికా జ్వరములకు చాల మంచి పనిజేయును. సూతికా జ్వరమున కలుగు బాధలు, నొప్పులు నివారించును. రోగి

యొక్క దేహబలమును బట్టి ఇంజక్షన్ చేయుచుండ వల యును. జ్వరమును తగ్గించి, మంచి శక్తి కలుగజేయును. సాధారణమైన పరిస్థితులయందు 1 CC ఇంజక్షన్ వాడు చుండిన చాలును. మొత్తము ఆరు ఇంజక్షన్లు ఒక కోర్సుగా చేయవలసి యుండును. పై వ్యాధులకు మంచి పనిజేయును.

## 6. కస్తూరి, మస్క్ ఇన్ ఈథర్

## Musk in Ether

### చర్మముక్రింద చేయదగిన ఇంజక్షన్

1 CC సీసాలోగల ఔషధము తడవతడవకు వాడ వలయును. తరుణవ్యాధులలో కాళ్లుచేతులు, శరీరము చల్ల బడునట్టి సమయములలో ఈ ఇంజక్షన్ యిచ్చిన వెంటనే వేడి కలిగించును. అవసరమును బట్టి గంటకు ఒకసారి గాని, అర్ధగంట కొకసారిగాని, పదిహేను నిమిషాలకొక సారిగాని వేడి వచ్చువరకు ఇంజక్షన్లు యివ్వవచ్చును. రోగికి వాతము హెచ్చుగా నున్న వాతనాడి తగ్గి తగ్గి నడచు సమయమందు ఈ ఇంజక్షన్ యిచ్చినయెడల వాత మును హరించి, నరములకు బలము కలిగించి రోగిని చావ నీయకుండా కాపాడి మంచిశక్తిని కలుగజేయును. నర ములయొక్క క్షీణగతి యందును, శరీరమున చలువలు గ్రమ్మినప్పుడును పై ఇంజక్షన్ సంజీవివలె పనిజేయును.

## 7. కార్పొరాల్ లుటియా యెక్స్‌ట్రాక్టు

## Corporal Lutia Extract

### ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

1 CC గల ఔషధము ప్రతిదినము వాడనగును. గర్భిణితోవుండు స్త్రీలకు కలుగు వాంతులు (డోకులు) వేవిళ్లు, తల తిరుగుట, పైత్యవికారములను నివారించును. ఋతుదోషములందు సకాల బహిష్టు అగునట్లు ముట్టు శూలకు పనిజేయును. వయస్సు ముదిరి రజస్వలకాని ఆడ పిల్లలకు యిచ్చిన రజస్వలను గావించును. సాధారణమైన పరిస్థితులయందు ఆరు - ఇంజక్షన్లు వాడిన మంచిది. దినము తప్పి దినముకూడ యివ్వవచ్చును.

## 8. కాఫిన్ అండ్ సోడియాబెన్‌జోయేట్.

## Caffeine and Sodiabenjoet

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 CC ల సీసాలో అయిదు గ్రైనులు లేదా యేడు న్నర గ్రైనుల ఔషధ ముండును. 1CC సీసాలో రెండు న్నర గ్రైనుల ఔషధ ముండును. గుండె నీరసించినప్పుడు చురుకుదనము కలిగించి గుండెకు బలము కలుగజేయును. మూత్రము అధికముగా వెడలింపజేయును. శరీరము చల్ల

బడినప్పుడు ఈ ఇంజక్షన్ యిచ్చిన వేడి కలుగజేయును. హృదయ దౌర్బల్యము, నీరసముగా నుండునపుడు మంచి పనిజేయును. న్యూమోనియావంటి శ్లేష్మ సంబంధమైన వ్యాధులు కలుగునప్పుడును, వృద్ధత్వము గలవారికి కూడ యివ్వవచ్చును తొందరగా పనిజేయును. దినము ఒక్క ఇంజక్షన్ చొప్పున వ్యాధి కుదురునంత వరకు యివ్వ వచ్చును.

## 9. క్యాంఫర్ ఇన్ ఆయిల్.

## Comphor in Oil (Intramuscular Injection)

## చర్మముక్రింద కండరములోనికి యిచ్చు ఇంజక్షన్.

ఆలివ్ఆయిల్, హారతికర్పూరము కలిపి తయారు జేయుదురు. కర్పూరము 3 గ్రైనులును, ఆయిల్ పదిహేను చుక్కలు కలిపి సాధారణముగా తయారు చేయుదురు. గుండెయొక్క నీరసమును పోగొట్టును. గుండెకాయకు బలము కలిగించును. చురుకును, బలమును కలిగించును. న్యూమోనియా వ్యాధులయందు మంచి పని జేయును. ఊపిరితిత్తుల వ్యాధికి పనిజేయును. శ్లేష్మము గొంతులో అడ్డము పడినప్పుడు గురుక గల్గు వ్యాధికి మంచిపని చేయును. చలువల్ల గ్రమ్మినవారికి వెంటనే వేడి కలిగించును. వేడి వచ్చునంతవరకు గంటకు ఒకసారి ఇంజక్షన్ చేయుచుండవలయును. పై వ్యాధులందు వేడి సరిగా లేనప్పుడు వెంటనే ఇంజక్షన్ చేసిన మంచి పనిజేయును.

## 10. క్యాంఫర్ ఇన్ ఈథర్
## Camphor in Ether
## చర్మముక్రింద చేయు ఇంజక్షన్

1 CC అంపుల్స్ దొరకును. గంటకు ఒకసారి లేక అర్ధగంట కొకసారిగాని ఒక్క సి. సి. మోతాదు చొప్పున యివ్వవచ్చును. వేడి వచ్చునంతవరకు యివ్వ వచ్చును. వేడి వచ్చినచో ఇంజక్షన్ ఆపి, అవసరమైన మరల చేయుచుండవలయును. రోగి మూర్ఛలో నున్న సమయమందుకూడ ఇంజక్షన్ చేయవచ్చును. తొందరగా పనిజేయును. అవసరమైన యెడల క్యాంఫర్ ఇన్ ఆయిల్ యిచ్చినకూడ పనిజేయును. మూడు లేక నాలుగు ఇంజక్షనులు యిచ్చిన మంచిగా పనిజేయును. ఇంజక్షన్‌లు ఎక్కువ యిచ్చినయెడల వేడి అధికమగును. గుండెయొక్క బలము నీరసమునకు సయితము రెండు మూడు ఇంజక్షన్‌లకే గుణము కనుపించును. బాధ నివారణ మగును. ఊపిరి తిత్తుల వ్యాధికికూడా పనిజేయును.

## 11. క్వినైన్ బై హైడ్రోక్లోరైడ్
## Qunine Bi Hydrochloride
## Intramuscular Injection

1 CC లో మూడు గ్రైనుల ఔషధమున్ను, 2 CC లో పది గ్రైనుల ఔషధమున్ను యుండునట్లు తయారు

చేయుదురు. 1 CC పిల్లలకున్ను, 2 CC ల వరకు పెద్దలకున్ను వాడవలయును. మలేరియా జ్వరమునకు మంచిపని జేయును. వాంతులు, జ్వరము, కండ్లమంటలు, శరీరమున మంటలు, చలితోకూడి దినము తప్పి దినమువచ్చే జ్వరము, తలనొప్పి, జ్వరము బాగా తగ్గినప్పుడు పై ఇంజక్షన్ చేయవలసియుండును. ఇంజక్షన్ చర్మముక్రింద యెన్నడు చేయరాదు. అట్లు చేసినయెడల ఇంజక్షన్ చేసిన స్థలము గడ్డకట్టి కొన్ని రోజులకు కురుపులు లేచి కుళ్ళుట కూడ సంభవించును. వీలైనంతవరకు పిఱ్ఱపైనుండు గట్టి కండరములోనికి ఈయవలయును. ఈ ఇంజక్షన్ యిచ్చిన పైత్యముజేసి వాంతులుకూడ కలుగును. జ్వరము తగ్గినపిదప ఒక ఇంజక్షన్ చేసిన జ్వరము, చలి నివారించును. మరల కొన్ని దినములకు తిరిగి జ్వరము రావచ్చును. కాని మూడు నాల్గు ఇంజక్షనులు చేసిన చలిజ్వరము మరల రాదు. ఇంజక్షన్ చేసిన స్థలమున కొద్దిగా నొప్పి యుండును. గడ్డ గట్టినట్లుండును గాని, వేడినీళ్ళతో కాపడము కాసిన గడ్డ కరగిపోవును.

## 12. బై సల్ఫానమైడ్

## Bi Sulphonamide Intramuscular Injection

### కండరములోనికి చేయు ఇంజక్షన్

5 CC 10 CC వాడవలయును. ఈ ఇంజక్షన్‌లో సల్ఫానామైడు మందు కలిసి యుండును. దీనిని గనేరియావ్యాధి

గలవారికి వాడుదురు. గనేరియావలన కలుగు అన్ని అవస్థ లకు పనిజేయును. 5 CC ద్రవము మూడు రోజుల కొకసారి వాడవలయును. అంపులు కదలించి ఇంజక్షన్ చేయవలయును.

### 13. సైటోడైన్

### Cytodin. (Intramuscular Injection)

### కండరములోనికి చేయు ఇంజక్షన్

2CC అంపుల్సు లభించును. తరుణజ్వరములలోను, జలుబు, విషపడిసెములతో కూడిన జ్వరము, సమస్త జ్వరములకు ఈ ఇంజక్షన్ చేసినయెడల చాలవరకు నివారణమగును. జ్వర మున్నప్పుడే 2 CC ఇంజక్షన్ నీయవలయును. జ్వరములను నివారించుటలో (I. H.) కంపెనీ వారిదే శ్రేష్ఠమగు మందు ఇదియే లభించును. మంచి గుణము కలిగించును. శరీరమున కేర్పడినట్టి యే వ్యాధినైనను తీవ్రదశకు రానీయక కాపాడునట్టి శక్తి ఈ ఔషధమునకు సహజముగాన వ్యాధియొక్క ప్రారంభ దశయందు దీనిని వాడిన మంచి ఫలిత మొసంగును.

### 14. బైఓమ్నిజీన్.

### Bi-Omnigen (Intramuscular Injection)

### కండరములోనికి చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు వాడుకజేయుదురు. జ్వరమువచ్చిన

వెంటనే ఈ ఇంజక్షన్ చేసిన యెడల జ్వరము అప్పటి కప్పుడే నివారణ మగును. విషపడిశములు, ముక్కు బిగ్గరపట్టుట, చర్దిచలువయున్ను బోనచంచి, వేడి కలిగించి జ్వరములను నివారించును. సూతికా జ్వరమునకు మంచి పనిజేయును. సన్నిపాతజ్వరము నివారించును. ప్రతిదినము 1 CC యిచ్చిన జ్వరములు నివారించును. ఆరు ఇంజక్షన్ల కన్న యెక్కువ చేయరాదు. ఇది లభించని యెడల వరిజనలు, బెయరుకంపెనీవారిది వాడవలెను. ఓంనాడైన్ కూడ మంచి పనిజేయును. క్షయవ్యాధి జ్వరములందు కూడ టెంపరేచర్ తగ్గును.

## 15. బై ఓవరెక్సు

## Bi, Ovarex

తత్వము మారినందువల్లను, కాలము మార్పు జెందుటచేత కలుగు వ్యాధులకును, బహిష్టు దోషములకు మంచిపనిజేయును. 1 CC ఇంజక్షన్ అంపుల్సు దొరకును.

## 16. ప్రొకైన్ హైడ్రోక్లోరైడ్

## Procaine Hydrochloride

1 CC, 2 CC ట్యూబులుకూడా లభించును. గడ్డలగువాటికి నొప్పి లేకుండ ఆపరేషన్ చేయవలెనన్న ఈ ఇంజక్షన్ చేయవలెను. ఆపరేషన్ చేయవలసిన గడ్డచుట్టు

రెండు ఇంజక్షనులు చేసిన నవి మొద్దుబారును. అప్పుడు ఆపరేషను చేసినయెడల నొప్పి యేమాత్రము కలుగదు. (Bi) కంపెనీవారిది పైవిధముగానే పనిచేయును.

## 17. కోల్లాయిడ్ స్టానో మేంగనేస్

### Colloidstnne Manganese

### కండరములలోనికి చేయు ఇంజక్షన

1 CC, 2 CC ట్యూబులు దొరకును. రెండు రోజులకు ఒక్కసారి ఇంజక్షన చేయవలయును. రక్తశుద్ధి లేక కలిగెడు కురుపులు, రాచకురుపులు, మొటిమలు మొదలగు వ్యాధులు గలవారికి ఈ ఇంజక్షన చేసిన నవి నివారణ మగును. క్రమముగా ఆరు ఇంజక్షనులు చేసిన చాలును. రక్తశుద్ధి జేయుచు చర్మవ్యాధులు నివారించుటలో దీనికిదియే సాటి. మంచి గుణముగలది. మొటిమలు గూడ తొందరగా మానిపోవును.

## 18. యాట్రిన్ కాసైన్

### Yatren Casoin

1 CC ట్యూబులు లభించును. వాతపు నొప్పులు, ఉష్ణవాత సంబంధమైన వాతపు నొప్పులు, శరీరములోగల పెక్కు వాతపు నొప్పులకు బాగుగా పనిజేయుటయందు ప్రసిద్ధి గన్నది. మంచి గుణముగలిగి యుండుటచేతను,

కంటిపోట్లుకూడ నివారించునట్టి దగుటచేతను దీని కింత ప్రసిద్ధి. బేయర్ కంపెనీవారిది మంచి పేరుగలది. ఆరు ఇంజక్షన్ లిచ్చిన గుణము వెంటనే కనిపించి పై వ్యాధులను నివారణ గావించును.

## 19. మైయోసిన్

## Mayocin

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్

సన్నముగా నడుచుచున్న నాడికి చురుకుదనము కలిగించును. బలము కలుగజేయును. దినమునకు ఒక ఇంజక్షను చేసిన చాలా మంచిపని చేయును. గుండెకు బలము కలుగజేయును. వేడిని హెచ్చించి, తరుణవ్యాధులచే గలుగు క్షీణగతి యందు మంచి గుణము కలిగించును. (Bi) కంపెనీ వారిది మంచిపని చేయును.

## 20. బైహిస్టూడైన్

## Bi-Histidine

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్

నాడికి చురుకుదనము కలిగించి, గురకను నివారించును. శ్లేష్మమును పలుచపరచును. వాతము గ్రిమ్మిన వారికి వాతమును నివారణ చేయును. సన్నగానడచు నాడికి.

ఉత్తేజము కలిగించి బాగుగా పనిచేయును. గుండెయొక్క నీరసమును పోగొట్టును. తరుణ వ్యాధులందు అమృతము వలె పనిజేయును. (Bi) కంపెనీ వారిది బాగుగా గుణము నొసంగుటలో పేరుపొందియున్నది. దినమున కొక్కసారి గాని, అవసరముకొద్దిగాని వాడుచుండవలయును.

## 21. లేడర్ ప్లక్సు
## Lederplex
### కండరములో చేయు ఇంజక్షన్

5 CC వయల్ లభించుచుండును. ఇది శరీరము నందుగల నొప్పులను నివారించుటకున్ను, శరీరమునకు పట్టుదల, రక్తవృద్ధి కలిగించుటకున్ను, పాండు వ్యాధులను నివారించుటకున్ను, రక్తవృద్ధి జీర్ణశక్తి నిచ్చుటకున్ను, తిమురువాతములను నివారించుటకున్ను, నోటియందు కలు వ్యాధులను నివారించుటకున్ను యిది బాగుగా గుణము నిచ్చును. పాండు వ్యాధులయందు కలుగు రక్త క్షీణతల కున్ను, పాండు వ్యాధియొక్క అన్ని లక్షణములకున్ను, జీర్ణాశయముయొక్క క్షీణత, ఆకలి పుట్టించుటకున్ను, వ్యాధులచే బాధపడిన తర్వాత కలుగు బాధలకున్ను టానిక్ మాదిరిగా గుణమునిచ్చును. రెండు మూడు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని లీడరలీ లెబోరేటరిస్ లిమిటెడ్ వారు తయారుచేయుదురు.

## 22. సిలోట్రొఫిన్
## Cilotrophin
### ఇంట్రవీనస్ ఇంజక్షన్

గనేరియా వ్యాధులలో సంభవించు మూత్రిమున మంటలు, మూత్రము పోవు మార్గము వాచుట, అధిక మగు బాధలు గలుగుట నివారించి, గనేరియా (సెగలు) నివారించి, మూత్రమును బాగుగా వెడలించి మేహబాధలు నివారించుటలో మంచి శక్తి గలది షిరింగు కంపెనీవారిది బాగుగా పనిజేయును. మంచి గుణము నిచ్చును. మంచి పనితనము గలిగి శ్రేష్ఠముగా నుండును. "పెనిసీలిన్" వెలువడిన పిదప దీనియొక్క వాడుక అంతగాలేదు.

## 23. కార్డటోన్
## Cardatone
### చర్మముక్రిందను కండరములోనికి ఇచ్చు ఇంజక్షన్

గుండెయొక్క నీరసము పోగొట్టుటయందు మంచి పనిజేయును. పైత్యమువల్ల వచ్చు శూలలకు బాగుగా పని జేయును. గుండెశూల నివారించును. గుండెకు బలము కలుగజేయును. 1 CC, 2 CC వాడుక జేయవలయును. యీవెన్సు కంపెనీవారిది బాగుగా పనిజేయును. గుండె శూలలకు అమోఘముగా పనిచేయును. తత్వమును, ప్రకృతిని గుర్తెరింగి వాడవలెను.

## 24. కోల్‌సాల్ అయొడిన్.

## Collosol Iodin (Intravenous Intra Muscular Injections)

## ఇంట్రవీనస్ అండ్ ఇంట్రమస్కులర్ ఇంజక్షన్.

న్యూమోనియా జ్వరములకు చాల మంచి పని జేయును. ఈ ఇంజక్షను మరచి చర్మముక్రింద చేయరాదు. (చేసిన యెడల బాధలు కలిగించును.) జ్వరమును చాల తొందరగా నివారించును. న్యూమోనియా వ్యాధికి అమృతమువలె పనిజేయును. విషజ్వరముల కిది పెట్టినది పేరు. జగద్విఖ్యాతి వహించిన పలుఇంజక్షనులలో నిది యొక్కటి.

## 25. కోలోసాల్ కాల్షియం.

## Coliosol Calcium

## ఇంట్రవీనస్, ఇంట్రమస్కులర్ ఇంజక్షను

5 CC, 10 CC ట్యూబులు లభించును. క్షయవ్యాధి వలన బాధపడువారికి బాగుగా పనిజేయును. రక్తకాసలు, రక్తవాంతులు నివారించును. బలహీనత తగ్గించి, జీర్ణశక్తి నిచ్చుటయందు మంచి పనిజేయును. దగ్గును నివారించును. క్షయ జ్వరమును నివారించును. ఈ ఇంజక్షను క్షయవ్యాధులకు బాగుగా పనిజేయును. స్త్రీలకు గలుగు శ్వేతప్రదరమునుగూడ నివారించి పుష్టి గలుగజేయుటయందు ప్రఖ్యాతి

వహించినది బలహీనమును, హృదయముయొక్క గతిని స్థితిని గమనించి ఇంజక్షన్ చేయవలయును.

## 26. లివరేక్సు

## Livarex.

కండరములోనికి చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు వాడవలయును. క్షయవ్యాధుల వలన కలిగిన బలహీనమునకు యివ్వనగును. పాండు రోగము గలవారికిని, జ్వరమువలన రక్తము తగ్గి బలహీనత యేర్పడినవారికి బహు తొందరగా పనిజేయును. మలేరియా జ్వరము తగిలి పూర్తిగా తగ్గిపోయిన పిదప శరీరములో సత్తువలేక నుండువారికిని, జీర్ణశక్తిలేకయుండు వారికి, గర్భిణితో నుండు స్త్రీలకు రక్తవృద్ధి గావించి ఆయాసముగల బాధలను తగ్గించును. రక్తము వృద్ధి జేయును. జీర్ణశక్తినిచ్చి బలమును కలుగజేయును.

## 27. బైబిస్ముతాల్.

## Bi-Bismuthol Intravenous and Intramuscular Injection.

ఇంట్రవీనస్, ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

అర్జంటుగల కేసులకు ఈ ఇంజక్షన్ యిచ్చిన తొందరగా గుణము కనిపించును. సిఫిలిస్ అను సవామేహ

సంబంధమగు వ్యాధులకు పాషాణసంబంధమైన ఇంజక్షన్‌లు చేయకున్న యెడల, మధ్య మధ్య ఈ ఇంజక్షన్‌లు యివ్వ వచ్చును. 140 పౌనుల బరువుగలవారికి, వారమునకు మూడు ఇంజక్షన్‌లు యివ్వవచ్చును. 100 మొదలు 120 పౌనులు గలవారికి రెండు ఇంజక్షనులు వారములో రెండు సార్లు యివ్వవచ్చును. నిదానముగ పనిజేయవలెనినిన, కండరములోనికి ఈ ఇంజక్షను యివ్వవచ్చును. ఈ ఇంజక్షను మందు అంపుల్సును బాగుగా కదలించి వేడినీళ్ళలో నుంచి పిదప కొంతసేపటికి ఇంజక్షను చేసిన మంచిది.

## 28. సల్పార్సనాల్.

## Salparsanal.

## పాషాణసంబంధమగు ఇంజక్షను.

ఇది ట్యూబులో పౌడరు రూపముగా సప్లయి చేయబడును గవర్నమెంటువారిచే పరీక్షింపబడి సీసాలు అంపుల్సుచేసి ఉంచుదురు ఈ ఇంజక్షను ట్యూబులు యీ క్రింద మోతాదులతో వాడనగును. మరచి కండరములోనికి యెన్నడు చేయరాదు. రక్తనాళములోనికే చేయవలయును. చాల జాగ్రత్తగా చేసిన వ్యాధిపై తొందరగా మంచి గుణము కనబడును. 0.15.0 గ్రాములు. 0.13.0 గ్రాములు, 0.45.0 గ్రాములు, 0.60.0 గ్రాములు, 0.75.0 గ్రాములు, 0 90.0 గ్రాములు, ఈ విధముగా ఔషధముయొక్క

బలమును రోగ బల తత్వముల నెరింగి, (సవామేహ మనగా) సిఫిలిస్ వ్యాధులకు ప్రత్యేకముగా వాడుచుందురు. ముందుగా రక్తము పరీక్షించి ఇంజక్షన్ చేయవలయును. 10 CC డిస్టిల్డు వాటర్, సీసాలోగల సల్వార్సనలు పౌడరులో కలిపి, ఇంజక్షన్ చేయవలయును. శుభ్రముగా సూదులు, సిరంజీ వేడినీళ్ళలో మరగించి ఇంజక్షన్ ఇచ్చిన చాల మంచిది. డిస్టిల్డు వాటరు బాగుగా మిశ్రమముజేసి సిరంజీలోనికి లాగుకొని జాగ్రత్తగా రక్తనాళములోనికియ్యవలయును. సవామేహ జబ్బులకు, పిరంగి జబ్బులకు ప్రత్యేకముగా పనిజేయును. పెద్దలకు మొదట సామాన్యముగా 0.60.0 వరకు వారం రోజులకు ఒక ఇంజక్షన్ చేసిన చాలును. క్షయవ్యాధి గలవారికి, మూత్రవ్యాధి గల వారికి గమనించి ఇంజక్షన్ చేయవలయును. ఎక్కువ పసరుగలవారికి (పైత్యతత్వము గల రోగులకు) ఇంజక్షన్ చేసిన పసరు యెక్కువయగును. ప్రాణాపాయముకలుగును. ఒకప్పుడు శరీరము పెట్లి బీటబారును. గనుక ప్రతి ఇంజక్షన్ పెట్టెలోనుండు కాగితమును సాంగోపాంగముగా చదివి, దానిని గుర్తునందుంచుకొని ఇంజక్షనిచ్చిన వ్యాధి నివారించును. బలహీనము, గుండెయొక్క బలహీనముగల వ్యాధులందు యెన్నడును ఇంజక్షన్ చేయరాదు. గమనించి చేయవలెను. సామాన్యముగా సవామేహము, గనేరియావ్యాధులకు చేయుచుండవలెను. నెం. 1 మొదలు 10 నెంబరు వరకు

ఔషధముతో నింపబడిన అంపుల్స్ లభించుచుండును. పెద్ద లకు 3 నెంబరు మొదలు 6 లేక 7 వరకు చేయవలెను. పాషాణసంబంధమైన ఇట్టి ఇంజక్షన్‌కు విరుగుడుగా అవ సరమునుబట్టి బిస్మిత్ ఇంజక్షన్ పెట్టె నెం. 40 లేక 41 చేయు చుండవలయును. రోగ క్రిములను సంహరించును. సవా మేహ వ్యాధులకు నాలుగు ఇంజక్షన్‌లు నాలుగు వారము లలో చేసిన సవామేహ వ్యాధియేగాక క్రిమిజాద్యములను కూడ రూపుమాపును. రక్తశుద్ధి జేయును. చర్మవ్యాధులకు బాగుగా పనిజేయును. నేడు పైవ్యాధులను "పెనిసిలిన్" ఔషధము కడుసమర్థతతో నిర్మూలించుచున్నది.

## 29. మిల్క్ ప్రోటీన్.

(Milk protein. Intramuscular Injection)

కండరములోనికి చేయు ఇంజక్షన్.

2 CC, 5 CC, 10 CC పరిమాణములలో లభించు చుండును. దీనిని పాలతో తయారు చేయుదురు. గనేరియా వ్యాధి గలవారికి, కీళ్ళనొప్పులకును స్త్రీలకు కలుగు మర్మ స్థానమునందలి వ్యాధులకు, చర్మవ్యాధులకును, 2 CC మొదలు 10 CC వరకు వాడవలెను. అన్ని కంపెనీలవారును యీ ఇంజక్షనులను తయారు చేయుచున్నారు.

## 30. అండ్రినలిన్ క్లోరైడ్.

## Andrenalin Chloride.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

ఈ ఇంజక్షన్ రబ్బరు మూత వేయబడిన సీసాలో లభించును. వెయ్యిభాగములలో ఒకభాగము పైఔషధము చేరియుండును. అర CC మొదలు 1 CC వరకు రోగి బలములను అనుసరించి యివ్వవలయును. రోగి బాధ తగ్గు వరకు గంట కొకసారి; అర్ధగంట కొకసారి యివ్వవలయును. బాధలు తగ్గినతర్వాత ఈ ఇంజక్షన్ ఆపుచేయవలయును. మోతాదు యెక్కువైన యెడల ప్రాణాపాయము కలుగును. రోగియొక్క రక్తపుపోటు ననుసరించి జాగ్రతగా ఇంజక్షన్ యివ్వవలయును. ఉబ్బసపు వ్యాధి బాధలు తొందరగా తగ్గించుటకు దీనికి మించిన ఔషధములేదు. గుండెకు మంచి బలము నొసంగును. క్లోరోఫారమువలన కలిగిన ప్రమాదములను నివారించుటకు సయితము ఉపయోగపడును.

## 31. ఎడ్రిపొ ఎఫిడ్రిన్.

## Edripo Ephedrine.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

మోతాదు 1 CC యివ్వవలయును. శ్వాసవ్యాధులకు యివ్వవలయును. ఆలస్యముగా పనిజేయును. గుండెకు

బలమునిచ్చి, శ్వాస వ్యాధిని నివారించును. ఎడ్రినలిన్ క్లోరైడ్ మాదిరిగా పనిజేయును. ఉబ్బస వ్యాధులకు కూడ మంచి పనిజేయును.

## 32. ఎఫిడ్రిన్ హైడ్రోక్లోరైడ్.

## Ephedrine Hydrochloride.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

మోతాదు అర్ధగ్రైను మొదలు ముప్పావు గ్రైను వరకు 1CC ద్రవముతో చేర్చబడిన అంపుల్స్ లభించును. శ్వాస సంబంధమైన వ్యాధులకు నిమిషాల ప్రకారము మంచి గుణము కల్పింపజేయును. ఉబ్బసవ్యాధికి మంచిగా పని జేయును. ఈ ఇంజక్షన్ ఔషధ మాత్రలుకూడ లభించును. ఉబ్బస సంబంధమగు అన్నివ్యాధులకు ఇది వజ్రాయుధము.

## 33. ఒవేరియన్ రెసిడ్యూ.

## Overian Recidue.

### కండరములోనికి చేయు ఇంజక్షన్.

1CC అంపుల్స్ లభించును. సామాన్యముగా ప్రతి దినము, గుణము కనుపించునంతవరకు ఒక ఇంజక్షన్ యివ్వవలెను. వైద్యుడు రోగి శరీర తత్వ స్వభావములను గ్రహించి యుక్తవయస్సు వచ్చి రజస్వల కాని కన్యలకు ఇంజక్షన్ చేసిన యెడల అవయవస్ఫూర్తి కలుగును. స్త్రీలకు గల్గు ముట్టుశూలలు, నొప్పులను సహా నివారించును.

## 34. ఇన్స్లిన్.

Insulin.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

మోతాదు అర సిసి నుంచి 1 సిసి వరకు వాడవలయును. ఈ ఔషధము రబ్బరుమూత వేయబడిన సీసాలో నుండును. ముఖ్యముగా మధుమేహములకు మాత్రమే వాడుట కలదు. మూత్రములో చక్కెరలేనిదే పై ఇంజక్షన్ నీయరాదు. ఇచ్చినయెడల రోగి మూర్ఛపోవును. సాధారణమైన పరిస్థితులయందు చర్మముక్రిందను, రోగికి స్పృహలేనప్పుడు రక్తనాళములోనికి నీయవచ్చును. మధుమేహమును నివారించుననుట కెట్టి సందియము లేదు. మూత్రమున చక్కెర యెక్కువగా పోవువారికిచ్చిన అట్టి దానిని వెంటనే తగ్గించును. ప్రతిదినమును మూత్రపరీక్ష గావించుచు చక్కెర యెంత (యెన్నివంతులు) తగ్గుచున్నదో గమనించు చుండవలయును. చక్కెర ఒకభాగ మున్నదనగా ఇంజక్షన్ ఆపుచేయవలయును. తరువాత మంచి గుణము కలిగియున్న ఔషధము వాడుచున్నయెడల మధుమేహవ్యాధి నివారణమగును.

## 35. ఎమిటిన్ హైడ్రోక్లోరైడ్.

Emetine Hydrochloride.

కండరములోనికి చేయు ఇంజక్షన్.

అర సిసి, 1 సిసి ట్యూబులు లభించును. రక్తాతి

సారములు, ఆమాతిసారములు, జిగటతోకూడిన అతిసారములు, విరేచనములు అగునప్పుడు యిచ్చిన మంచి పని జేయును. గుదెమువద్దను, కడుపులోన నుండు బాధలు నివారించును. కార్జములో పుట్టినటువంటి వాపును నివారించును. ఈ ఇంజక్షన్ రోగబలము ననుసరించి, తత్వమును బాగుగా గుర్తెరింగి యిచ్చిన మంచిపనిజేయును. ప్రేగుల్ల లోని క్రిములను సంహరించును. మూడు రోజులు వరుసగా యిచ్చిన మంచి పనిజేయును. మొత్తము తొమ్మిది ఇంజక్షన్ లిచ్చిన తరువాత చాలించవలయును. పై వ్యాధులకు వజ్రాయుధమువలె పనిజేయును. ఇందు యెంతమాత్రమును సందేహించ నవసరములేదు.

## 36. అయిరన్ అర్సినైట్.

## Iron Arsenite. (Intramuscular Injection.)

### కండరములోనికి చేయు ఇంజక్షన్.

1 సిసి సీసాలో 1 గ్రేను ఔషధముండును. ఈ ఇంజక్షన్ రక్తశుద్ధిలేక కలిగెడు చిడుము, కురుపులు, చర్మవ్యాధి, గజ్జి, దురదలు నివారించును. పాండు వ్యాధులకు మంచి పనిజేయును. కామిలావ్యాధి నివారించును. మంత్రపు పొక్కుల బాధ నివారించును. దినము ఒక ఇంజక్షన్ చొప్పున ఆరు ఇంజక్షనులు యివ్వవలెను. మలేరియా జ్వరమునకు కూడ బాగుగా పనిజేయును.

## 37. అయిరన్ అర్సినైట్ స్ట్రిక్నైన్.

## Iron Arsenite Strych Nine

### కండరములోనికి చేయు ఇంజక్షను

1 సిసి సీసాలో అయిరన్ అర్సినైట్ ఒకగ్రైను, స్ట్రిక్నైన్ 1/60 గ్రెయిను పరిమాణమువరకు చేర్చి పాషాణ సంబంధముగా తయారుచేయుదురు. ఈ తయారుచేసిన మందు పాండురోగులకు ఇంజక్ష నిచ్చిన రక్తవృద్ధియై పాండువ్యాధులు నివారించును. గుండెకు మిక్కిలి బలము నొసంగును. బలహీనతచే నుండువారికి మంచి బలము నిచ్చును. దేశ కాల పరిస్థితులను, తత్వము ననుసరించి చర్మ వ్యాధులకు ఇంజక్షను చేయవచ్చును. ఆరుదినములు ఆరు ఇంజక్షనులు యివ్వవచ్చును. సాధారణమైన నీరస స్థితి యందు పై ఇంజక్షను యిచ్చినయెడల శరీరమున కుత్తే జము గలిగించును.

## 38. అయిరన్ సిట్రేట్.

## Iron Citrete.

### చర్మముక్రిందను కండరములోనికి ఇచ్చునట్టివి.

రెండు గ్రెయినుల ఔషధము 1 సిసి సీసాలో నుండును. గొప్పగొప్ప వ్యాధులు కుదిరినతరువాత శరీర ములో రక్తము లేక బలహీనము గలిగి, జీర్ణశక్తి లేక నీరసస్థితియందుండు వారికి ఈ ఇంజక్షన్ యిచ్చినచో

టానికు మాదిరిగా పనిజేసి రక్తము శుద్ధిజేసి, బలహీనతను నివారించి మంచి తేజస్సును, నరములకు బలమును కలుగ జేయును. ప్రతిదినము ఒక ఇంజక్షన్ చొప్పున ఆరు ఇంజక్షన్లు యివ్వవచ్చును.

## 39. ఎర్గటిన్.

## Ergotin.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1/100 గ్రెయిను ఔషధము 1 CC సీసాలో లభించును. ప్రసవానంతరము మావి బయలువెడలుటకు ఆలస్యమైన యెడల వెంటనే ఈ ఇంజక్షన్ యిచ్చిన మావి బయటకు వెడలును. రక్తస్రావము అధికముగా అగుచున్న తగ్గించును. రక్తస్రావములకు మంచి పనిజేయును.

## 40. ఎన్ట్యూలిట్రిన్-'S'

## Antulitrin-'S'.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC గల అంపుల్సు సీసాలు వాడుకలో గలవు. ఎదుగక గట్టిబారియున్న బాలురకు, బాలికలకు యిచ్చిన ఎదుగుదురు. బుద్ధిబలమును, జ్ఞాపకశక్తిని వృద్ధిజేయును. సోమరితనము నుండి తప్పించును. ఋతువచ్చి రజస్వల కానివారికి యిచ్చిన వెంటనే రజస్వ లగుదురు. పార్కు-డేవిసు కంపెనీవారిది మంచి పనిజేయును.

41. ఐసొటానిక సెలైన్ సొల్యూషన్,
Isotonic Saline Solution.
ఇంట్రవీనస్ ఇంజక్షన్.

దేహపుష్టి, కంఠరములకు శక్తి, రక్తపుష్టి, రక్త శుద్ధిచేసి బలమును కలిగించి ముఖమునకు కాంతి, నరములకు పటుత్వము, వీర్యవృద్ధి, వీర్యశుద్ధి జేయును. వేల్సు కంపెనీవారు తయారు చేయునది చాలామంచిది. దినమునకు ఒక ఇంజక్షన్ చొప్పున వాడవచ్చును.

42. సైలాన్ విత్ అయోడిన్.
Saline With Iodine.
ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్,

5 CC, 10 CC లభించును. మూడుదినముల కొకసారి ఇంజక్షన్ చేసిన మంచిది. ఆరు ఇంజక్షనులు చేసిన వ్యాధి నివారించును. స్త్రీలకు కలుగు శ్వేత ప్రదరములు, రక్తస్రావములు, గనేరియా వ్యాధులను నివారించును. (Bi) కంపెనీవారిది చాలా మంచి పనిజేయును. శ్వేత ప్రదరములు మిక్కిలి చాకచక్యముగా నివారింపగల శక్తిగలది.

43. బిస్మిథాలు.
Bismuthal. (Intramuscular Injection.)
ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

2 CC, 5 CC లభించును. ప్రతిదినము ఇవ్వవచ్చును.

ఆరు ఇంజక్షనులు యిచ్చిన చాలును. "సిఫిలిస్" అనగా సవామేహ జబ్బులు గలవారికి యిచ్చిన నిదానంగా పని జేయును. సిఫిలిస్ సంబంధముగల అన్ని వ్యాధులను నివారించును. అలంబిక్ కంపెనీవారిది చాలా మంచిపనిజేయును. ఇంజక్షను అంపుల్సు కదలించి వాడవలెను.

## 44. మల్టిన్.

## Multin. (Intramuscular Injection.)

## ఇంట్రమస్కులర్ ఇంజక్షను.

2 CC యివ్వవచ్చును. దినము తప్పి దినము వచ్చే వరుసజ్వరము, విషజ్వరములతో కూడిన రుగ్మత (మలేరియా) అను చలిజ్వరము ఇన్‌ఫ్లూయంజా మొదలగు అనేక జ్వరముల నివారించును. దినముతప్పి దినము ఇంజక్షను జేయుచుండవచ్చును. మూడు యింజక్షనులు చాలును. జ్వరమున్న వేళలయందుకూడ యింజక్షన్ చేయవచ్చును. సాధారణమైన జ్వరములు తప్పక నివారించును ఒక యింజక్షనుకే జ్వరము నివారించును గాని మూడు యింజక్షనులు తప్పకుండా యిచ్చిన సర్వవిషజ్వరములు మాయమగును. ఈ ఇంజక్షను నివారించగల అనేకవ్యాధులను "పెన్సిలిన్" యింజక్షన్‌గూడ నేడు నివారించుచున్నది.

## 45. అసిటైలార్సన్.

Acetylarsan. (Intramuscular Injection.)

ఇంట్రిమస్క్యులర్ యింజక్షన్.

3CC యింజక్షన్ చేయనగును. M&Bco., వారిదే లభించును. పై కంపెనీవారే చేయుదురు. సవాయి సంబంధ మైన అనేక వ్యాధులకు పనిజేయును. గనేరియాకు, శరీరమునందు గల అన్ని నొప్పులకు, జ్వరములకు, క్రిమి సంబంధమైన అంటుజాడ్యములకు మంచి పనిజేయును. రెండుదినముల కొకపర్యాయము యింజక్షనిచ్చిన చాలును.

## 46. గ్లూకోస్ యింజక్షన్.

Glucose Injection.

5CC, 10CC 25% సొల్యూషన్‌తో వాడుక చేయుదురు. నరములు బలహీనత గలవారికి బాగుగా పనిజేయును. గుండెదడ నివారించి గుండెకు బలము నొసంగును. అపస్మారము గలవారికి తొందరగా గుణము నిచ్చును. రోగి స్పృహతప్పి నోటిద్వారా ఆహారము పోనివారికి ఈ యింజక్షన్ రక్తనాళముద్వారా చేసిన ఆహారము తీసికొనుటకై తగినశక్తి కలుగజేయును. దినము ఒక యింజక్షన్ యివ్వవలయును. అవసరము ననుసరించి జాగ్రితగా గమనించి యింజక్షన్ చేయవలయును. మత్తుమందు ప్రియోగించుటచే యెక్కువై వాంతులు సంభవించినప్పుడు వెంటనే ఈ యింజ

క్షన్ నిచ్చిన వాంతులు కట్టును. పసిపిల్లలకు కలుగు మొండి జ్వరములకు కూడా పనిజేయును. ఈ గ్లూకోసు యింజక్షన్ పెద్దవారికి కలుగు మొండి వ్యాధులకును పనిజేయును. మధుమేహవ్యాధులలో మైకము కలిగినప్పుడు మంచిగా పనిజేయును. దీనిని గ్లూకోసు సొల్యూషన్ యందురు. C. T. E. కంపెనీవారిది చాలా మంచిగా పనిజేయును.

47. థయోసార్మిన్.

Thio Sarmine. (Intramuscular Injection.)

ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

ఈ యింజక్షన్ పాషాణ సంబంధమైనది. బ్రిహ్మా చారి కంపెనీవారు తయారుచేయుదురు. సిఫిలీసుగల వ్యాధులకు వాడవలయును. సల్ఫర్సనల్ మాదిరి పనిజేయును. సల్ఫర్సనల్ మాదిరిగానే డబ్బాపై నెంబరు గలదు. సవామేహవ్యాధికి నాలుగు దినములకు ఒక ఇంజక్షన్ చేసిన, సవామేహములు నివారించును. చాల జాగ్రతతో కండరములకే యివ్వవలయును. "పెనిసీలిన్" వెలువడిన పిదప దీని ప్రయోజనము చాలవరకు తగ్గెను.

48. పొటాషియం యాంటిమోనిటార్ ట్రేట్.

Potassium Antimonytartrate.

ఇంట్రావీనను యింజక్షన్.

1 CC, 2 CC అంపుల్సు లభించును. పొరపాటున మ్రింగరాని విషసంబంధమైన వస్తువులు మ్రింగినయెడల వెంటనే పై యింజక్షన్ జేసినచో విషమును వాంతి గావిం

చును. అజారు వ్యాధికి వాడుకగలదు. మూడు దినముల కొకసారి యింజక్షన్ చేసేది. ఈ యింజక్షన్ చేసిన వెంటనే ఒకవేళ వేడి యెక్కువైనచో దగ్గు, పేగులలో గాలి జొచ్చుట, వాంతి విరేచనములు కలిగిన యెడల వెంటనే యింజక్షన్ ఆపుచేయవలయును. ఈ యింజక్షన్ యెన్నటికి కండరములోనికి యివ్వకూడదు. ఇచ్చినయెడల పోటు, వాపు, బాధ యేర్పడును జాగ్రతతో గమనించి యింజక్షన్ చేసిన చాల మంచి పనిజేయును.

## 49 సల్ఫోడైన్.

Sulfodine. (Intramuscular Injection.)

ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

1 CC యింజక్షన్ లభించును. గనేరియా వ్యాధికి మిక్కిలి మంచి పనిజేయును. గనేరియావలన కలుగు అన్ని అవస్థలకు గుణము కలిగించును. నడుము నొప్పులను వెంటనే తగ్గించి, వాతము నొప్పులుకూడ నివారించుటలో మంచి గుణము కలదు. తొంటి నొప్పులకుకూడ బాగుగా పనిజేయును. మెడికల్ సప్లైస్ కంపెనీ లిమిటెడ్, కలకత్తా కంపెనీ వారిది చాల మంచి పనిజేయును.

## 50. సిబాజాల్.

Cibazol. (Intravenous and Intramuscular Injection.)

ఇంట్రవీనస్, ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

5 CC అంపుల్సు లభించును. ఈ యింజక్షన్ గనే

రియా వ్యాధికి వాడిన తొందరగా గుణము కనిపించును. చర్మవ్యాధులు, రక్తశుద్ధి లేక గలిగెడు వ్యాధులకు మూడు ఇంజక్షన్ లిచ్చిన గుణము కనిపించి తొందరగా అన్ని చర్మ వ్యాధులు నివారించును. సిబాజాల్ మాత్రలుకూడ లభించును. అవికూడ వాడుక జేయుదురు. "సీబా" కంపెనీ వారిది ఉత్తమగుణము కలవి. గనేరియా వ్యాధికికూడా బాగుగా పనిజేయుననుట నిర్వివాదాంశము. ఈ ఇంజక్షన్ మాత్రము చాల జాగ్రతతో చేయవలయును ఇంట్రావీనసు ఇంజక్షను నిచ్చిన చాల తొందరగా పనిజేయును. గుండె బలహీనము గలవారికి జాగ్రతతో నియ్యవలెను. పై యింజక్షన్ నివారించగల అనేక వ్యాధులను కష్టశీఘ్రముగా నేడు పెనిసిలిన్ నివారించుచున్నది.

## 51. డిజిటాలిన్.

## Digitalin.

### చర్మముక్రింద చేయు ఇంజక్షను.

1 CC లో 1/100 గ్రైను పరిమాణముగల ఔషధ ముండును. గుండెదడను తగ్గించును. గుండెకు మంచి బలము కలిగించును. మూత్రము యెక్కువగా వెడలింప జేయును. ఆయాసము, జలోదరముతో గూడియున్నపుడు మంచి పనిజేయును. రక్తము శరీరములో ఆడని యెడల ఈ ఇంజక్షన్ యిచ్చిన ఆడునట్లు జేయును. గుండెదడను,

నాడియొక్క స్థితిని అనుసరించి ఇంజక్షన్ చేయవలెను. ఇరువది నాలుగు గంటలలో 1/6 గ్రైను ఔషధముకన్న యెక్కువ చేయరాదు. గుండెకాయ యందు దుష్టతత్వము చేరి గురుకకల్గువేళ ఇంజక్షన్ నీయవలయును. ఉబ్బసపు వ్యాధులకు ఈ ఇంజక్షన్ చేయరాదు. నాభివంటి విషమూలి కలచే కలుగు బాధలకు విరుగుడుగా పనిజేయును. (Ci) కంపెనీ వారిది బాగుగా గుణముకలిగి ఉండును. పైత్యాదులకు మంచిగా పనిజేయును.

## 52. డిజిటాలిన్ అండ్ స్ట్రిచ్నైన్.

## Digitalin and Strychnine

## చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1/100 గ్రెయిను పరిమాణము గల డిజిటాలిన్, 1/60 గ్రెయిను పరిమాణము గల స్ట్రిచ్నైన్ మందు కలిపి తయారు చేయుదురు. స్ట్రిచ్నైన్ మందును ఆయుర్వేద వైద్యులు విషముష్టి యని పిలుతురు. 1 CC సీసాలోనిదే వాడుక చేయుట కలదు. గుండెకు మంచి బలము కలిగించును. నరములకు చురుకుదనమును హెచ్చించును. శరీర తత్వమును వేడిజేయుటకు యివ్వవచ్చును. తరుణ వ్యాధులలో శరీరము చల్లబడినచో అప్పటికప్పుడే వేడి కలుగజేయును. వాతము గ్రమ్మినదని తెలిసి నప్పుడును నాడి సన్నముగా నడచునపుడు యివ్వవచ్చును. కఫము గొంతున

కఫము పడినప్పుడు, గురక గలిగినప్పుడు వెంటనే ఈ ఇంజక్షన్ చేసిన కఫమును పోగొట్టి ఆరోగ్యమును కలిగించును. అమృతమువలె పనిజేయుటయందు ప్రసిద్ధికలది. అరగంట కొకసారి లేదా గంటకొక పర్యాయము తర్వాత నాలుగు గంటలకొకసారి, అటుతర్వాత రోగి పరిస్థితి నను సరించి చేసినచో రోగి పాలిటికి కల్పవల్లిగా పరిణమించి పైరోగములనెల్ల నిశ్శేష మొనర్చి, నిత్య జీవితమున కొక నూతన వెలుగును చూపించి మార్గదర్శి కాగలదని చెప్పుట యతిశయోక్తి కానేరదు (Bi) కంపెనీ వారిది గొప్ప గుణము కలది.

## 53. పలుడ్రిన్.

## Paludrin (Intravenos Injection)

## ఇంట్రవీనస్ ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించును. ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ ఇండియా లిమిటెడ్ కంపెనీవారు దీనిని తయారుచేయుదురు. రక్తనాళములకే యివ్వవలయును. మరచి కండరములోని కెన్నడును యివ్వరాదు. చలితో గూడిన మలేరియాజ్వరము, తలనొప్పితో కూడిన జ్వరము దినముతప్పి దినమువచ్చు జ్వరమునకు (దీనినే వరుసజ్వర మనియెదరు) మంచిపనిజేయును. బలహీనము, గుండెదడ వ్యాధిగల వారికి యెన్నడును ఈ ఇంజక్షన్ నివ్వరాదు. పై కంపెనీవారి పలుడ్రిన్ మాత్రలు 3 గ్రైనులవి లభిం

చును. మలేరియావ్యాధికి అన్ని ఇంజక్షనులకన్న యివి మిక్కిలి బాగుగా పనిజేయును. రోగి వయస్సు బలము ననుసరించి ఇంజక్షన్ చేసిన నొప్పులుకూడ హరించును. సర్వసాధారణమైన మలేరియా జ్వరములకు మూడు ఇంజక్షను లిచ్చిన చాలును.

## 54. సింకోనిన్ బై హైడ్రోక్లోరైడ్.

## Cinconine Bi Hydrocloride

## ఇంట్రిమస్క్యులర్ ఇంజక్షన్.

5 గ్రెయినుల 1 CC అర గ్రెయిను 2 CC అంపుల్స్ నందు లభించుచుండును. క్వైనైను ఇంజక్షను యిచ్చిన పైత్యము, వాంతులు గల్గువారికి క్వైనైను సరిపడని వారికి ఈ ఇంజక్షను యిచ్చిన పైత్యము వాంతులు లేక మంచిగా గుణమిచ్చును. ఎక్కువగా మలేరియా జ్వరము గలవారికి వాడుక చేయుట గలదు. తలనొప్పి విషపడిసెమును నివారించును. సాధారణముగా శరీరమున జ్వరమున్నప్పుడు ఈ ఇంజక్షను యివ్వకూడదు. యిచ్చినయెడల జ్వరతీవ్రిత యెక్కువగును. ఇంజక్షను గమనించి చేయవలయును. మలేరియా జ్వరమువలన చాలదినములనుంచి బాధ పడు వారికి ఈ ఇంజక్షను అమోఘముగా పనిజేయును. మలేరియా పిశాచమును కూకటివేళ్ళతో పెల్లగించి నాశనము జేయును. మూడు దినముల కొక ఇంజక్షను చేయుచుండ వలయును.

మూడు ఇంజక్షనులకే మలేరియా పూర్తిగా నశించును. వృద్ధులకుకూడ 1 CC చేసిన చాలును. క్వినైసుకు బదులు దీనిని తప్పకుండ వాడవలయును దీనివలన ఉపయోగములు అనుభవముమీద తెలిసికొన వలయును.

## 55. లారోస్టిడిన్.

Larostidin (Intramuscular Injection)

ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

5 CC లభించును. ఆమ్లపిత్తము, కడుపుబ్బరము, పులిత్రేపులు, పైత్య సంబంధమైన వ్యాధులు నివారించి, జీర్ణశక్తిని కలుగజేసి మంచిబలము కలుగజేయును. కడుపుబ్బరమునందు బాగుగాపనిజేయును. ఈ వ్యాధిని గ్యాస్ట్రబుల్ అందురు. పైవ్యాధులలో బాగుగా పనిజేయును. కడుపులోని శూలకూడ నివారించును. ప్రతిదినము ఈ ఇంజక్షను చేయరాదు. రెండు దినముల కొకసారి చేసిన చాలును. ఆరు లేక పన్నెండు ఇంజక్షనుల కోర్సు నుపయోగించిన, శరీరములో విటమిను తగ్గిన వ్యాధికి పనిజేయును. ఈ ఔషధము విటమినులతో తయారు చేయుదురు. దీని మెలిగ్రాం గుర్తెరింగి వాడుక చేయవలయును. రోగి తత్వము నెరింగి వాడుకొనవలయును. విటమిను బి మాత్రలు కూడ వాడుచున్నయెడల వ్యాధిని తొందరగా నివారింప వీలగును.

పై ఇంజక్షను ఔషధము పెద్ద మోతాదుగా చర్మముక్రింద యెన్నడు చేయరాదు. కండరములోనికే చేయుచుండ వలయును.

## 56. పిట్రెసిన్.

## Pitressin

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

అర సిసి మొదలు 1 సిసి వరకు వాడుదురు. ఆపరేషను చేసినపిమ్మట యిచ్చిన యెడల రోగికి తలతిరుగుట సంభవించదు. బహుమూత్రవ్యాధి గలవారికి యిచ్చిన బహుమూత్రమును తగ్గించగలదు. మలబద్ధకమును నివారించును. స్త్రీలకు కలుగు రక్తస్రావములు కట్టించును. రక్తముపోవు వారికికూడ రక్తము నాపును. మూత్రము వెడలనపుడు ఈ ఇంజక్షను చేసిన యెడల మూత్రము జారీచేయును. వ్యాధిని గమనించి చేసిన మంచిగుణమ్ము కలుగును. ముక్కుబెదరి రక్తము కారుచున్న ఆపును. రక్తప్రదరములు నివారించును. ఆపరేషన్ చేయునప్పుడు వెడలెడి రక్తమును తగ్గించును. ఈ ఇంజక్షను సాధారణముగా అనేకవిధములైన రక్తస్రావములను అరికట్టుటకు ఉపయోగించును.

## 57. పిటోసిన్.

## Pitocin

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

అర CC ద్రవముగల అంపుల్సు 1 CC ద్రవము

గల అంపుల్సు లభించుచుండును. రక్తపుపోటు హెచ్చించ కుండ గర్భకోశ కండరములు, మూత్రికోశమును సంకు చిత పరచును ప్రసవసమయమున నొప్పులు రాకున్న ఈ ఇంజక్షన్ నిచ్చినచో నొప్పులను కలిగించి ప్రసవించునట్లు జేయును. నిమిషాలమీద దీని గుణమును చూపించును. అనేక విషయములు బాగుగా పరిశీలించిన పిదపనే ఈ ఇంజక్షను గర్భవతులకీయవలసి యుండును.

## 58. పిట్యూట్రిన్.

## Pituitrin

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1/2 CC నుండి 1 CC అంపుల్సు వాడుకొందురు. రక్తపుయొత్తిడి అధికముజేయును శీతలము గ్రమ్మినపుడు పనిజేయును. నాడి సన్నగిల్లినపుడు కూడా దీనియొక్క మంచిగుణము చూపించును. ఈ ఇంజక్షను మంచి పని జేయుచున్న దనుటలో సందేహములేదు. రక్తప్రసరణము నకు చురుకుయేర్పరచి రక్తపుయొత్తిడి అధికముజేయును. శ్వాసవ్యాధికి కళ్ళె తెగనప్పుడు ఈ ఇంజక్షన్ చేసినచో కళ్ళెను పడునట్లు చేయును. ఉబ్బసపు వ్యాధికి యిచ్చు ఇంజక్షను ఎడ్రనలిన్ కంటె ఈ ఇంజక్షను గుణము చాల సేపు ఉండును. రక్తపుపోటు ఉన్నవారికి యివ్వరాదు. ప్రసవించుటకు స్త్రీలకు శక్తి లేనప్పుడు నొప్పులు ఆగిఆగి వచ్చు సమయమందు యిచ్చిన మంచిపని జేయును. యోని

మార్గము నుండి బయలు వెడలుటకు యెట్టి ఆటంకము లేని శిశువుయొక్క శిరస్సు యోనిమార్గమునకు దిగుచున్నపుడు ఈ ఇంజక్షన్ యిచ్చిన శిశువును సరియైన మార్గమునకు దీసికొని వచ్చి విడచును. కలరావ్యాధికి, టైఫాయిడ్ జ్వరమునకు, న్యూమోనియాకు వాడిన మంచిఫలితము నిచ్చును. ఆపరేషను చేసిన తర్వాత కలుగు బలహీనమును బోనడంచును. మధుమేహములకు ఇన్సులిన్ ఇంజక్షన్ యిచ్చినపుడు కలుగు బాధలకు, ఈ ఇంజక్షన్ విరుగుడుగా పనిజేయును తరుణవ్యాధులలో యిచ్చియున్న ఇంజక్షన్లు యేమి పనిజేయని యెడల ఈ ఇంజక్ష నిచ్చినచో అప్పటి కప్పుడే మంచి గుణము కనుపించును. తొందరలో గుండెకు బలమిచ్చును. ఈ ఇంజక్షన్లు అవసరమునుబట్టి చేయుచుండ వలయును. చాల జాగ్రితగా గమనించి ఈ ఇంజక్షన్ చేయవలయును. పైన దెల్పినట్టుల మంచి లక్షణములతో ప్రిసవమునకు సిద్ధముగానున్నప్పుడే చేయవలయును. గర్భిణీస్త్రీకి పిండము తిరుగుచున్నప్పుడు చేసిన యెడల చాల అపాయము సంభవించును, డిజిటాలిన్. స్ట్రిచ్నైన్ క్యాంఫర్ ఈ ఇంజక్షనులు పనిజేయకయున్న ఈ ఇంజక్షన్ నిచ్చిన త్వరగా పనిజేయును. గమనించి జాగ్రతతో ఇంజక్షన్ చేయవలయును.

## 59. రోమటిజం బై పైలాజిస్టన్.

## Rhenmatism Bi Phlogiston.

## (Intramuscular Injection)

## ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

5 CC రబ్బరుమూత బల్బుగలది లభించును. అవసరమునుబట్టి దినము 1 CC వాడు చుండవలయును. శరీరములో గల నరములకు బలము నొసంగును. పక్షవాతములకు పనిచేయును. నడుము నొప్పులను నివారించును. కీళ్ళ నొప్పులకు బాగుగా పనిచేయును. దినము 1 CC ఇంజక్షన్ చొప్పున పది ఇంజక్షను లిచ్చిన పక్షవాతములు, కోరు వాతములు, సాధారణమైన వాతములు నివారించును. (Bl) కంపెనీవారిది బాగుగా పనిజేయును.

## 60. మెగ్నీషియం సల్ఫేట్.

## Magnisium Sulpate.

## కండరములోనికి చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సులో 25% వంతులు బలముగల ఔషధము కలిగి యుండును. బాలురకు కలుగు పిడికిలి వాతము మీద బాగుగా పనిచేయును. ధనుర్వాతమునకు, కోరువాతమునకు, కోరియా డెటనిసు వాతములలో కలుగు గురక కఫములను మాన్పును. కండరములలో కలుగు యీడ్పును కుదుర్చును. రోగి తత్వమును బట్టి దినము ఒక ఇంజక్షన్ తగినట్లు యిచ్చుచుండవలయును.

## 61. మెరుక్యూర్ సాల్ సొల్యూషన్.

## Mercur Sal Solution.

### కండరములోనికి చేయు ఇంజక్షన్

5 CC అంపుల్సులో 1/10 గ్రాము మెరుక్యూరి కలిసి యుండును. మెరుక్యూరి అనగా పాదరస సంబంధమైన ఔషధమును కలిపి తయారుచేయు ఇంజక్షన్. సవామేహ సంబంధమైన పిరంగిజబ్బులు, సిఫిలిసు వ్యాధులు గలవారికి యిచ్చుచుండుట యాచారము. వారంరోజుల కొక యింజక్షన్ చేయవలయును. సవామేహ వ్యాధులు తప్పకుండ నివారించును. నాలుగు యింజక్షన్‌లకు వ్యాధి పూర్తిగా నివారించును. పెనిసీలిన్ వెలువడిన పిదప పై యింజక్షనుల అగత్యము అంతగా గానుపించదు.

## 62. యొహింబిన్ హైడ్రోక్లోరైడు.

## Yohimbin Hydrochloride.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సులో 1/3 గ్రైను పరిమాణము గల ఔషధము కలిసి యుండును. పలుచబడిన యింద్రియమును గట్టిపరచును. దేహపుష్టినిచ్చి మంచిబలము కలుగజేయును. నరములకు పటుత్వము, ముఖమునకు కాంతి నొసంగును. నిస్సత్తువను నివారించును. అలంబిక కెమికల్ లిమిటెడ్ బరోడా వారిది గొప్ప గుణము కలది. ఆరు యింజక్షన్‌లు **చేసిన చాలును.**

## 63. లీవర్ ఎక్స్ట్రాక్టు.

## Liver Extract (Intramuscular injection)

## ఇంట్రిమస్క్యులర్ యింజక్షన్.

2 CC 5 CC అంపుల్సును 10 CC బల్బులు రబ్బరు మూతగలవి లభించును. రక్తము శుద్ధిలేక రక్తము క్షీణించుటచే కలిగెడు గజ్జి, దురదలు నివారించును. రక్తమును వృద్ధిజేయును. పాండువ్యాధులను నివారించి. బలహీనము పోగొట్టి రక్తవృద్ధిని కలిగించును. సాధారణమైన ఆయాసమును హరించును. వాపు (నంజు) నీరును లాగివేయును. లివర్ (కార్జము)నకు మంచి బలము నొసంగి జీర్ణశక్తి నిచ్చును. రక్తహీనతచే ముఖము తెల్లబడినవారికి యిచ్చిన మంచి తేజస్సు నొసంగును. దినము ఒక ఇంజక్షన్ 2 CC చేసిన యెడల మంచిగుణము కనిపించుచుండును. అవసరమునుబట్టి వారమునకు 5 CC లు యివ్వవలయును. పన్నెండు ఇంజక్షన్లు చేసినచో సాధారణమైన పాండురోగములు రక్తహీనత గర్భిణీస్త్రీలకు గలుగు బలహీనత నివారించును.

## 64. పెరోట్రిన్.

## Perotrin.

## చర్మముక్రింద చేయు ఇంజక్షన్

1 సిసి అంపుల్సు లభించును. ఘాతికావాతమునకు మంచిగుణము నిచ్చును. రక్తపు పోటు తగ్గించును. న్యూమో

నియా ఊపిరితిత్తులవ్యాధి ప్రథమావస్థలో కర్ణపు జ్వరము తీవ్రతలోను ఈ ఇంజక్షన్ మంచిపనిచేయును. వెంటనే చెమటలు బెట్టి మూత్రము జారీ చేయును. కీళ్ళ సంబంధ మైన జ్వరములోను, కీళ్ళబాధలను నివారింపజేయును. నడుము నొప్పులకు వజ్రాయుధము. రెండు దినముల కొక సారి ఇంజక్షన్ చేసిన మంచిది. ఆరు ఇంజక్షన్ లిచ్చిన సూతికా జ్వరము నివారించును. మూడు ఇంజక్షన్‌లకు నడుమునొప్పి తగ్గించును. జ్వర మాగిపోయి అప్పటికప్పుడే చెమటలు బుట్టునుగాని గమనించి నిదానముగా చేయవల యును. పైన దెల్పినట్టి వ్యాధులనన్నింటిని కూడా "పెనిసీ లిన్" నివారించ గలదు.

## 65. మార్ఫిన్ సల్ఫేట్.

## Morphine Sulphate.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

అర గ్రెయిను, 1/3 గ్రెయిను, 1/4 గ్రెయినువరకు 1 సిసి అంపుల్సులో నుండును. మార్ఫిన్ అనగా నల్ల మందు సంబంధమైన ఔషధమే అనవచ్చును. ఈ ఇంజ క్షన్ చేసినయెడల యెటువంటి బాధలైనను అప్పటికప్పుడే తెలియకుండునట్లు రోగికి విశ్రాంతి యొసంగును. రోగి బాధ భరించుటకు శక్తిలేనప్పుడు ఈ ఇంజక్షన్ జేసిన యెడల వెంటనే నిద్రపట్టును. ఉబ్బసపు వ్యాధి బాధ తగ్గు టకు దీనికి మించిన ఔషధము లేదు. వాంతులు నివారిం

చును. నీళ్ళ విరేచనముల నాపును. రక్తస్రావముల తుద ముట్టించును. ధనుర్వాతమును రూపులేకుండ జేయును. స్ట్రిచ్నైన్‌వల్ల కలుగు విషమునకు విరుగుడుగా పని జేయును. విషమువలన గలిగిన బాధలు నివారించుటకు ఉపయోగపడును. రోగియొక్క వయస్సు, తత్వమును గమనించి చేయవలయును. పన్నెండు గంటలు దాటిన తర్వాతగాని ఇరువది నాలుగు గంటలు దాటిన తర్వాతగాని రోగియొక్క అవసరమునుబట్టి మరల ఇంజక్షన్ యివ్వవలయును. ఈ ఇంజక్షన్ కడుపులో వాయువు చేరినప్పుడు, ఊపిరితిత్తులలో నీరుండు జబ్బులకు యిచ్చినయెడల ప్రమాదము సంభవించును. ఎన్నడు అటువంటి వాటి కివ్వక చాల జాగ్రతతో వాడిన మేలు కలుగును.

### 66. మార్ఫిన్ అండ్ ఎట్రోపిన్.

### Morphine and Atrophine.

### చర్మముక్రిందచేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సులో, అరగ్రెయిను పరిమాణముగల మార్ఫిన్ 1/20 గ్రెయిను పరిమాణముతో ఎట్రోఫిన్ కలిపి తయారు చేయబడును. కడుపులో కలుగు శూలనొప్పి యే కారణముచేత కలిగినదో తెలిసికొని ఈ ఇంజక్షన్ నివ్వవలయును. గ్రహించనిదే మత్తు కలుగజేయడానికి యీయరాదు. ప్రథమమున సంభవించు అశ్మరియును పైత్యకోశ [illegible]ములో, మేహరాళ్ళవలన కలిగినటువంటి శూలనొప్పికి

యిచ్చిన వెంటనే బాధ తెలియకుండా నిద్రపట్టును. ఉబ్బు రోగులకు, అతిమూత్ర రోగలక్షణములు గలవారికి నివ్వ రాదు. ఇచ్చినయెడల ప్రాణహాని కలుగజేయును. రోగి వయస్సు, తత్వము ననుసరించి ఈ ఇంజక్షన్ నియ్యవలెను. తత్వమును, వయస్సును తెలుసుకోనిదే యీయరాదు. యిచ్చినయెడల చాల ప్రమాదము సంభవించును.

67. వెలెరియన్ ఫోస్ఫేట్.

Valerian Phosphate.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

అర సిసి, 1 సిసి అంపుల్సు లభించును. వణుకు వ్యాధికి మంచి పనిజేయును. హిస్టీరియా వ్యాధివలన కలుగు కఫమునకుచేసిన బాధలు తగ్గించును. మెదడునకు నరములకు శక్తి కలిగించును. నరముల బలహీనత గలవారికి చాల మేలుచేసి తొందరగా నిద్రపట్టించును. దినము ఒక ఇంజక్షన్ చేయుచుండిన పైవ్యాధులకు మంచిపనిజేయును.

68. సోడియం కోకోడైలేట్.

Sodium Cacodilate.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 సిసి లో 3½ గ్రెయిను పరిమాణముగల ఔషధముతో తయారుచేయుదురు. పాండువ్యాధులలో రక్తము

వృద్ధిజేయును. జీర్ణించిన మన్యపు జ్వరమును మలేరియా జ్వరమును నివారించును. సవాపేహము వలన కలిగిన దద్దుర్లు పొడలు గలవారి కిచ్చిన వాటిని మాయముజేయును. నరముల బలహీనత గలవారికి అద్భుతముగా పనిజేయును. దేహపుష్టిజేసి రక్తము శుద్ధిపరచును. దినము ఒక ఇంజక్షన్ నిచ్చుచుండవలయును. కొన్నిరోజులు యిచ్చినతర్వాత రెండు దినములకు ఒక ఇంజక్షన్ నిచ్చిన పాండువ్యాధులను, జ్వరములను బోనడంచి అమృతమువలె పనిజేసి టానిక్ మాదిరిగా గొప్ప గుణమును చూపించును.

## 69. స్ట్రిచ్‌నైన్ సల్ఫేట్.

## Strichnine Sulphate.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్

1 సిసి లో 1/30 గ్రైను, 1/60 గ్రైను, 1/100 గ్రైయిను పరిమాణముగల ఔషధమును కలిపి తయారు చేయుదురు. ఆపరేషన్ జేయు సమయమందు గుండె ఆగినట్లు తోచిన వెంటనే ఈ ఇంజక్షన్ యిచ్చినయెడల గుండె మామూలుగా కొట్టుకొనును. నాడికి చురుకుదనము కలిగించును. పునర్జీవితునిగాజేయును. క్లోరోఫారమిచ్చిన వారికి గలుగు చెడ్డ గుణములు నివారించును. కండరములలో కలుగు నీరసమును నివారించును. పసిపిల్లలకు కల్గు బ్రాంకో న్యూమోనియా జబ్బులోను, పక్షవాతముగలవారికి మంచి

గుణము నిచ్చును. వ్యాధి పరిస్థితి ననుసరించి నాలుగు గంటల కొకసారి ఇంజక్షను యిచ్చిన వాతములు హరించును. బలము గలుగజేయును. గమనించి చేయవలయును.

## 70. స్ట్రోఫెరిథిన్.

## Stropharthine

## ఇంట్రవీనస్ ఇంజక్షన్

1 CC 1/200 గ్రెయిను పరిమాణముగల మందు కలిపి తయారు చేయుదురు. దీని గుణము డిజిటాలిస్ వలె నుండును. డిజిటాలిస్ కన్న తొందరగా పనిచేయును. గుండెకు మంచిబలము నొసంగును. అమోఘముగా పని జేయును. న్యూమోనియా వ్యాధిలో కల్గు గుండెబలహీనము మాన్పి మంచిబలము గలిగించును. ఆరు యేడు గంటలకు ఒక ఇంజక్షన్ చేయవలయును. అవసరము కొద్ది వెంటనే పనిజేయవలెనంటె 1/200 గ్రెయినుల మందును నార్మల్ సెలైనుతో కలిపి యివ్వవచ్చును. ఈ ఇంజక్షన్ యిచ్చుటకు పూర్వము డిజిటాలిస్ మందు వాడినయెడల మోతాదు బహు జాగ్రతగా యివ్వవలయును. ఈ ఇంజక్షన్ మరచి కండరములోనికి చేయరాదు. చేసినయెడల నొప్పి అధికమగును. గుండె బలహీనమునకు చాల మంచి గుణమిచ్చును.

## 71. హాయోసిన్ హైడ్రో బ్రోమైడ్.

## Hayocin Hydro Bromide.

### కండరములోనికి చర్మముక్రిందను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు, 1/100 గ్రెయిను పరిమాణము గల మందు కలిపి తయారు చేయుదురు. ఇది పిచ్చివాండ్ర కివ్వవలసిన ఇంజక్షన్. గర్భవాతము నివారించి, కడుపు నొప్పి (అనగా) శూలను నివారించును. మెదడుకు సంబంధించిన వ్యాధులకు మంచి పనిజేయును. పక్షవాతసంధి నణచును. చిన్నపిల్లల చేష్టలవల్ల కలుగు వణుకునకు, వాతమునకు మంచి పనిజేయును. హిస్టీరియా, మూర్ఛ, నరముల యొక్కయు వాతసంబంధమైన వ్యాధులను నివారించును. 1/200 గ్రెయిను ఔషధముతో మొదలుజేసి అవసరముకొద్ది మరల యిచ్చుచుండవలయును. మూత్రమునందు గలుగు మంటను నివారించును. మాటిమాటికి ఈ ఇంజక్షనులు యివ్వరాదు. రోగియొక్క తత్వమును గమనించి యిచ్చుచుండవలయును. ఆతురతనొంది రోగికి వెంట వెంటనే ఇవ్వరాదు. ఊపిరందుటకు కష్టముగా నుండు రోగికి యెక్కువ ఇంజక్షన్లు చేయరాదు. చేసినయెడల రోగికి కష్టము కలిగించును.

## 72. హాయోసిన్ మార్ఫిన్ కంపౌండు.

## Hyoscine Marphin Compound.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్

1 CC అంపుల్సులో మార్ఫిన్ హైడ్రోక్లోరైడ్ 1/4 గ్రెయిను పరిమాణము మొదలు 1/20 గ్రెయిను పరిమాణము హాయోసిన్ హైడ్రోబ్రోమైడు, మరియు 1/160 గ్రెయిను పరిమాణముగల ఎట్రపిన్ సల్ఫేటున్ను కలిపి తయారు చేయుదురు. గర్భిణీస్త్రీలకు ప్రసవకాలమందు నొప్పులు వచ్చుటకై ఈ ఇంజక్షన్ యివ్వవలయును. ఇచ్చినయెడల సుఖప్రసవమగును. ఉన్మాదవ్యాధియందు మంచి పనిజేయును. పిచ్చివాళ్ళకు ప్రథమావస్థలో బాగుగా గొప్ప పని జేయును. మోతాదు తక్కువ యిచ్చినయెడల మంచి నిద్ర పట్టించును. అవసరమైన యెడల నాలుగు గంటలకు ఒక సారి యివ్వవచ్చును. చాల మంచి పనిజేయును. పిచ్చివాళ్ళకు ద్వితీయావస్థలోకూడ ఒక విధమైన మంచినే జేయును. గాని యిది కడు జాగ్రతతో వాడవలసి యుండును.

## 73. విటామిన్ బి.

## Vitamin B, (Intramuscular Injection)

### కండరములో చేయు ఇంజక్షన్

1 CC పరిమాణముగల ఈ ఔషధ ద్రవమునకు 25 M. G, 50 M. G and 100 M. G. అవసరమును బట్టి

యింతకు యెక్కువ M.G. బలముతో లభించును. (M.G.) అనగా మెల్లిగ్రాం అందురు. విటామిన్ బి శరీరములో తగ్గుటచేత, శరీరమందు నొప్పులు యేర్పడిన వారికి, ఈ ఇంజక్షన్ యిచ్చిన యెడల నొప్పులు నివారించి, శరీరపుష్టి కలిగించును. కాళ్ళు చేతులు తిమ్మిర్లుగల వారికి కూడ బాగుగా పనిజేయును. శరీరములో రక్తముతగ్గి నీరు యేర్పడిన వారికి దినము ఒక ఇంజక్షన్ చేసినయెడల ఆకలి వృద్ధిజేసి నీరు లాగివేయును. కీళ్ళ నొప్పులకు బాగుగా గుణ మిచ్చును. వాతమువలన కలిగిన నొప్పులను గ్యారంటీగా కుదుర్చగలదు. ముందు 25 మెల్లిగ్రాంనుంచి మొదలు జేసి హెచ్చించి యివ్వవలయును. గుణము తొందరగా కనిపించును. గ్లాక్సో, సిప్లా మొదలగు కంపెనీలు తయారు చేయునట్టిది మిక్కిలి మంచిది.

## 74. విటామిన్ సి.

Vitamin C, (Intramuscular Injection)

ఇంట్రామస్క్యులర్ ఇంజక్షన్.

2 CC లకు 200 మెలిగ్రాములు 5 CC లకు 500 మెల్లిగ్రాములతో తయారు చేయుదురు. ఈ ఇంజక్షన్‌వాడిన యెడల బలహీనతను తగ్గించును. శరీరములో విటామిను సి. తగ్గినప్పుడు ఈ ఇంజక్షన్ చేసినయెడల విటామిను సి. వృద్ధి కలుగును. కడుపు ఉబ్బరమును తగ్గించును. ఆమ్ల

పిత్తము గలవారికి ఈ ఇంజక్షన్ నిచ్చిన వెంటనే గుణ మిచ్చును. జీర్ణశక్తి కిది పెట్టినది పేరు. 3 CC దినము యివ్వవచ్చును. మూడు దినముల కొకసారి 5 CC 500 మెలిగ్రాం యివ్వవచ్చును. పై వ్యాధులకు తొందరగా పని జేయును. సిప్లా కంపెనీ లేక, ఆల్బర్టు దేవిడు కంపెనీ గ్లాక్‌సో కంపెనీవారిదికూడ బాగుగా పనిజేయును.

## 75. హెగ్జామిన్.

## Hexamin.

### ఇంట్రవీనస్ ఇంజక్షన్.

5 CC ద్రవముగల మందుతోను 10 CC ల తోను కూడా మనకు లభించును. ఇది టైఫాయిడ్ జ్వరములయందు యివ్వవచ్చును. ధనుర్వాతము, సూతికావాత జ్వరముల వంటి వ్యాధులకు యివ్వవచ్చును. మూత్రకృచ్ఛ్ర వ్యాధులకు కూడ బాగుగా పనిజేయును. మూత్రములోగల క్రిములను సంహరించును. మూత్రమును శుభ్రపరచును. రక్తములోనుండు క్రిములను కూడ సంహరించును. రక్తవృద్ధి చేయుటలో మంచి గుణము గలది. అవసరమును బట్టి నాలుగు దినములకు ఒక ఇంజక్షన్ చేయవచ్చును. మందు గల ట్యూబును వేడినీళ్ళలో పెట్టి మందుకు వెచ్చదనము కలిగించిన తర్వాత ఇంజక్షన్ చేయవలయును. ఈ ఇంజక్షన్ బహుశ్రద్ధగ చేయవలయును బలహీనమునకుకూడ

బాగుగా పనిచేయును. ముఖ్యముగా మూత్రమును జారీ చేయుటకు బాగుగా తోడ్పడును.

### 76. కాంపోలాన్

### Camploan.

### ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

2 CC, 5 CC అంపుల్సుకూడా మనకు లభించును. పాండువ్యాధులకు రక్తహీనతకు గూడా గొప్ప గుణమిచ్చుటలో దీని కిదియేసాటి. రక్తశుద్ధి, రక్తవృద్ధి జేయును. బలహీనము వలన యేర్పడిన జ్వరము వంటి లక్షణములను నివారించుటలో మంచి శక్తిగలది. దినముతప్పి దినము ఒక ఇంజక్షన్ యిచ్చుచుండవలయును. కొన్ని ఇంజక్షన్‌లు వాడినంతనే గుణము కనిపించును.

### 77. సలార్గన్

### Salarugan.

### కండరములలోనికి చేయు ఇంజక్షన్

2 CC ఔషధ ద్రవమును వారమురోజుల కొకసారి ఇంజక్షన్ చేసినయెడల నంజురోగములు నివారించును. మూత్రమును వెడలింపజేయును. నీరు నంజువాపులు లాగివేయును. బహు జాగ్రతగా యిచ్చినచో చాల మంచి గుణమిచ్చును.

## 78. లూమినల్ సోడియం.

## Luminal Sodium.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC ద్రవమునకు 1 2/3 గ్రెయిను పరిమాణము గల మందు కలిపి తయారుచేయుదురు. హిస్టీరియావంటి మూర్ఛ సంబంధమగు వ్యాధులకు బాగుగా పనిచేయును. పిచ్చిని నివారించుటలో మంచి శక్తిగలది. దినముతప్పి దినము ఒక ఇంజక్షన్ చేయుచుండవలయును. ఈ ఔషధ మును ప్రారంభించిననాడే రోగికి కొంత విశ్రాంతి కల్పించును.

## 79. నెప్టాల్.

## Neptal.

### కండరములోనికి చేయు ఇంజక్షన్

1 CC అంపుల్సు లభించును. దినము తప్పించి దినము యిచ్చిన నీరు వాపులు, నంజులు నివారించి బల మును కలుగజేయును. ఈ ఇంజక్షన్ మాత్రలుకూడ లభిం చును. కడుజాగ్రతతో వాడవలయును. వ్యాధి తత్వమును వెంటవెంటనే గ్రహించు చుండవలయును. వ్యాధితత్వ మును గ్రహించనిదే ఇంజక్షన్ యిచ్చిన కష్టముగలుగును. మూతృబంధములందు దీనిని ఉపయోగించినచో మూత్ర మును జారీచేయును.

## 80. డైడ్రోకోలిన్.

Deey Drocholin.

ఇంట్రవీనస్ ఇంజక్షన్.

10 CC అంపుల్సు లభించును. కామిలావ్యాధిని మూడు ఇంజక్షనులకే తగ్గించును. పసికలు, పచ్చకామిల, తెల్లకామిల ఈ వ్యాధులకు గొప్ప గుణము జేయును. అయిదు దినముల కొకసారి ఇంజక్షను చేయవలయును. కడు జాగ్రతగా చేయవలయును.

## 81. చాల్ మోగ్రిన్.

Chal Mogrin

ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

2 CC ద్రవముగల అంపుల్సు లభించును. కుష్ఠ వ్యాధులకు ఈ ఇంజక్షను స్పర్శజ్ఞానము లేని మచ్చలపై చేసినయెడల కుష్ఠువ్యాధులు నివారణమగును. వారము రోజుల కొకసారి ఇంజక్షను యిచ్చినయెడల పై వ్యాధులు నివారించును. (Bi) కంపెనీవారు తయారు చేయునది చాల మంచిగా పనిచేయును.

## 82. పల్మోట్రాన్.

Pulmotran.

కండరములోనికి చేయు ఇంజక్షన్.

1 CC 2 CC లభించును. ఇది సర్వ విధములైన

దగ్గులు నివారించును. న్యూమోనియా వ్యాధికి మంచి పని జేయును. న్యూమోనియా వ్యాధివల్ల కలుగు జ్వరములు నివారించును. క్షయవ్యాధులలో కలుగు దగ్గులు నివారించును. రోజు ఒక ఇంజక్షన్ యిచ్చుచుండవలయును. సిఫ్లాకంపెనీవారిది చాలమంచి పని చేయును.

## 83. ఎటెబ్రిన్.

## Atebrin.

### ఇంట్రమస్క్యులర్ ఇంజక్షన్.

పౌడరుతో నింపబడిన అంపుల్సు లభించును. కావలసినప్పుడు డిస్టిల్డు వాటరులో బాగుగా కలిపి తయారు చేసికొని ఇంజక్షన్ చేసినయెడల చలిజ్వరము, దాహము, తలనొప్పి, తొందరగా నివారించును. ఈ ఇంజక్షన్ జాగ్రతగా చేయనగును. మలేరియా వ్యాధికి చాల మంచిపని చేయును. ఈ ఇంజక్షన్ క్వినైనుకన్న యెక్కువ పని జేయును.అంపుల్సునందు పౌడరుతో డిస్టిల్డు వాటరును బాగుగా కలిపి కదలించి కావలసినంత మోతాదుతో ఇంజక్షన్ చేయవలయును. మలేరియా వ్యాధికి మంచి గుణము కనిపించును. ఒకానొకప్పుడు వాంతులైనను అవియే తగ్గిపోవును. ఒకసారి ఇంజక్షన్‌చేసిన చాలును. రెండు ఇంజక్షనులకే మలేరియా క్రిములు హరించును. మూడు ఇంజక్షనులకు పూర్తిగా జ్వరము నివారణ మగును.

## 84. బిజాక్టల్,

## Bejectal. I, M, I. V.

కండరములోను రక్తనాళములో చేయుటకు కూడా ఉపయోగపడునట్టిది. ఈ ఇంజక్షన్ 10 CC బల్బు లభించును. దీనిని అల్బర్డు లేబరేటరివారు తయారు చేయుచున్నారు. యిది విటామిన్ బి. కాంప్లెక్సుకు సంబంధించినదే. ఇయ్యది వ్యాధిని నివారించుటకుగాను శరీరమునందు నొప్పులు గలవారలకున్ను, తిమురు వాయువులయందును, శరీరమున రక్తము లేనివారలయందును, పాండువ్యాధులయందును, విటామిన్ బి. తగ్గినవారలయందును. నీరువాపులకున్ను, వాతరక్తము నందును, బలహీనత యందును, నీరసించిన వ్యాధిగ్రస్తులయందును మంచి టానికు మాదిరిగా గుణము నిచ్చును. వారమునకు మూడుసార్లు ఇంజక్షన్ చేయుచుండిన, అనేక పరిస్థితులయందు బాగుగా గుణము నిచ్చును.

## 85. బిజాక్టల్ విత్‌లీవర్.

## Bejectal. with Liver I. M.

కండరములోనికి చేయు ఇంజక్షన్.

దీనినికూడ పైకంపెనీవారే తయారుచేయుదురు. దీనియందు లీవరెక్సుట్రాక్టును యితరవిధముల ఔషధములను కలిపి తయారుచేయుదురు. ఇది పైదానికంటె అధిక గుణము కలిగియున్నది. ఈ ఔషధము బలహీనత గల

వారికి బలహీనము నివారించుటకు బాగుగా తోడ్పడును. రక్తమును వృద్ధిగావించును. శరీరమునందు క్షీణించిన విటామినుల ఎక్కువజేసి వ్యాధులను నివారించును. పై వ్యాధులయందు యిది బాగుగా తోడ్పడును. జీర్ణకోశము నకు సంబంధించిన వ్యాధులయందు నమ్మకముగా గుణము నిచ్చును. రెండు దినముల కొకతూరి 2 CC వరకును ఇంజక్షణ్ చేయుచుండ వలయును.

## 86. ప్రోంటోసిల్.

## Prontosil I. V. I. M.

రక్తనాళములో కండరములోను చేయవచ్చును.

5 CC అంపుల్సు లభించుచుండును. అంటుజాడ్య ములయందు దీనిని యిచ్చుచుండిన అంటుక్రిములను నశింపజేసి గనేరియా యొక్క అనేక లక్షణములను మాన్పుటకు బాగుగా తోడ్పడును. స్త్రీలకు కలుగు లుకో రియా వ్యాధియందు మంచి గుణము నిచ్చుచుండును. యిది గర్భధారణమును నివారించుట యందును బాగుగా తోడ్పడుచున్నది. రెండు ఇంజక్షనులలో గుణము కను పించును. తొందరగా గుణము కావలసిన వారలకు, ఇంట్ర వీనస్ ఇంజక్షను చేసిన యెడల, వారికి గల అవస్తలు నివారించును. ఈ ఇంజక్షణ్ చేసిన రెండు మూడు గంట లకు గాని అంతకు లోపుగాని మూత్రము యెరుపురంగుతో

వచ్చును. ఇట్టి ఔషధ గుణమును వైద్యుడెరింగి రోగికి ధైర్యము చెప్పవలెను. చికిత్స ఆపిన పిదప యీ రంగు స్వయముగా తగ్గిపోవును.

## 87. యాంటిపైరిన్.

## Antipyrin S-C.

ఇది చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

బల్పునందు లభించుచుండును. వాతము నొప్పుల యందు, కోరింత దగ్గులయందును, తరుణవ్యాధుల యందును, రోగికి కాళ్లు చేతులు చల్లబడిన పరిస్థితులయందును నాడి సన్నగిలి నప్పుడును దీనిని వెంటనే ఇంజక్షన్ చేసిన అమృతమువలె పనిజేయును. జ్వరములయందు టెంపరేచర్ తగ్గించును. ముట్టు శూలలయందు స్త్రీలయొక్క గర్భకోశ వ్యాధులయందును బాగుగా గుణము నిచ్చును. నరముల బలహీనత గలవారలకు వాతపు నొప్పులయొక్క అనేక పరిస్థితులయందు దీనిని ఇంజక్షన్ చేయుచుండిన బాగుగా గుణము నిచ్చును.

## 88. ఎం. అండ్ బి. 693.

## M & B 693 I. M.

కండరమున చేయు ఇంజక్షన్.

దీనిని మే అండ్ బేకర్ ఇంగ్లాండు కంపెనీవారు తయారు చేయుచున్నారు. ఇట్టిది మాత్రిలరూపమున

సైతము లభించుచుండును. ఇట్టివే చాలవరకు ఎక్కువ వాడుకలో గలవు. క్రిమిజ్వరముల యందును రక్త వికారములయందును చిడుము పుండ్లు. కీళ్ళనొప్పులు గనేరియా సెగలయందును దీనిని వాడుక జేయుదురు. రెండుమూడు ఇంజక్షన్ లకే దీనియందు గల మంచి ఫలితము తొందరగా కనుపించును. గనేరియా వ్యాధికి ఒక నెల కోర్సుగా యిచ్చిన పూర్తిగా గనేరియా నివారించును. దీని మాత్రలు గూడ సేవించు చుండినచో ఫలితము తొందరగా కనుపించుచుండును. వ్యాధియొక్క తీవ్రదశయందు రెండు దినముల కొకసారి ఇంజక్షన్ చేయుచుండవలయును. పెనిసీలిన్ వెలువడక పూర్వము దీనియొక్క ప్రతిభ చాల ప్రశంసింప బడుచుండెను.

## 89. హైడ్రార్జ సాలిసిలేట్.

### Hydrarg Salicylate (S.E,)

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

ఇదియును సెగవ్యాధులయందే గుణము నిచ్చుచుండును. గనేరియా ప్రథమావస్థలో నున్నప్పుడు గొప్ప గుణము నిచ్చును. మూత్రనాళమునందు గల పుండును మాన్పివేయుట యందును మూత్రమునందు గల మంటను నివారించుటకు గాను దీనియందు మంచి శక్తి గలదని చెప్పక తప్పదు. రెండు దినముల కొకతూరి ఇంజక్షన్

చేయుచుండిన గనేరియాను నివారించును. ఆరు ఇంజక్షన్‌ల వరకు సాధారణమైన పరిస్థితియందు చేయవలసి యుండును. స్త్రీలకు మర్మస్థానమున గలుగు వ్యాధులయందును గుణము నిచ్చుచుండును. కొరకు సవాయివ్యాధులయందు ప్రథమావస్థలో మంచిగుణము నిచ్చుచుండును. ప్రస్తుతము పై వ్యాధుల నన్నింటిని "పెనిసిలిన్" నివారింప గలిగి యున్నదని పాఠకులకు వేరుగా చెప్ప పనిలేదు.

## 90. నికోనిన్.

Niconin (I. M. O R. I. V)

కండరములోను రక్తనాళములోను చేయుదురు.

పిచ్చివారలయందును, రక్తవికారముల యందును దీనిని చేయుదురు. పిత్తాధిక్యము గలవారల యందును మంచి గుణము నిచ్చుచుండును. అతిసార వ్యాధులయందు కొద్ది గుణమైన కనుపించక తప్పదు. రక్తశుద్ధి కొరకును యిది బాగుగా గుణము నిచ్చుచుండును. సాధారణముగా రెండు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవలసియుండును.

## 91. కాల్షియమ్ లేక్టేట్.

Calcium. Lactate I. M. OR I, V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 CC నుండి 10 CC వరకు లభించుచుండును. శరీ

రములో నున్నపుధాతువు తగ్గినవారలయందు బాగుగా గుణము నిచ్చును. క్షయవ్యాధుల యందు నరముల బలహీనత పోగొట్టునట్టి గొప్ప గుణము గలదు.

92. మెరక్యూరోక్రోమ్.

Mercurochrome (I. V.)

రక్తనాళమున చేయు ఇంజక్షన్.

గనేరియా సెగవ్యాధులయందు మిక్కిలి గుణకారి గనేరియాకు మూత్రద్వారములో గల పుండును మాన్పివేసి చీమును రాకుండ జేయుటకు బాగుగా తోడ్పడును. శ్లేష్మ వాతజ్వరములయందు బాగుగా గుణము నిచ్చుచుండును. సూతికా వాతజ్వరములయందు కూడ గొప్పగుణము నిచ్చుచుండును. పిరంగి జబ్బులయందును వాటియొక్క చెడు గుణముల యందును క్రిమిజాడ్యములయందు గుణము నిచ్చుచుండును. వారమునకు రెండుసార్లు యివ్వవలసి యుండును. నేడు "పెనిసీలిన్" ఇంజక్షన్ ప్రయోగము వల్ల పై వ్యాధులు శీఘ్రముగా నివారించును.

93. అర్సెనిక్ (I. M.)

కండరములోనికి చేయు ఇంజక్షన్

సవాయిరోగ క్రిములను సంహరించుటకుగాను ఈ

యింజక్షను బాగుగా తోడ్పడును. మొండిజ్వరముల యందు జీర్ణించిన మలేరియా జ్వరముల యందును వాత వ్యాధుల యందును గనేరియా సెగవ్యాధులయందును మిక్కిలి గుణ కారి. ఇది పాషాణ సంబంధమగు యింజక్షను. దీనిని యెక్కువగా మాటిమాటికి యింజక్షనులు చేయరాదు. చేసిన యెడల అపాయము సంభవించును. పూర్ణశ్లేష్మ వాతజ్వర ములయందు మిక్కిలి గుణకారి. వారమునకు రెండుసార్లు యింజక్షను చేయవలసి యుండును. ఈ ఇంజక్షను చేసిన కొన్ని వికారగుణములు సంభవించ వచ్చును. గాని వాటికి అవియే క్రమముగా నిదానించుచుండును.

### 94. గైకోల్.

Guaia Col (S. C. I. M.)

చర్మముక్రింద కండరములోనికి చేయు ఇంజక్షను.

టైఫాయిడ్ జ్వరములయందును న్యూమోనియాజ్వర ములయందును క్షయ జ్వరములయందును మిక్కిలి ఉప యోగపడును. వాతరక్తము, పుండ్లు, చిడుము నరముల బలహీనత యందును వాడుటవలన యెంతయో మేలు చేకూర్చును.

### 95. యూకలిప్టల్.

Euca Lyptl. S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షను.

దీనిని ప్రత్యేకముగా క్షయవ్యాధి జ్వరములయందు

యిచ్చుచుందురు. క్షయవ్యాధికి ఈ ఇంజక్షన్ వలన బాధలు చాలవరకు తొందరగా నివారించుటకు బాగుగా తోడ్పడును. సామాన్యమగు పరిస్థితులయందు ఆరు ఇంజక్షనులకు జ్వరము నివారించును.

## 96. ఆటోపానీల్.

## Atophanyl.

రక్తనాళములో చేయు ఇంజక్షన్.

ఇది వాతవ్యాధులయందు వాతపునొప్పుల యందును వాతజ్వరముల యందును గొప్ప గుణకారి. కీళ్ళనొప్పుల కును పక్షవాతము కంపవాతము మేహ వాతము సూతికా వాతము వీటియందు బాగుగా గుణము నిచ్చుచుండును. సాధారణముగా మూడు దినముల కొకసారి ఇంజక్షను చేయవలసి యుండును.

## 97. రిటికోలోజిన్.

## Reticulogen. I. M.

లివరెక్స్ట్రాక్టు మరియు విటామిన్స్.

బి. 1 మొదలగువాటిని చేర్చి లిల్లీ కంపెనీవారు తయారుచేయుచున్నారు. కండరములోచేయు ఇంజక్షను

ఇది పాండువ్యాధుల చికిత్సయందు ముఖ్యమైనదని చెప్పక తప్పదు. నీరసము, బలహీనము, రక్తక్షీణత, తిమురు షాయువు, నీరువాపులు వీటియందు బాగుగా గుణము నిచ్చు చుండును. బలహీనత చాలకాలముగా శరీరమున యేర్పడి యుండుటచే శరీరమున యేర్పడునట్టి అనేక విధములైన వ్యాధులను రాకుండ జేయుటయందును వ్యాధిచే గలుగు బలహీనమును నివారించుటకుగాను బాగుగా తోడ్పడు చుండును. ప్రతిదినము గాని దినముతప్పి దినముగాని పరిస్థితిని బట్టి 1 CC మొదలు 2 CC వరకు ఇంజక్షన్ చేయు చుండినచో, బలహీనులకు శరీరమునందు రక్తము లేనివారలకు టానిక్ మాదిరిగా పనిచేయుచుండును. శరీరమున క్షీణించిన యెఱ్ఱని రక్తాణువులను శీఘ్రకాలములో వృద్ధి గావించుటయందు చాల గొప్పగా తోడ్పడును.

## 98. మఫర్సైడ్.

### Mapharside I. V.

"సిఫిలిస్" వ్యాధిని తొలగించుటకు గాను పార్క్-డేవిస్ కంపెనీవారు తయారు చేయుచుందురు. ప్రత్యేకముగా రక్తనాళములోనికి ఈ ఇంజక్షన్ చేయవలయును. వారమున కొకతూరి చేసిన చాలును. "సిఫిలిస్" అను సవామేహ జబ్బులయందు బాగుగా గుణము నిచ్చును.

"సిఫిలిస్" అను వ్యాధిచేకలుగు కొరుకుమచ్చలు పుండ్లు వ్రణములు యితరవిధముల సిఫిలిస్ సంబంధమగు అన్ని అవస్థలయందు బాగుగా పనిచేయును. ఈ ఇంజక్షనుల యందు వీటియొక్క మెలిగ్రాముల శక్తి గ్రహించి వ్యాధి రోగిబలము నిదానించి ఇంజక్షను చేయవలయును. మరి యును "పెనిసిలిన్" సయితము పైఔషధమునకు బదు లుగా వాడినప్పుడు, పైవ్యాధులను తొందరగా నివారింప గలుగును.

## 99. ఎన్. ఎ. బి. ఇంజక్షను.

## N. A. B. Injection (I. V.)

## రక్తనాళములందు చేయబడు ఇంజక్షను.

ఇదియును సల్ఫార్సనాల్ మాదిరిదే కాబట్టి దాని గుణములే యిదికూడా పోలియుండును. దీనిని మేఅండు బేకరు కంపెనీవారు తయారుచేయుచున్నారు. ప్రత్యేక ముగా సిఫిలిస్ సవామేహ జబ్బులయందును, కొరుకు పిరంగి వ్యాధులయందును పైఔషధము డిస్టిల్డువాటరుతో మిశ్రితముజేసి రక్తనాళములో ఇంజక్షను చేయునప్పుడు ముందుగా పిత్తోద్రేకము గలవారల యందు గమనించి తక్కువ మోతాదు తక్కువ నంబరుతో తక్కువ గ్రాము లతో చేయవలెను. లింగముపై పుండ్లు పొక్కులు గల వారల యందును, మేహ ఉడుకులు ఉష్ణవాతపు నొప్పుల యందును నమ్మకముగా దీని నుపయోగించుట వలన

మంచి ఫలితము తప్పక కనుపించును. స్త్రీలయొక్క సవా మేహముల యందును పురుషులయొక్క సవామేహముల యందును నంబరువారీగా కోర్సుప్రకారముగా చేయవలసి యుండును. అవసరమునుబట్టి దీనితో వెంటవెంట బిస్మిత్ ఇంజక్షన్ కూడ చేయుచుండిన గుణము తొందరగా కనుపించును.

## 100. వి బె క్సు.

## Vibex (I. M.)

### కండరములోనికి చేయు ఇంజక్షన్

10 CC VIAL లభించు చుండును. దీనిని పార్క్ డేవిడ్ కంపెనీవారు తయారుచేయుచున్నారు. శరీరము నందు విటామిన్ బి. తగ్గినవారలకున్ను నొప్పులు బల హీనము గలవారలకున్ను యిది బాగుగా సహాయపడును. వాతవ్యాధియందు గలుగు కీళ్ళ నొప్పులయందు నడుము నొప్పులయందును గర్భిణీస్త్రీలకు గలుగు బలహీనత యందును శరీరమునందు రక్తము తగ్గి నీరు యేర్పడిన వారల యందును యిది బాగుగా ఉపయోగ పడుచుండును. నంజు వ్యాధులచే బాధపడువారలకు నీరును లాగివైచి బలము చేకూర్చును. ఇది టానిక్ మాదిరిగా గుణమునిచ్చు చుండును. జీర్ణశక్తి వృద్ధిపరచుచు నీరసము ఆయాసము తగ్గించి శరీరమునకు బలము కలుగజేయును. ప్రతిదినము అవసరమును బట్టి రోగికి తగిన మోతాదుతో ఇంజక్షన్ చేయుచుండిన మంచి ఆరోగ్యమును ప్రసాదించును.

## 101. యురాసల్ఫాజైడు. I. M.

Urea Sulphazide.

కండరములోనికి చేయు ఇంజక్షన్

దీన్ని యూనియన్ డ్రగ్ కంపెనీవారు తయారు చేయుచున్నారు. 2 CC మొదలు 5 CC ల అంపుల్సు లభించును. గనేరియా సెగ వ్యాధులయందును వాతరక్తముల యందును గజ్జి చిడుముపుండ్లు పొక్కులు చర్మవ్యాధుల యందును నమ్మకముగా గుణము నిచ్చును. పురాణ చర్మ వ్యాధులయందు ఆరు ఇంజక్షనులకే పూర్తిగా వ్యాధినివారించును. ఈ ఇంజక్షన్ చేసిన గంటకు మూత్రము మలము యెరుపురంగుగా వచ్చును. కాని యేమాత్రము ప్రమాదము లేదు. భయపడ నవసరము లేదని రోగికి వైద్యుడు ధైర్యము చెప్పవలెను. గనేరియాయందు కూడ దీనిని కోర్సుగా చేయుచుండిన గనేరియా క్రిములను పూర్తిగా నశింపజేయును. ప్రతిదినము కాని రెండు దినముల కొక సారి కాని ఇంజక్షన్ చేయవలయును.

## 102. హెప్టాల్ జిన్.

Heptalgin (I. M, S. C.)

10 M. G. ల ఔషధశక్తితో నింపబడిన 1 CC అంపుల్సు లభించుచుండును. ఈ ఇంజక్షన్ కండరములోను చర్మము క్రిందను చేయవలయును. శరీరమునందు పిత్తాధిక్యముచే యేర్పడు పుల్లని ద్రవమును వృద్ధి కాకుండా

జేయుటకుగాను "గ్యాసుటి్రబుల్" అను దానిని నివారించుటకుగాను యిది బాగుగా తోడ్పడును. పండ్లనొప్పులయందును, తలనొప్పులయందును శరీరమునందుగల అన్నివిధముల నొప్పులయందును, శూలనొప్పికిన్ని యిది తాత్కాలికముగా తోడ్పడుచుండును. సాధారణముగా జీర్ణశక్తిని కలిగించి మంచి బలము కలుగజేయును. వీటి మాత్రలుకూడ లభించుచుండును. అవసరమును బట్టి రెండు దినముల కొకసారి గాని మూడుదినముల కొకసారిగాని ఇంజక్షన్ చేయవలసి యుండును.

## 103. కెప్లిన్ విటామిన్ ఇంజక్షన్.

## Kapilin Injection.

## కండరములందు చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించును. దీనిని "గ్లాక్సో" కంపెనీవారు పైపేరుతో తయారుచేయుచుందురు. క్షయవ్యాధియొక్క ప్రారంభదశలో కలుగునట్టి రక్తస్రావముల నిలుపుటకును మలేరియా జ్వరముపై యెక్కువ "క్వైనైన్" వాడుటవలన యేర్పడినట్టి రక్తస్రావమును నిలుపుటకును రక్తాతిసారములయందును, శరీరమున మచ్చలు పొడలు మొదలగు లక్షణములతో గానుపించు URTICARIA అనంబడు చర్మవ్యాధి కొరకును పచ్చకామిలా వ్యాధియందు శరీరము పీతవర్ణముగా మారుటకు మూలకారణమైన యకృత్ పిత్తముల కొన్నిలక్షణములను సవరించి

దేహమున కారోగ్యము ప్రసాదించుట కొరకును, శరీర మున విటామిన్ కే లోపించుట వలన కల్గు అనేక సంక టములను తొలగించుటకును బాగుగా తోడ్పడును. విటా మిన్ కే మాత్రల రూపముతో సైతము మనకు లభించును.

## 104. అస్టిలిన్ ఫోర్టు డి ఇంజక్షన్.
## Ostelinfort d Injection (I. M.)
## కండరములోనికి చేయు ఇంజక్షన్.

కాల్షియమును విటామిన్ డితో చేర్చి తయారు చేయుచున్నారు. 1 CC అంపుల్సు లభించును. 10 CC ల వయల్స్ సయితము లభించును. క్షయవ్యాధుల యందు కాల్షియమ్ తగ్గినవారల యందును దీనిని తప్పక ఇంజక్షన్ చేయవలసి యుండును. విటామిన్ డి. తగ్గినవారలయందు గుణము నిచ్చుచుండును. చిన్నవారలకు ఎముకలయందు బలము పట్టులేని వారలకున్ను వీరికి కలుగు అనేకవిధము లగు యెముకల దుర్బలము నందును బాధల యందును బాగుగా గుణము నిచ్చుచున్నది. పిల్లలకు ఆరోగ్యము కలి గించును. వీటి మాత్రలుకూడ లభించుచుండును. ఈ ఇంజ క్షన్లు చిన్నవారికి నాలుగుదినముల కొకతూరి చేయవలెను. పెద్దవారలకు రెండుదినముల కొకతూరి చేయవచ్చును. కొన్ని విధములైన చర్మవ్యాధుల నివారణ కొరకు పై ఇంజక్షన్ బాగుగా ఉపయోగపడును.

105. లీవీ బీ ఇంజక్షన్.

Livobee (I. M.)

కండరమున చేయు ఇంజక్షన్.

10 CC, 30 CC బల్బుసయితము లభించుచుండును. అలంబిక్ బరోడా కంపెనీవారు దీనిని తయారు చేయుచున్నారు. తిమురు వాతములయందును నరముల బలహీనతల యందును మిక్కిలి గుణకారి. బలహీనతయందు బలము రక్తము చేకూర్చుటకును పాండువ్యాధుల యందు నంజు ఉబ్బు లక్షణముచే గలుగు రక్తక్షీణతల యందును దీనిని తప్పక వాడవలసి యుండును. రెండుదినముల కొకసారి 2 CC ఇంజక్షన్ చేయవలసి యుండును.

106. ఫోలిక్ ఆసిడ్ ఇంజక్షన్.

Folic Acid (I. M.)

కండరములోనికి చేయు ఇంజక్షన్

2 CC అంపుల్సు లేక, బల్బు లభించుచుండును. పాండు వ్యాధులయందు మిక్కిలి గుణకారి. పాండువ్యాధులకు కల్గు అన్ని గుణములయందును ఇది సహాయపడును. రక్త క్షీణతల యందును రక్త వికారముల యందును మిక్కిలి గుణకారి. తిమురు వాతములయందు కూడ మంచి గుణము కలిగించుచుండును. దీనితో లివరెక్స్ట్రాక్టు కూడ మధ్య మధ్య చేయుచుండిన యెడల లాభము కనుపించక మానదు. పాండు వ్యాధుల యందు

రక్తహీనత చేతను ఇతర కారణములవల్లను సంధులందును శరీరము నంతటను కలుగు నొప్పులు నిస్త్రాణ మొదల్గు లక్షణములకు అద్భుతమైన గుణమునిచ్చును. అన్ని విధముల రక్తక్షీణత వ్యాధులయందు దీనిని తప్పక చేయవలసి యుండును. 2 CC ని రెండు దినములకు గాని ప్రతి రోజు కాని చేయుచుండ వచ్చును. ఈ పై దెల్పినట్టి ఔషధము సయితము విటామిన్ బి కాంప్లక్సు వంటిదిగా నెరింగి వైద్యులు తగిన వ్యాధుల కొరకు వాడవలసి యుండును.

### 107. స్టిరోడైన్ ఇంజక్షన్.

### Sterodin Injection.

### కండరములందు చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సునందు లభించును. దీనిని యూనియన్ డ్రిగ్ కంపెనీవారు తయారుచేయుచుందురు. మలేరియా జ్వరము ప్యారా టయిఫాయిడ్ సన్నిపాత జ్వరము వాపు అస్వస్థత మొదలగు లక్షణములచే సంభవించిన యే వ్యాధియందైనను వ్యాధియొక్క ప్రిప్రథమ దశయందు పై ఇంజక్షన్ వాడినచో శరీరమునకు తేజము కలిగించి వ్యాధియొక్క తీవ్రతను నిరోధించి రోగికి ఆరోగ్యము చేకూర్చును. ఈ ఔషధము వ్యాధియొక్క చికిత్స కొరకు ఉపయోగించుటకన్న వ్యాధియొక్క తీవ్రతను నిరోధించుటకు వాడునట్టిదని వైద్యసోదరులు గ్రహించగలరు. అవ

సరమును వ్యాధియొక్క తీవ్రతనుబట్టి వారములో మూడు ఇంజక్షనులు వాడిన చాలును.

### 108. గనోక్రైన్ ఇంజక్షన్.
### Gonocrine (I. V.)
### రక్తనాళములోనికి చేయు ఇంజక్షన్.

5 CC అంపుల్సులో గల ఔషధద్రవము ఇంజక్షన్ చేయవలసి యుండును. ఇది గనేరియా క్రిములను సంహరించుటకు గాను బాగుగా ఉపయోగపడును. సెగవ్యాధి యందు వారమునకు రెండుసార్లు ఇంజక్షన్ చేయవలసి యుండును. గనేరియా స్రావమును నిలిపివేయును. మూత్ర నాళములో గలపుండును మాన్పివేయుటకుగాను దీని నుపయోగించవలసి యుండును. పెనిసీలిన్ వలన గుణము కనుపించని వారలయందు ఇది బాగుగా గుణము ఇచ్చుచుండును. దీనిని మేఅండ్ బేకర్ ఇంగ్లాండువారు తయారు చేయుచుందురు. ఈ ఇంజక్షన్ కడు జాగరూకతతో రక్తనాళములోనికి మాత్రమే యీయవలెను.

### 109. పెనిసీలిన్ జి. ఇంజక్షన్లు.
### Penicillin G. Injections.

పెనిసీలిన్ ఔషధములు వాడుకలోనికి వచ్చిన పిదప లోగడ వాడబడుచున్న ఔషధములలో కొన్ని ఔషధముల అవసరమంతగా వైద్యలోకమునకు గనుపించుట లేదు. దీనికి కారణము "పెనిసీలిన్" ఔషధము కనిపెట్టక

పూర్వము ప్రత్యేకమైన కొన్ని వ్యాధులకై వాడబడు పెక్కు ఔషధము లొసంగజాలిన సత్ఫలితములు నేటి "పెనిసీలిన్" ఔషధ ప్రయోగమువలన గాన్పించుచుండు టయే యని పాఠకులకు హెచ్చరిక చేయుచు పెనిసీలిను ఔషధము యొక్క గుణ విశేషములను యీ క్రింద వివరించుచున్నాము.

ప్రపంచమున మానవకోటికి సంప్రాప్తించుచున్న అనేక రోగముల నివారించుటకు నేటి మానవునిచే కనిపెట్టబడియున్న నాలుగైదు ఔషధరాజములే చాలునని యెంచబడుచున్న వాటిలో మొదటిది "పెనిసీలిన్" అనవచ్చును. ఇట్లే, డిహైడ్రో స్ట్రెప్టో మైసిన్, అయిరోమైసిన్, క్లోరో మైసిన్, టెట్రామైసిన్, రెమిఫాన్, నైడ్రాజైడ్ మొదలగు ఔషధరాజములందు మనము ముఖ్యముగా పెనిసీలిన్ ఔషధము యొక్క శక్తి సామర్థ్యములను, అందుగల భేదములను మోతాదులను ప్రయోగ ప్రయోజనములను గూర్చి చదివి గ్రహించిన ప్రతివైద్యుడును మానవకోటికి సంప్రాప్తించు అనేక రోగములనుండి కాపాడి ధన్యుడగుటకు అవకాశ మెంతేని గలదు. గాన పాఠకులీ యంశమున శ్రద్ధ వహింతురుగాక.

ఇంజక్షన్‌కొరకు "పెనిసీలిన్" ఔషధము
యెన్నివిధములుగా మనకు లభించును.

(1) పెనిసీలిన్ జి. సోడియం; (2) పెనిసీలిన్ జి.

పొటాసియం; (3) ప్రొకేన్ పెనిసీలిన్ జి. (4) ప్రొకేన్ పెనిసీలిన్ జి. ఇన్ ఆయిల్; (1) Penicillin G, Sodium 2) Pencillin G, Potasium (3) Procain Fenicillin G. (Aquaous (4) Procaine Penicillin G, in oil) ముఖ్యముగా యీ పైన దెల్పియున్న నాలుగు విధములగు పెనిసీలిన్ ఔషధములను ఇంజక్షను చికిత్సకొరకు యెల్లరి చేతను వాడబడుచుండును.

పెనిసీలిన్ ఔషధమును బిళ్ళల రూపమునను ఆయింటుమెంటు (లేపనము) రూపముతోడను ఇట్లే ఇతర పదార్థములతో మిశ్రమము గావించి వివిధ చికిత్సలకొరకు తయారు చేయుచున్నారు. ఇట్టివి నోటిద్వారా ్రమింగించుట కును పైపూతకును మాత్ర ముపయోగ పడుచున్నవి.

"పెనిసీలిన్" రూపముతో తయారు చేయబడినను దానికి, స్వభావ సిద్ధముగా యేర్పడియుండు గుణము, క్రిమినిర్మూలనాశక్తి, పదార్థ తత్వము ఒక్కటే యని మనము గ్రహింపవచ్చును. వివిధ స్వభావ లక్షణములతో యేర్పడియుండునట్టి శరీరాంగముల కేర్పడెడు రోగ ప్రమాదస్థితులకు తగినట్లు చికిత్సాది ప్రయోగములకు వీలుగా తగినట్లు యీ ఔషధము వివిధ రూపములతో తయారు చేయబడుచుండును. కొన్ని ప్రత్యేకమైన రోగములందు "పెనిసీలిన్" నోటిద్వారా మ్రింగించి నప్పటికంటే, ఇంజక్షను సాధనద్వారా రక్తమున ప్రవేశ పెట్టి నప్పుడే

బాగుగా పనిచేసి ఆరోగ్యమును ప్రసాదింపగలదు. "ఇంజ క్షన్" ప్రయోగము కొరకు ప్రత్యేకముగా తయారు చేయ బడు చుండు "పెనిసీలిన్" ఔషధముయొక్క స్వభావ స్వరూపములను ఇట విపులముగా వివరించుచున్నాను. ఇంజక్షన్ ప్రయోగము కొరకు తయారుచేయబడు "పెనిసీలిన్" ఔషధము సాధారణముగా రబ్బరు మూతగల చిన్న సీసాయందు భద్రపరచి సప్లయి చేయబడును. ఇట్టివాటినే మనము "వయల్స్" VIALS అని వ్యవహరింతుము.

"వయల్స్" నందు నింపబడి లభించునట్టి నాలుగు విధములైన పెనిసీలిన్ ఔషధ ద్రవములందు తైలము మైనము మొదలగు పదార్థములతో మిశ్రమము గావించి యుండునట్టి "పెనిసీలిన్ ఆయిల్" ఒక్కటి మాత్రమే తెల్లగా జిడ్డువలె (నవనీతమువలె) నుండి మనకు వయల్ నందుండి బాగుగా గోచరించుచునే యుండును.

మిగిలిన మూడు విధములగు పెనిసీలిన్ ఔషధము "వయల్స్" నందుండి మనకు పొడిరూపమున గోచరిం చును. పొడిరూపముతో లభించు, సోడియం పెనిసీలినుగాని పొటాసియం పెనిసీలినుగాని లేక ప్రొకేను పెనిసీలిను గాని ఇంజక్షన్ ప్రయోగముకొరకు "డిస్టిల్డువాటర్" మొదలగు ద్రవపదార్థములతో కరగించి "సొల్యూషను" (ఔషధ ద్రవము) గా మనము తయారు చేసికొనవలసియుండును.

పొడిరూపముతో లభించు "పెనిసీలిను" చాలా కొద్ది పరిమాణముగల ద్రవములో నైనను మిక్కిలి సులభముగా కరగిపోగలదు. ఇట్టి పెనిసీలిను సొల్యూషను ఇంజక్షనుద్వారా శరీరమున ప్రవేశపెట్టినపుడు రక్తమున 3 గంటలవరకు మాత్రము నిలచి పిదప మూత్రముద్వారా బయటికి వెడలిపోవును. పొడిరూపముతో లభించు పెనిసీలిన్ ఔషధమునకు "డిస్టిల్డువాటర్" Distilld water లో గాని "సోడియం క్లోరైడ్" ప్రత్యేకింపబడిన సొల్యూషన్ లేక నూటికి 5 పర్సెంట్లు వంతులు బలముగల గ్లూకోస్ సొల్యూషనుతో నైనను మిశ్రమము గావించి పెనిసీలిన్ పొడిని కరగించి ఇంజక్షన్ ప్రయోగము కొరకు సిద్ధపరచుకొనవలసి యుండును.

## పెనిసీలిన్ ఇన్ ఆయిల్ ఇంజక్షన్.

తైలముతో మిశ్రమము గావించి యుండు పెనిసీలిన్ ఇన్ ఆయిల్‌మాత్రము దేనితోడను మరల మిశ్రమమొనర్పకయే అప్పటి కప్పుడు సిద్ధముగా "స్టెరలైజ్" చేయబడిన సిరంజియొక్క సూదిని వయలునందు గ్రుచ్చి కావలసిన పరిమాణము (మోతాదు) గల ఔషధమును "సిరంజి" లోనికి దీసికొని వెంటనే రోగికి ఇంజక్షన్ చేయవచ్చును. N. B. ఇట్టి ప్రయోగము చేయునప్పుడు "స్టెరలైజ్" చేయబడిన సిరంజినందు గాని సూదియందు

గాని నీటితడి, చెమ్మ యేమాత్రమైనను లేకుండా వైద్యుడు ముందుగా జాగ్రత్తగా గమనించుట చాలా ముఖ్యము. సిరంజినందు చెమ్మగాని తడిగాని యున్నచో రోగికి ప్రమాదము జరుగును.

డిస్టిల్డువాటర్ మొదలగు ద్రవములతో మిశ్రమము గావించి ఇంజక్షన్ చేయబడు "పెనిసీలిన్" ఔషధము శరీరమున తాను సంహరింపగల రోగక్రిములను నిర్మూలనము చేయుచు సుమారు 3 గంటలు మాత్రమే రక్తమున నిలిచియుండి పిదప క్రమక్రమముగా మూత్రము ద్వారా బయటికి వెడలిపోవును. ఇందుచే యీకొద్ది వ్యవధిలో శరీరమునగల రోగక్రిములను పూర్తిగా తుదముట్టించుటకు వీలులేదు. కాబట్టి ఔషధశక్తి శరీరమున క్షీణించక ఒకే విధముగా నిలచియుండుటకుగాను మూడు గంటల కొకసారి మరల ద్రవరూపమున నుండు "పెనిసీలిన్ ఇంజక్షన్" చేయవలసి వచ్చుచున్నది.

తైల మిశ్రితముగా నుండు పెనిసీలిన్ ఆయిల్, పైనదెల్పియున్న పెనిసీలిన్ ద్రవమువలె 3 గంటల వ్యవధిలో శరీరమునుండి బయటికి వెడలిపోక కనీసము 36 గంటల కాలమైనను శరీరమున నిలిచి రోగ క్రిములను నాశన మొనర్చుచు పిదప క్రమక్రమముగా మూత్రమున ప్రవేశించి బయటికి వెడలిపోవును. గాన దీనిని బట్టి పెనిసీలిన్ తైలముతో యెందుకు మిశ్రమమొనర్చి తయారు చేయు

చున్నారో మనము సులభముగా గ్రహింపగల్గుచున్నాము. తైల మిశ్రితముగా తయారు చేయబడుచున్న పెనిసీలిన్ ఆయిలు నందు సాధారణముగా 1 CC ఔషధమునకు 300,000 మూడు లక్షల యూనిట్లు శక్తి గలిగిన పెనిసీలిన్ యుండును. పెనిసీలిన్ ఆయిలు యే కంపెనీవారు తయారు చేసినను పై పరిమాణమునకు చెప్పియుండు యూనిట్ల శక్తితోడనే తయారుచేయుట ఆచారము.

N. B. సోడియం పెనిసీలిన్ తప్ప, ప్రొకేను పెనిసీలిను ఇన్ ఆయిలుగాని లేక ప్రొకేను పెనిసీలిను సొల్యూషనుగాని లోతుగా కండరములందు మాత్రమే ఇంజక్షన్ చేయవలయునే గాని పొరపాటువలన యేమాత్ర మైనను రక్తనాళమునందు ప్రవేశించినను రోగికి చాలా ప్రమాదము సంభవించును.

ప్రొకేన్ పెనిసీలిను, స్పటికీయ పెనిసీలినుయొక్క ప్రొకేను క్షారమని యెరుంగవలెను. దీనిని ఒక్క పెనిసీలిను మాలిక్యూలు (Moleoule) లో ఒక్క ప్రొకేను మాలిక్యూలు సంయోగ మొనర్చి సిద్ధపరచబడును. గాన ఇది ప్రొకేను పెనిసీలిను అని వ్యవహరింప బడుచున్నది. ఇదే తైలములో మిశ్రమ మొనర్చినప్పుడు ప్రొకేను పెనిసీలిను ఇన్ ఆయిలు అని పేర్కొనంబడుచున్నది. దీనినే సామాన్యముగా పెనిసీలిను ఆయిలు అనుటయు కలదు. ప్రొకేను పెనిసీలిను ఇన్ ఆయిలు సాధారణమైన ఇంటి గదుల

యొక్క ఉష్ణోగ్రతలయందు నిలువయుంచవచ్చును. దీనిని భద్రపరచుటకు మిక్కిలి శీతలముగా నుండునట్టి చోటు కొరకు శ్రమపడవలసిన పనిలేదు. శీతకాలమున "పెనిసీలిను ఇన్ ఆయిలు"తో నింపబడిన వసులును వైద్యుడు తన రెండు అరచేతుల మధ్యనుంచి యించుక శీఘ్రముగా సీసాను రుద్దుట వలన చలిచే అందు పేరుకొనిన తైలపదార్థము కరగి సూదిగుండా సిరంజిలోనికి లాగి కొనుటకు వీలుకలుగును.

N. B. తైల సంబంధముగా తయారు చేయబడిన పెనిసీలిను ఔషధద్రవ్యమును సిరంజిలోనికి దీసికొనుటకును ఇంజక్షను చేయుటకొరకు No. 1 (ఒకటో నెంబరు) గల సూదిని మాత్రమే ఉపయోగింపవలెను. యీ సూది బెజ్జముయొక్క వర్తులము 0.9 M,M. అని యెరుంగవలెను. ఇంతకు తక్కువ వర్తులము గల సూదిరంధ్రము గుండా జిడ్డువలెనుండు పెనిసీలిను ఇన్ ఆయిలు సిరంజిలోనికి ప్రవేశించుటకు గాని సిరంజినుండి శరీరములోనికి ఇంజక్షను ద్వారా ప్రవేశపెట్టుటకు గాని చాలా కష్టమని వైద్యసోదరు లెరుంగవలెను. పెనిసీలిను ఆయిలు ఇంజక్షన్ కండరములోనికి యిచ్చిన పిదప ఆ స్థలమున యేవిధమైన కాపడము (Fomentation) ఇచ్చుట పనికిరాదు.

పెనిసీలిను ఇన్ ఆయిల్ ఔషధముతో ఇంజక్షన్ యిచ్చిన పిదప సిరంజి సూదికూడా బాగుగా శుభ్రపరచని

యెడల యెప్పుడైనను మరల ఇంజక్షను ప్రయోగము చేయవలసి వచ్చినచో సిరంజినందు నిలచిపోయిన జిడ్డువంటి పదార్థమును తొలగించుట చాల కష్టము. ఇట్టి పరిస్థితి కలుగకుండుటకై పై ఇంజక్షను యిచ్చిన వెంటనే గోరు వెచ్చని సబ్బుసీటియందు సిరంజియొక్క సూదిని ముంచి సిరంజిలోనికి ఆనీరే పలుమారు లాగుచు మరల విడచుచు ఇట్లు త్వరత్వరగా సుమారు పది లేక పదిహేను పర్యాయములు గావించిన సిరంజినందుండు జిడ్డువంటి పదార్థము వదలిపోవును. పిదప సిరంజిని డిస్టిలువాటరుతో కడిగి యుంచుట ఉచితము; ఇంజక్షన్ చేయుటకు పూర్వము స్టెరలైజ్ గావింపబడిన సిరంజినందు యేమాత్రమైననుచెమ్మ తడి యున్నట్లు గోచరించినచో దానిని తొలగించుటకు సిరంజిని ఈథరునందు గాని ఎసిటోన్ (Eather or Acetone) నందుగాని శుభ్రపరచి సిరంజి బాగుగా పొడిగా శుభ్రముగా యుండునట్లు చూచి పిదప పెనిసీలిన్ ఆయిలు ఇంజక్షన్ ఔషధమును సిరంజిలోనికి దీసికొని ప్రయోగించవలసియుండును.

N. B. పెనిసీలిన్ ఆయిల్ ఇంజక్షన్ ఇతర విధములగు పెనిసీలిన్ ఇంజక్షనుల వలెనే ఆయా వ్యాధులపై పనిచేయుచు వానికంటెను శరీరమున దీర్ఘకాలము నిలచి పనిచేయును. రోజున కొక్క పర్యాయమే ఇంజక్షన్ యిచ్చి చికిత్స జేయుటకు తగిన రోగులకై యీఇంజక్షను

చాలా ఉపయోగపడును. వ్యాధియొక్క అనేక పరిస్థితుల యందు రోజుకు 1 CC పెనిసీలిన్ ఇన్ ఆయిల్ ప్రయోగించుచు చికిత్స చేయబడుచున్నది. తైల మిశ్రితముగా తయారుచేయబడిన 'పెనిసీలిన్' ఔషధమును "ఎవ్లోప్రొసిల్" అను పేరుతో I. C. I. కంపెనీవారు సప్లయి చేయుచున్నారు.

## ప్రొకేన్ పెనిసీలిన్ జి. పొడిరూపములో లభించు ఇంజక్షన్.

## Crystalline Procaine Penicillin G. for Aqueoue Injection

ఇది తైల సంస్కరణము లేక పొడి రూపమున తయారుచేయబడునట్టి ఇంజక్షను ద్రవ్యము. దీనిని సయితము రబ్బరు మూతగల "వయల్"నందు భద్రపరచి సప్లయి చేయబడుచున్నది. యీ పొడిరూపమున లభించునట్టి ఔషధమును, ఇంజక్షన్ ప్రయోగము కొరకు డిస్టిల్డు వాటర్‌తో గాని నార్మల్ శాలైన్‌తోగాని కరగించి ఇంజక్షన్ చేయవలెను.

పైవిధమగు ఇంజక్షన్ "వయల్" అను ప్రొనాపెన్ (Pronapen) అను పేరుతో, పైజర్ కంపినీ వారున్నూ "దురాసిలిన్" (Duracillin) అను పేరుతో 'లిల్లీ' కంపినీవారున్నూ క్రిస్టిసిలిన్ (Crysticillin) అను

పేరుతో "స్క్విబ్" కంపెనీ వారున్నూ ఇట్లే అనేక కంపె నీలు వారి వారి కుచితమైన పేర్లతో తయారు చేయు చున్నారు.

"డిస్టిల్డు వాటరు"తో కరగించి యింజక్షన్ ప్రయోగ మునకు వాడబడు యీ ఔషధమునందు తైలముగాని, మైనముగాని చేరియుండదు. ఇది వయలునందు కేవలము పొడి రూపమున లభించును. ఈ ప్రొకేను పెనిసిలిను డిస్టిల్డు వాటర్‌తో గరగించిన పిదప పిఱుదుల కండరములందు లోతుగా యింజక్షన్ చేయవలసి యుండును. ఈ ఔషధము రక్తమున ప్రవేశించిన పిదప సాధారణముగా శరీరమున కనీసము 24 గంటల కాలమైనను నిలచి, ఆ పిదప క్రమ క్రమముగా మూత్రమునందు కలిసి బయటికి వెడలి పోవును. పొడిరూపమున లభించు "ప్రొకేను పెనిసిలిను జి" ఒక వయలునందుండు ఔషధమును సాధారణముగా అవ సరమును బట్టి 2 లేక 3 CC ల వరకు డిస్టిల్డు వాటరుతో గాని 5 పర్‌సెంట్లు గ్లూకోస్ సొల్యూషనుతోగాని నార్మలు శాలైన్‌తోగాని కరగించి పైద్రవ్యమును ఒకే మోతాదుగా పిరుదుల కండరములందు లోతుగా గ్రుచ్చి ఇంజక్షన్ చేయ వలసి యుండును.

N. B. ద్రవరూపముతో ఇంజక్షన్ చేయబడు ఈ ఔషధద్రవము సయితము కేవలము కండరములందు మాత్రమే చేయవలెనుగాని, పొరపాటున, యేమాత్రమైనను

రక్తనాళమునందు ప్రవేశించినచో రోగికి కడుప్రమాదము సంభవించును. 24 గంటలకు ఒకే మోతాదుగా వాడుటకై తయార్చు చేయబడుచున్న ప్రొకేన్ పెనిసీలిన్ జి. ఔషధము ఒక్క "వయలు"నకు 400,000, నాలుగు లక్షల యూనిట్లతోను కొన్ని కంపినీలు 300,000, మూడు లక్షల యూనిట్ల శక్తితోను తయారు చేయుదురు.

ప్రొకేన్ పెనిసీలిన్ జి. డిస్టిల్డువాటర్ మొదలగు ద్రవపదార్థములతో కరగించి సిరంజిలోనికి దీసికొనినపిదప రెండు నిమిషముల వ్యవధిలోపల ఇంజక్షను చేయవలసి యుండును. అట్లుగాక రెండు నిమిషములకు మించిన వ్యవధితో సిరంజినందు ఔషధ ద్రవమును నిలువయుంచి యింజక్షన్ చేసినయెడల రోగి పెక్కు ప్రమాదాది బాధలకు లోనుగావలసి యుండునను విషయము, వైద్యసోదరులు మరువరాదు. "పెనిసీలిన్" ఇంజక్షన్ చికిత్స జరిగిన పిదప వేడినీరు మొదలగువాటితో కాపడ మివ్వకూడదని వైద్యుడు రోగికి హెచ్చరిక చేయుచుండవలయును.

ప్రొకేన్ పెనిసీలిన్ 'జి' ఔషధమును వయలునందు డిస్టిల్డువాటర్‌తో కరగించుటకు సిరంజి ద్వారా "డిస్టిల్డువాటర్" యెక్కించునప్పుడు వయలును తలక్రిందులుగా చేతియందు పట్టుకొని సిరంజియొక్కసూదిని రబ్బరు మూతగుండా లోపలివరకు లోతుగా గ్రుచ్చి వేగముగా సిరంజినందుండు ద్రవము వయలునందు ప్రవేశించు

నట్లు చేయుటచే ద్రవముయొక్క ధార తలక్రిందుగానున్న వయలుయొక్క పైభాగమున తగిలి సవ్యముగా వయలు యొక్క గోడలనుండి జారి ఔషధమును క్రమముగా ద్రవీభూతము గావించును. పిదప వయలును ఇంచుక కద లించి ఒక త్రుటికాలమైన పిదప వయలును యథాప్రకా రము తలక్రిందుగా చేతబట్టుకొని సిరంజియొక్క సూదిని కొద్దిగా "వయలు" నందు జొనిపి, అందుగల పెనిసిలిన్ ద్రవమును సిరంజిలోనికి దీసికొని రోగికిఇంజక్షను చేయుట ఉచితము.

పెనిసిలిన్ ప్రయోగముచే నశించు అన్ని విధము లైన క్రిమిరోగముల యందును, ఈ ప్రొకేను పెనిసిలిన్ జి, వాడి చికిత్స చేయవచ్చును. సోడియం పెనిసిలిన్ జి. కంటెను పై ఔషధము దీర్ఘకాలము శరీరమున నిలిచి పని చేయును. 24 గంటల యనంతరము క్రమక్రమముగా మూత్రమున ప్రవేశించి బయటికి వెడలిపోవుట దీని ధర్మము.

సాధారణమైన అనేక పరిస్థితులయందు ప్రొకేను పెనిసిలిన్ 300,000 మొదలు 400,000 లక్షల యూనిట్ల వరకు 24 గంటల కాలములో ఒకేమోతాదుగావాడి చికిత్స చేయవచ్చును. గాని తీవ్రమైన సవాయి రోగముల యం దున్ను, మిక్కిలి తీవ్రతరమగు పరిస్థితుల యందును

24 గంటల కాలములో 12 గంటల కొక్క మోతాదు చొప్పున మొత్తము రెండు ఇంజక్షనులకు 600,000 లక్షల యూనిట్లు మొదలు 800,000 లక్షల యూనిట్లవరకు ద్రవ రూపమున ప్రొకేన్ పెనిసీలిన్ జి, రోగికై ఇంజక్షన్ చికిత్స కొరకు ప్రయోగించబడును.

ప్రొకేన్ పెనిసీలిన్ ఇన్ ఆయిల్ 1 CC ఔషధమునకు 300,000 లక్షల యూనిట్లి శక్తిగల ఔషధమును సాధారణముగా 36 గంటలు మొదలు 48 గంటల వ్యవధిలో 300,000 యూనిట్లు మాత్రమే (అనగా 1CC మాత్రమే) వాడుట సమంజసము.

పెనిసీలిన్ 'జి' సోడియం ఇంజక్షన్లు.

(ఇందు ప్రొకేను సంపర్కము లేదు)

Crystalline Penicillin Sodiumsalt.

ఇందు ప్రొకేనుగాని మరియే యితర విధమగు ఔషధ సంపర్కములు లేక తయారు చేయబడు శుద్ధ సోడియం పెనిసీలిన్ క్షారస్ఫటికములని యెరుంగవలెను.

"సోడియం పెనిసీలిన్" పూర్వము పీతవర్ణముతో లభించునట్టిది కూడా వ్యాధులకై వాడబడుచుండెను. గాని ప్రస్తుతము తెల్లని (శ్వేత) పెనిసీలిన్ సోడియం స్ఫటిక

ములు పొడిరూపమున వయలునందు నింపి సప్లయి చేయ బడుచున్నది. ఈ పెనిసీలిన్ ఔషధమునందు 1 సోడియం పెనిసీలిను అనియు 2 పొటాసియం పెనిసీలిను అనియు రెండు విధములు. ఈ రెంటియొక్క ప్రభావము రోగముపై సమానముగానే కనబడినను మొదటిది ఇంజక్షను చికిత్సల యందు ప్రయోగించి నప్పుడు రెండవ దానికంటె ఇంచుక శ్రేష్ఠమైన లక్షణములు గానుపించును. రెండవది ప్రియో గించినప్పుడు కొద్దిపాటి మంట మొదలగునట్టి లక్షణము లిందు గానుపించును. ఇది మొదటిదానికన్న ఇంచుక చవ కది. పొడిరూపమున వయలునందు నింపబడి మనకు లభిం చునట్టి పెనిసీలును ఔషధమును సయితము డిస్టిల్డు వాటరు తోగాని నార్మల్ శాలైనుతోగాని 5 పర్సెంట్లు గ్లూకోస్ ద్రవ ముతోగాని కరగించి ఇంజక్షను చికిత్సకొరకు ప్రయోగింప వచ్చును.

సోడియం పెనిసీలిను సాధారణముగా ఈ క్రింది యూనిట్ల శక్తితో ఒక్కొక్క వయలునందు నింపి సప్లయి చేయబడుచున్నది.

ఒక వయలునకు 100,000 యూనిట్లు, 200,000 యూనిట్లు 500,000, యూనిట్లు 10,00,000 పది లక్షల యూనిట్ల వరకును మనకు లభించును. పైన చెప్పియున్న పది లక్షల యూనిట్ల "సోడియం పెనిసీలిను పొడి" సయి తము స్వల్ప పరిమాణముగల డిస్టిల్డువాటరునందు సులభ

ముగా కరగిపోయినట్టి స్వభావము దీనికి కలదు. అవసర మును బట్టి అనేక పరిస్థితులయందు రోగము, దాని స్వభా వమును బట్టి దానికొరకు కావలసిన యూనిట్ల శక్తిని విభా గించి ఇంజక్షన్ చేయుటకు పెనిసీలిన్ వయలునకు అవసర మైన పరిమాణము గల డిస్టిల్డువాటర్ మొదలగు ద్రవము లను చేర్చి కరగించి, అందుండి కావలసిన పరిమాణముతో మోతాదును గ్రహించి ఇంజక్షను చికిత్సకొరకు వాడబడు చున్నది.

N. B. యెన్ని యూనిట్ల పరిమాణము గల వయలు నకు యెన్ని CC ల డిస్టిల్డువాటర్ చేర్చినప్పుడు, ఒక్క CC కి యెన్ని యూనిట్ల పెనిసీలిన్ ఔషధము జెందియుం డునో. యా వివరములను పాఠకుల కొరకు యిట ఉదహ రించి, పిదప ఆయావ్యాధులందు పరిస్థితికి తగినట్లు యెన్ని యూనిట్ల బలముతో యెన్ని CC లు వాడవలసి యుండునో వివరించుచున్నాను.

ఉదాహరణమునకు I00, 000 లక్ష యూనిట్ల పెని సీలిన్ జి, సోడియం పొడిగల వయలునకు 5 CC ని డిస్టిల్డు వాటర్ చేర్చుట వలన 1 CC కి 20 వేల యూనిట్ల పెనిసీ లిన్ ఔషధము ఉన్నదని మనము సులభముగా గ్రహింప గలుగుచున్నాము.

పైవలెనే 5,00,000 లక్షల యూనిట్ల పెనిసీలిన్ పొడిగల వయలునకు 4 CC ల డిస్టిల్డువాటర్ చేర్చినప్పుడు 1 CC కి 125,000 యూనిట్లు పెనిసీలిన్ ఔషధముయున్న దని తేలుచున్నది.

ఇట్లే 10,00,000 లక్షల యూనిట్లు పెనిసీలిన్ గల వయలునకు 5 CC డిస్టిల్డువాటర్ చేర్చుటవలన 1 CC కి 200,000 రెండు లక్షల యూనిట్ల ఔషధమున్నదని లెక్క చేయవచ్చును. దీని ననుసరించి యెన్నిలక్షల యూనిట్ల వయలునను యెన్ని సిసి ల కెన్ని యూనిట్ల ఔషధముం డునో వైద్యులు స్వయముగా గ్రహింపవచ్చును.

పై లెక్కప్రకారము 1 సిసి కి 2,50,000 యూనిట్ల పెనిసీలిన్ ఓషధముండునట్లు తయారుజేసికొన్న పైఔషధ ద్రవమును 2 CC లు సిరంజిలోనికి దీసికొన్నప్పుడు సిరం జిలో 5,00,000 యూనిట్ల పెనిసీలిన్ ఔషధమున్నదని గ్రహించితిమి. ఇట్లే కావలసిన మోతాదుతో ఔషధము రోగికై వాడుటకును తెలిసికొన వీలగుచున్నది.

2 సిసి ల ద్రవమునందు 5,00,000 యూనిట్ల పెని సీలిన్ చేరియుండుటచే ఔషధము (సొల్యూషన్) యొక్క

సాంద్రత యెక్కువగా యున్నట్లు వైద్యుడు అనుకొన్న యెడల మరల అదే సిరంజిలోనికి 2 సిసి లు కేవలము; డిస్టిల్డువాటర్ మాత్రమే లాగికొన్నచో, ఇప్పుడు సిరంజిలో చేరియున్న మొత్తము 4 CC లలో ఒకటికి 125,000 యూనిట్ల పెనిసీలిన్ ఔషధ ద్రవ్యము ఉన్నట్లు గ్రహింప గలిగితిమిగదా ? ఇట్లే సోడియం పెనిసీలిను ఇంజక్షనులు జేయదలచిన వైద్యులెల్లరు యీ పద్ధతిలో వారివారి చికిత్సా కార్యక్రమముల నెరవేర్చుకొన వచ్చును.

పైన వివరించిన విధముగా కొన్ని యూనిట్ల పరిమాణముగల పెనిసీలిన్ ఔషధమును యెక్కువ తక్కువ పరిమాణములు గల ద్రవములు చేర్చుటకుగల కారణము ఆయావ్యాధి సందర్భములకు కావలసిన విధముగా చికిత్సాది ప్రయోగములు గావించుటకేనని వైద్యసోదరులు గ్రహించెదరుగాక !

పెనిసీలిన్ ఇంజక్షనులు అన్ని వ్యాధుల యందును ఒకే మోతాదుతోడను, ఒకే సాంద్రతతోడను, వాడబడక ఆయా వ్యాధులకు తగిన మోతాదుతో వాడునట్టి విధానమును, అనుభవజ్ఞులైన గొప్ప డాక్టర్లచే నిర్ణయింప బడుచుండును. యీ విషయమును పాఠకులు ముందు గమనించ గలరు.

పెనిసీలిన్ ఇంజక్షనులు యెట్టి క్రిమిరోగములను
నిర్మూలించును.

అల్లోపతి వైద్య సాంప్రదాయము ననుసరించి, విచారించగా నేడు మానవకోటిని బాధించునట్టి అనేక రోగములు సూక్ష్మాతి సూక్ష్మములైన అనేక అవయవానురూపములతో నుండునట్టి క్రిములవల్లనే గలుగుచున్నవని నిరూపింపబడు చుండుట వైద్యసోదరులకు విదితమే.

పైన దెల్పియున్న రోగక్రిమి సముదాయమునందు యే తరగతి క్రిములు శరీరమున ప్రవేశించుటచే యేవ్యాధి కలుగుచున్నదో స్పష్టముగా పరీక్షించి దెలిసికొనుటకై ఆయా క్రిమివర్గములకు ప్రత్యేకముగా నామకరణముల గావించి యున్నారు.

మానవునకు సంభవించిన రోగమునకు మూల కారణమైన క్రిమిని లేక క్రిమివిషమును స్పష్టముగా తెలిసి చికిత్స చేయుట ఉత్తమమైన పద్ధతి. దీనికి ముఖ్యముగా రోగియొక్క రక్తమును మైక్రొస్కోపుద్వారా అనుభవజ్ఞులు పరీక్షగావించి నప్పుడే వ్యాధి యదార్థ పడగలదు.

రక్తమును యంత్ర సహాయమున పరిశీలించక యే రోగమైనను నిర్ణయింప వలెనన్న ముఖ్యముగా రోగ లక్షణముల పయిననే ఆధారపడి రోగమును నిర్ణయింప వలసి యుండును కదా? ఇట్టి పరిస్థితులయందు పెనిసీలిన్ ప్రయోగము వల్ల నశించునట్టి రోగములకు మూలమైన క్రిమివర్గముల నిట పరిశీలింపుడు.

1. గనోకోక్కి
2. న్యూమోకోకి
3. స్ట్రెప్టోకోకి
4. సెఫిలోకోకి
5. మెనింజోకోకి
6. సిఫిలీసుక్రిమి
7. డిప్తీరియా
8. స్ట్రెప్టోలిక్ ఎక్కినో మైసిక
9. ఏంట్రాకుక్క
10. లెక్చిబ్యేసిల్
11. పెటనెస్‌బ్యాల్
12. చీము మొదలైనవి (పసుపురంగు చీము) బుట్టించునట్టి క్రిమి.

ఈ పైన ఉదహరించిన క్రిమి సముదాయమునే గాక నూతనముగా అనుమానింపబడుచున్న మరికొన్ని క్రిములను వ్యాధులను సయితము "పెనిసిలిన్". రూపు మాపగలిగి యుండును.

పైన ఉదహరింపబడిన వివిధవర్గములకు జెందిన క్రిములవలన జనించు వ్యాధులలో కొన్ని క్రిమి ప్రసంశ లేకుండగనే వృద్ధియగునట్టి రోగములు కలవు. క్రిమి జన్య ముగా సంభవించిన రోగలక్షణములే క్రిమిసంపర్కము లేక వృద్ధినొందిన యీ రోగమునకు సయితము యేర్పడి

యుండును. ఇట్టి పరిస్థితియందు వైద్యులీ క్రింది ఉదాహరణమును పరిశీలింతురు గాక.

1. క్రిమిజన్యము
3. తత్వజన్యము

పై భేదముతో సంప్రాప్తించిన యేరోగమైనను బాగుచేయుటకు పెనిసీలిన్ ఔషధమును ఇంజక్షన్ రూపమున రోగికి యిచ్చి వ్యాధిని నిర్మూలింపవచ్చును.

"పెనిసీలిన్" ఔషధమునకు లెక్కచేయక స్వేచ్ఛగా వృద్ధియగునట్టి క్రిమి సముదాయముకూడా కలదు. అట్టి క్రిమివర్గమును యీ క్రింద వివరించుచున్నాను.

1. మసూచి క్రిములు
2. కలరా క్రిములు
3. ఇన్‌ఫ్లూయింజా క్రిములు
4. మలేరియా క్రిములు
5. టయిఫాయిడ్ బెలిలై
6. కాలాజార్ జ్వరక్రిములు
7. కోలన్ బెసిలై క్రిములు
8. బ్యాక్టీరియా డిసెంటరీ
9. T. B. బ్యాక్టీరియా క్షయరోగమును బుట్టించునట్టివి.
10. కొన్ని విధములైన చీము క్రిములు

11. శూల; "పరిణామశూల"
12. తీవ్రమైన వాతజ్వరము కీళ్ళవాతము మొదలగునవి.
13. క్షయసంబంధమైన కణుతులు గవదబిళ్ళలు
14. క్యాన్సర్ సంబంధమైన రోగము
15. నంజు, వాపు, హృద్రోగము దడ
16. ఇంద్రియనష్టము మూత్రమున శ్వేతధాతువుపోవుట
17. జలోదరము
18. యకృత్ ప్లీహముల వృద్ధి
19. వాతపిత్త సంబంధమైన ఇతర వ్యాధులు

ఈ పైనుదహరించిన క్రిమివర్గమును గాని ఇట్టి క్రిమిజన్యములుగా శరీరమున వృద్ధినొందు యేవ్యాధియందైనను "పెనిసీలిన్" ఔషధము చికిత్సకొరకు ప్రయోగించినచో యేమియును లాభము కలుగదు. గాన వైద్యులిది గమనించి జాగుచేయక పయి క్రిమిజన్య క్రిమిరహితములైన రోగములకు తగిన యితర చికిత్సలు చేయుట ధర్మము.

N. B. "పెనిసీలిన్" చికిత్సతో బాగుచేయుటకు వీలైన అనేకరోగములందు అనేక విధములుగాను "పెనిసీలిన్" మోతాదులు వాడవలసి యుండును. ఇట్లు వాడుటకు ఆయా వ్యాధియొక్క తీవ్ర, సామాన్యవ్యాధియొక్క దశ

కాలపరిమితి యూ మొదలగు అనేక విషయములపై ఆధార పడి అనుభవముతో చికిత్సచేయుటకలదు. ఇందువలన మొదట "పెనిసిలిన్" యే యే వ్యాధులను నశింపచేయునో వివరించి వెనుక ఆ యా వ్యాధులకు తగినమోతాదుల ప్రయోగములను వివరించుచున్నాను.

పెనిసిలిన్ చికిత్సకు లొంగిపోవునట్టి వ్యాధులు.

1. న్యూమోనియా జ్వరము (సన్నిపాత, రక్తష్ఠీవి సన్నిపాత జ్వరములు)

2. యెంఫీమియా, (పుప్పుసములందు న్యుమోనియా వ్యాధి ముదిరి చీము వాపు మొదలైనవి యేర్పడుటవల్ల కలిగిన జ్వరములు)

3. అభిఘాత జ్వరము (దెబ్బలు వగైరా తాకుట వలన వాపు బాధ చీము జ్వరము మొదలగు లక్షణములతో బాధించునట్టి పరిస్థితి.)

4. కాల్పులు (యేకారణము చేతనైనను శరీరము కాలుట వలన యేర్పడిన వ్రణము బాధ వాపు చీము కుళ్లు మొదలైన పరిస్థితి)

5. వ్రణములు గడ్డలు (మొండికురుపులు చీముతో గూడినవి వీటివలన కలుగు జ్వరములు, వడిశగడ్డలు మేహ సంబంధమైనట్టివి రక్తము చీము మొదలైనవి కారుచు గాని అట్టి ద్రవము బయటికి రాక జ్వరము బాధ పోటు మొదలైన లక్షణములతో బాధించునట్టి పరిస్థితి.)

6. రాచపుండ్లు (రాచపుండ్లు శరీరమున యేర్పడు నట్టివియు ఉలవకాయలు మొదలైనవాటియందు యేర్పడు నట్టిదియును)

7. మేనిన్ జాయిటీస్ జ్వరము (మెదడు, బ్రిహ్మ దండినాడి యీ మొదలగు ప్రిదేశములందు వాపు నీరు దుష్ట త్వము అభిఘాతము ఈ మొదలైన కారణములవల్ల యేర్పడెడు జ్వరము, బాధ మొదలగు రోగములు)

8. అస్థి భంగాది దోషములు (ఎముకలు విరుగుట ఇది మృదుత్వముచేగాని తత్వదోషము వల్లగాని కలుగుచు శరీరమున అనేకబాధలు కలిగించునట్టి రోగములు)

9. గడ్డలు గదుములు వాపులు, (మాంసము నం దును, చర్మమునందును, గట్టి కండరముల యందును అకస్మాత్తుగాను క్రిమక్రిమముగను యేర్పడునట్టి వాపులు గడ్డలు గదుములు పోటు, నెత్తురు లేక చీము ఈ మొదలగు దుష్టత్వములు వృద్ధి బొంది జ్వరాది అనేక సంకటములు కలిగించునట్టి రోగములు)

10. శ్వాసనాళ రోగము శ్వాసావ రోధములు (శ్వాసనాళము నందు రక్తాది దుష్టత్వములు క్రిమివిషయ ములు చేరుటవలన వాపు యేర్పడుట లేక శ్వాసను నిరో ధించుట ఇట్టి పరిస్థితియందు రోగి స్పృహ తప్పుటయు లేక ఉక్కిరి బిక్కిరి యగుట ఇట్టి అనేక లక్షణములతో బాధించు రోగములు)

11. నీరుతో గూడిన వాపు (శరీరమున యేదో ఒక భాగము లేక అంగము అవయవము ఈ మొదలైనవాటిలో ఒక్కచోట వాపు నీరు ఉబ్బు మొదలైన వాటితో గూడి నట్టిది. ఇట్టి లక్షణము లందు కొన్నిగాని అన్ని గాని యేర్పడి బాధించునట్టి రోగములు)

12. మాంసమునందు కొంతభాగము కుళ్ళుట(శరీర మున యే భాగమందైనను రక్తము సరిగా ప్రసరింపని కారణముచే ఆ ప్రదేశమున వాపు మొదలైనవి యేర్పడి చాలకాలము నిలచియుండుట లేక ఆ ప్రదేశము అనేక కారణములవల్ల కుళ్ళుట, దీనివలన జ్వరము బాధ ఇట్టి పరిస్థితికి లోనై బాధపడునట్టి రోగములయందును)

13. పెద్ద పేగుయొక్క వాపు (కడుపులోని పెద్ద పేగు యేకారణము చేతనైనను వాచి కడుపునందు నొప్పి బాధ విరేచనములు ఇందు వివిధవిధములుగా దుష్టతత్వము బయటికి వెడలుట కొన్ని వేళలందు రక్తముగాని చీము గాని బయలు వెడలుట ఇట్టి పరిస్థితి క్రిమిజన్యముగాను క్రిమిరహితముగాను కూడ యేర్పడునట్టి అనేక పరిస్థితుల యందును)

14. రొమ్ము కుంపటి, చంటికురుపు (వక్షస్థలమున గాని స్త్రీలకు చంటియందుగానీ వాపు పోటు చీము మొదలైన లక్షణములందు దేనితోనైనను ప్రారంభించి బాధించు నట్టి వ్రణము. ఈ వ్రణము కాలక్రమమున మాంసమును

తినివేయుచు చీము తగ్గక క్రమముగా రోగిని మరణావస్థకు దెచ్చునట్టి వ్యాధులయందును)

15. పెరిటోనిస్, (గర్భకోశములోను ప్రేవుల యందును సన్నని పొరలలో చేరినట్టి అనేక విధములైన రోగ క్రిముల మూలమున లేక ఇట్టి యే యితర కారణ ముల చేతనైనను కడుపులో నొప్పి మలబద్ధకము వాంతి, భ్రాంతి, జ్వరము శోష ఇట్టివే అనేక లక్షణములతోను సహింపరాని బాధతోను యేర్పడు పరిస్థితుల యందును)

16. ఎండోకార్డిటీస్ (హృదయమునందుగల కొన్ని పొరలు వాచుటవలనను హృదయనాళముల వద్దను ద్వార ముల యందును వాపు దుష్టతత్వ మేర్పడి యీ కారణము వలన రోగికి (సంధులు) కీళ్ళయందు బాధ యేర్పడి తగ్గి పోయినను కొన్ని వేళలందు జ్వరము హృదయమున బాధ చలి ఈ మొదలగు లక్షణములు గానుపించునట్టి వ్యాధి యందును)

17. ప్లూరసీ (పుపుసవేష్టృపు నంజు వాపు, ఈ వ్యాధి పుపుసములకు దిగువగా యుండునట్టి పొరయందు నీరు దుష్టతత్వము లేక చీము ఈ మొదలగు నట్టివి చేరి రోగికి మిక్కిలి ఆయాసము కలిగించి జ్వరాది అనేక దుష్ట లక్షణములతో బాధించురోగము)

18. గనేరియా (మూత్రకోశము మూత్రనాళము ఈ మొదలగు ప్రదేశములందు కురుపు వాపు ఈ మొదలగు లక్షణములు యేర్పడుటవలన మూత్రద్వారమునుండి చీముగాని చీముతోగూడిన రక్తము ఈ మొదలగు దుష్ట ద్రవములు స్రవించును. మూత్ర విసర్జన కాలమున భరింపరాని బాధ పోటు ఈ మొదలగు లక్షణములుగల రోగములకును)

19. ఎలుకకాటు జ్వరము (ఎలుక చుంచు పందికొక్కు ఈ మొదలగు జాతులకు జెందిన జంతువుల కాట్లవల్లను భూమి పాప పెద్దసాలీడు మొదలగు విష జంతువుల కాట్లవలన విషము శరీరమున నిలచి ఏదో ఒక కాలమున శరీరమును బాధించునట్టి అనేక పరిస్థితుల యందును)

20. సూతికా జ్వరములు (ప్రసూతికి పిదప మర్మస్థానమున వాపు యేర్పడుట శుభ్రతలేక గాని మరియే యితర కారణములవల్ల నయినను మయిల మొదలగు దుష్ట ద్రవతత్వములు యోని మొదలగు మర్మాంగముల యందు నిలచి క్రమముగా క్రిమిసహితముగాను లేక క్రిమి రహితముగాను, వాపు పోటు జ్వరాది అనేక బాధలను గలిగించునట్టి పరిస్థితులయందు)

21. శస్త్ర చికిత్సకు పూర్వము, పిదప (శరీరమున శస్త్రచికిత్స చేయవలసిన రోగ మేదేని సంభవించినప్పుడు

శస్త్రచికిత్సకు పూర్వముగాని, పిదపగాని ఆ వ్యాధియొక్క లక్షణములు తీవ్రరూపము దాల్చునను అనుమానము సంభవించి నప్పుడును వ్యాధియొక్క లక్షణములు యే రూపములో నైనను శరీరమున వ్యాప్తి జెందనీయక ఆరికట్టుటకును)

22. ప్రమేహములు (ప్రమేహ రోగములందు చీము వాపు పోటు మచ్చలు పొక్కులు ఈ మొదలైన లక్షణములం దేలక్షణములతో సంప్రాప్తించిన పరిస్థితినైనను బాగుచేయుటకును)

23. అంజైనా, (ఆకస్మాత్తుగా గుండెలో నొప్పి యేర్పడి జ్వరాది అనేక లక్షణములతో బాధించునట్టి వ్యాధి. ఈ వ్యాధి సంభవించుటకు శరీరమున పూర్వము జీర్ణించి యున్న మేహాది రక్తదోషములు ఆహారదోషము ధాతు దోషము ఈ మొదలగు అనేక కారణము లుండవచ్చును. ఇట్టి అనేక లక్షణములను బాగుగా పరిశీలించి చేయబడు చికిత్సల కొరకును)

24. సిఫిలిస్ (సవాయిరోగము అనేక లక్షణములతో సంభవించు సకల విధములగు సవాజాత రోగములు నిర్మూలించుటకును)

25. టాన్సిల్స్, (సాధారణముగా గొంతులో చిన్న గ్రంధులవలె గానుపించు "టాన్సిల్స్" యేకారణము

చేత నైనను వాచి మ్రింగునప్పుడు అమితమగు బాధ గలిగించుచు అనేక సంకటముల నొసంగునట్టి పరిస్థితిని నిరోధించుటకును)

26. పిప్పిపన్ను, దవడవాపు (పిప్పిపన్ను వంటి చిగురునందు కురుపు వాపు చీము ఈ మొదలైన లక్షణములవల్ల జ్వరము, పోటు మొదలయిన లక్షణములతో బాధించురోగ పరిస్థితులయందును)

27. డిప్తీరియా (ముక్కు, నోరు, కంఠము, ఈ మొదలగు ప్రదేశములయందు వాపు, పుండు, చీము, ఈ మొదలగు లక్షణము లేర్పడి, శ్వాసమార్గములం దవరోధము కలిగించుచు క్రమముగా వ్యాధి యితర అవయవములకు వ్యాపించుట. జ్వరాది అనేక లక్షణములు ఈ వ్యాధియందు గానుపించుచు క్రిమిజన్యముగా వృద్ధి నొందు ఈ వ్యాధియొక్క ప్రమాదాది అనేక సంకటముల నిర్మూలించుటకును)

28. స్టోమటిట్స్, (నోరు పొక్కుట, నాలుకయందు వాపు, దుర్వాసనతో గూడిన శ్వాస యిట్టి పరిస్థితితో అధికమగు లాలాజలము నిరుపయోగ కరముగా స్రవమగుట, ఇట్టి వ్యాధిలో క్రిమిదోష కారణము వల్ల యేర్పడి పెక్కు సంకటములను తొలగించుట కొరకును)

29. స్కార్లెట్ జ్వరము (ఇట్టి జ్వరాది దోషములు, ప్రవేశించిన రెండురోజుల పిదప శరీరముపై యెరుపు తెలుపు వర్ణముతో ఒక వర్ణము మధ్యను, ఒక వర్ణము అంచులందును గానుపించు మచ్చలు మొదలైన అనేక లక్షణములతో ప్రాప్తించునట్టి రోగమును నివారించుటకును)

30. ఆర్థరయిటీస్ (గనేరియాక్రిమి లేక దోషము శరీరమున నిలచియుండి క్రమక్రమముగా కీళ్ళయందు నొప్పి పోటు ఇత్యాది దోషములతో బాధించునట్టి కీళ్ళ సవాయి రోగమును నిర్మూలించుటకును)

ఇట్లే పైన ఉదహరింపబడిన అనేక వ్యాధులచే గాక పెనిసీలిన్ ఔషధమునకు నశించునట్టి యే వర్గమునకు జెందిన క్రిములు శరీరమున యే కారణముచేతనైనను ప్రవేశించుటచే సంభవించునట్టి అనేక విధములగు రోగములను, రోగక్రిములను, "పెనిసీలిన్" ఇంజక్షన్ ప్రయోగమువల్ల రూపుమాప బడుచున్నవి.

పెనిసీలిన్ ఇంజక్షన్ యొక్క మోతాదులు.

"వయల్" నందు నింపబడియుండు "సోడియం పెనిసీలిన్ జి. పౌడిని క్రమప్రకారము డిస్టిల్డువాటర్‌తో మిశ్రమము గావించి తయారు జేసికొన్న సొల్యూషన్ (ద్రవమును) అవసరమైన మోతాదులతో చర్మముక్రిందను,

కండరముల యందును, అవాంతరమైన కొన్ని పరిస్థితుల యందు రక్తనాళముల యందును, ఇంజక్షను ఇచ్చి చికిత్స జేయబడునుగాని సర్వసాధారణమైన అనేక రోగములకు లోతుగా కండరములందు మాత్రము ఇంజక్షన్ యిచ్చి చికిత్స చేయబడును.

N. B. "పెనిసిలిన్" ఇంజక్షన్‌లు అన్ని వ్యాధుల యందు ఒకే విధమగు మోతాదులతో వాడబడక ఆ యా వ్యాధులకు తగిన విధముగ అవసరమునుబట్టి మోతాదుల పరిమాణము హెచ్చు తగ్గులుగా మార్చుకొన వలసి యుండును.

సర్వ సాధారణముగా పెనిసిలిన్ చికిత్స అవసరమైన అనేక వ్యాధులను నిర్మూలించుటకై ఒక్కరోజులో (24 గంటలలో) 250,000 యూనిట్లు మొదలు 500,000 యూనిట్ల పెనిసిలిన్ ఔషధ ద్రవమును 2 మొదలు 8 ఇంజక్షనులుగా విభాగించి ఇచ్చుచు రోగికి ఆరోగ్యము చేకూర్చవచ్చును.

తీవ్రతరమైన రోగములు, క్రిమిసంబంధముగను, క్రిమి విషసంబంధముగను, లేక తత్వసంబంధముననైనను సంప్రాప్తించి; రోగికి ప్రమాదస్థితి గల్పించినప్పుడు 24 గంటల కాలములో కనీసము 320,000 యూనిట్లు మొదలు 1200,000 లక్షల యూనిట్లకు మించిన శక్తిగల పెనిసిలిన్ ఔషధ ద్రవమును మూడు మొదలు ఎనిమిది ఇంజక్షన్

లుగా విభాగించి యిచ్చి చికిత్స చేయునట్టి పరిస్థితు లెన్నోని గలవు.

పెనిసీలిన్ చికిత్స అవసరమైన పెక్కు జ్వరాదులను నిర్మూలించుటకై రోగబలమును రోగియొక్క వయస్సు బలము పరిస్థితికి తగిన మోతాదులతో జ్వరము పూర్తిగా జారువరకు (అనగా టెంపరేచర్ సమానముగా నార్మల్ అగువరకు) చికిత్సజేయుట ముఖ్యము. ఆ పిదప సయితము రోగశేషము శరీరమున నిలిచి, మరల యేసమయమున నైనను జ్వరము, వ్యాధి తలయెత్త కుండుటకై కొద్ది మోతాదులతో మరికొన్ని పెనిసీలిన్ ఇంజక్షనాలు తగిన వ్యవధిలో ఒకటిరెండు వారములు వాడుట చాల మంచిది.

పెనిసీలిన్ చికిత్స వలన రోగము సమసిన పిదప, రోగియొక్క రక్తమును బాగుగా పరిశీలించి అందు యేవిధమైన రోగ క్రిమి విషము గాని లేనట్లు నిర్ణయించిన తోడనే పైచికిత్సను నిలిపి రోగియొక్క శక్తిని హెచ్చించు నిమిత్తము ఇతర విధములగు టానికులు మొదలైనవి వాడుట ఉచితము.

పెనిసీలిన్ చికిత్సకు సమసిపోవునట్టి రోగములను వైద్యుడు బాగుగా పరిశీలించి పైఔషధ చికిత్సవలన యీ వ్యాధి నిర్మూలమగునని గట్టిగా నిర్ణయించుకొన్న పిదప రోగముయొక్క తీవ్రతను రోగియొక్క వయస్సు పరిస్థితి

యీ మొదలైన విషయములను కడుజాగరూకతతో పరిశీలించి ఈ క్రింది మోతాదులతో వీలునుబట్టి తగినట్లుగా వాడవలసి యుండును.

25 వేల యూనిట్ల బలముతో ప్రతి 3 గంటలకు ఒక్క ఇంజక్షన్ చేయుటకుగాని 50 వేల యూనిట్ల బలముతో ప్రతి 4 గంటల కొక్క ఇంజక్షన్ చేయుటగాని 100,000 ఒక లక్ష యూనిట్ల బలముతో ప్రతి 6 గంటల కొక్క ఇంజక్షన్ చేయుటగాని 200,000 లక్షల యూనిట్ల బలముతో ప్రతి 8 గంటల కొక్క ఇంజక్షన్ చేయుటగాని 300,000 యూనిట్ల బలముతో ప్రతి 10 గంటల కొక్క ఇంజక్షన్ చేయుటగాని 500,000 లక్షల యూనిట్ల బలముతో ప్రతి 12 గంటల కొక్కఇంజక్షన్ గాని చేయుట ఉచితము.

N. B. "ప్రొకేను పెనిసీలిను జి." అయినచో 400,000 లక్షల యూనిట్లు ఒకే మోతాదుగా 24 గంటల కాలములో 1 లేక 2 ఇంజక్షన్లు యిచ్చుట "ప్రొకేను పెనిసీలిన్ జి. ఇన్ ఆయిల్" అయినచో 1 CCకి 300,000 లక్షల బలముగలది 24 గంటల కాలములో అవసరమును 600,000 లక్షల యూనిట్లను విభాగించి 2 ఇంజక్షన్లుగా యిచ్చుటయు కలదు. పై మోతాదులు సాధారణమైన పరిస్థితితో సంప్రాప్తించిన అన్ని వ్యాధులయందును యుక్తా

యుక్త విచారణ సలిపి వైద్యుడు తగిన యుక్తితో మోతా దులను నిర్ణయించి చికిత్సచేయుట ఉచితము.

గనేరియా (పచ్చసెగ) కు, యీ వ్యాధియొక్క ప్రాథమిక దశలో పైవ్యాధిని దీనితో గూడియుండు ఇతర లక్షణములను రూపుమాపుటకు 25,000 యూనిట్లు మొదలు 50,000 యూనిట్ల బలము గల పెనిసీలిన్ ద్రవమును 3 లేక 4 గంటల కొక్క మోతాదు చొప్పున 6 మొదలు 8 ఇంజక్షన్లు 24 గంటల కాలములో యిచ్చి చికిత్సజేయుట వలన రోగము పూర్తిగా నిర్మూలించును.

గనేరియా వ్యాధియొక్క తీవ్రదశయందు, ఈ వ్యాధి చాలాకాలముగా శరీరమున నిలచి, దీనితో యితర సంకటములు కూడియుండి, రోగిని బాధించునట్టి మొండి వ్యాధికి 24 గంటలకు ఒకే మోతాదుగా ప్రొకేను పెనిసీలిన్ జి, 400,000 లక్షల యూనిట్ల బలముతోగాని, లేక 300,000 లక్షల యూనిట్ల బలముతోగాని ప్రయోగించి చికిత్స జేయుటయు, సోడియం పెనిసీలిన్ జి, వాడదలచిన యెడల 500,000 లక్షల యూనిట్లు బలము గల ద్రవము 24 గంటల కాలములో విభాగించిన మోతాదులుగా వాడి చికిత్స జేయుటయు ఉచితము.

పై విధముగా ఒకటి రెండు రోజులు చికిత్స సల్పి రోగికి 10 లేక 15 రోజులు విశ్రాంతి యిచ్చి వ్యాధియొక్క పరిస్థితిని గమనించుచు, సుమారు ఒకమాసము గడువుతో

15 మొదలు 20 లక్షల యూనిట్ల పెనిసీలిన్ ఇంజక్షన్లు వాడి చికిత్స చేయుటచే రోగము పూర్తిగా నిర్మూలించును.

పైన ఉదహరించిన విధముగ చేయబడినచికిత్సకు లొంగని వ్యాధులయందు రోగియొక్క రక్తమును, యితర లక్షణములను బాగుగా పరిశీలించి రోగియందు ముదిరిన ప్రమేహము గాని సవాజాత సంబంధమైన క్రిమివిషాదులు నిలచి యున్నట్లు నిర్ణయించిన వెంటనే, ఆయా వ్యాధి లక్షణములకు తగినరీతి హెచ్చు మోతాదులతో పెనిసీలిన్ చికిత్స ఈ క్రిందివిధముగా చేయుట ఉచితము.

పెనిసీలిన్ చికిత్సచే నశించు అన్ని విధములైన వ్యాధులందు సవాయి రోగము ఇంచుక మొండిదనియే చెప్పవచ్చును. ఇందువలన ఈ రోగముయొక్క అనేక దశలను నిర్మూలించుటకు తగిన మోతాదులతో "పెనిసీలిన్" వాడని యెడల వ్యాధిని పూర్తిగా శరీరమునుంచి తొలగించుట మహాకష్టమగును.

ప్రాథమికావస్థలో నున్న సవాయి రోగము యే రూపముతో శరీరమున నిలచి యున్నను దానిని పూర్తిగా నిర్మూలించుటకు సోడియం పెనిసీలిన్ జి, అయినచో 60,000 యూనిట్ల శక్తిగల ఔషధద్రవము 3 లేక నాలుగు గంటల కొక మోతాదుచొప్పున లోతుగా కండరములందు యిచ్చుచు మొత్తము 3,600,000 లక్షల యూనిట్లకుమించని

పెనిసీలిన్ ఔషధమును 60 మోతాదులుగా విభజించి వాడి చికిత్సజేయుట యుచితము.

సవాజాత సంబంధమైన రోగము ద్వితీయ తృతీయావస్థలలో శరీరమున నిలచి బాధించునట్టి పరిస్థితియందు 60,000 వేల యూనిట్ల శక్తిగల పెనిసీలిన్ ఔషధ ద్రవమును 3 గంటల కొక్క మోతాదు చొప్పున కండరములందు యిచ్చుచు మొత్తము 5,400,000 యూనిట్లు పెనిసీలిన్ ఔషధమునకు మించనీయక 90 మోతాదులతో చికిత్సను ముగించుటచే పైవ్యాధిని పూర్తిగా రూపు మాపవచ్చును. దీనికి గొప్ప అనుభవము అవసరము.

శరీరమున జీర్ణించి మొండికి బడిన సవాయి రోగములకు పైవిధముగా చేయబడిన చికిత్సవలన రోగము దాని లక్షణములు పూర్తిగా సమసిపోయినట్లు గానుపించి కొన్నిదినముల పిదప వ్యాధిగాని దాని లక్షణముగాని పొడచూపినట్టి సందర్భము లనేకములుకలవు. ఇట్టి పరిస్థితులను విమర్శించుచు పెద్దమోతాదులతో సవాజాత రోగములకు, చేయవలసిన కొన్ని పద్ధతులను మార్చి నెల 1948 సంవత్సరమునను, అటుతరువాతను వెలువడిన అమెరికా దేశపు వైద్యసంఘము యొక్క మాసపత్రికయందు విపులముగా ప్రకటింప బడియున్నది.

పై విషయమై అనేక పరిశోధనల వల్లను అను భవజ్ఞులైన వైద్య శ్రేష్ఠుల సలహాతోడను 1951 సంవత్స రమున ప్రకటింప బడిన అంశములనే 1952 "ఫిజిషిన్స్ బులిటిన్" (Physicians Bulletin)అను అల్లోపతి భిషగ్ త్రిమాస పత్రిక ఏప్రియల్, మే, జూన్ మాసములకు విడుదలగావించి ప్రకటింపబడిన పొత్తమునందు వివరింప బడిన కొన్ని మోతాదులు వివరములను పాఠకుల కొరకు ఈ క్రింద వివరించుచున్నాను.

సవాయిరోగముయొక్క ప్రాథమిక ద్వితీయావస్థల యందు సయితము రోగముయొక్క లక్షణములు రోగ వ్యాప్తియొక్క వేగము ఈ మొదలైన పరిస్థితులు సామాన్య స్థితియందు నిలిచి యున్నచో షుమారు 2,400,000 యూనిట్ల 'పెనిసీలిన్' ఔషధ ద్రవమును, అవసరమైన మోతాదులతో విభాగించి ప్రయోగించుచు, 4 మొదలు 8 రోజులలో పై మొత్తమును మించనీయక చికిత్స జేసి నప్పుడు, ఇంతకుపూర్వము ఇందు పెద్ద మొత్తముగా చెప్పి యున్న మోతాదులు వాడినప్పటి కంటె రోగికి శ్రమ తగ్గి కొంచెము సుగుణమే గాన్పించినట్లు చెప్పబడుచున్నది.

సవాయిరోగముయొక్క ప్రాథమిక ద్వితీయావ స్థలయందు, రోగము ప్రబల మొందుచున్నట్లు గానుపించి నను, రోగముయొక్క పరిస్థితి స్వభావము దుష్టముగా

నుండినను వాడవలసిన "పెనిసీలిన్" మోతాదులు యీక్రింద తిలకింపుడు.

1. ప్రొకేను పెనిసీలిన్ తైలము మిశ్రితముగా తయారు చేయబడినట్టిది. 600,000 లక్షల యూనిట్లు 2 CC లతో, లోతుగా కండరములందు, 48 గంటలు మొదలు 72 గంటలకొక్క మోతాదుచొప్పున యిచ్చుచు, మొత్తము 3,600,000 యూనిట్ల తైల మిశ్రతమైన పెనిసీలిన్ ఔషధ మును 6 ఇంజక్షన్లుగా విభాగించి ప్రయోగించి చికిత్స చేయుట ఉత్తమముగా తెల్పబడుచున్నది.

"ప్రొకేను పెనిసీలిన్" డిస్టిల్డు వాటర్‌తో కలిపి ద్రవరూపముగా వాడునట్టిది.

2. 600,000యూనిట్లు (2 CC)లతో, లోతుగా కండ రములందు, 24 గంటల కొక్క మోతాదుచొప్పున ప్రయో గించుచు; మొత్తము 4,800,000 యూనిట్లకు మించిన ప్రొకేను పెనిసీలిన్ ఔషధమును 8 ఇంజక్షనులుగా విభా గించి ప్రయోగించుచు చికిత్స చేయుట ఉత్తమము.

3. సోడియం పెనిసీలిన్, అయినచో, 50,000 వేల యూనిట్ల బలముగల ద్రవమును 3 గంటల కొక్క ఇంజ క్షన్ చొప్పున 24 గంటలకు (రోజుకు) 8 ఇంజక్షనులుగా మొత్తము 8 రోజులకు 3,200,000 లక్షల యూనిట్ల "పెనిసీలిన్" ఔషధమునకు మించనీయక చికిత్సజేయుట ఉత్తమమైన పద్ధతిగా యెంచబడుచున్నది.

సవాయి రోగము బాగా ముదిరిపోయి మొండికిబడి భయంకరమైన లక్షణములతో రోగియందు వ్యాపించి యుండునట్టి పరిస్థితులయందు, పరిస్థితికి తగినట్లు మేధావులైన అనుభవజ్ఞులు మోతాదుయొక్క పరిణామమునకు నిర్ణయించు కొని చికిత్సజేసి ఉత్తీర్ణులగుటయో, విఫలులగుటయో జరుగుచున్నను అట్టిరోగమును మాత్రము ప్రబలనీయక అరికట్టుటకై కనీసము పై దెల్పియున్నట్టి "పెనిసీలిన్" మోతాదులు వాడుచు చికిత్సజేయుట ఉచితము.

సవాయిరోగము శరీరమున జీర్ణించి హృదయనాళములు ప్రేగులు మొదలైన భాగములందు తీవ్రరూపము దాల్చి భయంకరమై యుండి, రోగిని బాధించునట్టి పరిస్థితి యందు వాడవలసిన గరిష్ట పరిమాణము గల మోతాదును గూర్చి గట్టి నిర్ణయము జరగకున్నను, యీక్రింది మోతాదులతో రోగముయొక్క తీవ్రదశయందు, అనుభవము తోడను వివేకము తోడను తగిన హేతువెరింగి ప్రయోగింప దగిన మోతాదులయొక్క వివరము లీక్రింది విధముగా దెల్పబడుచున్నవి.

1. సోడియం పెనిసీలిన్ ద్రవమును 100,000 యూనిట్ల శక్తితో 3 గంటలకొక్క ఇంజక్షన్ చొప్పున రోజుకు (24 గంటలకు) 8 ఇంజక్షనులు యిచ్చుచు 4 మొదలు 12 రోజులలో మొత్తము 9,6000,000 లక్షల

యూనిట్ల శక్తికి మించిన పెనిసీలిన్ సోడియం ఔషధ ద్రవమును వాడి చికిత్స జేయవలసి యుండును.

2. "ప్రొకేను పెనిసీలిన్" ద్రవరూపముతో వాడు నట్టిది 900,000 యూనిట్ల (3 CC) లతో, లోతుగా కండ రములందు ప్రతి 24 గంటల కొక్క ఇంజక్షను చొప్పున 12 ఇంజక్షన్‌లు 12 రోజులు వాడి మొత్తము 10,8000,000 యూనిట్ల "ప్రొకేను పెనిసీలిన్" ఔషధమునకు మించ నీయక చికిత్స జేయవలసి యుండును.

3. "ప్రొకేన్ పెనిసీలిన్ ఇన్ ఆయిల్" తైల మిశ్రితమయి నట్టిది వాడదలచినచో 900,000 యూనిట్లు (3 CC) లతో లోతుగా కండరములందు ప్రతి 48 గంట లకు లేక 72 గంటలకుగాని ఒక ఇంజక్షన్ చొప్పున యిచ్చుచు మొత్తము 12 ఇంజక్షన్‌లకు 10,800,000 యూనిట్లు "పెనిసీలిన్" ఔషధమునకు మించనీయక, అతి చాకచక్యముతో జాగ్రతగా చికిత్స చేయవలసి యుండును.

సవాయిరోగము యేరూపముతోనైనను యేస్థితియం దైనను నేత్రములయందును, తత్ సంబంధముగా నాసికాది కంఠము జిహ్వాదులకు వ్యాపించి యున్నట్టి లక్షణములతో, ముఖ్యముగా నేత్రములను బాధించునట్టి పరిస్థితి పైవ్యాధిని ప్రత్యేకముగా గుర్తించ గల అనుభవజ్ఞుడైన వైద్య శ్రేష్ఠుని సలహా ననుసరించి "పెనిసీలిన్" చికిత్స చేయ వలసి వచ్చినచో, మొత్తము 9,600,000 లక్షల యూనిట్లు

మొదలు 15,000,000 లక్షల యూనిట్లకు మించక "పెని సీలిన్" ఔషధద్రవమును విభాగించి 3 గంటల కొక్క ఇంజక్షన్ చొప్పున ప్రయోగించుచు, 12 మొదలు 20 రోజులవరకు చికిత్స చేయవలసి యుండును.

గర్భిణీ స్త్రీలకు సంప్రాప్తించు సవాయి రోగాదుల యందు, గర్భముయొక్క ఏడవమాసము దాటినపిదపగాని 'పెనిసీలిన్' చికిత్సజేయుట ఉచితము. అట్టి పరిస్థితియందు 'సోడియం పెనిసీలిన్' గాని 'ప్రొకేను పెనిసీలిన్' గాని వాడదలచిన యెడల సాధారణమైన సవాయి రోగము లందు తెల్పియున్నట్టి మోతాదులనే, అనువగు రీతిని మోతాదులు నిర్ణయించుకొని, కడు జాగరూకతతో గర్భిణీ స్త్రీలయొక్క సర్వ లక్షణములు పరిశీలించుచు, అనుభవ ముతో చికిత్స చేయవలసి యుండును.

చంటి పిల్లలకు సంప్రాప్తించునట్టి సవాయి రోగ ముల కొరకు పరిస్థితి ననుసరించి ఒక "కిలోగ్రాము" శరీర తూకమునకు 200.000 లక్షల యూనిట్లు పెనిసీలిన్ ఔషధము సమముగా విభాగింపబడిన మోతాదులతో 3 గం టల కొక్క ఇంజక్షను చొప్పున ప్రతి ఇంజక్షన్‌కు 8,000 ఎనిమిది వేల యూనిట్ల 'సోడియం పెనిసీలిన్' ద్రవము నకు మించనీయక మొత్తము వారమురోజులు మొదలు పదిరోజులలో చికిత్స.పూర్తిజేయుట ఉచితము .

పై చికిత్సకొరకు ప్రొకేను పెనిసీలిన్ వాడవలసి వచ్చినచో 150,000 యూనిట్ల ఔషధ ద్రవమును 24 గంటలకు ఒక మోతాదు చొప్పున 8 రోజులకు మొత్తము 1,200,000 యూనిట్ల 'ప్రొకేను పెనిసీలిన్' ఔషధము కంటె మించనీయక చికిత్స జేయుటయు కలదు.

N. B. ఒక్క కిలోగ్రాము శరీరతూకమునకు 2.2 (రెండు పాయింటు రెండు) పౌనుల తూకమని యెరుంగవలెను.

పసిబిడ్డలకు 'పెనిసీలిన్' చికిత్స చేయునప్పుడు వైద్యుడు కడు జాగరూకత వహించి, వ్యాధిపై తాను ప్రయోగించిన ఔషధము యేవిధముగ పనిచేయుచున్నది, రోగియందు యేర్పడిన సుగుణ దుర్గుణ లక్షణములకు మూలకారణమేది ? యిందుకై ముందు తీసుకోవలసిన జాగ్రతలు ! పథ్యపానాది నియమములు ! యీ మొదలగు విషయములను గూర్చి యెప్పటికప్పుడు తాను దెలిసికొనుచు తగిన సలహా యొసంగుచు చికిత్స జేయుటచే, తగిన ఆరోగ్యము రోగికి కలుగుట కవకాశ మెంతేని గలదు.

"పెనిసీలిన్" ఔషధము గిట్టనివారియందు ఏర్పడు దోషములు.

వైద్యుడు యేవిధమైన "పెనిసీలిన్" ఔషధము నైనను వాడవలసి వచ్చినచో ముందుగా "పెనిసీలిన్"

ప్రయోగము గిట్టక కొందరి శరీరమున యేర్పడునట్టి విప రీత లక్షణములను గూర్చి యెరింగియుండుట చాలా అవ సరము గాన దానిని గూర్చి యీ క్రింద తిలకింపుదుము.

"పెనిసీలిన్" ఇంజక్షన్ వాడినపిదప యీఔషధము కొందరి శరీరములకు సరిపడక (గిట్టక) పోవుటయు కలదు. ఇట్టి పరిస్థితియందు రోగియొక్క శరీరము వాచుట, కంది పోవుట, దద్దులు, బాధ, వాంతి, భ్రాంతి, జ్వరము, యెక్కిళ్ళు, అతిసారము, చిత్తభ్రమ. తలతిరుగుట మొద లగు దుష్టలక్షణములు కొన్ని రోగియందు గాన్పించుట కలదు. ఇట్టి లక్షణములు రోగియందు గాన్పించినవెంటనే, వైద్యుడు పైచికిత్సను నిలిపివైచి; రోగికి తగిన విశ్రాంతి యొసగి అనుభవముతో తగిన విరుగుడుకొరకు యితర ఔషధముల వాడుచు జాగ్రతగా చికిత్సజేయుట ఉచితము.

"పెనిసీలిన్" ఔషధము సరిపడని (గిట్టని) కార ణము వలన, రోగియందు యేర్పడు వికారాది దోషము లను శాంతింపజేయుటకు, "బినాడ్రల్ హైడ్రోక్లోరైడ్" అను ఔషధమును వాడుటచే మిక్కిలి సుగుణము గాన్పించు నని కొందఱి అభిప్రాయమై యున్నది.

"బినాడ్రల్ హైడ్రోక్లోరైడ్" ఔషధము నోటిద్వారా వాడుటకును, ఇంజక్షన్ రూపమున ప్రయోగించుటకును, వీలుగా పార్కుడేవిస్ కంపినీవారు తయారుజేసియున్నారు.

## 110. డిహైడ్రోస్ట్రెప్టోమైసిన్ సల్ఫేట్ ఇంజక్షన్.

## Dihydro Strepto Mycin Sulphate Injection.

క్షయరోగ నివారణ కొరకు మొదటిసారిగా కని పెట్టి వాడబడినట్టి "స్ట్రెప్టోమైసిన్" ఔషధమును, అనేక విధముల పరిశోధనలు గావించి అద్భుతమైన గుణవిశేష ముతో రోగికి యెట్టి ఆయాసము కలుగనీయక, క్షయపై ద్విగుణీకృతముగా పనిచేయునట్లు తయారు జేయబడినట్టి దివ్యౌషధము, "డిహైడ్రోస్ట్రెప్టోమైసిన్ సల్ఫేట్" అను విషయమును వైద్య సోదరులు జ్ఞప్తి యుంచుకొనుట ముఖ్యావసరము.

మానవునకు సంప్రాప్తించు భయంకరమయిన రోగములందు కడు ప్రమాదకరమైనట్టిది క్షయరోగము. ఈ క్షయరోగము అనువంశికముగాను మాత్రమే సంప్రాప్తించునను నమ్మకము కొందరియందు గలదుగాని, క్షయ వ్యాధి సంప్రాప్తించుటకు ఒక్క పైకారణమే గాక, ఆహారవిహార అభ్యాసాది అనేక కారణములవల్ల సయితము పైవ్యాధి సంప్రాప్తించుటకు యెంతేని వీలుకలదను విషయమును, ఇటీవల శాస్త్రజ్ఞులు రుజువుపరచియున్నారు.

క్షయరోగమునకు మూలకారణమయిన క్రిమి యే విధముగా శరీరమున ప్రవేశించినను, తన్మూలమున శరీరముయొక్క ఆరోగ్యమునకు భంగము కలుగకమానదు.

క్షయరోగము నందు జ్వరము, దగ్గు, బలహీనము, స్వేదము, పాలిపోవుట, బరువుతగ్గుట యీ మొదలగు లక్షణములు సర్వసాధారణముగా గనుపించుచునే యుండును.

ముఖ్యముగా ఊపిరితిత్తులయొక్క క్షయనుగురించి తెలిసికొనుట ఉమ్మి పరీక్ష (ఇది సూక్ష్మదర్శినియొక్క సాయమున జరుగును) చాల అవసరమునునై యున్నది.

శరీరముయొక్క వివిధభాగములందు యేర్పడు నట్టి క్షయలయొక్క అవస్థను గూర్చి యెరుంగుటకు "ఎక్స్‌రే" ఫోటో యెంతయు ఉపయోగకరమును, ఆధారమునై యున్నది.

"డిహైడ్రోస్ట్రెప్టో మయిసిణ్" ఇంజక్షను చికిత్స చేసి దగ్గు జ్వరముతో గూడినట్టి ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయ, గ్రంధి క్షయ, శల్యాసంబంధమయిన అస్థి క్షయ, ప్రేవులయందు జనించు క్షయ, ఉలవకాయలందును మూత్రనాళము నందును, మజ్జయందును, సంభవించు నట్టి క్షయయును, రక్తమాంసాదులందును పురీష మార్గాది అనేక స్థానములందు వృద్ధినొందుచు రోగిని మృత్యుముఖమున బడజేయునట్టి, వివిధ విధములైన క్షయరోగములను, సమూలముగా నిర్మూలించుటకు పై ఔషధము యెంతేని ఉపయోగ పడగలదు.

"డిహైడ్రోస్ట్రెప్టోమయిసిన్" ఇంజక్షన్ ప్రయోగము వలన క్షయసంబంధ మయినట్టి రోగములే గాక, మొండికి బడిన కొన్ని ప్రమేహరోగములు (గనేరియా మొదలైనవి) పురీష మార్గమువద్ద గాని, వృషణములకు పురుషాంగమునకు మధ్యనుగాని రంధ్రము వంటిది యేర్పడి, అందుండి చీము రక్తము స్రవించుచు బాధించు నట్టి భగందరము మొదలైన వ్యాధులను సమూలముగా నిర్మూలించుటకును జ్వరముతో గూడిన కోరింత దగ్గు, పసివారియందు ఇది అంటుసంబంధమయిన యే రోగములకు పిదపగాని సంప్రాప్తించి రోగిని మరణావస్థకు దెచ్చునట్టి, అనేక పరిస్థితులనుండి కాపాడి పై వ్యాధిని, ఒకటి రెండు ఇంజక్షన్లకే పూర్తిగా రూపుమాపి, ఆరోగ్యమును ప్రసాదించుటకును వాడబడుచున్నది.

జ్వరము మొండిదై యేకారణమును గోచరించక సదా కొద్దిగనో గొప్పగనో ఉష్ణోగ్రత గల్గి విడువక రోగి యొక్క ఆరోగ్యమునకు భంగము గలిగించుచు, బాధించునట్టి దీర్ఘ జ్వరాదులయందు పై ఇంజక్షన్ ప్రయోగించిన, ఒకటి రెండు రోజులలోనే జ్వరమును తగ్గించి మంచి ఆరోగ్యమును ప్రసాదించి కాపాడినట్టి పరిస్థితు లెన్నోని గలవు.

పైన ఉదహరించియున్న వ్యాధులందు, సాధారణ మయిన కాలపరిమితితో చికిత్సచేసి వ్యాధిని నిర్మూలించు

టకు వీలు కలిగినప్పటికిని క్షయసంబంధమయిన రోగము లందు మాత్రము "డిహైడ్రోస్ట్రెప్టో మయిసిన్" చికిత్స చాలా దీర్ఘకాలము చేయవలసిన అవసర మెంతేనియు కలదు. పాఠకు లీక్రింది వివిధరోగములందు పై ఔషధ మును ప్రయోగించుటకు తగిన మోతాదులయొక్క వివర మును తిలకింపుడు.

"డిహైడ్రోస్ట్రెప్టో మయిసిన్" 1 గ్రాము పొడిని రబ్బరుమూత గల వయల్‌నందు నింపి సప్లయి చేయబడు చున్నది. పై ఔషధమునకు కావలసిన పరిమాణముగల "డిస్టిల్డువాటర్"తో కరిగించి పిదప, ఇంజక్షను ప్రయోగ మునకు తగినంత వాడవలెను.

కొన్ని కంపినీలు డిహైడ్రోస్ట్రెప్టో మయిసిన్ పొడిని డిస్టిల్డువాటర్‌తో మనము కరగింపవలసిన అవస రము లేకయే ద్రవరూపమున తయారుజేసి అంపుల్స్ నందును, వయల్‌నందును నింపి సప్లయి చేయుచున్నారు.

ద్రవరూపముతో తయారు చేయబడి సప్లయి చేయ బడుచున్న వయల్ రెండు విధములు.

1. ఒక గ్రాము డి హైడ్రోస్ట్రెప్టో మయిసిన్ ఔష ధమును 2 CC ద్రవముతో చేర్చి, అంపుల్స్‌నందు నింపి సప్లయి చేయబడును.

2. 1 CC ఔషధ ద్రవమునకు 0·5 గ్రాము డీహైడ్రోస్ట్రెప్టో మయిసిన్ చేరియుండునట్లు తయారుజేసి నింపినట్టి 10 CC వయల్సు కూడా మనకు లభించుచుండును.

ఒక గ్రాము పొడి రూపమున లభించు ఔషధమును డిస్టిల్డు వాటర్‌తో గరగించి, ఆ యా వ్యాధులకు తగిన మోతాదులతో వాడబడుచుండును.

పయి ఔషధము వాడుటకు పూర్వము రోగియొక్క పరిస్థితి, రోగబలము, రోగియొక్క వయస్సు, ఉచ్ఛిష్టము యొక్క పరీక్ష, యెక్స్‌రే ఫోటోయొక్క సాక్ష్యము యీ మొదలైన ఆధారములపై చికిత్సయొక్క కాలపరిమితిని గాని, మోతాదుయొక్క పరిమాణము గాని, నిర్ణయించుకొనవలసియుండును.

దగ్గు జ్వరముతో క్షయ సంబంధముగా బాధించు రోగముయొక్క ప్రాథమిక ద్వితీయావస్థలయందు 0.5 గ్రాము మొదలు 1 గ్రాము వరకు 12 గంటల కొక్క మోతాదుచొప్పున లోతుగా కండరములందు తగిన స్థలమున ఇంజక్షను యిచ్చుచు రోగముయొక్క తీవ్రత లక్షణము ననుసరించి, షుమారు చికిత్సయొక్క కాలపరిమితి 40 రోజులు మొదలు 90 రోజులవరకు పొడిగించి చికిత్స చేయవలసిన అవసరము సయితము కలదు.

పయిన ఉదహరింపబడిన రీతిని చికిత్సయొక్క కాలపరిమితి యందు, రోగముయొక్క హెచ్చుతగ్గులను బట్టి మధ్య 3 మొదలు వారమురోజులవరకు గాని. అంతకు మించిగాని, చికిత్సను నిలిపి మరల చికిత్సను ప్రారంభించు నట్టి పరిస్థితులు లేకపోలేదు.

గ్రింధులందు సంప్రాప్తించు క్షయలయందు రోగ జ్వరముతో బాధపడును. గ్రంధులందు యేర్పడిన వాపు, బాధ, జ్వరము మొదలైన సంకటముల నడంచుటకు 0.5 గ్రాము ఔషధ ద్రవమును 12 గంటల కొక్క ఇంజక్షన్ చొప్పున ప్రయోగించుచు 24 గంటలకు 1 గ్రాము ఔషధ పరిమాణమునకు, అతిక్రమించనీయక చికిత్స జేయుచు 60 రోజులు మొదలు 120 దినముల వరకు చికిత్సను పొడిగింపవలసిన పరిస్థితులు సయితము కలవు.

పైవిధముగనే, వివిధ లక్షణములతోను, దశల తోను రోగము శరీరమున నిలచి యున్నప్పుడు రోగి యొక్క వయస్సును బట్టియు రోగబలము, రోగియొక్క పటుత్వము, స్వభావము యీ మొదలగు అంశముల నన్నింటిని పరిశీలించి, అస్థిక్షయ, భగందరము, మూత్రనాళ, మూత్రపిండాదుల యొక్కయు, మూత్రకోశము యొక్కయు, ఇట్లే యితర అంగములందు సంప్రాప్తించు క్షయాదులను నిర్మూలించుటకు 0.5 గ్రాము మొదలు 1 గ్రాము వరకు ఔషధము 24 గంటల కాలమున కొకే మోతాదు

గనో, విభజించి రెండు మోతాదులుగనో వాడుచు, మొత్తము చికిత్సయొక్క కాలపరిమితి 60 రోజులు మొదలు 120 రోజులవరకు పొడిగించుచు, రోగియొక్క సర్వలక్షణము లను, వ్యాధియొక్క తీవ్ర మాంద్యములను, శ్రద్ధతో పరి శీలించుచు చికిత్సజేయుట యెంతేని అవసరము.

గనేరియావంటి వ్యాధులందును స్వల్పమైన జ్వర ముతో బాధించునట్టి కోరింతదగ్గు, మొదలైన రోగాదుల యందు 0.5 గ్రాము మొదలు 1 గ్రాము అవసరమును బట్టి 24 గంటల కాలములో పైపరిమాణముగల ఔషధము ఒకటి లేక రెండు మోతాదులుగా విభజించి ప్రయోగించు టచే రెండు మూడు మోతాదులతోనే వ్యాధి పూర్తిగా నమసి పోవును. ఇందుచే యీ చికిత్స ఒకటి లేక రెండు రోజుల లోనే ముగించుటకు సయితము వీలు కలుగుచున్నది.

పై పద్ధతినిబట్టి రోగము, క్షయ క్రిమిజన్యముగా శరీరముయొక్క వివిధ భాగములకు సంప్రాప్తించియున్న రుగ్మతలను నిర్మూలించుట కొరకు 0.5 గ్రాము బలముగల ఔషధద్రవమును 12 గంటల కొక్క ఇంజక్షను చొప్పున ప్రయోగించుచు 24 గంటల కాలములో 1 గ్రాము బలము గల ఔషధమునకు మించనీయక పూర్తిచికిత్స కాలపరి మితి 60 మొదలు 120 రోజులవరకు పొడిగించుచు, వ్యాధిని సమూలముగా పోగొట్టి రోగికి, ఆరోగ్యము చేకూర్చవచ్చును.

క్షయ క్రిమితో సంబంధము లేక యితర విధము లైన, రోగక్రిముల స్ట్రెప్టోమైసిన్‌చే నశించునట్టివి ఏయొక్క కారణముచే సంప్రాప్తించి నట్టి యితర రోగాదులందు సయితము 0.5 గ్రాము మొదలు 1 గ్రాము పరిమాణము గల 'డిహైడ్రోస్ట్రెప్టొ మయిసిన్' ఔషధము 24 గంటల కాలములో, ఒకటి లేక రెండు మోతాదులుగా విభజించి వాడక తప్పదు. గాని చికిత్సయొక్క కాలపరిమితి రెండు మూడు దినములకంటెను, అధికముగా పొడిగింపవలసిన అవసరముండదని పాఠకులు సులభముగా గ్రహింప వచ్చును.

పయిన తెల్పబడిన విధముగా స్వల్పకాలములో చికిత్స ముగించుటకు రోగము నిమ్మళించినప్పుడే గాని రోగ లక్షణము లింకను శరీరమున నిలచి గానుపించు చున్నప్పుడు మాత్రము యా లక్షణములు పూర్తిగా నశించు వరకు ఒకటి రెండు దినములు ఈ ఇంజక్షను చికిత్సచేయుట యెంతేని అవసరమను విషయమును వైద్యసోదరులు మరువకుందురు గాక.

N.B. డిహైడ్రోస్ట్రెప్టొ మయిసిన్ ఔషధము 24 గంటల కాలములో, 1 గ్రాము మొదలు 2 గ్రాములవరకు సయితము రెండు మోతాదులుగా విభజించి వాడవలసిన పరిస్థితులు సయితము లేకపోలేదు. ఇట్టి చికిత్స స్వల్పకాలముననే ముగించినను, చికిత్స జేయునట్టి వైద్యుడు అను

భవరహితుడైన యెడల రోగికి, అనేకవిధముల ప్రమా దాది సంకటములు సంభవించుటకు తగిన అవకాశము లెన్నోని కలవు. రోగముయొక్క స్వభావము, రోగియొక్క పరిస్థితి, ఆహారాది వాతావరణ విశేషములను, సయితము, గుర్తెరిగి చికిత్స చేసినప్పుడే రోగికి ఆరోగ్యము సంభ వించుటకు అవకాశము కలుగును.

గమనిక:- ముఖ్యముగా పైఔషధద్రవమును కండ రములందు ఇంజక్షను చేయునప్పుడు తప్పి యేమాత్ర మయినను రక్తనాళమునందు ప్రవేశించినయెడల రోగికి ప్రమాదము సంభవించును. ఉలవకాయలు (మూత్రపిండ ములు) వాని సంబంధమయిన వికారాది రోగములతో బాధ పడునట్టి రోగికి 'డిహైడ్రోస్ట్రెప్టోమయిసిన్' చికిత్స చేయ వలసి వచ్చినచో వైద్యుడు, మిక్కిలి నేర్పుతోను, జాగ రూకతతోను నుండనియెడల రోగికి ప్రమాదము సంభ వింపవచ్చును.

"డిహైడ్రోస్ట్రెప్టో మయిసిన్" సరిపడని వారి యందు ఇంజక్షన్ ప్రయోగించిన మరుసటి దినము నుం డియే శరీరము కందిపోవుట, చర్మవికారము, పోటు, విప రీతమయిన లక్షణములు, మూత్రము వెడలకుండుట, విరే చనములు, వాంతి, భ్రాంతి, యిత్యాది లక్షణములు పొడ చూపుటయు కలదు. కొందరియందు యీ ఔషధము ప్రయోగించిన కొన్ని గంటలకే, కళ్ళు యెఱ్ఱబడుట, చెవులు

వినుపించకపోవుట, తలదిమ్ము, మెదడునందు పోటు, చిత్తభ్రమ, సంధివంటి లక్షణములు మొదలైనవి ఒక్కొక్కటిగాని, కొన్నిగాని, అన్నియుగాని కనిపించుటయు కలదు.

పైవిధముగా ఔషధము సరిపడని కారణమువలన రోగియందు గనుపించెడి అవస్థాది లక్షణములను వైద్యుడు వెంటనే గమనించి నిలిపివైచి పై చికిత్సను వెంటనే నిలిపివైచి, ఔషధదోషము శాంతించుకొరకు "బెనిడ్రియల్" వంటి ఇతర ఔషధములను ప్రయోగించి రోగికి విశ్రాంతి యొసంగుచు కడు జాగరూకతతో కాపాడుట వైద్యుని యొక్క బాధ్యతగా నెరుంగవలెను. "హైడ్రోస్ట్రెప్టొమయిసిన్" చికిత్స కొన్ని వ్యాధులందు 60 మొదలు 120 రోజులవరకు దీర్ఘకాల చికిత్స చేయవలసి వచ్చినప్పుడు కొందరికి ఈ ఔషధ ప్రయోగమువలన శరీరమున యెట్టి వికారాది దోషములు మొదలు గనుపించనప్పటికిని కొంత కాలము చికిత్స నడచిన వెనుక మూత్రపిండములందుగాని మూత్రనాళమునందు గాని కొన్ని సంకటములు యేర్పడుటకు వారివారి తత్వముల ననుసరించి అవకాశము కలదు గాని ఇట్టి పరిస్థితికి అవకాశ మొసంగకుండుటకై రోగి యొక్క మూత్రమును క్రమప్రకారము పరీక్షచేసి అందు యేవిధమయినట్టి దోషములు లేవని ఘట్టిసాక్ష్యము లభించి నప్పుడే పై చికిత్స యింకను అవసరమైనంత కాలపరి

మితికి పొడగింపవచ్చునేగాని లేనియెడల వెంటనే చికిత్స నిలిపి క్రొత్తగా మూత్రమునందు గనుపించిన దోషము లుపశమించు నిమిత్తము, మరియొక్క చికిత్స జేయవలసి యుండునను యంశమును వైద్యసోదరులు మరువరాదు.

## 111. కాల్షియం, ఇంజక్షణ్.
## శాండోజ్ కంపెనీ వారిది.
## Calcium Sandoz Injection.

పై ఇంజక్షన్ అంపుల్స్ నూటికి 10 పర్ సెంట్ల వంతుల బలముతోను, 20 వంతుల బలముతోను మనకు లభించును.

ప్రస్తుతము మనకు లభించునట్టి కాల్షియం సంబంధ మైన ఇంజక్షన్‌లందు "శాండోజ్ కంపెనీ" వారియొక్క కాల్షియం అంపుల్స్ అతి ఉత్తమమైనవిగా యెల్లరిచేతను యెంచబడుచున్నవి. దీనితో సమానముగా పనిచేయగల "కాల్షియం ఇంజక్షణ్"లను మనదేశమున అనేక కంపెనీలు తయారుజేసి మన కందించుచున్నవి. ఇట్టివాటిని సైతము అనేకులు వాడుచునేయున్నారు. మొత్తముమీద 'కాల్షియం' ఇంజక్షణ్ ప్రయోగ ప్రయోజనములను, చక్కగా గుర్తెరిగి చికిత్సలయందు సక్రమముగా వాడగలిగిన, వైద్య సోదరులు తప్పక జయముతో రోగిని, ఆరోగ్యవంతునిగా చేయగలరనుట, అతిశయోక్తి కానేరదు.

వైద్యసోదరులీక్రింద వివరింపబోవు ముఖ్యమైన విషయములను, శ్రద్ధతో గమనించి, 'కాల్షియం ఇంజక్షన్' వైద్యవిధానమున మనకెంతటి, ఉపయోగకారియో గుర్తెరుంగ గలరు.

మానవుని శరీర పోషణమునకు ముఖ్యావసరమైయుండు పదార్థములందు "కాల్షియం" చాలా ముఖ్యమైన పదార్థమని ఎల్లరిచేతను, అంగీకరింప బడుచున్నది.

శరీరమునందు గల ప్రతి 100 CCల రక్తమునందు, కనీసము 10 M. G. ల పరిమాణముగల కాల్షియం పదార్థము గల్గియున్నప్పుడే మానవుడు రోగరహితుడుగాను, ఆరోగ్యవంతుడుగాను నుండగల్గుటకు అవకాశమేర్పడుచున్నది. ఇట్టి ముఖ్యపదార్థము శరీరమున యే కారణము చేతనైనను, క్షీణించినప్పుడు, శరీరమున యేదో ఒక విధమగు అస్వస్థత చేకూరక తప్పదు.

శరీరమున కాల్షియం పదార్థము క్షీణించుటకుగల కారణములను, రెండు విధములు యీ క్రింద తెలియునటుల విభజించి చెప్పవచ్చును.

"కాల్షియం" శరీరమున క్షీణించుటకుగల
మొదటి కారణము.

1. 'కాల్షియం' పదార్థము లోపించిన, ఆహారపానీయములనే సదా సేవించుచుండుట.

2. స్త్రీ గర్భవతిగా నున్నప్పుడు, కడుపులోని పిండము వృద్ధియగుటకు కావలసిన కాల్షియం (సున్నపు పదార్థము) తల్లియొక్క శరీరము నుండియే వ్రయమగు పరిస్థితి యేర్పడుటవల్ల గర్భిణీస్త్రీకి "కాల్షియం" లోపము యేర్పడుచుండుట సహజము.

చిన్నపిల్లలు యెదుగునపుడు వారి శరీరవృద్ధికి (ఎముకలు, దంతములు వృద్ధికి) కావలసిన కాల్షియం పదార్థము, రక్తాది రసముల నుండి విడబడి, అస్థిభాగములకు జెందునట్టి పరిస్థితియందు సయితము శరీరమునకు కాల్షియం, అవసరమై యుండును.

3. రక్తమున కలుగు మార్పులు:— ఇట్టి మార్పు వయస్సుయొక్క పరిపాక దశల ననుసరించిగాని, శరీర పోషణమున కవసరమైన, యితర ధాతు సముదాయము యేకారణము చేతనైనను శరీరమున క్షీణించినప్పుడు, శరీర పోషణము క్రమప్రకారము జరుగని కారణమువల్ల కాల్షియంనందు క్షీణదశ యేర్పడునట్టి పరిస్థితి శరీరమున కలుగుట సహజము.

ఈ మొదలైన కారణములచే గలుగు వ్యాధులందును, కాల్షియం లోపమునందును రోగికి నోటిద్వారా "కాల్షియం" సంబంధమైన ఔషధములను వాడుటయు, యేతత్ సంబంధమైన "కాల్షియం" ఔషధములకు తోడుగా విటామిన్ "డి" సంబంధమైన పదార్థము చేరియుండు

లాగున చూచి చికిత్స జేయుటయేగాక "కాల్షియం" విటామిన్ 'డి' సమృద్ధిగ నుండునట్టి, ఆహార పదార్థములనే వాడుచు పై చికిత్స దీర్ఘకాలము చేయుటచే రోగియందు, ఆరోగ్యలక్షణములు దినదినాభివృద్ధి గాంచుటకు అవకాశ మేర్పడును.

పై దెల్పినట్టి కారణములవల్ల శరీరమున లోపించిన, "కాల్షియం" పదార్థమును శరీరమున, యథాప్రకారము సమానమైన స్థితికి దెచ్చుటకై, ఇంజక్షను ఇచ్చి శరీరమున కాల్షియం వృద్ధిపరచుటకన్న, ఆహారపానీయములచేతను నోటిద్వారా దీర్ఘకాలము క్రమక్రమముగా 'కాల్షియం' ఔషధాది పదార్థములను హెచ్చించుచు క్రమముగా, చికిత్స జేయుటవలన రోగికి, యెంతయు మేలును క్షేమమును గలుగును.

II 'కాల్షియం' పదార్థము శరీరమున క్షీణించుటకు రెండవ కారణము.

1. "యకృత్" దోషముల వలనగాని, మూత్రపిండముల దోషము వలనగాని, శరీరమున యేర్పడునట్టి వివిధ రోగములవలన, శరీరమున కాల్షియం క్షీణించుట.

2. పుపుసములందు యేర్పడు వ్యాధులు, ఆహార దోషమువలన జనించు వ్యాధులు, నంజు, వాపు, శరీరము మొద్దుబారుట యిత్యాది అనేక రుగ్మతలవలన శరీరమున కాల్షియం క్షీణించుట.

3. తత్వమునకు సరిపడని ఆహారపానీయములు సదా వాడుటచేతను శరీరమున గల "కాల్షియం" పదార్థమును నాశనము చేయునట్టి, ఔషధీక్షారములు సేవించుట చేతను, ఆహారకోశమునకు అకస్మాత్తుగా యేర్పడిన సంకట వికారాది దోషములవల్లను, యెడతెగని యెక్కిళ్ళు విడువక బాధించుటవలన గాని, శరీరమున "కాల్షియం" క్షీణించుట.

4 నాగ, వంగ, రజిత రసహేమాది ధాతు దోషములు శరీరమున జీర్ణించి యుండి రోగియందు, అసాధారణ పరిస్థితి గన్పించినట్టి సందర్భములందు శరీరమున "కాల్షియం" క్షీణించుటచే గలుగునట్టి లక్షణముల నడంచుటకును,

5. రక్తస్రావము యే కారణముచేతనైన యేర్పడి, రక్తకాస, క్షయాది అనేక రోగాదులవల్ల శరీరమున కాల్షియం క్షీణించుటచే గలుగునట్టి లక్షణముల నడంచుటకును.

6. "అస్థిక్ష" యాది అనేక కారణములవలన శరీరమున యేర్పడునట్టి, అనేక అసాధారణ పరిస్థితుల యందును, చాలినంత 'కాల్షియం' శరీరమున లేకపోవుటగాని, పుట్టినప్పటి నుండియు అనేక రోగములకు తోడుగా, "రికెట్సు" వ్యాధికిలోనై బాధపడి, ఆరోగ్య రహితముగా జీవించువ్యక్తికి శరీరమున "కాల్షియం" క్షీణించుటచే కల్గునట్టి లక్షణముల నడంచుటకును.

7. రక్తము శరీరమున యేకారణము చేతనైనను, స్వేచ్ఛగా ప్రసరింపలేని పరిస్థితులు యేర్పడుటచే సంభవించెడు అనేక విధములైన రుగ్మతల వలనను, నిస్సత్తువ బహుదినములు శరీరమున నిలిచి, యా కారణము వలన కొన్ని అంగములు చురుకుగా పనిచేయని లోపమువలన, శరీరములో క్రమ క్రమముగా వివిధ లక్షణములతో యేర్పడు రుగ్మతలకు శిధిలమై క్షీణించినతత్వము, తేజము చెడియున్న కాలమున క్రమముగాగాని అకస్మాత్తుగా గాని "కాల్షియం" క్షీణించుట.

ఈ మొదలగు కారణములచే కలుగు వ్యాధుల నిర్మూలించుటకును, పయికారణములవలన శరీరమున ఏర్పడిన కాల్షియం లోపమును సవరించి రోగికి ఆరోగ్యము ప్రసాదించుటకును, ఇంజక్షన్ ప్రయోగమువలన 'కాల్షియం' శరీరమున ప్రవేశపెట్టిన వెంటనే, శరీరమున ప్రవేశించిన 'కాల్షియం' రక్తాది వివిధాంగముల కుత్తేజము శక్తిని కలిగించి రోగికి కడుశీఘ్రముగా, ఆరోగ్యస్థితికి తెచ్చుటకు తోడ్పడును.

నోటిద్వారా వాడబడిన "కాల్షియం" చికిత్సకంటె, కండరములందు, ఇంజక్షను యిచ్చి చేయబడెడు చికిత్స యందు శీఘ్రగుణము గాన్పించుట సహజముగాని, కండరములందు ఇంజక్షన్ రూపమున ప్రవేశపెట్టిన కాల్షియం కంటెను, రక్తనాళముద్వారా ఇంజక్షన్ చేసి శరీరమున

ప్రవేశపెట్టబడిన "కాల్షియం" అతి శీఘ్రముగా శరీరము నకు గుణవిశేషము చూపి, రోగికి ఆరోగ్యము ప్రసాదిం చుట తథ్యము.

N. B. కండరములందు చేయబడు "కాల్షియం" ఇంజక్షన్‌లు కొంత వ్యవధితో పనిచేసినప్పటికిని కేవలము ప్రమాద రహితములు. రక్తనాళమునందు చేయబడు "కాల్షియం" ఇంజక్షన్‌లు, కడుశీఘ్రముగా పనిచేయును గాని, ఇట్టి చికిత్స పసివారియందు (రక్తనాళములు దృఢ ముగా వృద్ధికానివారు) మిక్కిలి కోమల శరీరముతోను, బక్కగాను, సన్నగిలి యుండునట్టి వారియందును చేయుట వలన కొన్ని ఇబ్బందులు యేర్పడి రోగికి ప్రమాదము గలుగవచ్చును.

పాతరోగములందు 'కాల్షియం ఇంజక్షను' దీర్ఘ కాలము యిచ్చుచు చికిత్స జేయవలసివచ్చినప్పుడు ముఖ్య ముగా కండరములందు వాడుటే ఉచితము. పయి ఇంజక్ష నుల ఫలితమును శీఘ్రకాలములో పొందవలసిన రోగుల కొరకు రక్తనాళమునందు, ఇంజక్షను యిచ్చును. ఇట్టి చికిత్స కొంతకాలములో ముగించుట మంచిది.

"కాల్షియం శాండోజ్" ఇంజక్షనులు, వివిధ రోగ ములయందు వాడవలసిన, వివిధ మోతాదులకొరకు వీలుగా హెచ్చుతగ్గు బలముతోను, కొద్దిగొప్ప పరిమాణముతోను,

పై ఇంజక్షనును యీ క్రింద వివరించిన విధముల తయారు జేయబడుచున్నవి.

1. కాల్షియం ఔషధద్రవము నూటికి 10 వంతుల బలముతో 10 సిసి, 5 సిసి, 2 సిసి అంపుల్సు సయితము మనకు లభించును.

2. కాల్షియం ఔషధ ద్రవము నూటికి 20 వంతుల బలముతో 10సిసి, 5సిసి అంపుల్సు మాత్రము లభించును.

ఇందు మొదట తెల్పియున్నట్టి నూటికి 10 వంతుల బలముగల ఔషధ ద్రవమును కండరములందును, రక్తనాళ ములయందును, అవసరమునుబట్టి వాడుకొనవచ్చును.

ఇందు రెండవది నూటికి 20 వంతుల బలముతో గాఢముగా తయారు చేయబడిన, ఔషధ ద్రవమును రక్త నాళమునందు మాత్రమే ప్రయోగించి చికిత్స జేయవలసి యుండును. దీనిని కండరములందు వాడినచో మంట, బాధ, పోటు యీ మొదలైన అనేక సంకటములు సంప్రాప్తించును.

"కాల్షియం ఇంజక్షన్" కార్యక్రమముయొక్క కాలపరిమితి.

N. B. కండరముల యందుగాని, రక్తనాళము నందుగాని చేయబడు కాల్షియం ఇంజక్షన్‌యొక్క కాల పరిమాణము నిట గమనింపుడు.

1. రక్తనాళమునందు ప్రయోగింపబడు ఇంజక్షన్ నూటికి 10 వంతులు బలముకల 'కాల్షియం ద్రవము' 10 CC లు 1½ నిమిషము మొదలు 3 నిమిషములవరకు నెమ్మదిగా రక్తనాళములోనికి యెక్కించవలసియుండును.

2. నూటికి 20 వంతులు బలముగల కాల్షియం ద్రవము 10 CC లు 3½ నిమిషములు మొదలు కనీసము 5 నిమిషముల కాలమైనను జాగ్రతతో నెమ్మదిగా రక్త నాళము లోనికి యెక్కించవలసి యుండును.

పై ఇంజక్షన్ ప్రయోగ సమయమున వైద్యుడు నిర్లక్ష్యభావముతోను, పరధ్యానముతోను, అజాగ్రతగా, త్వరపడి ఇంజక్షన్ ఇచ్చినచో రోగికి ప్రమాదము సంభ వింపక తప్పదు.

కండరములందు చేయబడు "కాల్షియం ఇంజక్షన్" లోతుగా పిరుదుల కండరములందు, జాగ్రతగా ప్రయోగిం చిన పిదప ఆ స్థలమును ఒకటి లేక రెండు నిమిషములు, వైద్యుడు తన బొటనవ్రేలితో మర్దించుటచే, ఔషధద్రవము సవ్యముగా ప్రసరించి రక్తమున వ్యాపించుటకు అవకా శము గలుగును. ఇంతకు దీనిచే, ఆ స్థలమున గడ్డకట్టు టకు గాని, వాచుటకుగాని అవకాశమేర్పడదు.

N.B. రోగి, మిక్కిలి అవస్థతోను అలసి నిద్ర లేక ఆహారములేక, మిక్కిలి బలహీనుడుగా నున్నప్పు డును, కాల్షియం ఇంజక్షన్ రోగియొక్క తత్వమునకు

సరిపడు వరకును తగిన పరిస్థితి అదను, వీలు మొదలగు యంశములను విచారించి, జాగరూకతతో పై ఇంజక్షన్ ప్రయోగము గావింపవలసి యుండును. రోగి జ్వరము తోను, అమితమగు నీరసస్థితియందును, ఉన్న పరిస్థితుల యందు రక్తనాళము లోనికి చేయబడు ఇంజక్షన్, పైన దెల్పియున్న కాలపరిమితికన్న, అతి నిదానముగా ప్రయోగింపవలసి యుండును.

## కాల్షియం శాండోజ్ యొక్క ప్రయోగ ప్రయోజనముల వివరము.

1. అన్ని విధములైన క్షయరోగాదుల యొక్క ప్రాథమిక ద్వితీయావస్థల యందును, ఈ వ్యాధివలన కలుగు రక్తస్రావముల నాపుటకును, శస్త్రచికిత్సాది సమయములకు పిదప కలిగెడు రక్తస్రావముల నిలుపుట కొరకును, క్షయయందుగల్గు అజీర్ణాతిసారముల నాపుటకును, స్వర్ణాది ధాతుక్షారములుగల ఔషధములు వాడియుండుటచే, అవి సరిపడని కారణమున రోగియందు గనిపించు, అనేక వికారాది దోషముల బోనడంచుటకును.

2. శ్వాసకోశ సంబంధముగా జనించు 'నిమోనియా' వాతశ్లేష్మ జ్వరము, ఊపిరిగొట్టము లందు యేర్పడునట్టి శీతవాత రోగములు, దగ్గు, దమ్ము, ఉబ్బసము, గాఢమైన దగ్గుపడిశెమువంటి వ్యాధుల బోనణంచుటకును.

3. జీర్ణకోశ సంబంధమైన కురుపులను మాన్పుటకు అట్టిరోగము సందిగ్ధావస్థలో నుండిగాని, వికటించుటవలన గాని యేర్పడునట్టి రక్తస్రావము, తీవ్రరూపముతో అకస్మాత్తుగా సంభవించిన అజీర్ణవాతాది విరేచనముల నడంచుటకును "యకృత్" అంటు సంబంధమైన వ్యాధులచే చెడిన పరిస్థితివలన, శరీరమున గనుపించునట్టి కొన్ని రోగముల నివారించుటకును.

4. నరముల సంబంధముగాను, కండరముల సంబంధముగాను, అస్థి సంబంధముగాను ప్రాప్తించు ధనుర్వాతము, కండరముల బాధ, చచ్చు, రికెట్సువంటి ఎముకల దౌర్బల్యము, (ఇది పసివారియందు గలుగు చుండును) గొంతులో కురుపు, కంఠమాల రోగము మొదలగు వ్యాధుల నడంచుటకును.

5. తత్వదోషము వలనగాని, ఆహార విహారాది దోషముల వలనగాని సంప్రాప్తించినట్టి ఉబ్బసము, దగ్గు దమ్ము ఆయాసము శరీరము వాపు నీరు నంజు పుప్పుసములయందు నంజు "సీరములు" మొదలైన యితర ఔషధ చికిత్సలవలన శరీరమున యేర్పడిన దుష్టతత్వమును పోగొట్టుటకును, వాత సంబంధముగా సంప్రాప్తించునట్టి కీళ్ళరోగము సంధివాతము తేనెటీగలు కందిరీగలు మొదలైనవి కుట్టుటవలన శరీరమున యేర్పడినట్టి అసాధారణ స్థితిని అడంచుటకును సొరచేప ఇంగిలాయి మొదలగు

చేపలు కరచుటవలనను కొన్ని విధములగు తుట్టెపురుగులు కరచుటవలనను "భూమిపాప" సాలీడు మొదలగు జీవజంతువులు కరచుటవలన శరీరమందు యేర్పడిన విషాది దోషములను బాధలను నిర్మూలించుటకును.

6. రసవిష సువర్ణాది రజిత వంగములచే తయారు చేయబడిన ఔషధములు "పెనిసిలిన్" సల్ఫనమయిడ్, పాషాణ సంబంధమయిన ఇతర ఔషధములను వాడుటచే శరీరమునకు అట్టివి సరిపడని వారియందు గనుపించు వివిధ రోగలక్షణముల నడంచుటకును.

7. సాధారణమయిన పరిస్థితితో ప్రారంభించిన వాంతులు యెడతెగని చాలా కాలము బాధించుచు రోగియందు అసాధారణమైన పరిస్థితిని దెచ్చి బాధించునట్టి పరిస్థితిని చక్కపరచుటకును గర్భిణీస్త్రీయొక్క నవమాసములు పూర్తిగా వచ్చునట్టి సమయమున ఆయాసము వాంతి భ్రాంతి మొదలగు అనేక లక్షణములతో సంప్రాప్తించు రుగ్మతలను నివారించుట కొరకును గర్భాశయ గర్భకోశ సంబంధ వ్యాధులయొక్క అనేక దశలయందు చేయబడు వివిధ చికిత్సల కొరకును.

చంటికురుపు రొమ్ముకుంపటి మండె మొదలగు రోగములను ఇట్టి పరిస్థితులయందు సంభవించు రక్త ప్రావములను నరికట్టుటకును.

8. గొంతులోని "టాంసిల్స్" (గ్రంథులు) వాచుటచే కలుగు నొప్పి బాధ, యీ కారణములవలన శరీరమున గనుపించు యితర సంకటములు 'టాంసిల్స్' ఉద్రేకించి గాని చిట్లిపోవుట లేక నలిగిపోయి చితుకుటచే సంభవించెడు, రక్తస్రావముల వంటి పరిస్థితిని ఆపి నివారించుటకును, స్వరభంగము స్వరపేటికయందు మ్రింగునప్పుడు యేర్పడు నొప్పి కంఠవాతము, (ఈ పరిస్థితులు, అమ్మవారు మొదలగు వ్యాధులు సోకిపోయిన పిదప సంప్రాప్తించుట సహజము) కొండనాలుక వద్ద వాపు పెరుగుట, దీనివలన కలుగు దగ్గు బాధ, కంఠము చచ్చుపడిపోయి, అనేక యిబ్బందులు గలుగుట, పై కారణములవల్ల శ్వాసకోశములయందును, అసాధారణమయిన పరిస్థితి యేర్పడి బాధించునట్టి అనేక రుగ్మతలను నిర్మూలించుటకొరకును,

9. కంటిసంబంధమయిన అనేక రుగ్మతల యందును; కంటిపోటు వాపు యెరుపు నీరుకారుట ఒక విధమగు సన్నని పొక్కులు కంటిరెప్పలయందు కనిపించుట నేత్రదోషము కళ్ళకలకలవంటి అనేక పరిస్థితుల యందును, శరీరమున కాల్షియం లోపించిన కారణముచేత నేత్రములయందు యేర్పడునట్టి ఇతర సంకట వికారరోగముల నిర్మూలించుటకును.

నేత్రములందు పొరలు, బిందువులు మొదలైనవి గప్పి యున్నప్పుడు అట్టివాటిని తొలగించుటకు చేయబడు

నట్టి శస్త్రచికిత్సలకు ముందుగాని, పిదపగాని సంభవించు ఉద్రేకములను, రక్తస్రావములను అరికట్టి నాపుటకు క్షయాది అనేకరోగములు శరీరమున నిలచి చాలకాలము బాధించుటచే, అట్టి దోషములు క్రమక్రమముగా నేత్రము లకు వ్యాపించుటవలన, కళ్ళయందు జనించు వివిధరోగాది సంకటముల నడంచుటకును.

10. చర్మసంబంధమైన వ్యాధులందు గజ్జి కురుపులు కరపాణి సరిఫి శరీరమున చర్మములందు రంగు మారిపోవుట శరీరమునందు సన్నని పొరలు ఒక్కొక్క టిగా ఊడిపోవుట (ఇట్టివి కాళ్ళయందు గాని చేతుల యందుగాని తరుచుగా సంభవించుచుండును) శరీరమున కాల్షియం పదార్థము తగ్గిపోవుట వలన రక్తమునందు యేర్పడు మార్పువల్ల; చర్మమునందు యేర్పడు యెండు గజ్జి, భరింపరాని దురద నవ దద్దులు గనుపించుట మొద లగు అనేక విధములైన చర్మ వికారరోగముల నడంచుటకును.

11. మూత్రకోశ సంబంధమైనట్టి వ్యాధులందు కీళ్ళయందు నొప్పులేర్పడి, మూత్రమున శ్వేతధాతువు పోవుట (అల్బూమెనోరియా) మూత్రమువెంట రక్తము స్రవించుట మూత్ర పిండములందుగాని మూత్రాశయమున గాని యేర్పడునట్టి బాధ ఇట్టి అనేక రోగములను తొలగించుటకును.

(మూత్రాశయమున గాని మూత్రపిండములందు గాని రాయి వంటివి యేర్పడునప్పు డీ ఇంజక్షన్ యీయక శస్త్ర చికిత్సలవంటి యితర ప్రక్రియలు చేయించుట మంచిది)

12. శస్త్రచికిత్సలు యేసంబంధమైనట్టివిగాని చేయబడిన పిదప యేకారణముచేత నైనను అప్పుడప్పుడు లేక సంతతము స్రవించునట్టి రక్తస్రావాది అనేకదోషములను తొలగించుట కొరకును.

13. యెక్కువ భారమితిగల లోహాది ధాతువుల యొక్కయు విషసంబంధమైన వాయువుల (గ్యాసెస్) యొక్కయు ఔషధముల యొక్కయు విషదోషాదులు శరీరమున చేరి బాధించునట్టి అనేక పరిస్థితులను తొలగించుట కొరకును.

14. కాల్షియం ప్రకరణము, చేతినుండి నాలుక వరకు యెట్లు జరుగుచున్నది తెలిసికొనుటకు చేయు ప్రక్రియల యందును యెంతో ఉపయోగపడును.

పైన వివరింపబడిన విధముగా 'కాల్షియం ఇంజక్షను' యే యే పరిస్థితులయందు యెట్లు సంప్రాప్తించునట్టి రుగ్మతలకు లక్షణములకును యెట్లు ఉపయోగపడునో మనము బాగుగా గ్రహింపగలిగితిమి.

పై రుగ్మతలయందు యే రుగ్మతను నివారించుటకు ఇంజక్షన్ ప్రయోగము ఎచట ఎంత యీయవలయునను విషయమును, ఒక్కొక్కటిగా క్రమపద్ధతిగా వివరింప వలయు నన్నచో ఒక గొప్ప గ్రంథమే యగును. యీ కారణముచే గలిగిన గ్రంథవిస్తరణ భీతిచే చదువరులు వారివారి అనుభవ విజ్ఞాన విశేషముతో రోగము ననుస రించి చికిత్సావిధానమున కవసరమైన కాలపరిమితిని పరి స్థితిని యెప్పటికప్పుడు పరీక్షించుకొనుచు అవసరమైన మోతాదులతో చికిత్స జేయవలసి యుండును. గాన సాధా రణముగా యెల్లరిచేతను వాడబడునట్టి "కాల్షియం ఇంజ క్షణ" మోతాదులను గూర్చి యీక్రింద గమనింపుడు.

కాల్షియం ఇంజక్షణాల మోతాదులు.

పెద్దవారికి వాడబడు మోతాదులు:-

రోగముల యొక్క సామాన్యదశయందును దీర్ఘ కాలముగా బాధించునట్టి వ్యాధులయందు "కాల్షియం ఇంజ క్షణ" ప్రయోగింపవలసి వచ్చినచో నూటికి 10 వంతుల బలముతో తయారుచేయబడిన "కాల్షియం" ఔషధద్రవ మును ప్రతిరోజుగాని రెండురోజుల కొక్కపర్యాయము గాని ఇంతకు మించిగాని 5 CCలు మొదలు 10 CC ల వరకు పిరుదుల కండరములందు లోతుగా గ్రుచ్చిగాని రక్తనాళముల యందుగాని, ఇంజక్షన్ చేయుచు రోగపరి

స్థితి అదుపులోనికి వచ్చుటకు గమనించి, కొంతకాలము చికిత్సజేసి రోగ నిర్మూలనము గావించవచ్చును.

రోగముయొక్క తీవ్రపరిస్థితి యందును, నూటికి 20 వంతుల బలముగల "కాల్షియం" ఔషధద్రవమును రోజుకు 10 CC మొదలు 20 CC పరిమాణము వరకు రక్తనాళముద్వారా అతినిదానముగా ఇంజక్షన్ ప్రయోగము చేయవలెను. దీనికి తోడుగా నూటికి 10 వంతుల బలముతో తయారు చేయబడిన "కాల్షియం ద్రవము"ను 10 సిసి ల వరకు లోతుగా పిరుదుల కండరములందు గ్రుచ్చి ఇంజక్షన్ చేయవలసిన పరిస్థితులు సయితము కలవు.

చిన్నవారికి వాడబడు మోతాదులు :—

రోగిముయొక్క సామాన్య దశయందు, దీర్ఘకాలముగా బాధించుచున్నట్టి వ్యాధులకొరకును "కాల్షియం" ఇంజక్షన్ వాడవలసి వచ్చినచో, నూటికి 10 వంతుల బలముతో తయారు చేయబడిన "కాల్షియం" ఔషధ ద్రవమును, పరిస్థితి ననుసరించి 2 సిసి మొదలు 10 సిసిల ద్రవమును ప్రతిరోజుగాని రెండురోజుల కొక్క పర్యాయము గానీ, అవసరము ననుసరించియు, వీలునుబట్టియు రక్తనాళములయందుగాని, లోతుగా పిరుదుల కండరముల యందుగాని ఇంజక్షను ప్రయోగము గావించుచు, రోగము

యొక్క పరిస్థితి ననుసరించి చికిత్స జేయుచు, రోగి కారోగ్యము చేకూర్పవచ్చును.

రోగముయొక్క తీవ్రపరిస్థితులయందును, ముఖ్యాతిముఖ్యమైన అవసర పరిస్థితులయందును, నూటికి 10 వంతుల బలముతో తయారుచేయబడిన 'కాల్షియం' ఔషధ ద్రవము మాత్రము 2 CC లు మొదలు 5 CC ల పరిమాణము వరకు రక్తనాళముల యందును లోతుగా పిరుదుల కండరములయందును, అవసరము ననుసరించి జాగరూకతతో ఇంజక్షను చేయవచ్చును.

N.B. చిన్నవారికి రక్తనాళములయందు పై ఔషధ ద్రవమును ఇంజక్షను యీయవలసి వచ్చినచో, రక్తనాళములు బాగుగా అభివృద్ధిజెంది పైచికిత్సకు తగియున్నవో లేవో బాగుగా పరిశీలించి ఇంజక్షను చేయవలసిన బాధ్యత వైద్యునియందుండును. గాన ఇట్టి విషయమును సవ్యముగా విచారించక త్వరపడి, పై ప్రయోగము గావించుటచే రోగికి కడు ప్రమాదము సంభవించును. ఈ విషయమును వైద్యసోదరులు మరువకుందురుగాక యని హెచ్చరిక చేయుచున్నాను.

ఇందు ముఖ్యముగా నూటికి 20 వంతుల బలముతో తయారు చేయబడు "కాల్షియం" ఇంజక్షను ద్రవమును చిన్నమోతాదుతోగాని, పెద్ద రక్తనాళములందు ఇంజక్షను చేయుటకు మాత్రమే, ఉపయోగింప వలసి

యుండు నను విషయమును వైద్యసోదరులు మరువకుండు దురుగాక.

112. "కాల్షియం విత్ విటామిన్ సి." ఇంజక్షనులు.
శాండోజ్ కంపెనీవారిచే కాల్షియంనందు విటామిన్ చేర్చి తయారు చేయబడినట్టి క్రొత్త ఇంజక్షనులు.

Calcium Shandoz with Vitamin C. Injections.

ఈ గ్రంథమున 'కాల్షియం శాండోజ్' ఇంజక్షనుల యొక్క ప్రయోగ ప్రయోజన గుణవిశేషములను గూర్చి పాఠకులు చదివి గ్రహించియే యున్నారు. అట్టి శక్తివంత మగు కాల్షియం ఇంజక్షన్ ద్రవముతో విటామిన్ సి, ఔషధ ద్రవమును చేర్చి వాడుటవలన కొన్ని వ్యాధులందు యీ మిశ్రమ చికిత్స కడు జయప్రదముగా నుండుటచే కొందరు ఉత్తమ వైద్యులీ విధానముతో వారి బుద్ధి బల మును ఉపయోగించి, సంధిగ్దావస్థలోనున్న కొన్ని వ్యాధు లను బాగుచేయుచుండిరి.

పైపద్ధతితో చేయబడు చికిత్సయందు, విటామిన్ సి ఔషధద్రవము 'కాల్షియం'తోచేర్చిగాని, ప్రత్యేకముగా గాని వీలునుబట్టి చికిత్సాదుల యందు ప్రయోగించుచుండెడివారు.

ఇట్లు వైద్యులీ రెండు ఔషధములను, ఒకచోట చేర్చిగాని, ప్రత్యేకముగా గాని, చికిత్స చేయునప్పుడు

రసాయనిక శాస్త్రీయమైన కొన్ని ఇబ్బందులు వైద్యులకు గాని, రోగికిగాని, కలుగకుండ నుంచుటకై బాగుగా యోచించి, ఇటీవల శాండోజ్ కంపెనీ వారు పై రెండు ఔషధ ద్రవములను ఒక్కచోట చేర్చి, ఇంజక్షన్ చికిత్స కొరకు యెంతో వీలుగా తయారు జేయబడినట్టి ఔషధీ రాజమే ఇట ఉదహరింప బడినట్టి కాల్షియం విత్ విటామిన్ సి, ఇంజక్షన్.

పై ఇంజక్షన్ ద్రవమందు గల కాల్షియం తన సహజమైన గుణాధిక్యతతో, రోగమును కుదుర్చుచు శరీరమున కాల్షియం లోపమును సవరించు కొనుచున్నటులే "విటామిన్ సి," పై ఔషధమునకు తోడుగా యీ క్రింది విధమున, ఉపయోగపడును సాయపడుచుండును.

శరీరమున యేర్పడియుండు యెట్టి జ్వరమైనను, శరీరపోషణకు అవసరమైన "విటామిన్ సి" మొదలగు విటామిన్ కుటుంబములకు హానిచేకూర్చును. ఇట్టి పరిస్థితి యందు రోగికి ఒకవిధమగు శక్తిహీనత యేర్పడి, రోగమును యెదిరించగల కొన్ని శక్తులు శరీరమున నీరసించుటచే, రోగము సులక్షణముగా శరీరమున వృద్ధియగుటకు అవకాశ మేర్పడును. ఇట్టి పరిస్థితియందు 'విటామిన్ సి,' ఔషధమును కావలసిన పరిమాణముతో వైద్యుడు రోగికై ప్రయోగించినప్పుడు, శరీర పోషణమునకు నిత్యావసరమ్ముగా నుండునట్టి 'విటామిన్ సి,' లోపించిన కొరతదీరి

రోగికెంతో మేలు కలుగుటయే గాక, రోగనివారణకై వాడబడునట్టి యితర ఔషధములు సయితము యధేచ్ఛగా శరీరమున పనిచేయుటకు అవకాశము యెంతేని కలుగును.

'విటామిన్ సి,' ఔషధ ప్రయోగమువలన పేగు లందు యేర్పడు కురుపులు రక్తస్రావము, అజీర్ణము, జలుబు, నీరసస్థితి, జ్వరతీవ్రత, అశక్తత, ఆమ్లపిత్తము, శరీరమున సన్నని నరములు చిట్లిపోయి యాప్రదేశమున రక్తస్రావము కలుగుటగాని, రక్తము పేరుకొనిపోయి నీలవర్ణముతో చర్మమునుండి పైకి గనుపించుట మొదలగు అనేక లక్షణ ములను నిర్మూలించును.

"విటామిన్ సి" గర్భవతులకు గలుగు అధికమైన శ్రమ రక్తస్రావము పుపుసమున నీరసము (తాత్కాలిక ముగా యేర్పడునట్టిది) మొదలైన, అనేక పరిస్థితులయందు అద్భుతముగా పనిజేసి రోగికి ఆరోగ్యము కలిగించును.

పైన దెల్పినట్టి ఉత్తమ లక్షణములుగల "విటా మిన్ సి," ఔషధ ద్రవమును కాల్షియం ఔషధద్రవముతో మిశ్రమముగావించి, తయారుజేయబడినప్పు డీ మిశ్రమ ఔషధము వ్యాధులందు యెంత గొప్పగా పనిచేయునో వైద్యసోదరులు ఊహింపవచ్చును. ఇట్టి మిశ్రితఔషధము ముఖ్యముగా యేయే వ్యాధులపయి యెట్లు వాడబడుచున్నదో యీ క్రింద తిలకింపుడు.

"కాల్షియం విత్ విటామిన్ సి."

క్షయాది రోగములందు గలుగు జ్వరాది లక్షణములను నడంచుటకును, అంటుసంబంధమైన కొన్ని వ్యాధులు శరీరమున ప్రవేశించినప్పుడా కారణమువలన శరీరమునకు యేర్పడునట్టి జ్వరముగాని, జ్వరమువంటి యితర లక్షణములుగాని నడంచుటకును.

దగ్గుదమ్ము ఉబ్బసములవంటి వ్యాధులందు కఫమును కళ్ళెను శ్వాసనాళముల నుండి తొలగించుటకును, తగ్గించుటకును, పాషాణాది యితర ధాతు విషములు శరీరమున నిలిచి బాధించునట్టి పరిస్థితుల దొలగించుటకును, రక్తస్రావాది పరిస్థితులయందు అకస్మాత్తుగా కల్గిన నీరసస్థితినిగానీ, శక్తినిమించిన కార్యభారమువల్ల శరీరమున తాత్కాలికముగా యేర్పడిన నీరసస్థితినిగాని, యితర బలహీన లక్షణములుగాని, శరీరమున నిలచి అప్పుడప్పుడుగాని, యెల్లకాలముగాని బాధించునట్టి అనేక లక్షణముల తొలగించుటకును.

అస్థిభంగము (ఎముకలు విరుగుట) ఇట్టి పరిస్థితియందు ఎముకలు కట్టుబడక చాలాకాలము బాధించునట్టి పరిస్థితులయందును ఎముకలు వంగిపోవుట ఎముకలందు పటుత్వము లేకుండుట శరీరమున ఎముకలు వికటముగాను, వంకరగాను పరిణామము జెందుట, (యెదుగుట) దంతములు వక్రిముగను, దోషపూరితముగను వృద్ధి

నొందుట యీ మొదలగు అనేక పరిస్థితులను నిర్మూలము గావించి రోగికి యెంతో మేలు గూర్చి, ఆరోగ్యమును ప్రసాదించును.

ముఖ్యముగా యీ ఔషధము "కాల్షియం" ఇంజక్షన్లు వాడవలసిన అన్ని రోగముల యందును, అవసరము ననుసరించి వాడవచ్చును.

"కాల్షియం" 'విత్ విటామిన్ సి' శాండోజ్ ఇంజక్షన్లు నూటికి 10 వంతులు బలముగల కాల్షియం ద్రవముతో 200 M. G. ల "విటామిన్ సి" ద్రవమును చేర్చి నింపబడిన 5 సిసి ల అంపుల్సును 10 సిసి ల అంపుల్సును సయితము మనకు లభించును.

మోతాదు:-చిన్నవారికి 2 సిసీ లు మొదలు 5 సిసి ల వరకు ప్రతిరోజు ఒకటి లేక రెండు ఇంజక్షన్లు తీవ్రమగు రోగపరిస్థితులయందు వాడవచ్చును.

పెద్దవారికి 5 మొదలు 10 సిసి ప్రతిరోజు వాడవచ్చును.

పయి ఇంజక్షన్ చికిత్స ప్రారంభించిన మొదలు మొత్తము 5 మొదలు 10 ఇంజక్షన్లకు తక్కువలేకుండా చికిత్స జేసినప్పుడే రోగికి మేలుకలిగి, ఆరోగ్యము కలుగుట కవకాశము కలదు.

N. B. పై ఇంజక్షన్లు పిరుదుల కండరములందు లోతుగా గ్రుచ్చి ఇంజక్షన్ యీయవలసి యుండును.

అత్యవసరమైన పరిస్థితులయందు రక్తనాళములందు తగిన వారికి ఇంజక్షన్ యీయవచ్చును గాని, రక్తనాళనునందు చేయబడు ఇంజక్షన్ కనీసము 3 నిమిషములకు తక్కువ గాని వ్యవధితో కడునెమ్మదిగా 10 సిసి ల ఔషధ ద్రవ మును ఇంజక్షన్ చేయవలసి యుండును

## 113. విటామిన్ "ఎ" ఇంజక్షన్.

## Vitamin 'A' Injection.

పై ఔషధ ద్రవము విటామిన్ కుటుంబమున మొదటిదిగా యెంచబడునట్టి విటామిన్ "ఎ" పదార్థమని పాఠకులు గ్రహింపవలయును. ఏకైక విటామిన్ ఇంజక్షన్‌లు సాధారణముగా ఒక్కొక్క కంపెనీ ఒక్కొక్క పేరుతో తయారుజేసి మన కందిచ్చుచున్నది. పయిపేరుతో మాత్రము క్రూక్స్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

శరీర పోషణమునకు నిత్యవసరమైన ఇతర విటా మిన్‌లకు వలెనే, విటామిన్ 'ఎ' సయితము శరీరారోగ్య మునకు గాను, యెంతేని అవసరమను విషయమును వైద్యసోదరులు మరువరాదు.

విటామిన్ "ఎ" శరీరమున అనేక పరిస్థితులయందు తగ్గిపోవుట సహజమే. ఇట్టి పరిస్థితి శరీరమున యేర్పడి నప్పుడు, మానవుని ఆరోగ్యము తప్పక చెడిపోవును.

శరీరమున విటామిన్ 'ఎ' తగ్గిపోవుటవలనగాని, సహజముగా లోపించి యున్నప్పుడుగాని, విటామిన్ 'ఎ' ద్రవమును ఔషధరూపమున ప్రయోగించి విటామిన్ లోపమును దీర్చవలసి యుండునుగదా? ఇందుచే విటామిన్ 'ఎ' శరీరమున లోపించినప్పుడు సర్వసాధారణముగా పొడజూపునట్టి వ్యాధి లక్షణములను, విటామిన్ 'ఎ' ప్రయోగముచే నిర్మూలము గావించుటకు తగిన ఇతర పరిస్థితులను యీ క్రింద తిలకింపుడు.

చీకటి పడినవెంటనే నేత్రదృష్టియందు ఒక విధమగు లోపము యేర్పడి, ఏ వస్తువుగాని సరిగా కనుపించని లోపము కలుగునట్టి "రేచీకటి" వ్యాధి లక్షణములను చక్కపరచుటకును, ఉలవకాయలు (మూత్రపిండములు) పుపుసములు ప్రేగులు (పెద్దవి చిన్నవి) మూత్రకోశ వికారములు గర్భవాతము, శరీరము కృశించుట, కాళ్లు చేతులు ముఖము మొదలగు అంగములందును, శరీరముపై అచ్చటచ్చటను ఒకే సమయమునగాని, క్రమముగాగాని వర్ణము మారిపోవుట, కాలిన చర్మమువలె తయారగుట, చర్మము "గోనె" పట్టావలె బిరుసుగలిగి సన్నని పొక్కులవలె గనుపించుట, కాళ్ళపయినను చేతులపయినను ఆకురాయివలె గలుకుయేర్పడి, అందుగల రోమకూపములు బిఱ్ఱబిగిసిపోవుట వలన రోమములు గుండ్రముగా తిరిగి వుండ గట్టుట, రోమకూపములు శిథిలమగుట, నేత్రములందు

తెల్లగ్రుడ్డుపై కాలిన పొడలవంటివి గనుపించుట ఈ మొద లగు లక్షణములను కడుశీఘ్రకాలములో "విటామిన్ ఎ" ఇంజక్షనులను ప్రయోగించి బాగుచేయవచ్చును.

చిన్నపిల్లలు యెదుగునప్పుడు శరీరపోషణమునకును అస్థిభాగములకును ముఖ్యముగా దంతములకును మంచి శక్తిని ప్రసాదించి ప్రేగులందు జనించు వికారాది రుగ్మత లను కురుపులను సయితము మాన్పును.

గర్భిణీ స్త్రీలయందు గలుగు దౌర్బల్యము శరీర ముపై పొడచూపు చర్మవికారములను, క్షయ శరీరము కంపించుట మొదలగు అనేక దుష్టలక్షణములను చక్క జేయును. విటామిన్ 'ఎ' ఔషధ ద్రవమును సర్వసాధార ణముగా విటామిన్ 'డి' తో చేర్చి వాడుటవలన గాని పై రెండు ఔషధములు ఒకచోట చేర్చి తయారు చేయబడిన, ఇతర ఔషధములను ప్రయోగించి గర్భవతి యొక్క కడుపులోని శిశువు (పిండము)యొక్క శరీరవృద్ధికిని తల్లి యొక్క శరీరపోషణకును నిత్యావసరమైన ఎ. డి. పదార్థ మును లోపించనీయక కాపాడును. స్త్రీ ప్రసవించిన పిదప శిశువుగాని తల్లిగాని యెట్టి బలహీన లక్షణములకు లోను గాకుండా కాపాడవచ్చును.

పుట్టినపిల్లలు మూడు నాలుగు సంవత్సరముల వర కును అంతకు మించిగాని సదా ఏదో ఒక వ్యాధియో

బాధయో కలుగుచు మిక్కిలి సన్నగిలి, అజీర్ణము, కడుపు నొప్పి వకర్లి దంతములు ఎముకలయందు మిక్కిలి బల హీనత కలుగుటకు మూలకారణమైన విటామిన్ 'ఎ' లోప మును దీనితో యేకీభవించగల, యితర విటామిన్ సము దాయమును చేర్చిగాని, చికిత్స జేయుట వలన పైన వివ రింపబడిన సంకట పరిస్థితులు చిత్రముగా నశించి, రోగి ఆరోగ్యముతో నుండుటకు యెంతేని అవకాశమొసంగును.

"విటామిన్ ఎ" ఔషధ ద్రవము 1CCకి 100,000 ఒక లక్ష అంతర్జాతీయ యూనిట్ల బలముతో తయారు జేయబడిన 1 CC అంపుల్సు మనకు లభించును.

పై ఇంజక్షన్ ద్రవ్యమును 1 CC వరకు లోతుగా చర్మముక్రిందగాని, కండరములయందుగాని ఇంజక్షన్ చేయుచు కష్టసాధ్యమైన రుగ్మతలందు వారమునకు ఒకటి లేక రెండు పరియాయములు వాడుచుండవలెను. రోగి యొక్క ఆరోగ్యవృద్ధి ననుసరించి, పై చికిత్స 6 మొదలు 10 వారములవరకు 7 రోజులకొక్క ఇంజక్షన్ చొప్పున ప్రయోగించుచు దీర్ఘకాలము చికిత్స చేయవలసియుండును.

పై చికిత్సా సందర్భమున విటామిన్ 'ఎ' పదార్థము మానవుని శరీరపోషణమునకు నిత్యావసరమైన (iu) అంత ర్జాతీయ యూనిట్ల పరిమాణమును యిట తిలకింపుడు.

యెదుగునట్టి పిల్లల శరీరపోషణమునకై ప్రతిరోజు

1,500 మొదలు 4,500 (iu) అంతర్జాతీయ యూనిట్లు 'విటామిన్ ఎ' పదార్థము అవసరమై యుండును.

పెద్దవారికొరకు 5,000 మొదలు 8,000 (iu) అంతర్జాతీయ యూనిట్లు విటామిన్ "ఎ" పదార్థము అవసరము.

పై విటామిన్ పదార్థము చికిత్సా సమయమున 2,00,000 (iu) అంతర్జాతీయ యూనిట్లవరకు ప్రతిదినము ప్రయోగింప వలసిన పరిస్థితులు యెన్నోనిగలవు.

N. B. కొన్ని సందర్భముల ననుసరించి విటామిన్ "ఎ" పదార్థముతో విటామిన్ 'డి' పదార్థము చేరి యుండునట్టి, యితర ఔషధ ద్రవములు సయితము పరిస్థితిని గుర్తెరిగి వాడుటవలన రోగికి యెంతో మేలు చేకూర్చును.

## 114. విటామిన్ "బి" 12 ఇంజక్షన్.

## Vitamin 'B' 12 Injection.

విటామిన్ కుటుంబమునకు జెందిన పై విటామిన్ ఇంజక్షన్ ద్రవమును, ఒక్కొక్క కంపెనీ ఒక్కొక్క పేరుతో తయారు జేయుచుండును.

ఉదాహరణకు 'అనాకోబిన్' (Anacobin) అను పేరుతో బి.డి.హెచ్.(B.D.H.)కంపెనీవారు "రూబ్రమిన్" (Rubramin) అనుపేరుతో "స్క్విబ్" (Squib) కంపెనీ వారు "మోకాబిన్" అను పేరుతో గాకో కంపెనీవారును

యీ విధముగనే అనేక కంపెనీలు, అనేక పేర్లతో పై విటామిను ద్రవమును ఇంజక్షన్ ప్రయోగములకు తగిన రీతిని తయారుజేసి మన కందించుచున్నారు.

పై విధముగా తయారు చేయబడినట్టి "విటామిన్" ఔషధ ద్రవము 1CC యందు 15 మొదలు 20; 30; 50; 100 మైక్రోగ్రాముల (Micrograms) శక్తి యుండులాగున తయారు చేయబడిన 1CC అంపుల్సు మనకు లభించును.

మానవునికి సంభవించునట్టి వివిధ రోగములవలన రోగికి సహజముగా రక్తము తగ్గిపోయి బలహీనత యేర్పడుట యెల్లరు యెరిగిన విషయమే. ఇట్లు రోగకాలమున తగ్గిపోయిన రక్తమును బలమును, రోగము పూర్తిగా నిమ్మళించిన పిదప క్రమక్రమముగా వృద్ధియగుచు, గోలుపోయిన శక్తిని మరల ప్రసాదించునట్టి శక్తి సహజముగా (ప్రకృతి సిద్ధముగా) దేహమునందు యేర్పడుట ధర్మము.

ఒక్కొక్క పరిస్థితియందు ఒక్కొక్కరికి యేదేని వ్యాధి సంభవించి, పూర్తిగా రోగము నిమ్మళించినను రోగకాలమున కోలుపోయిన రక్తము బలము మరల శరీరమున కనుపించక (వృద్ధికాక) యుండుట మనము యనేకులయందు గాంచుచున్నాము. దీనికై ముఖ్యముగా విచారించినచో శరీరమున మొదట తగ్గిపోయిన రక్తము, శరీరమున సకాలములో సవ్యముగా వృద్ధికాకుండుటయే

యని రోగియొక్క లక్షణములను బట్టి ప్రతి వైద్యుడును గ్రహింపగలడు.

పైన దెల్పినట్టి పరిస్థితిని చక్కపరచుటకు సాధారణముగా "లివర్ యెక్స్ట్రాక్టు" వంటి ఇంజక్షనులు వాడుట ఆచారమే! ఇట్టి "లివర్ యెక్స్ట్రాక్టు" ఇంజక్షనులు పెక్కు ప్రయోగించి నప్పటికిని కానరానట్టి సుగుణము ఒక్క విటామిన్ బి, 12 ఇంజక్షన్ ప్రయోగించి నంతనే గలుగుచున్నది. దీనిని దృష్టాంతరముగా ఒక్క టన్ను తూకము గల "లివర్" మేక మొదలగు జంతువుల యకృత్‌నుండి సంగ్రహింపబడిన రసాయనమునందు, 20 మిలిగ్రాముల విటామిన్ బి, 12 కంటె యధికమైన శక్తిలేదని నిరూపింపబడుచున్నది. దీనినిబట్టి విచారించగా విటామిన్ బి, 12 యొక్క శక్తి యెంతయో మనము గ్రహింప గలుగుచున్నాము.

ఇంతటి శక్తివంతమైన విటామిన్ బి, 12 ఔషధ ద్రవమును యిటీవల "స్ట్రెప్టొమైసిన్" తయారు జేయబడునట్టి నవనీత పదార్థమునుండియే కనిపెట్టి తయారు జేయబడుచున్నదను విషయమును పాఠకులు జ్ఞప్తియుంచు కొనుట అవసరము.

విటామిన్ బి. 12 ఇంజక్షన్ ద్రవమును, "లివర్ యెక్స్ట్రాక్టు" వాడుట, అవసరమైన ప్రతి రోగ లక్షణమునకును వాడవచ్చును. ఇంతియేగాక "లివర్ యెక్

స్ట్రాక్టు" ఇంజక్షన్లు వాడుటవలన శరీరమునకు సరిపడక యితర వికారాది లక్షణములతో బాధపడునట్టి రోగుల కీ విటామిన్ బి. 12 ఇంజక్షన్ చికిత్స యెంతయో సౌఖ్యమును, ఆరోగ్యమును చేకూర్చుననుటలో సందియములేదు.

పాండురోగముయొక్క అనేక దశలందు దీనిని ప్రయోగించుట వలన రోగి శరీరమున కడు శీఘ్రకాలములో రక్తాణువుల వృద్ధిహెచ్చి, వెంటనే ఆరోగ్యమును ప్రసాదించును.

బలహీనురాలుగానున్న స్త్రీ గర్భము ధరించుటవలన మరికొంత బలహీనత అధికమై శరీరమున రక్తము తగ్గిపోయి చూచుటకు పాండురోగివలె గనుపించుచు, దిన దినము అశక్తత అధికమగుచున్నట్టి పరిస్థితియందు ఈ ఇంజక్షన్ 15 మైక్రోగ్రాములు మొదలు 100 మైక్రోగ్రాముల శక్తివరకు చేరియుండునట్టి 1 CC ఔషధ ద్రవమును, లోతుగా చర్మముక్రిందగాని, కండరములయందుగాని, వారమునకు ఒకటి లేక రెండు ఇంజక్షన్లు చేయుచు చికిత్సా కాలపరిమితి 4 మొదలు 5 వారములవరకు సయితము పొడిగించవలసిన పరిస్థితులు యెన్నోని కలవు.

అతిసారము యెండవేడిమి వలనగాని, అజీర్ణ వాతము వలన గాని యేర్పడి బాధించునట్టి పరిస్థితులయందు 1CC ఔషధ ద్రవమునకు 15 మొదలు 100 మైక్రో

గ్రాముల వరకుగాని యింతకు మించిన శక్తిగల ఔషధ ద్రవమునుగాని ఇంజక్షన్ యిచ్చి అవసరము, వయస్సు, రోగలక్షణము, యీ మొదలగు పరిస్థితులను బాగుగా విచారించి, ఒకటి లేక రెండువారములు చికిత్సజేసి, పై పరిస్థితిని చక్కపరచ వచ్చును. పై వ్యాధులందు, ఒక్క ఇంజక్షన్ ప్రయోగించినంతనే కొందరికి స్వస్థత కలుగ వచ్చును. ఇట్టి పరిస్థితియందు రోగిని బాగుగా పరీక్షించి, అవసరమని తోచినచో రెండవ మోతాదు ప్రయోగించ వచ్చును. లేనియెడల మొదటి మోతాదుతో చికిత్స ముగించినట్టి పరిస్థితు లెన్నోని కలవు.

శరీరమున యేర్పడిన రక్తహీనత వలన పేగులందు శక్తి క్షీణించి యేర్పడునట్టి నీళ్ళ విరేచనములు, నాలుకవాపు, నాలుక తెల్లబారిపోవుట, కంటిరెప్పలు విప్పి చూచినప్పుడు మిక్కిలి రక్తహీనత గనుపించుట, శ్వేత ప్రదరము ఋతురక్తాశయ గర్భాశయ వ్యాధులవలన చాలాకాలము బాధపడి, అట్టి లక్షణములు, వ్యాధి కొంత వరకుగాని, పూర్తిగాగాని నిమ్మళించినప్పటికిని శరీరమున రక్తహీనతచే పాలిపోయి గనుపించునట్టి వ్యాధులందును 1CC కి 15 మొదలు 100 మైక్రోగ్రాముల శక్తి వరకుగల ఈ ఔషధ ద్రవమును 1 CC వరకు, లోతుగ చర్మముక్రింద గాని, కండరములందుగాని, వారమునకు ఒకటి లేక రెండు ఇంజక్షన్లు ప్రయోగించుచు, అవసర

మును బట్టి 4 లేక 5 వారముల వరకు చికిత్స జేయవలసి నట్టి పరిస్థితు లెన్నేని కలవు.

ఇంతకు పూర్వము మనకు లభించుచుండెడు విటామిన్ బి, తరగతికి జెందిన బి 1, 2 బి 6 వరకే చేర్పబడు చుండెను గాని ఇప్పుడు బి, 12 సయితము చేర్చి తయారు చేయబడుచుండుటచే పై ఔషధము ద్విగుణీకృతముగా పనిజేయుటకు అవకాశ మేర్పడినది.

N.B. వైద్యసోదరులు విటామిన్ బి, కాంప్లక్స్ ఇంజక్షన్ రూపమున ప్రయోగించుటకు పూర్వ మీ ఔషధము తయారు చేయబడిన కంపెనీచే రక్తనాళములయందు ప్రయోగించుటకుగాని కండరములందు ప్రయోగించుటకు గాని యొసంగబడిన సలహాను (అనుమతిని) ఇంజక్షన్ పెట్టెపై బాగుగా పరిశీలించిన పిదప ఇంజక్షన్ చికిత్సా కార్యక్రమము నడుపవలసి యుండునను విషయమును మరువకుందురు గాక.

## 115. హాడ్రినాల్ ఇంజక్షన్.

## Hydrenol Injection.

పై పేరుతో జి. లుకాటోస్ కంపెనీవారిచే తయారు జేయబడు ఇంజక్షన్‌లు 2 CC లతో నింపబడిన అంపుల్సు మనకు లభించుచున్నవి.

అజీర్ణవాతము, అజీర్ణ విరేచనములు నివారించుటకును అజీర్ణాతిసారమువలన కడుపులోని ప్రేవులందు

సున్నితమైన పొరలకు శ్రమ రాపిడి మొదలైనవి యేర్పడి ఒక విధమగు మచ్చలు మొదలగునట్టి లక్షణములు జనించుట; గుఱ్ఱుమని చప్పుడు చేయుట, వాంతి, నొప్పి (ప్రేగు లందు సంకటము) కొన్నిసమయములందు విరేచనము ద్వారా బంకవంటి జిగట పదార్థము పడుట యిట్టి లక్షణములను నిలుపుటకును.

ఎండవేడిమి వలనగాని, టైఫాయిడ్ మొదలగు (ఆంత్రిక జ్వరాదుల యందును) వ్యాధులకు పూర్వము సంప్రాప్తించునట్టి అతిసార విరేచనములను గర్భశూల అన్నకోశమునందు సంభవించు వికారములును "గ్రహణి" సంగ్రహణి మొదలగు లక్షణములకు పూర్వమును కొన్ని స్థితులయందు పిదపయును, యీ ఇంజక్షన్‌లను ప్రయోగించి రోగిని కాపాడుచు పరిపూర్ణమైన ఆరోగ్యమును ప్రసాదించుటకును.

కొన్ని విధములైన అంటురోగములు సోకుటవలన రోగియందు అతిసారము, కడుపునొప్పి సంకటము మొదలగు అనేక లక్షణములు గలుగుట సహజము. ఇట్టి పరిస్థితులను నివారించుట కొరకును.

పిల్లలకు సంభవించునట్టి ఆకుపచ్చని విరేచనములు, (కిసరు) అజీర్ణ లక్షణములు అంత్రముల యందు కలుగు వికారాది దోషములు బంక నొప్పి మొదలైన సంకటములు నివారించుట కొరకును.

పై ఇంజక్షన్ అంపుల్సు అవసరమైన కొన్ని పరిస్థితులయందు నోటిద్వారా త్రాగించుటకును.

కొన్ని సమయములందు (పరిస్థితి ననుసరించి) లోతుగా చర్మము క్రింద ఇంజక్షన్ చేయుటకును ఉపయోగపడును.

మోతాదు :—

సాధారణమైన రోగ పరిస్థితులయందు వయస్సు బలము మొదలగు అంశముల ననుసరించి పెద్దవారికి ప్రతి రోజుగాని, రోజుమార్చి లేక రోజుగాని యింతకు మించిన వ్యవధితోగాని చర్మముక్రింద లోతుగా 2 CC లు ఇంజక్షను చేయవలసి యుండును.

చిన్నవారికి వయస్సు బలము పరిస్థితి మొదలగు అంశముల ననుసరించి రోజువిడచి రోజు 1 CC మొదలు 2 CCల వరకు పై ఔషధమును చర్మముక్రింద ఇంజక్షన్ చేయుచు రోగిని ప్రతిరోజు పరీక్షించుచు వ్యాధి తగ్గుచున్నటుల సరియగు సాక్ష్యములు గనుపించినప్పుడు చికిత్సను పొడిగించుట ఉచితము.

N.B. రోగకాలమున అజీర్ణమగు పదార్థములుగాని మసాలాద్రవ్యములు కారము నిషావస్తువులవంటి పదార్థములు వాడక, సాధారణముగా జీర్ణమగునట్టి ద్రవపదార్థములనే వాడుట ఉచితము.

## 116. గ్లూకాల్డైన్ ఇంజక్షన్.
## Glucaldin Injection.

పై ఇంజక్షన్ అంపుల్సు గ్లూకోనేట్ లిమిటెడ్ కలకత్తా కంపెనీవారు తయారుజేసి మన కందిచ్చుచున్నారు. ఈ ఇంజక్షన్ వాడుటవలన పసుపురంగు చీముతో బాధించునట్టి అంటువ్యాధులు, గడ్డలు, కురుపులు, గజ్జి, చీడ, దళసరి గల చర్మము క్రింద పుట్టునది పెక్కు కురుపులు శరీరమున బయల్వెడలి బాధించునట్టి వ్యాధి నడంచుటకును సరిఫి చర్మముపై సన్నగా కురుపుల సమూహము బయల్వెడలి బాధించునట్టి వ్యాధులేగాక అనేక వికార వర్ణముల తోను లక్షణములతో సంప్రాప్తించు పెక్కు చర్మరోగములను నివారించుటకును.

వాత సంబంధముగా శరీరమును బాధించునట్టి రుగ్మతలయందు మోకాళ్ళ కలకలు మొండికిబడిన కీళ్ళవాతము పక్షవాతము వీపు నడుము (కటి) మొదలగు వాతవ్యాధుల యందును నరముల పట్లు కీళ్ళ కలకలు మొదలగు లక్షణముల నివారించును.

సాధారణమైన దగ్గు పడిశము రొంప శీతవాత జ్వరము గొంతులో గురక దగ్గు మొదలగు లక్షణములతో సంప్రాప్తించు శ్వాసకోశ సంబంధమైన రుగ్మతలు మొదలగు వ్యాధులేగాక "అయొడైన్" ప్రయోగమువలన ఉపశమించు నట్టి అన్ని వ్యాధుల కొరకును వాడి చికిత్స

జేయుట వలన రోగికి మంచి ఆరోగ్యమును ప్రసాదించ వచ్చును.

"గ్లూకాల్డైన్" ఇంజక్షన్ ద్రవముతో నింపబడిన 2 CC అంపుల్సు మొదలు 5 CC అంపుల్సు వరకును మనకు లభించును.

పై ఔషధ ద్రవమును రోగబలము అవసరము మొదలగు పరిస్థితుల ననుసరించి పెద్దవారికి 2 CC లు మొదలు 5 CCల వరకు లోతుగా కండరముల యందు ఇంజక్షన్ చేయుచు చికిత్స అవసరమైనంత కాలము వారమునకు ఒకటి లేక రెండు పర్యాయములు మాత్రమే ఇంజక్షన్ చేయుట ఉచితము.

చిన్నపిల్లల కొరకు 3 మొదలు నాలుగు సంవత్సరముల వరకు ½CC వరకును 4 మొదలు 7 సంవత్సరముల వరకును అవసరము ననుసరించి 1 CC వరకును 8 మొదలు 22 సంవత్సరముల వరకును 1 CC మొదలు అవసరమును బట్టి ½CC హెచ్చించుచు 2 CC ల వరకును రోగలక్షణముల ననుసరించి రోగిని ప్రతిరోజు పరీక్షించుచు చికిత్స చేయుట అవసరము.

N.B. పై ఔషధము "అయోడైను"తో గ్లూకోస్ సంబంధమైన ద్రవపదార్థము చేర్చియుండుటచే "అయోడైను" యొక్క ఉదృతము అంతగా గనుపించదు. అయి

నను చికిత్సకాలమున వైద్యుడు అప్రమత్తతతో జాగరూకుడై చికిత్స చేయవలసి యుండును.

"గ్లూకాల్డైజ్ ఇంజక్షను" అంపుల్సు వలెనే గుణాధిక్యత గల ఇంజక్షన్ అంపుల్సును "గ్లూకో అయోడైన్" అను పేరుతో యీస్టు ఇండియా ఫార్మాటికల్ కంపెనీ కలకత్తావారిచే మనదేశమున తయారు చేయబడుచున్నవి. పైఔషధము 2 CC లు మొదలు 5 CC ల వరకు నింపబడిన అంపుల్సు సయితము లభించును.

## 117. నొవాల్ జిన్ ఇంజక్షన్.

## Novalgin Injection.

పై ఇంజక్షన్ అంపుల్సు "బెయర్" (Bayer) కంపెనీ జర్మనీవారిచే మొదట తయారు చేయబడెను గాని ప్రస్తుతము మరియొక జర్మనీ కంపెనీ వీటిని తయారు చేయుచున్నది. ఈ ఇంజక్షన్ అంపుల్సును ప్రస్తుతము మనదేశమున, ఇండో ఏజన్సీస్ మద్రాసువారు అన్ని పట్టణములకు సప్లయి చేయుచున్నారు.

"నొవాల్జిన్" ఇంజక్షను యొక్క అవసరము ప్రతి వైద్యుడు తెలిసికొనియుండుటచే తాత్కాలికముగా బాధించు అనేక రోగసంకటములను సులభముగా తొలగించి యెల్లరకు సాయపడుటకు వీలుకలుగును.

మానవుని యొక్క ఆహార విహారములందును, దేశ కాల పరిస్థితుల ననుసరించి వాతావరణమున కలుగు మార్పులవల్లను శరీరమున తాత్కాలికముగా యేదో ఒక విధమగు మార్పు కలుగుచుండును. ఈ విధముగా శరీర తత్వమున పై కారణముల వలన సంభవించు వివిధ లక్షణములందు ముఖ్యముగా మనము గమనించగల లక్షణములను యీ క్రింద గమనింపుడు.

"తలనొప్పి" దగ్గు పడిశము వలనగానీ అమిత మైన వేడి వలనగాని యేదేని ఒక రోగము శరీరమున ప్రవేశించుటచే తత్వమున అకస్మాత్తుగా యేర్పడిన మార్పు అసాధారణ పరిస్థితుల వలనగాని యేర్పడుట సహజము. ఇట్టి పరిస్థితియందు "నొవాల్జిజా" ఇంజక్షనును ప్రియోగించి పై లక్షణమును నివారించుటయేగాక యా లక్షణమునకు పిదప శరీరమున పొడజూప గల అనేక రోగ లక్షణములను సయితము అరికట్టుటకు ఉపయోగపడును.

పై విధముగనే అకస్మాత్తుగా తత్వమున యేర్పడిన మార్పువలన గాని ఆహార విహార దోషముల వలన గాని సంభవించిన కడుపునొప్పి, మేహవాతము కీళ్ళ నొప్పులు శ్లేష్మ వాతము కండరములందు యేర్పడిన వణుకు బాధ వేదన దగ్గుపడిశము, విషజ్వరాది రోగములతో పొడచూపు అసాధారణ లక్షణములందు బాధతో గూడిన అనేక సంకటముల నడంచుటకును.

ఋతుశూల, నరముల వాతము, నరములుగుంజుట, వెన్నెముక నొప్పి, నడుమునొప్పి, మొదలగు లక్షణముల నడంచుటకును.

పుపుసములకు సంబంధించిన అసాధారణమైన పరిస్థితి క్షయాది రోగములయొక్క ప్రారంభదశయందు గనుపించు బాధాది లక్షణములు నివారించుటకును.

కొన్ని అంటువ్యాధులు సోకినప్పుడే యేదో ఒక విధమగు వేదన శరీరమున జనించి ఇట్టి బాధలచే రోగికి యేర్పడిన అస్థిమిత స్థితిని తొలగించి బాధలను వుపశమింప జేయుటకును.

ఆమవాతము కండరముల వణుకు అదరు పోటు యీ మొదలైన బాధల నడంచుటకును "నొవాల్‌జిన్" ఇంజక్షన్ యెంతయో ఉపయోగపడును.

ముఖ్యముగా పయిఇంజక్షన్ చేయగల పనినిగూర్చి క్లుప్తముగా చెప్పవలయునన్న అకస్మాత్తుగా శరీరమున జనించిన అనేక బాధాది లక్షణములను తాత్కాలికముగా అరికట్టుటకు దీనికి మించిన ఔషధము మరియొకటి లెదనియే చెప్పవచ్చును.

మోతాదులు :—

"నొవాల్‌జిన్" ఇంజక్షన్ ద్రావముతో నింపబడిన 2 CC అంపుల్సు మనకు లభించును.

పై ఔషధ ద్రవమును బాధయొక్క ఉద్రుతమును వయస్సు పరిస్థితి ననుసరించి 1CC మొదలు 2CCల వరకు ప్రతిరోజు రెండు మొదలు మూడు ఇంజక్షణాల వరకు చర్మము క్రిందగాని కండరములందుగాని ఇచ్చుచు చికిత్స కాలపరిమితి రెండు మొదలు నాలుగు రోజులలో ముగించుట మంచిది.

బాధ భరింపరానిదై అట్టి బాధచే రోగియందు యేదేని గొప్ప మార్పుగలిగి ప్రమాదము సయితము సంభవించునను భయము యేర్పడినప్పుడును తగిన కారణము యేదేని వైద్యునకు గనుపించినప్పుడును పై ఔషధమును 5 CC పరిమాణము వరకు రోజున కొక్క ఇంజక్షణ యీయవచ్చును. గాని ఇట్టి పరిస్థితియందు రోగియొక్క గుండెబలము శరీర పటుత్వము నాడీగతి ఇట్టి అనేక లక్షణములయొక్క స్థితిగతులను చక్కగా గ్రహించి పిదప పై పరిమాణముగల మోతాదు ప్రయోగింపవలసియుండును.

రక్తనాళ సంబంధమైనట్టియు కండరముల సంబంధమైనట్టియు రుగ్మతలయందును అకస్మాత్తుగా సంభవించెడు ఉద్రేక పూరితములైన కొన్ని జ్వరాదులు ఉద్రుతము నరికట్టి రోగము నవరోధించుటకు 0.5 CC ఔషధ ద్రవముతో చికిత్సను ప్రారంభించి ఒక్కరోజునకు ఒకటి లేక రెండు ఇంజక్షణాలను మించనీయక రక్తనాళములందు ఇంజక్షణ

ప్రయోగము గావించుచు పై మోతాదును 1 CC మొదలు 2 CC వరకు హెచ్చించి రెండు మూడు రోజులలో చికిత్సను ముగించుట ఉచితము.

పై విధముగా రక్తనాళమునందు జేయబడిన ఇంజక్షన్ కొంత నిదానముగను జాగరూకతతోను చేయవలసి యుండును.

N.B. "నొవాల్‌జిన్" ఇంజక్షన్ చికిత్స అప్పటి కప్పుడు తాత్కాలికముగా సంభవించిన బాధాది అవస్థల తొలగించుటకు వుపయోగపడును గాని పాతరోగముల కొరకుగాని దీర్ఘకాల చికిత్స కొరకుగాని దీనిని ప్రయోగించిన ప్రయోజనము గనుపించక పోవుటయేగాక పెద్ద మోతాదుతో దీర్ఘకాల చికిత్స జేసినయెడల ప్రమాదము సయితము కలుగవచ్చును.

భరింపరాని బాధతో ప్రారంభించిన కొన్ని రోగములను, లక్షణములను "నొవాల్‌జిన్" ఇంజక్షన్ ప్రయోగముచే అరికట్టి, బాధను కొంత శాంతింపజేసి రోగిని బాగుగా పరీక్షించి రోగకారణమును చక్కగా గుర్తెరిగి ఆ యా రోగపరిస్థితులకు అనువైన ఇతర ఔషధ చికిత్స జేసికొనుటకు పై ఇంజక్షన్ యెంతో ఉపయోగపడగలదు.

తాత్కాలి కోద్రేకముతో సంభవించెడు అనేక రుగ్మతలను అరికట్టగల "నొవాల్‌జిన్" ఇంజక్షన్ ప్రతి

వైద్యుడును వద్ద నుంచుకొనుటచే అనేక పరిస్థితులయందు చేదోడుగా ఉపయోగించుకొన వీలు కలుగుచున్నది.

## 118. లాకార్‌నాల్ ఇంజక్షన్.
## Lacarnol Injection.

హాకెస్టు జర్మనీ కంపెనీవారిచే తయారు చేయబడు "లాకార్‌నాల్" ఇంజక్షనులు మనదేశమున "ఇండో ఏజన్సీస్" లిమిటెడ్ మదరాసు కంపెనీవారు అన్ని పట్టణములకు సప్లయి చేయుచున్నారు.

పై ఔషధ ద్రవముతో నింపబడిన 1 CC అంపుల్సులు మనకు లభించుచున్నవి. ఇట్టి వాటి ప్రయోగము వలన యీ క్రింద వివరింపబడిన రోగముల సులభముగా నిర్మూలము గావించవచ్చును.

రొమ్మునొప్పి అకస్మాత్తుగా సంభవించి రోగి భరింపరాని బాధతో శ్రమపడుట, ఇట్టి పరిస్థితియందు రోగి ఒక్కొక్క సమయమున తెలివితప్పుట యిట్టి అనేక లక్షణములతో ప్రారంభించు భయంకరమగు వ్యాధి.

ఈ వ్యాధికి మూలకారణము విచారించగా హృదయ నాళములందు ముఖ్యమైన ఒక గొట్టములో రక్తము పేరుకొనుటగాని లేక యిట్టి రక్తనాళమునందు వాపులేక అసాధారణ పరిస్థితి యేర్పడుట ఇట్టి సమయమున వైద్యుడు గుండెను పరీక్షించినప్పుడు రోగియొక్క గుండెయందు

వక్రిగతి, ఒకదెబ్బ విడిచికొట్టుట మొదలగు అనేక లక్ష ణములు రోగపరీక్షలో అనుభవము గలవారికి వెంటనే గానుపించును.

పై రోగమునందు హృదయములో చేరియుండు పెద్ద రక్తనాళమునందు యేర్పడిన అసాధారణ పరిస్థితిచే హృదయమునందు చేరిన రక్తము పై నాళమునుండి శరీ రాంగములకు వెడలలేక పోవుటగాని అట్టి నాళములనుండి హృదయమునకు చేరబడు రక్తముపై అవరోధములవల్ల కదలలేక హృదయమున నిండిపోవుట, లేక పేరుకొని పోవుట యిట్టి లక్షణములతో సంభవించు "అంజైనీ పెక్టో రీస్" వంటి వ్యాధియందు గనుపించు పై లక్షణములను వ్యాధిని నిర్మూలించుట కొరకును.

పై విధముగనే శరీరములో ముఖ్యమైన పెద్దరక్త నాళమునందు రక్తము పేరుకొనుట రక్తము సవ్యముగా స్రవించి శరీర కార్యక్రమమున హృదయముయొక్క కారణములతో జనించు గుండెనొప్పి శూల వాపు మెదడు నందును మూత్రపిండములందు జనించు వికార లక్షణ ములు యీ లక్షణముల ఉద్ధృతము వలన హృదయము యొక్క నడకలోని మార్పులు నివారించి రోగిని రక్షించు టకును.

వార్ధక్యమున హృదయమునందు దౌర్బల్య మేర్పడి ఇట్టి కారణమున యేర్పడు గుండెయొక్క నీరసస్థితి, యీ కారణమువలన కొన్ని నరముల యందును కండరము లందును యేర్పడునట్టి బాధలు కండరములయొక్క వణుకు శరీరమునకు కావలసిన రక్తమును పరిశుద్ధి గావించి తగిన విధముగా తన కార్యక్రమము నడపలేక చెడియున్న గుండెయొక్క దౌర్బల్యముచే శరీర చర్మమున యేర్పడు దురద యెండుగజ్జి మొదలగు అనేక లక్షణములను నివా రించుటకును పై కారణములవలన యేర్పడు కీళ్ళవాతము బాధ హృదయశూల వెన్నుశూల మొదలగు అనేక రోగ లక్షణములను నిర్మూలించుటకును హృదయమునకు మేలు జేసి నాడీగతిని చక్కపరచుటకును "లాకార్నాల్" ఇంజక్షణ పరిస్థితిని గమనించి ప్రయోగించి నప్పుడు అద్భుత ముగా పనిచేయును.

మోతాదు :—

పెద్దవారికి రోగబలము అవసరము, పరిస్థితి రోగి యొక్క వయస్సు యీ మొదలగు లక్షణములను బాగుగా విచారించి "లాకార్నాల్" ఇంజక్షణ ద్రవమును 1 CC వరకు చర్మము క్రిందగాని కండరములందు రోజునకు ఒకటి లేక రెండు పర్యాయములు ప్రయోగించుచు రోగి యొక్క గుండెనడక నాడీగతి మొదలగు లక్షణములను

సరిచూచుకొనుచు కొలది కాలములో చికిత్స పూర్తిచేయ వలసి యుండును.

హృదయమున రక్తము పేరుకొని పోవుట హృదయము రక్తముతో నిండి బాధ జనించునట్టి "అంజైనా పెక్టొరీస్" వంటి వ్యాధియందు ½ CC మొదలు 1 CC వరకు పై ఔషధమును రక్తనాళమునందు జాగ్రతగా ప్రయోగించి అనుదినము కండరములందు ప్రయోగించు మోతాదులు సహా యథాప్రకారముగా అవసరమును బట్టి వాడవలసిన పరిస్థితులు సయితము గలవు. కండరముల వాతము మొదలగు రోగములవల్ల కండరములందు యేర్పడిన నొప్పి మొదలగునట్టివి తొలగించుటకు బాధగలచోట లోతుగా కండరములందు 1 CC మొదలు 2 CC వరకు ఇంజక్షను చేయుచు అట్టిబాధలను తొలగింపవచ్చును.

N.B. లాకార్నాల్ ఇంజక్షను ప్రయోగమునకు పూర్వము వైద్యుడు రోగియొక్క హృదయగతిని పరిస్థితిని చక్కగా పరీక్షించి రోగలక్షణములను రోగమును గుర్తెరిగి పై ఔషధ ప్రయోగము గావించుటవలన తప్పక ఆరోగ్యము గలుగుటకు అవకాశము గలదు గాని వ్యాధిని గుర్తెరుగక ప్రయోగించిన ఔషధము నిరుపయోగ మగుటయేగాక మీదుమిక్కిలి ప్రమాద హేతువగునను విషయమును మరువరాదు.

## 119. ఓమ్నాడైన్ ఇంజక్షన్.

## Omnadin Injection.

హాకెస్టు జర్మనీ కంపెనీ వారిచే తయారుచేయబడు "ఓమ్నాడైన్" ఇంజక్షన్‌లు మనదేశమున ఇండో ఏజన్సీస్ లిమిటెడ్ మదరాసు కంపెనీ వారిచే అన్ని పట్టణములకును సప్లయి చేయబడుచున్నవి.

"ఓమ్నాడైన్" ఔషధ ద్రవముతో నింపబడిన 2 CC అంపుల్సు మనకు లభించును. ఈ ఔషధము ఒక రోగ చికిత్సకొరకు ప్రత్యేకముగా తయారు జేయబడక కొన్ని విధములైన వ్యాధులను నిరోధించుటకు వీలుగా సృష్టింప బడినది.

పై ఔషధము ప్రయోగించుటచే శరీరమున ప్రకృతి సిద్ధముగా యేర్పడియుండు వ్యాధులను నిరోధించుటకు తగిన శక్తిని శరీరమునకు ప్రసాదించగల కొన్ని కణుతుల (గ్రంథుల) యొక్క శక్తి క్షీణించిన సమయమున వాటికి ఉత్తేజము గలిగించి క్రొత్తగా శరీరమున ప్రవేశించి వ్యాధియొక్క క్రిమిదోషములను నశింపజేయును.

పై ఔషధ ప్రయోగమువలన శరీరమునకు సోకిన అనేక విధములైన జ్వరాదులను అరికట్టుటకై వ్యాధినిరోధన శక్తిని గల్గియున్న కొన్ని గ్రంథులయొక్క శక్తిని అభివృద్ధి పరచి పై జ్వరాదుల తీవ్రత నడంచి శరీరమున కారోగ్యము ప్రసాదింపవచ్చును.

పై విధముగా నిరోధించగల జ్వరాదులందు దగ్గు పడిశము (రొంప) తలనొప్పి ముక్కువెంట నీరుకారుట కొంచెము చలి శరీరమంతయు నొప్పులు జ్వరము మొదలగు లక్షణములతో సంప్రాప్తించు "ఇన్ఫ్లూయన్జా" జ్వరము, దీనిని సంస్కృతమున "దుష్టప్రతిశ్యాయ" మని వ్యవహరించునట్టి వ్యాధికొరకు,

పై వ్యాధి జలుబు శీతముయొక్క కారణముగా సంభవించు క్రిమిజన్య రోగముగా నెరుంగవలెను. పడిశము తీవ్రముగా కలిగి అకస్మాత్తుగా మిక్కిలి బలహీనత గలిగించి జ్వరముతో రోగిని నిరుత్సాహ పరచి బాధించును.

పై వ్యాధి 4 దినములు మొదలు 11 దినముల వరకు శరీరమున నిలువవచ్చును. ఇంతియేగాక ఇది క్రమముగా "నిమోనియా" పుపుసముల వికారము వాపు మొదలగు అనేక విధములైన రోగాది లక్షణములతో రోగిని బాధింపవచ్చును.

పై వ్యాధి సోకినవెంటనే శరీరమున వ్యాధి నిరోధక శక్తిని అభివృద్ధిచేయు గ్రంధులయందు గల శక్తి వ్యాధియొక్క తీవ్రత ననుసరించి క్రమముగా తగ్గిపోవుట సహజము. ఇట్టి పరిస్థితియందు గ్రంధులకు త్తేజము కలిగించుటకై "ఓమ్నాడైన్" ఔషధమును యీ క్రింద దెల్పిన మోతాదులతో ప్రయోగించ వలసి యుండును.

"ఓమ్నాడైన్" ఔషధద్రవమును రోగబలము రోగియొక్క బలము వయస్సు అవసరము యీ మొదలగు విషయములను చక్కగా పరిశీలించి 2 CC ల వరకు చర్మము క్రిందగాని కండరముల యందుగాని రోజునకు ఒకటి లేక అత్యవసర పరిస్థితులయందు ఇంజక్షనులు చేయుచు ఔషధము వ్యాధిని అవరోధింప గలిగినచో 4 లేక 5 రోజులలో చికిత్స పూర్తిచేయుట ధర్మము.

పై ఇంజక్షను ఒకటి రెండు రోజులు ప్రయోగించినను వ్యాధియొక్క ఉధృతము తగ్గనియెడల అట్టి వ్యాధి కొరకు వేరేచికిత్సను ప్రారంభించుట ఉచితము.

## 120. గ్యాస్ట్రీడైన్ ఇంజక్షన్.

## Gastridine Injection.

స్పెసిఫిక్ ఫార్మాటికల్ కంపెనీ అమెరికా వారిచే తయారు జేయబడునట్టి గ్యాస్ట్రీడైన్ ఇంజక్షను ఔషధముతో నింపబడిన 5 CC ల అంపుల్సులు మనకు లభించుచున్నవి.

పై ఔషధ ప్రయోగమువలన భోజనానంతరము కపుడులో జనించు నొప్పి బాధ పులితేన్పులు, కడుపులో కురుపు మొదలగు కారణముల వల్ల గర్భమున జనించు అనేకవిధములైన బాధాది వికారముల నడంచుటకును,

కడుపులో ఆహారము అరుగనట్టి కారణమున ఆహారము పులిసి వాయువు వృద్ధిజెంది బాధించునట్టి "గ్యాస్ట్రబుల్స్"వంటి వ్యాధులను నివారించుటకును.

భోజనానంతరము కడుపులో నొప్పి ప్రారంభించి కొంతసేపు బాధించి తిన్న ఆహారము జీర్ణము కాకుండగనే వాంతి గావించుట కొరకును.

కడుపులోని ప్రేగులందు సన్నని పొరలు పికిలి స్రవించెడు రక్తస్రావము నడంచుటకును, ప్రేగులందు యేదేని వ్యాధులు సంభవించిన పిదప క్రమముగా అట్టి వ్యాధి పూర్తిగా నిర్మూలించినను ప్రేగులయందు యేర్పడిన బలహీన లక్షణములయందు గాని యేర్పడునట్టి రోగాది లక్షణముల నడంచి జీర్ణశక్తిని అభివృద్ధిపరచి రోగికి ఆరోగ్యము ప్రసాదించుటకును "గ్యాస్ట్రిడైజ" ఇంజక్షను బాగుగా ఉపయోగపడును.

మోతాదు :—

పై ఔషధ ద్రవమును వ్యాధియొక్క ప్రారంభ దశలో రోగబలము అవసరము వయస్సు మొదలగు అంశములను విచారించి 5 CCల వరకు లోతుగా కండరములయందు ఇంజక్షన్ చేయవచ్చును.

పై ఇంజక్షనులు వ్యాధియొక్క తీవ్రత ననుసరించి వారమునకు రెండు పర్యాయములుగాని ఇంతకు మించి

గాని వాడుచు రోగియొక్క ఆరోగ్యాభివృద్ధిని జాగరూక
తతో పరిశీలించుచు చికిత్స పొడిగించుట ఉత్తమము.

## 121. రోమినాల్ ఇంజక్షన్.

## Reuminol Injection.

పై పేరుతో ఈస్టుఇండియా ఫార్మాటికల్ వర్క్సు కలకత్తా కంపెనీవారు తయారుచేసి అందించుచున్నారు.

"రోమినాల్" ఇంజక్షన్ ప్రయోగించి వాతప్రకోపము వలనగానీ శరీరమున వాతము క్రమముగా అధికమగుటవలనగాని శరీరమున యేర్పడు వాతపునొప్పులు, సంధివాతము కండరములందు పై కారణమువలన యేర్పడు పట్లు నొప్పులు పెద్దనరములందు నొప్పి బాధ లేక పట్లు మొదలగు అవస్థతో సంప్రాప్తించు వాతరోగము, కీళ్ళ వాతము కటివాతము వెన్నెముకకు యిరుప్రక్కలయుండు కండరముల యందు జనించు వాతరోగము యీ మొదలగు అనేక వాత లక్షణములను వెంటనే నివారించవచ్చును.

రోమినాల్ ఔషధ ద్రవముతో నింపబడిన 5 CC అంపుల్సు మనకు లభించును.

పై ఔషధము వ్యాధియొక్క సామాన్య స్థితియందు 5 CC ల వరకు లోతుగా కండరములందు ఇంజక్షన్ చేయుచు చికిత్స పూర్తి యగువరకు వారమునకు ఒకటి

లేక రెండు పర్యాయములు ఇంజక్షన్‌లు యీయవచ్చును. రోగముయొక్క తీవ్రమైన పరిస్థితియందు రోగియొక్క వయస్సు పరిస్థితి ననుసరించి వారములో మరియొకసారి కూడా ఇంజక్షన్ ప్రయోగించుచు రోగియొక్క పరిస్థితి కడు జాగరూకతతో పరిశీలించుచుండవలెను.

పై ఔషధము అవసరములేని పరిస్థితియందు అనవసరముగా యెక్కువ మోతాదులు ఒకేవారములో ప్రయోగించుటవలన కొన్ని సమయములందు రోగికి ప్రమాదము సయితము కలుగవచ్చును.

N.B. పై ఔషధచికిత్స ప్రారంభించుటకు పూర్వము రోగికి యేర్పడిన బాధాది సంకటములు వాతసంబంధమైనవని రోగపరీక్షవలన నిర్ణయించిన వెనుకనే పై చికిత్స ప్రారంభింపవలయునేగాని మేహ సంబంధమైన నొప్పుల కొరకు పై ఇంజక్షన్ ప్రయోగించిన నిరుపయోగమనియు మీదుమిక్కిలి ప్రమాద హేతువనియు పాఠకులు గుర్తెరుంగవలెను.

## 122. కొరామిన్ ఇంజక్షన్.

## Coramine Injection.

పై ఇంజక్షన్‌లను "సిబా" కంపెనీవారు తయారు జేసి మనకందిచ్చుచున్నారు.

శరీరమున యేర్పడినట్టి జ్వరాది అనేక రోగములందు ముఖ్యమైన రక్తనాళములు పై రోగకారణమువలన

అస్థిమితమై దుర్బలమైన వక్రప్రవర్తన (ఒకపని చేయుటకు బదులు మరియొక పనిచేయుట) మందగమనము అనగా రక్తనాళములో ప్రసరించు రక్తము, రక్తముయొక్క గమనము మందగించుట.

పై కారణములవలన హృదయ తాడనము (గుండె కొట్టుకొనుట) యందు క్షీణగతి యేర్పడి యీ కారణము వలన శరీరాంగములందు చైతన్యము క్రమముగా తగ్గి రోగి మరణావస్థకు వచ్చుట, ఇట్టి అనేక పరిస్థితులనుండి తప్పించుకొనుటకును.

రోగాది సంకటములవలన కృశించిన హృదయ శక్తి రక్తనాళములయందు యేర్పడిన బలహీనత యీ మొదలగు అవస్థలతోపాటు పుపుసములయొక్క గతి నడక శక్తి స్వభావము సయితము క్షీణించిన స్థితినుండి తప్పించుటకును, రోగకాలమున రోగియొక్క అస్థిమితస్థితిని తొలగించుట కొరకును, నిద్రపట్టుటకును వాడబడి యున్నట్టి "మార్ఫిన్" మొదలగు ఔషధ ప్రయోగములవలన శరీరమున యేర్పడినట్టి ఔషధ దోషమును తొలగించుటకును.

ఊపిరిగొట్టములందు అతి సన్నితమైన నాళములందును శ్లేష్మము చిక్కబడి స్తంభించియున్నట్టి పరిస్థితుల యందు శ్లేష్మాదులను ఇంచుక ద్రవింపజేసి వాటిని వెడలగొట్టుటకును ఇట్టివి రోగము అమితమైన తీవ్రదశకు వచ్చి సర్వాంగములందు క్షీణగతి యేర్పడి రోగి ప్రమాదావస్థ

నొంది యున్నట్టి పరిస్థితులు గల్గినప్పుడు గమనించి పై ఔషధము ప్రయోగించవచ్చును.

ముఖ్యముగా పై ఔషధమును ఇంజక్షన్ రూపమున ప్రయోగించి రోగికి రోగతీవ్రతచే సంభవించిన హృదయ దౌర్బల్యము నీరసస్థితి క్షీణగతి మొదలగు అనేక ప్రమాదలక్షణములను తొలగించి హృదయమునకు రక్తనాళములకును, నాడికిని ఉత్తేజము కలిగించుటకు "కొరామిన్" ఇంజక్షన్ అద్భుతముగా పనిచేయును. గాని ప్రతి వైద్యునకును యెల్లవేళలయందు వెంట నుంచుకొనుటకు తగిన పై ఇంజక్షన్‌యొక్క మోతాదుల నిట గమనింపుడు.

రక్తమునందు యేర్పడిన అసాధారణస్థితియందును రక్తముయొక్క స్థితి బాగుగా చెడి సరియైన ప్రసరణశక్తి నశించినట్టి పరిస్థితియందును, ఇతర రుగ్మతలయందును ఇతర లక్షణములందును కొరామిన్ ఇంజక్షన్ రోగస్థితి లక్షణము మొదలైన అనేక పరిస్థితులు గమనించి వివిధ విధములైనట్టి మోతాదులు అనుభవముతో ప్రయోగింప వలసియుండును గాన వాటి వివరముల నిట తిలకింపుడు.

కొరామిన్ ఔషధద్రవము 1.7 CC తో నింపబడిన అంపుల్సును 5.5 CC తో నింపబడిన అంపుల్సును పెద్దమోతాదులు వాడుటకు తగినట్లు తయారు చేయబడుచుండును.

పై ఔషధ ద్రవమును రక్తనాళముల యందు రక్తము సరియైన గతిలో నడచుటకు వీలులేక పరిస్థితి చెడియున్నట్టి స్థితిని తొలగించుటకు 2½ CC ల కొరామిన్ ఔషధముతో 1 CC డిజిఫోలిన్, (Digifolin) కలిపి (డిజిఫోలిన్ సయితము సిబా కంపెనీవారిచే తయారు చేయబడునట్టి అంపుల్సు) ఒకే సిరంజితో ఒకే మోతాదుగా చర్మము క్రింద లోతుగా ఇంజక్షను చేయవలసి యుండును.

నిమోనియా రోగమందు పుపుసములకు యేర్పడిన అసాధారణ పరిస్థితిని తొలగించుటకు అవసరము రోగతీవ్రత, రోగియొక్క వయస్సు యీమొదలగు విషయములను బాగుగా పరిశీలించి 1 CC వరకు కొరామిన్ ప్రతి నాలుగు గంటల కొక్కసారి చర్మముక్రిందగాని లోతుగా కండరములయందు గాని ఇంజక్షను యీయవచ్చును.

సాధారణమైన పరిస్థితిలో సంప్రాప్తమైన జ్వరము నిమోనియా కేవలము పుపుసములను చెరచినట్టిది. ఇట్టి వ్యాధియందు కలుగు పరిస్థితులు క్రమముగా వృద్ధి యగునట్టి యవస్థ గనుపించునట్టి పరిస్థితులయందును ప్రతిరోజు 2 CC లు మొదలు 3 CC ల వరకు చర్మము క్రిందగాని కండరములయందుగాని ప్రయోగించుచు కొరామిన్ బిళ్ళల రూపమున లభించునట్టివాటిని నోటిద్వారా ప్రతిరోజు రెండు బిళ్ళలు సయితము రెండుసార్లు మ్రింగించవచ్చును.

అంటుసంబంధమైన అనేక వ్యాధులయందు శరీరమున ప్రసరించు రక్తమునందు కలిగిన అవరోధము దుస్థితి మొదలగు అనేక ప్రమాదములను తొలగించుటకు 5 CCల వరకు రక్తనాళమునందు ఇంజక్షను యిచ్చుచు రోగియొక్క పరిస్థితిని గమనించుచుండుట ఉచితము.

రోగి స్పృహతప్పియున్న అనేక రోగలక్షణములయందు 8 CCలు మొదలు 10 CCల వరకు ఒకేసారి లేక విభాగించి రక్తనాళమునందు కండరములయందు సయితము వాడవలసిన పరిస్థితు లెన్నోని కలవు.

శస్త్రచికిత్సలకు పిదప యేర్పడునట్టి హృదయ దౌర్బల్యము క్షీణగతి మొదలగు ప్రమాదకరమైన పరిస్థితులయందు అవసరమును బట్టి మోతాదులను వాడవచ్చును. గాని 5 సిసిల పై ఔషధమును లోతుగా కండరములందు ఇంజక్షను ఇచ్చి మరల 2 సిసిల ఔషధమును శస్త్రచికిత్స చేయబడిన వెంటనే చర్మముక్రింద ఇంజక్షను యిచ్చి రోగియందు కలుగబోవు క్షీణగతి ప్రమాదాది అనేక ఆవస్థలను తప్పించవచ్చును. అవసరమునుబట్టి కొన్ని పరిస్థితులయందు ఒకటి లేక రెండు కొరామిన్ బిళ్ళలను మ్రింగించవచ్చును.

"కొరామిన్" ఇంజక్షను ప్రయోగముయొక్క అవసరమెరిగి రోగమునకును పరిస్థితికిని తగినట్లు మోతాదుల నిర్ణయించి చేయబడు చికిత్సవలన మృత్యుముఖమున చిక్కి

యున్న రోగియొక్క ప్రాణమును రక్షించుటకు వీలు కల దని గట్టిగా చెప్పవచ్చును.

✓ 123. కొరామిన్ అడినోసైన్ ఇంజక్షన్.

Coramin Adenosine Injection.

మూడు విధములైన ఔషధ ద్రవ్యములను చేర్చి పై పేరుతో 'సిబా' కంపెనీవారు ఇంజక్షను అంపుల్సు నకు అందించుచున్నారు.

పై ఔషధ ద్రవముతో నింపబడిన 1 సిసి అంపుల్సులు మనకు లభించుచున్నవి.

కొరామిన్ ఔషధ ద్రవముతో ప్యాలడైన్ -బి- కార్బాలిక్ యాసిడ్ డైథయిలామైడ్ థయోఫైల్లిన్ అడినోసైన్ ఔషధ ద్రవ్యములు సూక్ష్మముగాను క్రమ ప్రకారముగాను చేర్చి తయారు చేయబడి యుండుటచే హృదయ నాళములయందు పేరుకొనిపోవు రక్తమునుగాని, అచ్చట గడ్డకట్టి తిరిగి ద్రవింపలేని రక్తమునుగాని, హృదయ నాళములు సంకోచావస్థనుజెంది, రోగియొక్క స్థితి క్లిష్టముగా యున్నప్పుడు, హృదయ నాళములను, వ్యాప్తి జెందించి (ఉబ్బించి) రక్తప్రసరణము చక్కగా జరిగి హృదయమునకును, హృదయ నాళములకును, స్వేచ్ఛ యొసంగి రోగి కారోగ్యము గల్పించుటకును.

హృదయమునకును, హృదయ నాళములకును, ఇతర రోగములవలన సంప్రాప్తించిన దుస్థితియందు

హృదయాది నాళములయందు, రక్తము యధావిధిగా ప్రవహించునట్టి స్థితిని గల్పించి, హృదయశక్తిగాని, హృదయ నాళముల శక్తిగాని, వెంటనే క్షీణదశకు రానీయక దీర్ఘ కాలము ఔషధగుణముతో గుండె సవ్యముగా పని చేయు చున్నట్లు రుజువుచేయగల యెక్స్‌రే సాక్ష్యములు సయితము కలవు.

ముఖ్యముగా పై ఔషధప్రయోగమువలన హృదయ నాళములయొక్కయు, హృదయము యొక్కయు గతిని గాని, స్థితినిగాని హెచ్చుచేయక మిక్కిలి తగ్గించక, సవ్యముగా రక్తము హృదయమునకు కావలసిన యొత్తిడిలో ప్రసరించునట్లు చేయు పై ఔషధము యొక్క శక్తి అద్భుతము.

పై మిశ్రమ ఔషధమున గల కొరామిన్ ఔషధ ద్రవ్యము హృదయమునకు త్తేజము కలిగించి, రక్తప్రసరణము యథేచ్ఛగా హెచ్చించుచున్న శక్తిని ఇందుగల "అడినోసిన్" అను ఔషధ ద్రవ్యముయొక్క స్వభావ శక్తి, రక్తముయొక్క వేగమును, పోటును, క్రమక్రమముగా తగ్గించుటవలన, ఒక ఔషధము యొక్క తీవ్ర శక్తిచే హెచ్చుచున్న కార్యక్రమమును, వేగమును, మరి యొక ఔషధశక్తి క్రమక్రమముగా తగ్గించుచుండుటచే, హృదయముయొక్కయు, హృదయనాళములయొక్కయు కార్యక్రమము ధర్మము మితిమీరిపోక క్షీణించక యుం

చుటవలన హృదయమున కవసరమైన రక్తము సవ్యము గను స్థిమితముగను రక్తనాళములయందు ప్రవహించుచు తన కార్యమును హృదయము యొక్కయు, నాళముల యొక్కయు గతిని చక్కపరచి రోగి కారోగ్యమును వెంటనే ప్రసాదించును.

మోతాదు:—

హృదయము కావలసిన వేగముతో పనిచేయుటకు వీలు కలుగనీయక, ఆటంకపరచునట్టి హృదయనాళ సంబంధమైనట్టి రోగముల యందును, "కొరామిన్ ఆడినోపైన్" 1 CC వరకు చర్మముక్రిందగాని, కండరముల యందుగాని, ప్రతిరోజు అవసరము, పరిస్థితి ననుసరించి, రెండు మొదలు మూడు పరియాయములు ఇంజక్షన్ ఇచ్చుచు, రోగియొక్క పరిస్థితిని గమనించుచు చికిత్స జేయుట యెంతేని అవసరము.

అకస్మాత్తుగా హృదయమునందు సంభవించిన బాధ, వేదన, దుస్థితి, స్పృహతప్పుట, ఇట్టి అనేక లక్షణములతో సంప్రాప్తించు హృద్రోగముల నడంచుటకును, ప్రమాదస్థితినుండి రక్షించుటకును, పై ఔషధ ద్రవ్యమును రోగపరిస్థితి, రోగియొక్క పరిస్థితి మొదలగు విషయములను గమనించి 1 CC వరకు రోజు రెండు లేక మూడు పర్యాయములు నెమ్మదిగా రక్తనాళములయందు ఇంజక్షన్ చేయుచు రోగియొక్క పరిస్థితిని గమనించుచు చికిత్స

జేయుట అవసరము.

హృదయమునకు సంభవించినట్టి, అంటువ్యాధుల వలనగాని, హృదయ నాళములకు వ్యాపించినట్టి ఉబ్బస రోగముయొక్క సంకటలక్షణములవల్ల యేర్పడిన దుస్థితి తొలగించుటకును, ప్రతిరోజు అవసరము ననుసరించి 1 CC ఔషధ ద్రవమును, ఒకటి లేక రెండు పర్యాయములు చర్మముక్రిందగాని, కండరముల యందుగాని, పరిస్థితినిబట్టి రక్తనాళము నందుగాని ఇంజక్షన్ చేయుచు రోగియొక్క స్థితి చక్కగా గమనించుచు చికిత్సజేయుట అవసరము.

పై విధముగనే "కొరామిన్ అడినొసైన్" ఇంజక్షన్ ఔషధమును వ్యాధియొక్క పరిస్థితిని, అవసరమును గమనించి, చర్మముక్రింద గాని, కండరములయందు గాని, రక్తనాళములయందు గాని ప్రయోగించి హృదయసంబంధమైనట్టియు, హృదయ నాళములకు సంబంధించినట్టియు, అనేక వ్యాధుల నిర్మూలింపవచ్చును.

124. కొరామిన్ ఎఫిడ్రైన్ ఇంజక్షన్.

Coramine Ephidrine Injection.

పై ఔషధ ద్రవమును 'సిబా' కంపెనీవారు తయారు చేయుచున్నారు.

ఈ ఔషధము సయితము కొరామిన్‌తో ప్యారీడైన్‌బి, కార్బాక్సలిక్ యాసిడ్‌డై థయిలామెడ్ మరియు

"ఎఫిడ్రో క్లోరైడ్" మిశ్రిమము గావించి తయారు చేయ బడియున్నది.

పై విధముగ మిశ్రమముగా తయారు చేయబడిన కొరామిన్ ఎఫిడ్రిన్ ఔషధ ద్రవముతో నింపబడిన 1 CC అంపుల్సు మనకు లభించును.

కొరామిన్ ఎఫిడ్రైన్ ఔషధము, ముఖ్యముగా ఉబ్బస సంబంధమైన రోగములయందు యేర్పడు అసాధారణస్థితి నడంచి రోగికి వెంటనే ఆరోగ్యము ప్రసాదించుటకై యిందుగల "కొరామిన్" ఔషధ ద్రవము పుపుసముల కుత్తేజము కలిగించి శ్వాసను స్థిమితపరచి హృదయమునకు బలము కలిగించి కఫాదులను యించుక ద్రవింపజేసి శ్వాసనాళముల యందుండి బయటికి వెడలించుటకు వీలు కలిగించును. పై మిశ్రమ ద్రవమందు చేర్చబడిన "ఎఫిడ్రైను" ఔషధము ముఖ్యముగా ఉబ్బస వ్యాధులందు సంభవించు అనేక లక్షణముల నడంచి శ్లేష్మాదులను ఉపశమింపజేసి శ్వాసావరోధమును సడలించి కొరామిన్ ఔషధముతో కలసి రక్తప్రసరాది కార్యక్రమమునకేర్పడిన సంకటావరోధములను బోద్రోలి రోగికి ఆరోగ్యమును ప్రసాదింప గలిగియుండును.

కొరామిన్ ఎఫిడ్రైన్ ఔషధ ప్రయోగము వలన వుబ్బస రోగముయొక్క తీవ్రత సులభముగా నడంగిపోయి రోగికి త్వరలో ఆరోగ్యము లభించుట యథార్థము.

సాధారణమైన దగ్గు దమ్ము మొదలగు వ్యాధులందు వాడబడిన కొరామిన్ ఔషధముచే వ్యాధి తాత్కాలికముగా ఉపశమించుచుండుట యాచారమేగాని పైవిధముగా ఎఫిడ్రైనుతో మిశ్రమము గావించి యుండుటచే, ఈ ఇంజక్షను గుణము శరీరమున దీర్ఘకాలము నిలచి, దగ్గుదమ్ము ఉబ్బసము మొదలగు రోగములను క్రమక్రమముగా తగ్గించుచు గుండెకు తగిన శక్తిని ప్రసాదించి రోగియందు పొడచూపిన దుర్బల లక్షణములను నడంచుట యథార్థము.

దగ్గు దమ్ముయొక్క సామాన్యదశయందును తీవ్రదశయందును, ఉబ్బసముయొక్క తీవ్రదశయందును కొరామిన్ ఎఫిడ్రైన్ 1 CC వరకు ప్రతిరోజు ఒకటి లేక రెండు పర్యాయములు చర్మముక్రిందగాని, కండరములయందుగాని ఇంజక్షన్ చేయుచు రోగముయొక్క తీవ్రత ననుసరించి కొరామిన్ ఎఫిడ్రైన్ ఔషధముతో తయారు జేయబడిన బిళ్ళలు సయితము నోటిద్వారా ప్రతిరోజు ఒకటి రెండు వాడవచ్చును.

ఉబ్బసము తీవ్రరూపముదాల్చి రోగి తెలివితప్పి క్షీణగతి నొందుచున్నట్టి సమయమునందు ప్రతిదినము ఒకటి లేక రెండు పర్యాయములు 1 CC ఔషధమును చర్మముక్రిందగాని, కండరములయందుగాని అవసరమును బట్టి రక్తనాళములయందుగాని ఇంజక్షన్ ఇచ్చుచు చికిత్స జేయుట ఉచితము.

## 125. కొరామిన్ కాఫియన్ ఇంజక్షన్‌లు.

## Coramine Caffeine Injection.

సీబా కంపెనీవారిచే తయారు జేయబడు పై ఔషధమునందు పైరీడైన్—బి, కార్బాలిక్ యాసిడ్ డై థయిలామైడ్ ఔషధముతో కాఫిన్ సోడియం శాల్సిలేట్ మరియు స్ట్రిచ్‌నైన్ సల్ఫేట్ అతిసూక్ష్మమైన మోతాదుతో మిశ్రిమము గావించి కడు జాగరూకతతో నిర్మాణము గావించి యున్నారు.

ఈ మిశ్రమ ఔషధము సయితము 1 CC తో నింపబడిన అంపుల్సు మనకు లభించును.

కొరామిన్ ఔషధముతో చేర్చబడిన "కాఫియన్" ఔషధద్రివము మస్తిష్కమునకు, కండరములకు శ్వాస నాళములకు ఉత్తేజము కలిగించుచు హృదయమునకు బలము కలిగించి స్వేదమును మూత్రిమును వెడలించునట్టి శక్తి కలదు గాన యీ ఔషధ ప్రియోగము వలన పై అంగములందు యేర్పడిన అశక్తతను అలసటను తొలగించి దేహమునకు తత్వమునకు కొంత విశ్రాంతి యొసంగునని చెప్పవచ్చును.

కొరామిన్ కాఫియన్ ఇంజక్షన్ ఔషధ ద్రివములో మిక్కిలి సూక్ష్మముగా చేర్చబడియున్న "స్ట్రిచ్‌నైన్" ఔషధ ద్రవము రక్తనాళములకును నరముల

కును శ్వాసనాళములకును పుపుసములకును ఉత్తేజము కలిగించునట్టి స్వభావము గలది.

ఈ విధముగా వివిధవిధములైన గుణాధిక్యతతో నొప్పారునట్టి ఔషధములను మిశ్రమముగావించి తయారు చేయబడిన కొరామిన్ ఇంజక్షన్ ప్రయోగమువలన అంటు సంబంధమైనట్టి రోగములు మొదలైనవి సోకినప్పుడు రోగము తీవ్రరూపముల దాల్చి రక్తనాళముల యందు రక్తప్రసరణకును (చలనమునకును) గల గమనశక్తిని వ్యర్థపరచి రోగిని మరణావస్థకు దెచ్చునట్టి పరిస్థితుల తొలగించి మెదడునకును శరీరాంగములకును యేర్పడినట్టి అలసట దౌర్బల్యము తాత్కాలికముగా నడంచి హృదయమును సయితము కాపాడుటకు ఎంతయో ఉపయోగపడును.

అమితమైన యోచనాది కార్యక్రమముల వలనగాని వ్యాధియొక్క తీవ్రత వలనగాని దుస్థితి నొందిన మెదడుయొక్కయు కండరములయొక్కయు నరములయొక్కయు అలసటను దుస్థితిని తొలగించుటకొరకు కొరామిన్ కాఫిన్ ఇంజక్షన్ 1 CC వరకు ప్రతిదినము ఒకటి లేక రెండు పర్యాయములు చర్మముక్రిందగాని కండరములయందుగాని తీవ్రమగు పరిస్థితులయందు రక్తనాళములయందు గాని నెమ్మదిగా కడు జాగరూకతతో ఇంజక్షన్ గావించుచు రోగియొక్క స్థితి నాడియొక్క గతి హృదయముయొక్క

వేగము మొదలగు లక్షణములను శ్రద్ధతో పరిశీలించుచు చికిత్స గావింపవలసి యుండును.

వాతావరణాది తత్వములు అకస్మాత్తుగా వికటించి నట్టి సమయములందు శరీరమున యేర్పడినట్టి అసాధారణ పరిస్థితిని తొలగించి హృదయమునకు, మెదడుకు, నరములకు ఉత్తేజము కలిగించుటకు పై ఔషధము యెంతయో ఉపయోగపడును. గాని దీనిని అనుభవముతోను, కడునేర్పుతోను చికిత్సలయందు ఉపయోగించుటచే మంచి ఆరోగ్యమును ప్రసాదించుటకు అద్భుతముగా సాయపడును.

## 126. హిపాఫోలిన్ ఇంజక్షన్.

## Hepafolin Injection.

ఈ ఇంజక్షన్‌లను "సిప్లా" కంపెనీవారు తయారు చేయుచున్నారు.

హిపాఫోలిన్ ఔషధ ద్రవముతో నింపబడిన 2 CCల అంపుల్సు మరియు 12 CCల రబ్బరు మూతగల వయల్సు సయితము మనకు లభించుచున్నవి.

ఈ విధముగా మనకు లభించు హిపాఫోలిన్ ఇంజక్షన్ ద్రవమునందు ముఖ్యముగా లివర్ యెక్స్‌ట్రాక్ట్ (యకృత్ కషాయసారము) ముఖ్యపదార్థ మైనప్పటికిని దీనితో విటామిన్ బి 12 ఔషధ ద్రవమును "ఫోలిక్ యాసిడ్" (ఫోలికు ఆమ్లము) మిశ్రమము గావించి తయారు చేయబడుచున్నది.

పాఠకులు ఇందు ముఖ్యముగా లివర్ యెక్స్ట్రాక్టు మరియు విటామిన్ బి 12 ఔషధ ద్రవములయొక్క ప్రయోజనమును వాటికిగల శక్తిసామర్థ్యముల గూర్చియు వాటిని ప్రయోగించుట వలన నిర్మూల మగునట్టి రోగాది విశేషములను గూర్చి యీ గ్రంథమున విపులముగా చదివి గ్రహించియే యున్నారు గాని పై రెండు ఔషధ ద్రవములతో ఫోలిక్ ఆమ్లము మిశ్రమము గావించి యుండుట వలన పై మిశ్రమ ఔషధముయొక్క శక్తి అద్భుతమైనదే యని మనము గ్రహింపవచ్చును.

ఫోలిక్ యాసిడు (ఫోలిక్ ఆమ్లము) శరీరమున ప్రవేశ పెట్టుటచే (వ్యాధులపై వాడుటచే) శరీరమున క్షీణదశయందుండు రక్తమును వృద్ధి పరచును. ఆంత్రములయందుండు దుర్భర లక్షణములను తొలగించి మంచి ఆకలి కలుగునటులచేసి శరీరమున రక్తము వృద్ధి యగుటకు వీలయిన అన్ని అంగములను యంశములకును తోడ్పడి శీఘ్రముగా రక్తాణువుల అభివృద్ధికి తోడ్పడును.

ఫోలికామ్లము రక్తాణువుల స్థితిని చెడనీయక కాపాడుటేగాక అతిసారాది వ్యాధులవలన యేర్పడిన శరీర దౌర్బల్యము నడంచి గర్భిణీ స్త్రీయందు గలుగు రక్తహీనతకు మూలకారణమైన దుర్బలత్వమును పెరుగనీయక రక్తాణువులను కాపాడుచు వాటిని పోషించుట ఈ ఔషధ ద్రవముయొక్క ముఖ్యధర్మము.

రక్తహీనత వలనగాని. యితర కారణముల వలన గాని శరీరమున పలుచని పొరలు ఊడిపోవునట్టి పరిస్థితిలో సంభవించు "పిలిగరా"వంటి చర్మవ్యాధులందును, ఇట్టివే లక్షణములతో గూడియుండి ముఖ్యకారణము గనుపించని "పిలిగరా" వ్యాధివంటి అనేక లక్షణములతో చర్మము నందు గనిపించు వికారలక్షణములతో గూడిన వ్యాధుల నడంచుటకు సయితము ఉపయోగపడునట్టి ఫోలిన్‌యాసిడ్ ఔషధ ద్రవమును ప్రత్యేకించి వాడుటకంటె లివర్ యెక్స్ట్రాక్టు వంటి ఔషధ ద్రవములతో మిశ్రమము గావించి ప్రయోగించుటవలన అద్భుతమైన ఫలితముల నొసంగ జాలియుండును.

హీపాఫోలిన్ ఇంజక్షన్ లివర్ యెక్స్ట్రాక్టుతో ఫోలిన్ యాసిడు చేర్పబడి యుండుటేకాక దీనికితోడు అద్భుత గుణముగల విటామిన్ బి 12 చేర్చి తయారు చేయబడి యుండుటచే యీ ఔషధము యొక్క శక్తి సామర్థ్యములను వైద్యసోదరులు గ్రహింపవచ్చును.

పైన వివరించిన విధముగా అద్భుతమైన శక్తిగల ఔషధ ద్రవములను చేర్చి తయారు చేయబడిన "హీపాఫోలిన్" ఇంజక్షన్ ప్రయోగమువలన, రక్తహీనత పాండు గర్భిణీ స్త్రీలయందు గలుగు రక్తహీనత ఆంత్రముల సంబంధమైన శూలవ్యాధులందు యేర్పడిన రక్తహీనత "క్యాన్సర్" మొదలగు వ్యాధులు నివారించుటకు

చేయబడిన శస్త్రచికిత్సకు పిదప శరీరమున యేర్పడిన రక్తహీనత పాండురోగములవంటి లక్షణముల నడంచి శరీరమున క్రమముగా ఎఱ్ఱని రక్తమును వృద్ధి గావించుటకును.

నంజు ఉబ్బు మొదలగు రోగములయందు శరీరమున క్షీణించిన రక్తాణువుల అభివృద్ధిపరచి శరీర పటుత్వమును కాపాడుటకును, ఈ వ్యాధియందు సర్వసాధారణముగా శరీరమున గనుపించు పిలిగరా వంటి వ్యాధుల లక్షణములను పోద్రోలుట కొరకును,

అజీర్ణాతిసారము, అగ్నిమాంద్యము, గ్రహణి, సంగ్రహణి, కలరా, గర్భసూల మొదలగు వ్యాధులవలన శరీరమున క్షీణించిపోయిన రక్తాణువులను తిరిగి యధా ప్రకారము వృద్ధిపరచి ఆరోగ్యము ప్రసాదించుటకొరకును,

క్రిమిజన్యముగా శరీరమున వృద్ధిబొందినట్టి "సల్ఫా నమైడు" మొదలగు సల్ఫాసంబంధమైన ఔషధముల యొక్కయు, "బెంజేవిల్ నాగము" (సీసము) సువర్ణము పాషాణము మొదలుగాగల ఔషధములు విడిగాగాని యితర ఔషధములతో భస్మాది రూపములుగా చేర్చి వాడి యుండుటచే ఇట్టి ఔషధ దోషములు యేకారణముచేతనైనను శరీరమున నిలచియుండి బాధించునట్టి పరిస్థితులను చక్కపరచుటకును,

మూలవ్యాధి వ్రణములు ముక్కు బెదురుట మొదలగు రోగాది లక్షణములందు శరీరమున తగ్గిపోయిన రక్తమును తిరిగి యథాప్రకారముగా అభివృద్ధి పరచుట కొరకును.

పై విధముగానే అనేక రోగాది కారణములవలన శరీరమున క్షీణించిన రక్తమును యథాప్రకారము వృద్ధి పరచి శరీరారోగ్యము కాపాడుట కొరకును "యెక్సురే" మొదలగు క్రియలవలన శరీరమున యేర్పడిన అసాధారణ స్థితిని సవరించుట కొరకును "హిపాఫోలిన్" ఇంజక్షన్ యెంతయో ఉపయోగపడును.

మోతాదు:—

అత్యవసరమైన పరిస్థితుల ననుసరించి రోగియొక్క బలానుసారముగా రోజువిడిచి రోజు 1 CC వరకు హిపా ఫోలిన్ ఔషధ ద్రవమును లోతుగా పిరుదులయొక్క కండరములయందు ఇంజక్షన్ చేయవలసియుండును. ఇట్టి చికిత్సవలన రోగియొక్క స్థితి అభివృద్ధికరముగా గనుపించినయెడల వారమునకు 1 CC మొదలు 2 CC వరకు మాత్రము ఇంజక్షన్ రూపమున ప్రయోగించుచు రోగియొక్క రక్తమును బాగుగా పరీక్షజేయించి కావలసిన పరిమాణముతో రక్తాణువులు అభివృద్ధి అగువరకు మాత్రము చికిత్స పొడిగింపవలసి యుండును.

చిన్నవారికి వయస్సు దేహబలము తూకము అవసరము యీ మొదలగు లక్షణములను పరిశీలించి అవసరమునకు తగిన పరిమాణముతో వారమునకు ఒకటి లేక రెండు పర్యాయములు ఇంజక్షన్ ఈయవచ్చును. రక్తపరీక్ష వలన వారి దేహమునందు యేర్పడుచున్న రక్తాభివృద్ధిని గమనించుచు కావలసినంత రక్తాభివృద్ధిని దేహమునకు యేర్పడిన వెంటనే చికిత్సను నిలిపివైచి, అట్లు చికిత్స నిలుపుటవలన మరల శరీరమున యథాస్థితి యేర్పడకుండుటకై నోటిద్వారా మంచి టానికు ఔషధముల వాడుచుండుట ధర్మము.

## 127. డైయూరిన్ ఇంజక్షన్.

## Daiurin Injection.

కాంటినెంటల్ కంపెనీవారు ఈ ఔషధమును తయారుజేసి మనకందించుచున్నారు.

డైయూరిన్ ఔషధ ద్రవముతో నింపబడిన 1 CC అంపుల్సు మనకు లభించుచుండును.

శరీరమున యేర్పడిన యే రుగ్మత యందైనను రక్తము క్షీణించి తగ్గిపోయిన రక్తమునకు బదులు శరీరమున నీరు చేరుట, ఇట్లు నీరు చేరుటవలన రోగియందు ఆయాసము గన్పించుట కాళ్ళపై నొక్కినప్పుడు గుంటలు పడుట యీ మొదలగు లక్షణములు గనుపించుట సహజమేగాని జలోదరము, ఉబ్బు ముఖమునందు యెదయందు

మాత్రము నంజు గనుపించుట లేక కడుపుమాత్రమే లావుగానుండుట యిట్టి అనేక లక్షణములతో సంప్రాప్తించు రుగ్మతలయందును,

శరీరమున నంజు మొదలగు లక్షణములతో బరువెక్కుట జలోదర లక్షణములు క్రమక్రమముగా అభివృద్ధి జెందుట మూత్రము కొద్దిపరిమాణముతో మూత్రము వెడలుచుండి స్వేదము యెప్పుడో ఒకపర్యాయము వెడలి వెడలనట్లు గన్పించు ఇట్టి లక్షణములను తొలగించుట కొరకును "డైయూరిన్" ఔషధము యెంతయు ఉపయోగపడును.

మోతాదు:—

డైయూరిన్ ఇంజక్షను ఔషధమును ప్రయోగించుటకు పూర్వము రోగియొక్క లక్షణములను చక్కగా గమనించి అవసరమునుబట్టి 1 CC ఔషధమును లోతుగా కండరములందు ఇచ్చుచు మూత్రాది స్వేదములు యెట్లు వెడలుచున్నవో వైద్యుడు కడుజాగరూకతతో పరిశీలించుచు అవసరమునుబట్టి చికిత్సాకాలమును పొడిగింపవలసి యుండును.

N. B. డైయూరిన్ ఇంజక్షను ప్రయోగమునకు పూర్వము రోగియొక్క లక్షణములను పూర్తిగా గుర్తించనిదే యీ ఇంజక్షను ప్రయోగము గావించుటవలన రోగియందు కొన్ని వికార దోషములు గలుగవచ్చును. గాన

వైద్యు లీవిషయమును గమనించి పై ఇంజక్షను ప్రయోగము అవసరమని నిర్ణయించుకొనిన పిదపనే పై ఔషధమును ప్రయోగింప వలసి యుండునను విషయమును మరువరాదు.

## 128. క్వినార్సలు ఇంజక్షను.

## Qinarsol Injection

పై ఔషధ ద్రవమును "సిప్లా" లేబరేటరీస్ కంపెనీ బొంబాయివారు తయారుజేసి మన కందించు చున్నారు.

సాధారణముగా మలేరియా జ్వరముల కొరకు క్వైనైను నోటిద్వారాగాని ఇంజక్షన్ రూపమునగాని వాడుట వైద్యసోదరు లందరికిని విదితమే గాని, శరీరమున ప్రవేశించిన మలేరియా జ్వరమును నిర్మూలించుటకు రోగి యొక్క బలము వయస్సు జ్వరముయొక్క తీవ్రత యీ మొదలగు అంశములను బాగుగా పరిశీలించి అప్పటి రోగ తీవ్రత ననుసరించి దానికి తగిన మోతాదుతో క్వైనైను ఔషధమును ప్రయోగింపని కారణమువలన కొందరి యందు మలేరియా జ్వరముపై చికిత్సకు కొంతలొంగి కొన్నాళ్ళవరకు జ్వరము గనుపింపక పోయినప్పటికిని రోగ శేషముచే మిగిలిన మలేరియా క్రిములు మొదటిసారిగా ప్రయోగించిన క్వైనైను ఔషధమునకు చావక క్వైనైను వలన మూర్ఛవంటి అవస్థకులోనై బ్రతికిన కొన్నిక్రిములు

కాలక్రమమున వృద్ధినొంది దీనికి తోడుగా మరికొన్ని పరిస్థితుల క్రిములకు తోడగుట వలన తిరిగి జ్వరము శరీరమున పొడచూపునట్టి పరిస్థితులు గలుగుచుండును.

పైవిధముగా సరియైన క్వినైను మోతాదులు వాడని కారణమువలన గాని రోగము బాగుగా ముదురుట వలన మొండికిబడిన మలేరియా క్రిమిసముదాయము శరీరమున వృద్ధియగుచు నిలచియుండుట వలనగాని తిరిగి హెచ్చు మోతాదుతో క్వినైను ఔషధమును పై రోగముకొరకు వాడినప్పటికిని రోగియందు పైత్యాది లక్షణములు అధికమగుటయే గాని జ్వరము మాత్రము పూర్తిగా నశింపక నాలుగు రోజులకో లేక వారమునకో యింతకు మించి 20 రోజులు నెలవరకు సయితము తిరుగబెట్టుచుండెడు మలేరియా జ్వరములను సమూలముగా నిర్మూలించుటకొరకు క్వినార్సలు యెంతయో ప్రయోజనకారిగా పని చేయునని చెప్పవచ్చును.

మలేరియా జ్వరములందు ప్రయోగింపబడు క్వినైను వలన నశింపని క్రిమిని సులభముగా నశింపజేయుట కొరకును దేహస్థితిని చక్కబరచి నరములకు కండరములకు త్తేజము కలిగించుట కొరకును క్వినైను ఔషధమునందు తగిన పరిమాణము శుద్ధి చేయబడిన పాషాణము మిశ్రమము గావించి అతి చాకచక్యముగా క్వినార్సల్ ఔషధమును తయారు చేయుచున్నారు.

క్వినైనులో ఆర్సనిక్ (పాషాణము) మిశ్రిమమై నపుడు క్వినార్సలు అనబడునని మనము జ్ఞప్తి యుంచు కొనుట మంచిది.

క్వినైనుతో విషతుల్యమైన పాషాణము రోగికి అపకా రము జరుగని మోతాదుతో మిశ్రమము గావించి తయారు చేయబడిన "క్వినార్సలు" ప్రయోగించుటచే మలేరియాజ్వర క్రిమి క్వినైనును లెక్కచేయకున్నను పాషాణ సంబంధ మైన ఔషధ ద్రవము సోకినంతనే సమసిపోవక తప్పదు.

పై పరిస్థితి ననుసరించి మొండికిబడిన మలేరియా జ్వరముల నివారించుటకును తీవ్రరూపముతో సోకి రోగిని అడలగొట్టునట్టి మలేరియా జ్వరముల నిర్మూలించుట కొర కును యీడ్పు, చిన్నబిడ్డచేష్టలు మొదలగు లక్షణముల నివా రించుటకును సయితము క్వినార్సలు ఇంజక్షను అద్భుత ముగా పనిచేయును.

క్వినార్సలు ఔషధ ద్రవముతో నింపబడిన అంపుల్స్ 1 CC మొదలు 2 CC వరకు మనకు లభించును.

పై ఔషధ ద్రవమును రోగబలము రోగియొక్క వయస్సు, అవసరము యీ మొదలగు యంశములను చక్కగా పరీక్షించి అవసరమును గ్రహించి 1 CC మొదలు 2 CCల వరకు లోతుగా చర్మముక్రింద ఇంజక్షను చేయుచు రోగియొక్క లక్షణములను గమనించుచు చికిత్సను పొడి గించుట ఉచితము.

N.B. క్వినార్సలు చికిత్సయొక్క అవసరము నను సరించి వారమునకు ఒకసారి లేక రెండు పరియాయములు ఇంజక్షణ వాడుట ఉచితమేగాని శరీరమున రక్తము క్షీణించినవారికిని, వేరే విధమయినట్టి అంటురోగములతో బాధపడునట్టివారికిని వైద్యుడు గ్రహించక ఇంజక్షణ ప్రయోగము గావించుటవలన ఇట్టి స్థితియందు శరీరమున ప్రవేశించిన క్వినార్సలు ఔషధ ద్రవము వికటించి ఇంజక్షణ ఇచ్చిన స్థలమున గడ్డకట్టి పోటు, బాధ మొదలగు లక్షణములతో రోగికి అమితమగు శ్రమ కలిగించుటయేగాక ప్రమాదమును సయితము తెచ్చిపెట్టు ననుటలో సందియము లేదు.

గాన వైద్యసోదరులు క్వినార్సలు ఇంజక్షన్ ప్రయోగించుటకు పూర్వము రోగిని బాగుగా పరీక్షించుటయే గాక అవసరమైనచో రోగియొక్క రక్తమును సయితము బాగుగా పరీక్ష చేయించి మలేరియా క్రిమివలననే రోగియందు జ్వరాదిలక్షణము లేర్పడుచున్నటుల తగినసాక్ష్యము లభించిన పిదప పై ఇంజక్షణ ఔషధమును ప్రయోగించి చికిత్సచేయుట ఉచితము.

## 129. కాల్షిబ్రోన్యాట్ ఇంజక్షణ.

## Calcibronat Injection.

పై పేరుతో "శాండోజ్" కంపెనీవారు తయారుజేసి మన కందించుచున్నారు.

పై ఔషధ ద్రవముతో నింపబడిన అంపుల్సు 5 CCలు మరియు 10 CCలవి మనకు లభించుచున్నవి.

"కాల్షి బ్రోన్యాట్ ఇంజక్షన్" శ్యామక (సడటివ్) ఔషధముగా శరీరవేదన తగ్గించుట కొరకును, శరీరము యొక్క ప్రక్షుబ్ధస్థితిని తగ్గించి శాంతి నొసంగుటకొరకును బాగుగా ఉపయోగపడుచున్నది.

"కాల్షి బ్రోన్యాట్ ఇంజక్షన్" కేవలము శ్యామక ఔషధముగా మాత్రమే పనిచేయక రోగనివారణమునకు ఉపయోగించునట్టి చికిత్సార్హమైన ఔషధముగా సయితము పనిచేయగల శక్తి దీనియందు ఉండునట్లు తగిన ఔషధ ద్రవము నిందుచేర్చి తయారు చేయబడియున్నది.

కాల్షి బ్రోన్యాట్ ఔషధమునందు "కాల్షియం" బ్రోమైడ్ ఔషధ ద్రవముతో నియమిత పరిమితితో చేరి యుండబట్టి ఈ మిశ్రమ ఔషధ ప్రయోగమువలన శరీర మునందలి కండరములు మొదలైన వాటియొక్క దుస్థితి (బాధాది లక్షణములు) శాంతింప జేయుటయేగాక మెదడు యొక్క దుస్థితిని సయితము శాంతిపరచి అద్భుతముగా పనిచేయుననుటకు సందియములేదు.

పై ఔషధ ప్రయోగముచే మెదడునందు యేర్ప డిన అస్వస్థత, నిద్రలేకపోవుట, మూర్ఛవంటి పరిస్థితి, స్త్రీల యందు సంప్రాప్తించు "హిస్టీరియా" అతివాగుడు, అసి

మితస్థితి మొదలగు పరిస్థితుల నడంచి తగిన విశ్రాంతి సరియగు నిద్ర కలుగునట్లు చేయుటకై యిందు గల బ్రొమైడ్ తోడ్పడును.

కండరముల యొక్కయు, నరములయొక్కయు, రక్తనాళముల యొక్కయు దుస్థితి నడంచి ఎముకలకు పుపుసములకు శక్తి నొసంగును. ఎన్నియో విధముల శరీరమునకు ఉపయోగపడునట్టి కాల్షియం యిందు చేరి యుండుటచే పై మిశ్రమ ఔషధము యెంతటి శక్తివంత మైనదో పాఠకులు గ్రహించవచ్చును.

కాల్షి బ్రోన్యాట్ ప్రయోగమువలన శరీరమున కాల్షియం లోపించుటచే యేర్పడునట్టి అనేక వ్యాధులందు మెదడును కలవర పరచునట్టి స్థితి లక్షణములు యేర్పడి నప్పుడు పై రెండు విధములైనట్టి లక్షణములను, రోగములను తాత్కాలికముగా ఉపశమింప జేయుటకే గాక కావలసిన వ్యవధితో చికిత్స జేయుటకు సయితము ఉపయోగించుటకు యెంతో వీలుకలదు.

శరీరముయొక్క పొరలయందు అంటు సంబంధముగాగాని, తత్వసంబంధముగాగాని యేర్పడిన "డెర్మటోసిజ్" వంటి చర్మవ్యాధి నడంచుటకు ఇట్టి చర్మవ్యాధిచే నిద్ర మొదలైనవి లేక శరీరమున యేర్పడిన బడలిక దౌర్బల్యమువంటి లక్షణముల నడంచి రోగికి ఆరోగ్యము ప్రసాదించుట కొరకును.

శరీరమున చర్మవ్యాధులు (సవాయి సంబంధముగా నట్టి) యేదో ఒక కారణమువలన పెక్కుకాలము నిలచి క్రిమక్రిమముగా గజ్జి, చిడుమువంటి లక్షణములే గాక చర్మముయొక్క లోపలివైపు భరింపరాని దురద మరియు దద్దులవంటి లక్షణము గాన్పించునట్టి లక్షణముల నడంచుటకును.

దగ్గు దమ్మ పొడిదగ్గు ఉబ్బసము మొదలైన రోగముల యందును వాడబడు యితర ఔషధములతోపాటు "కాల్షిబ్రోన్యాట్" ఇంజక్షణాలు బాగుగా ఉపయోగపడును.

కోరింతదగ్గు మొదలగు వ్యాధులందు పై ఇంజక్షను ప్రయోగించుట వ్యాధి నడంచుటకును, నరములకు మెదడునకు పుపుసములకు విశ్రాంతి యొసంగి శాంతముగా పనిచేయుటకును తోడ్పడును.

నరములకు సంబంధమైన రుగ్మతలవలన రోగి శ్రమపడునట్టి పరిస్థితియందును ఇట్టి వ్యాధులందు నిద్ర పట్టక యుండునట్టి అస్థిమితస్థితి తొలగించి వ్యాధిని క్రమముగా తొలగించుట కొరకును,

కాల్షియం చికిత్సచే సమసిపోవునట్టి యే వ్యాధి నందైనను రోగికి స్థిమితములేక నిద్రపట్టక నరములు కండరములు గుంజుచు అనేక లక్షణములతో బాధించునట్టి రోగాదులయందు వైద్యుడు రోగ పరిస్థితిని లక్షణమును అవసరమును సరిగా గుర్తించి పై ఔషధమును సరియైన

మోతాదుతో ప్రయోగించి పైన దెల్పియున్నట్టి అనేకరోగ లక్షణములను సులభముగా నిర్మూలించి రోగికి ఆరోగ్యము ప్రసాదించవచ్చును.

మోతాదు:—

రోగముయొక్క సామాన్య స్థితియందు అవసరము రోగియొక్క బలము ననుసరించి 10 CCల ఔషధ ద్రవమును లోతుగా పిరుదుల కండరములందుగాని రక్తనాళములందుగాని ప్రయోగించుచు వారమునకు ఒకటి లేక రెండు పర్యాయములు ఇంజక్షను ఇచ్చుచు చికిత్స జేయవచ్చును.

వ్యాధియొక్క తీవ్రపరిస్థితియందు 5 CC మొదలు 10 CC ల వరకు ఒకటి లేక రెండు పర్యాయములు లోతుగా పిరుదుల కండరములందుగాని రక్తనాళములందుగాని ఇంజక్షను చేయుచు ఇంజక్షను యిచ్చినచోట బొటనవ్రేలితో కొంచము మర్దనజేసి ఔషధము సవ్యముగా శరీరమున వ్యాపించునట్లు చేయుట ఉచితము.

పై ఇంజక్షను చికిత్స జరిగినంత కాలములో ప్రతి రెండు ఇంజక్షనులకును గల మధ్య వ్యవధికాలములో కాల్షి బోరిన్యాట్ ఔషధము నోటిద్వారా వాడుటకు తగినట్టి ద్రవమును కలిగిన మోతాదులతో వాడుచుండుటవలన మొదట ఇంజక్షను ప్రయోగము వలన సమసిపోయిన వ్యాధి లక్షణ

ములు మరల ఇంజక్షన్ యిచ్చు లోపల ప్రకోపించి రోగిని బాధించకుండుటకు వీలు కలుగును.

"కాల్షియబోరోగ్లూకోనేట్" ఇంజక్షన్ యొక్క అవసరమును బుద్ధికుశలతతో వైద్యుడు గ్రహించి పిదప అవసరమని తోచినచో ఇంజక్షన్ కడుజాగరూకతతో లోతుగా పిరుదుల యొక్క కండరములందు గాని రక్తనాళములయందు గాని ప్రయోగించుట ఉచితము గాని అనవసరముగా అడ్డదిడ్డము గాను పై ఇంజక్షన్ ప్రయోగించుటవలన రోగియందు అనేక దుష్ట లక్షణములు పొడచూపుటే గాక ప్రమాదము సయితము సంభవించుట కవకాశము కలదని వైద్య సోదరులు మరువరాదు.

N.B. పై ఇంజక్షన్ ప్రయోగించు నప్పుడు రక్త నాళములయొక్క పటుత్వము ననుసరించి కనీసము 8 నిమిషముల కాలమైనను 10 CC ఔషధ ద్రవమును శరీరమున యెక్కించుటకు ఉపయోగించుకొనవలెను. ఒకవేళ వైద్యుడు త్వరపడి శీఘ్రముగా ఇంజక్షను ద్రవమును ప్రయోగించుటవలన సయితము రోగికి వెంటనే ప్రమాదము సంభవించును గాన వైద్యులీ విషయమును కడు శ్రద్ధతో గమనింతురుగాక యని హెచ్చరిక జేయుచున్నాను.

## 130. న్యూక్లీన్ సొల్యూషన్ ఇంజక్షన్.

## Nuclein Solution Injection.

పైన ఉదహరింపబడిన పేరుతో బెంగాల్ ఇమ్యూనిటీ కంపెనీవారు కడునేర్పుతో తయారుజేసి అందించుచున్నారు.

పై ఔషధమును నూటికి 5% వంతుల బలముతో ద్రవరూపమున నింపబడినట్టి 1 CC అంపుల్సు మనకు లభించును.

"న్యూక్లీన్" ఇంజక్షన్ ప్రయోగించుట వలన కంఠమునందు వాపు మొదలగు లక్షణములతో ఉత్పన్నమై అమితమగు నొప్పితో బాధించునట్టి "టాంసిల్స్" గ్రంధుల యొక్క వాపు బాధ నడంచుటకు, విషజ్వరము దగ్గుపడిశముతో సంభవించునట్టి జ్వరము వాతావరణము యొక్క మార్పువలన శరీరమున యేర్పడినట్టి దుష్టలక్షణములు నీరసము గవదబిళ్ళలు గ్రంధిక్షయయొక్క ప్రాథమిక దశ వాత సంబంధమైన రోగలక్షణములు పాండువ్యాధి మొదలగు రుగ్మతల నడంచుటకును,

ఏదో ఒక గొప్పవ్యాధి శరీరమున వృద్ధియగుటకు పూర్వము దేహమునందు వివిధ వికారలక్షణములు యేర్పడుట సహజము. ఇట్టి స్థితిని బుద్ధిమంతుడగు వైద్యుడు గ్రహించి శరీరమునకు ముందు జరుగబోవునట్టి రోగ

మును తాత్కాలికముగా శరీరమున గనుపించునట్టి లక్షణ ములవలన గుర్తించి "న్యూక్లీన్" వంటి ఇంజక్షన్లను ప్రయోగించి అనేక వ్యాధులను నివారింపవచ్చును.

పై ఇంజక్షన్ ప్రయోగమువలన రాచపుండు, ప్రస వించిన స్త్రీయందు అపథ్య దోషము వలనకాని వాతావరణ దోషము వలన గాని సంభవించినట్టి అనేక వ్యాధుల నడం చుటకును,

పుపుస సంబంధమైన వ్యాధులందును శ్వాసనాళ ముల సంబంధమైన వ్యాధులందును సర్వ సాధారణముగా గనుపించునట్టి గురక, దగ్గు, కఫలక్షణము, రొంప (గాఢ మైన పడిశము) తలనొప్పి మొదలగు అనేక రోగలక్షణ ములను తొలగించుట కొరకును,

వ్యాధి యేదియును పైకి గానరాక అనేక దుష్టలక్షణ ములు అప్పుడప్పుడుగాని, వెంటవెంటనేగాని రోగియందు గనుపించుచు పై లక్షణములనుబట్టి రోగము నిర్ణయించి వాడినట్టి ఔషధము సరిగా పనిచేయక శరీరమున మరి కొన్ని లక్షణములు క్రొత్తగా పొడచూపుచు రోగిని వైద్యుని సయితము కలవరపరచునట్టి అనేక దుష్టపరిస్థితులనుండి కాపాడి రోగికి ఆరోగ్యము ప్రసాదించుటచేతను పైన వివరించినట్టి ఔషధము అద్భుతముగా పనిచేయునని చెప్ప వచ్చును.

మోతాదు:—

న్యూక్లేఇ౯ సొల్యూషను రోగబలము, రోగియొక్క వయస్సు పరిస్థితి అలవాట్లు మొదలగు అనేక లక్షణములను పరిశీలించి యీ ఇంజక్ష౯ అవసరమని తోచినవెంటనే పై ఔషధ ద్రవమును 1 CC వరకు లోతుగా కండరముల యందు ఇంజక్షను ఇచ్చుట ఉచితము. ఇట్టి ఇంజక్ష౯ల అవసరము ననుసరించి వారమునకు ఒకటి లేక రెండు సయితము వాడవచ్చును.

న్యూక్లేఇ౯ ఇంజక్ష౯ చికిత్సాకాలమున వాడబడినట్టి ఇంజక్షనువలన రోగియందు దినదినము కలుగుచున్న అభివృద్ధి మార్పును మొదలైనవి జాగరూకతతో పరిశీలించుచు మరల రోగముయొక్కయు రోగమునకు సంబంధించిన లక్షణముల ననుసరించియు చికిత్సను పొడిగించుట ఉచితము.

పై ఇంజక్షను చికిత్సాకాలమున ఆయా వ్యాధి లక్షణములకు తగినట్లు తాత్కాలికముగా పథ్యపానాది ఆహార నియమములను రోగికి తగినట్లుగా వైద్యుడు నిర్ణయించి చికిత్స చేయుటవలన పైన ఉదహరించినట్టి అనేక రుగ్మతలను నిర్మూలించి రోగికి ఆరోగ్యము చేకూర్చవచ్చుననుట యదార్థము.

## 131. వెలేరియన్ ఇంజక్షన్,

## Valerian Injection.

వెలేరియన్ ఇంజక్షను 1 సిసి అంపుల్సు బెంగాల్ యిమ్యూనిటి కలకత్తా కంపెనీవారి చేతను, తదితర కంపినీలచేతను సయితము తయారు చేయబడుచున్నవి.

"వెలరీనా" అనగా జటామాంసి యని యర్థము. ఈ మూలికనుండి తయారు చేయబడిన ఔషధ ద్రవము నకు మూలికను మాత్రాది కషాయములుగా జేసి వాడినప్పుడు గలుగునట్టి సుగుణములను ప్రసాదింపగలదని వైద్యసోదరులకు వేరుగా చెప్ప పనిలేదు.

పైన ఉదహరింపబడిన వెలేరియన్ ఇంజక్షను ప్రయోగము వలన స్త్రీలయందు ఋతు దోషము చే యేర్పడినట్టి అనేక దోషములను తగ్గించుటకు ఉపయోగ పడుటయేగాక అర తలనొప్పి, చెవులయందు సదా విను పించు రొొదవంటి లక్షణములు, మెదడునందు గలుగునట్టి సాధారణమైన అస్వస్థతవలన తలయందు జనించు నాదు దిమ్ము యిట్టి లక్షణములకు తోడుగా రోగి నిద్రలేక అవస్థ పడునట్టి అనేక పరిస్థితులను తొలగించి రోగికి మంచి నిద్ర కలుగుటకును మెదడుయొక్క అస్వస్థత, అపస్మా రమువంటి లక్షణములు తొలగించి రోగికి మానసికముగా

విశ్రాంతి, ఆరోగ్యము ప్రసాదించుటకును వెలేరియన్ ఇంజక్ష నెంతయు ఉపయోగపడును.

మోతాదు:—

రోగియొక్క వయస్సు, పరిస్థితి మొదలగు విషయములను విచారించి వారమునకు రెండు లేక మూడు పర్యాయములు సయితము పై ఔషధమును 1CC వరకు లోతుగా చర్మము క్రిందగాని, కండరములందుగాని ఇంజక్షన్ యీయవచ్చును.

N.B. పైన దెల్పినట్టి వెలేరియన్ ఇంజక్షన్ ప్రయోగ సమయమున రోగికి అవసరమైన ఇతర ఔషధములు సయితము వాడవచ్చును. గాని అట్లు వాడబడు ఔషధములు "వెలేరియన్ జటామాంసి" ఔషధికి సరిపడునట్టివిగా చూచివాడుట వైద్యునియొక్క ధర్మము.

## 132. అన్ టాక్సిన్.

## Antraxin S. C.

1 CC అంపుల్సు లభించును. చర్మముక్రింద జేయుటకు ఉపయోగించవలయును.

ఇయ్యది ప్లేగువ్యాధులయందు ఉపయోగపడుటయే గాక ప్లేగు వచ్చినట్లు కనుపించిన వెంటనే ఈ ఇంజక్షన్ చేసిన ప్లేగువ్యాధి రాకుండ కాపాడును. అంటువ్యాధులయందును, న్యూమోనియా అను శ్లేష్మ వాత జ్వరములయందును, వరుసజ్వరములయందును, విషమ జ్వరముల

యందును, అర్ధకర్ర, రాచకురుపులు, క్రుళ్ళినవిషముపుండ్లు, వ్రణములు, కురుపులు, ఇంకా యితరవిధముల అంటు జాడ్యముచే సంభవించు పుండ్లయందును మిక్కిలి గుణకారి. ప్లేగు వ్యాధియందు మాత్రము ఆరుగంటల కొక ఇంజక్షన్‌గాను పన్నెండు గంటల వ్యవధిలో యివ్వవచ్చును. జ్వరములయందు ప్రతిదినముగాని లేక రెండురోజుల కొకతూరి గాని ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని లక్ష్మిన్ లేబొరేటరీవారు తయారుచేయుచున్నారు. అన్ని వ్యాధులయందు ఆరు లేక యేడు ఇంజక్షనులు ఇచ్చిన చాలును.

## 133. అన్టిమెయిన్.

## Antimion I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

1 CC, 2 CC అంపుల్సు లభించుచుండును. ఈ ఇంజక్షన్ కాలా అజార్ అను వ్యాధియందును, కుష్ఠవ్యాధి యందును, జ్వరక్రిములను నివారించుటకున్ను, మశూచి పైనను, రాత్రియందు కండ్లు కనుపించనివారల యందును, యితర వ్యాధులచే బాధపడుచు నిద్రలేకయున్న వారికి నిద్ర కల్పించుటకున్ను గొప్పగా గుణము నిచ్చుచుండును. కుష్ఠువ్యాధియందు వారముదినముల కొక ఇంజక్షన్ చొప్పున ఆరు మాసముల వరకు యిచ్చిన తప్పక దీని ప్రభావము కనుపించును. కండరములయందే యీ ఇంజ

క్షన్ చేయవలసి యుండును. ఇందుకూడ ఆర్సెనిక్ కలదు గాన జాగ్రత్తతో చేయవలసి యుండును. మశూచియందు వారమునకు రెండుసార్లు ఇంజక్షన్ చేయవచ్చును. చిన్న పిల్లలకు మాత్రము చేయరాదు. రాత్రివేళలందు కండ్లు కనుపించనివారికి ఆరు ఇంజక్షన్‌లలో పూర్తి గుణము పొందవచ్చును. మొదలు 1 సిసి యిచ్చి క్రమేణ 2 సిసి యివ్వవచ్చును.

## 134. అన్‌టాక్సు.

## Antox I. M.

1 CC, 2 CC అంపుల్సు లభించుచుండును. అడ్డకర్ర అను అంటురోగముచే గల్గు గడ్డలయందును, ఇతర గడ్డల యందును, దద్దు రోగము అను కొఱకు వ్యాధి యందును, ప్లేగు గడ్డలు, విషపుపుండ్లు, రాచకురుపులు, మొదలగు ఇతర చర్మవ్యాధులకును, మాంసము తిని వేయు పుండ్లు, చర్మముపై వాతలు పడినట్లు కనుపించు నప్పుడున్ను, పొడి ఉబ్బసము, ఉబ్బసముచే బాధగల్గు వారలకును పై ఔషధమును చిన్న మోతాదుతో అనగా 1 CC ఇంజక్షన్ చేయవలయును. అడ్డకర్ర, యితర అంటు ప్లేగు గడ్డలయందు మూడుదినముల కొక ఇంజక్షన్ నిచ్చిన చాలును. మొత్తము నాల్గు అయిదు ఇంజక్షనులకే వ్యాధి నివారించును. ఉబ్బస వ్యాధియందును, వ్రణముల

యందు మాత్రము పన్నెండు ఇంజక్షనులు చేయుటచే వ్యాధి నివారించక తప్పదు.

## 135. అఫిమ్ విరోస్

## Apium Virus I. V.

### రక్తనాళములో చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. మేహావాతము నొప్పులచే చిరకాలమునుండి బాధపడువారలకును, నడుము నొప్పి, కీళ్ళనొప్పులు, కీళ్ళయందుపట్లు, చిన్నబిడ్డగుణము, మూత్రకృచ్ఛ్రము, అతిఉష్ణముచే కల్గు అవస్థలయందును, జలోదరము, శిరస్సునందు నీరుకూడుకొని యుండు జాడ్యములయందును, శిరోగ్రహము, నీరువుబ్బు నంజు వ్యాధులయందును మిక్కిలి గుణకారి. యేకారణముతో నైన సంభవించిన వాతపు నొప్పులకు ఈ ఇంజక్షను నిచ్చిన తప్పక గుణము కనుపించును. ఒక వారములో రెండు సార్లు ఇంజక్షను చేయవచ్చును. కీళ్ళవాతము మేహావాతము ముచే గలుగు నొప్పులు అధికముగా బాధించుచున్నచో రెండు దినములకొక ఇంజక్షన్ చొప్పున రక్తనాళములో యిచ్చిన వెంటనే గుణము కనుపించును. మొత్తము పది ఇంజక్షనులకన్న యెక్కువ నీయరాదు. గుణముకనుగొను టకుగాను వెంటవెంట యివ్వవలసిన అవసరముండదు.

## 136. అల్కామైడ్.

## Alcamide I. M. I. V.

### కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షను.

2 CC, 5 CC గల అంప్యుల్సు లభించుచుండును. రక్తము సరిగా ఆడక యుండు సమయమున వెంటనే ఈ ఇంజక్షన్ ఉపయోగించిన రక్తమును సరిగా ఆడునట్లు జేయుటయందు అద్భుతమైన గుణము కలిగి యున్నది. శ్వాస ఆడునట్లు జేయుటయందు కూడ అంతే. ఉన్మాద వ్యాధులయందును, ఉన్మాద గుణములయందును ఈ ఇంజక్షను తోడ్పడును. తిరిగి పైవ్యాధులను రాకుండ కాపాడుటకున్ను దీనియందు శక్తి గలదు. ఇది నల్లమందుకు విరుగుడుగా పనిజేయుచుండును. అవసరముబట్టి ఇంజక్షనులను ఉపయోగించవచ్చును. ఉన్మాదవ్యాధియందు కొన్ని ఇంజక్షనులు జేయవలసి యుండును. దీనిని అలంబిక్ కంపెనీవారు తయారు చేయుచున్నారు. పై వ్యాధులు నివారించుటయేగాక మానవుని ఆరోగ్యవంతునిగా జేయును.

## 137. అగోమెన్సిన్.

## Agomensin I. M.

### కండరములో జేయు ఇంజక్షను.

1 సిసి అంపుల్సు లభించుచుండును. స్త్రీలకు సంభవించు వ్యాధులలో ముఖ్యముగా ఋతుస్రావముచే బాధ

పడువారలయందు గొప్ప గుణము కనుపించుచుండును. ముట్టుశూల, శ్వేతప్రదరము, రక్తప్రదరము ఈ వ్యాధుల యందు మిక్కిలి గుణకారి. వారములో రెండు మూడు ఇంజక్షనులు చేయవచ్చును. ఋతుస్రావము అధికముగా వెడలునప్పుడు వెంటనే ఈ ఇంజక్షన్ ప్రయోగించి గుణము కనుగొనవచ్చును. ఋతుకాలమునందు ఋతుస్రావము యెక్కువ తక్కువగా వెడలుచుండిన సమానముగా యుంచు టకునుగాను పనిజేయును. దీనిని సిబాకంపెనీ స్విడ్జర్లాండ్ వారు తయారు చేయుచున్నారు. రెండు వారములలో వ్యాధిని పూర్తిగా నివారించును. వ్యాధిని, ప్రకృతిని గ్రహించి ఇంజక్షన్ చేయవలయును.

## 138. అంటిస్టిన్.

## Antistine I. M. & I. V.

కండరములలోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

1 CC, 2 CC అంపుల్సు లభించుచుండును. చలి కాలపు మూగగజ్జి, అదుర్త, తలనొప్పి, శ్వాస, రొమ్ము పడిసెము గలవారికి ఈ ఇంజక్షను కండరములో నీయ నగును. గర్భవతులుగా యున్నప్పుడు కాళ్ళు, యితర స్థల ములయందు నీరువచ్చి వాపు కలిగినవారలయందును ఈ ఇంజక్షన్ గొప్ప గుణకారి. ఈ వ్యాధులను నివారించుటయే గాక గర్భవతులకు హాని కలుగకుండ ఆరోగ్యవంతులుగా

జేయుటకున్ను ఇతర ఇంజక్షన్‌లవల్ల గుణము కనుపించని యెడల ఈ ఇంజక్షన్ ప్రయోగమున తప్పక గుణము కనుపించును. అవసరమునుబట్టి దినముగాని దినమునకు రెండుసార్లుగాని ఇంజక్షన్ చేయవచ్చును. రక్తనాళములో చేయవలసి యున్నప్పుడే ఇంజక్షన్ నెమ్మదిగా చేయవలయును. ఆతురతనొంది చేయరాదు. అట్లు చేసిన ప్రమాదము సంభవించును. దీనినికూడ సిబాకంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 139. అరోమైసిన్ హైడ్రోక్లోరైడ్ క్రిస్టలైన్.

Aureomycin Hydrochloride Crystalline I. V.

1 బుడ్డి యందు 100 M. G. ఔషధము గలది లభించును. ఇయ్యది రక్తనాళములోచేయు ఇంజక్షన్. అవసరమునుబట్టి పన్నెండు గంటలకొకసారి గాని లేక ఆరు గంటల కొకసారిగాని ఇంజక్షన్ యివ్వవచ్చును. సన్నిపాత జ్వరములయందును, విషజ్వరములయందును జీర్ణించిన వరుస జ్వరములయందును, న్యూమోనియా జ్వరములయందును, యితర యేవిధములైన జ్వరములయందును యీ ఔషధమును ప్రయోగించిన క్రమేణ జ్వరము

యొక్క తీవ్రతను తగ్గించును. విషపడిసెము, రొమ్ము నొప్పి, గుండెనొప్పి, గుండెబలహీనత వీటికి పై ఇంజక్షను చాల ఉపయోగకారి. గనేరియా సెగ అంటుసంబంధమైన యితర వ్యాధులయందును, క్రిమి సంబంధమైన చర్మ వ్యాధులయందును, అడ్డకర్రి సిఫిలిస్ సవామేహ వ్యాధుల యందును ఈ ఇంజక్షను యివ్వవచ్చును. వెంటనే గుణము కనిపించుటయందు పేరుపొందిన గొప్ప ఔషధరాజము. టైఫాయిడ్ జ్వరములందు ఆరోమైసిటిఇ్ కన్న యితర యే ఔషధములు కూడ పనిజేయవు. దీనియందు గల గుణ ములు యే ఔషధమునందు లేవు. పెన్సిలిఇ్ సెప్టొమైసిఇ్ పనిచేయని వ్యాధులపైన ఈ ఔషధము తప్పక గుణము నిచ్చును. గ్రహణి, అతిసార వ్యాధులయందును గొప్ప గుణము నిచ్చుచున్నది. వ్యాధిని నివారించుటేగాక వ్యాధిని రాకుండ కాపాడగలశక్తి దీనియందు కలిగియున్నది. అరో మైసిటిఇ్ హైడ్రోక్లోరైడ్ యందు గొప్పగొప్ప ఔషధ రాజములను చేర్చి తయారు చేయుటవల్ల ఇదివరకున్న వ్యాధులను పోగొట్టుటే గాక మఱల వ్యాధిని రాకుండ కాపాడు శక్తి దీనియందు గలదు. ఇది యితర వ్యాధుల యందు కూడ పనిజేయుననుటకు సందేహములేదు. ఈ ఔషధముయొక్క క్యాపుసోల్సు కూడ లభించుచున్నవి. దీనిని లేడర్‌లీ లేబొరేటరీస్ అమెరికా వారు తయారు చేయుచున్నారు.

## 140. బ్రోమికాల్.

Bromical I. V.

రక్తనాళములో చేయు ఇంజక్షన్.

10 CC గల అంపుల్సు మనకు లభించుచుండును. నరముల బలహీనతలయందు మిక్కిలి గుణకారి. నరముల పోటు, నరములయందు పటుత్వము లేనివారలయందు ఈ ఇంజక్షనువల్ల అద్భుతగుణము కనుపించుచుండును. మూత్ర కృచ్ఛ్రము దురదగల వ్యాధులయందును గుణకారి. ఇందు కాల్షియమ్ బ్రోమైడ్ కలిసి యున్నందున శరీరమునకు కావలసిన కాల్షియమ్ పదార్థమును కలుగజేసి ఎముకలయందు పటుత్వము కలిగించుటలో యిది చాల పేరు పొందినది. దీనిని రక్తనాళములోనే చేయవలసియుండును. యూనికమ్ లేబరేటరీస్ బొంబాయివారు తయారు చేసి మనకందించుచున్నారు.

## 141. సిన్తారిన్.

Cantharin S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ప్రథమదశలో గల గనేరియా వ్యాధిచే మూత్రము చుక్కలు చుక్కలుగా పడునప్పుడున్ను కాలిన గాయములయందును, అమిత

మైన నొప్పులయందును, కాలిన గాయములచే గలుగు దోషములయందును, శరీరమున గల్గు యేయితర విధముల నొప్పులయం దైనను మిక్కిలిగుణకారి. ఒగర్పును తగ్గించుటకు గాను ఇది బాగుగా గుణము నిచ్చుచుండును, మూత్రము యొక్క వివిధ దశలయందు కల్గు బాధలన్నింటినిబోగొట్టి ఆరోగ్యము ప్రసాదించును. మూత్రకోశము నందుగల పుండును మాన్పివేయుటకు దీనియందు మంచి ప్రభావముగలదు. దీనిని లక్ష్మన్ లేబొరేటరీవారు తయారు చేయుచున్నారు. బాధలు అధికముగాయున్న సమయముల యందు ఆరుగంటల కొకసారి ఇంజక్షను చేయవచ్చును.

## 142. కార్బో అనిమాలిస్.

## Carbo Animalis S. C.

### చర్మముక్రింద చేయు ఇంజక్షను.

2 CC అంపుల్సు లభించుచుండును. ఈఔషధము సిఫిలిసు అను కొరుకు వ్యాధిచే గల్గు నొప్పులయందును, ప్లేగు అంటువ్యాధులయందును, దద్దుర్ల రోగము, అడ్డగడ్డలయందును మిక్కిలి గుణకారి. అడ్డగడ్డల యందు 48 గంటలలో ఆరోగ్యమును కల్గించి బాధలు నివారింపజేయుటయందు దీనియందు మంచిప్రభావము కల్గియున్నది. కొరకు పుండ్లుగల వ్యాధులయందు కూడ అదేవిధముగా

గుణము కనిపింప జేయుచున్నది. 24 గంటల కొకతూరి ఇంజక్షన్ చేయవలయును. లక్చన్ లేబొరేటరీస్ కంపెనీ వారు తయారు చేయుచున్నారు. ప్రత్యేకంగా అడ్డకర్రల యందే గుణము నిచ్చుటకు కనిపెట్టి దీనిని తయారుచేసి యున్నారని తెలియవలెను.

## 143. కొబురావినొమ్.

Carbravenam S. C. & I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. పక్షవాతముల యందును, యితర విధములగు వాతపు నొప్పులయందును, బాలపాప చిన్నెలయందును, పొడిఉబ్బసము, ఒగర్పు, చర్ది క్షీణగతి వాతప్రకోపము నందును, ప్లేగు కలరా వ్యాధులయందును, న్యూమోనియా జ్వరము శ్లేష్మ వాత జ్వరములయందును, విషజ్వరముల యందును, టైఫాయిడు అను సన్నిపాత జ్వరములయందును, జ్వరముల యందు శ్వాస సంభవించు నప్పుడున్ను ఈ ఇంజక్షన్ వెంటనే చేసిన తప్పక గుణము కనుపించును. పక్షవాత మను వ్యాధియందు చాలకాలము ఇంజక్షనులు చేయుచుం డిన పక్షవాతము పూర్తిగా నివారించుననుటలో సందేహము లేదు. ప్రతిదినము ఒక ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని కూడ పై కంపెనీవారే తయారు చేయుచున్నారు. జాగ్రి

త్తగా గమనించి వ్యాధియొక్క ప్రకృతిని నిదానించి చూచి ఇంజక్షన్ నెమ్మదిగా చేయవలెను.

## 144. కాల్షిబైన్.

## Calcibion I. V.

### రక్తనాళములో చేయు ఇంజక్షన్.

5 సిసి, 10 సిసి అంపుల్సు లభించుచుండును. ఈ ఔషధము మూర్ఛవ్యాధులయందు గొప్ప గుణకారి. సొమ్మసిల్లుట, అన్ని దశలలో గల రక్తపుపోటుల యందును, రొమ్ముపడిసెము, శ్వాస పడిసెము, చర్ది అంటువ్యాధుల యందును అమోఘముగా గుణమిచ్చును. కొరుకుసంబంధమైన పుండ్లయందుకూడ గుణము నిచ్చుచుండును. ప్రథమమున 5 సిసి ఔషధము ప్రారంభించి క్రమేణ 10 సిసిల వరకు యివ్వవచ్చును. వ్యాధికి ఔషధము సరిపడునా లేదా గ్రహించి 10 సిసి ఇంజక్షన్ రక్తనాళములోనే చేయవలయును. ప్రతిదినము ఇంజక్షన్ చేయవచ్చును. రక్తపుపోటుయందు మాత్రము అవసరమునుబట్టి ప్రతిదినము రెండు ఇంజక్షనుల చొప్పున చేయవచ్చును. ఇందు కాల్షియమ్ కూడ కలిసియున్నందున క్షయ వ్యాధులయందు కూడ అనుభవపూర్వకముగా గుణము నిచ్చుచున్నది. దీనిని సిప్లా కంపెనీ బొంబాయివారు తయారుచేయుచున్నారు.

## 145. క్యాంఫర్ ఇన్ ఆయిల్ విత్ యీథర్.

## Camphor in oil with Ether.

### కండరములందు చేయు ఇంజక్షన్.

1 సిసి, 2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇయ్యది గుండెకు చురుకుదనము కలిగించుటయందు పేరుపొందిన ఔషధరాజము. గుండెయొక్క బలహీనతలయందును, గుండె ఆగిఆగి కొట్టుకొను వేళలయందును, తరుణము పుట్టినప్పుడును, శరీరమున చలువలు క్రిమ్మినప్పుడున్ను, అన్ని దశలు మించిన తరుణ వ్యాధులయందును, అదుర్త, క్షీణ గతి లేక వాతప్రకోపమునందును, శరీరమునందుపూర్తిగ చలువలుగ్రమ్మినపుడు యే ఇంజక్షన్కూడ ప్రయోగించియును ప్రయోజనము లేనప్పుడు దీనిని ఉపయోగించినచో మంచి ప్రయోజనము కనుపించకతప్పదు. అవసరముకొద్ది వాడుక కలిగించుకొనవచ్చును. గుండెవ్యాధులయందును గొప్ప గుణమునిచ్చును. దీనిని కూడ సిప్లా కంపెనీ బొంబాయి వారు తయారు చేయుచున్నారు. పిల్లలయందుకూడ ఉపయోగకారి. 1 CC వాడుట మంచిది.

## 146. క్రొటాలిన్.

## Crotalin S. C.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

ఈ ఔషధము 1 సిసి తో నింపబడిన అంపుల్సు

మనకు లభించుచుండును. ఇయ్యది విషజంతువుల కాటు లందును, పాముకాటునందును మిక్కిలి గుణకారి. రక్త మూత్రిమను వ్యాధియందును, రక్తమును మూత్రముద్వారా పోనివ్వకుండ కాపాడుటకున్ను. కామిలఅను బెండిస్ వ్యాధియందును, మశూచియందును, సూతికా జ్వరముల యందును సూతికా జ్వరముచే కల్గు రక్తస్రావముల యందును, రక్తవాంతుల యందును, కుడిప్రక్కన వచ్చు పక్ష వాతములయందును, కామిలావ్యాధిచే గల్గు జ్వరములయం దును, గర్భాశయము ముడుచుకపోవుటచే కలుగు బాధల కున్ను, రక్తస్రావములు అరికట్టుటకున్ను ఈ ఇంజక్ష నిచ్చిన వెంటనే గుణము కనిపించుచుండును. దినముతప్పి దినము ఒక ఇంజక్షన్ యివ్వవచ్చును. వ్యాధిని బాగుగా గుర్తెరింగి ఇంజక్షన్ యిచ్చిన వెంటనే గుణము కనుగొన వచ్చును.

## 147. కార్డయూనిసిన్.

## Cardiouesine S. C. I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

ఇయ్యది 1 CC ఔషధముతో నింపబడిన అంపుల్సు వాడుకలో గలవు. ఈ ఇంజక్షన్ అవసరమునుబట్టి రక్త నాళములో కూడ చేయవచ్చును. ముఖ్యంగా అతిప్రమాద మైన వ్యాధి గుండెపోటులను వెంటనే నివారించుటకుగాను

బాగుగా తోడ్పడుచుండును. శ్వాసవ్యాధిచే బాధపడువారల యందును ఉపయోగపడును గాని నిదానంగా గుణము కను గొనవచ్చును. దీనియందు మంచి ప్రభావము కలిగియుం డుటచే గుండెపోటును తగ్గించి గుండెకు బలము కలిగిం చును. నీరసమును పారద్రోలుటకున్ను పనిజేయుచుండును. గుండెపోటును వెంటనే తగ్గించవలసిన యెడల రక్తనాళ ములో యీ ఇంజక్షన్ చేయవలసి యుండును. దీనిని కూడ పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

### 148. కార్డియో ఎఫెడ్రిన్.

### Cardioaphedrine S. C. & I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించును. ఈ ఇంజక్షన్ ప్రయో గించిన శ్వాసలయందు నమ్మకముగా గుణము నిచ్చుటే గాక ఘరల తిరిగి శ్వాసావరోధము గలుగకుండ కాపాడు శక్తి దీనియందు కలిగి యున్నది. ఒగర్పు, రొమ్ముపడి సెము, కాసలయందును, శ్వాసకోశమును శుభ్రపరచుట యందు మిక్కిలి యుపయోగపడును. అవసరమునుబట్టి ప్రతిదినమునకు రెండు మూడుసార్లు ఇంజక్షను చేయ వచ్చును. దీనిని కూడ సిప్లా కంపెనీవారే తయారు చేయు చున్నారు. ప్రత్యేకంగా శ్వాసవ్యాధులయందే గుణకారిగా యుండుటచే ఈ ఔషధము మిక్కిలి ప్రచారములోకి వచ్చి

యున్నది. గమనించి జాగ్రతతో మోతాదు హెచ్చించ కుండ చిన్నమోతాదుతోనే గుణము తెలిసికొనవచ్చును.

## 149. కార్ హోర్ మొన్.

## Corhormon I. M. & I. V.

కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

సిప్లా కంపెనీవారిచే తయారు చేయబడిన పై ఇంజక్షన్ 1 సిసి అంపుల్సు మనకు లభించుచుండును. ఇయ్యది ముక్కు, నోరు, కంఠము వీటియందు కలుగు వాపులు, పుండ్లు, చీముకారుట ఈ మొదలగు వ్యాధులయందును, విషపడిసెము, వాతపు నొప్పులయందును, గుండెపోటు యందును, రాచకురుపుల యందును, శ్వాసకాసల యందును, రక్తస్రావములయందును, పాండువ్యాధి లక్షణములయందును, విషపుపుండ్లు, గజ్జి వీటియందు రక్తము చెడుటచే కల్గు వ్యాధులయందును, పాండువ్యాధి, జ్వరము, రక్తక్షీణతల యొక్క అన్ని దశలయందు దీనిని ప్రయోగించవచ్చును. పై వ్యాధులను తగ్గించుటయేగాక మరల తిరిగి వ్యాధిని రాకుండ కాపాడేశక్తి ఈ ఇంజక్షన్‌యందు కలిగియుండుటచే పై వ్యాధులను తప్పక నివారింపగలదని నొక్కి చెప్పవచ్చును. రోగిబలము, రోగబలమును గుర్తెరింగి ఇంజక్షన్ చేయవలసి యుండును.

## 150. ఇనార్సన్.
Enersan I. M.
కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు గల పెట్టెలు లభించుచుండును. ఇయ్యది పక్షవాతములయందు బాగుగా గుణము నిచ్చును. పక్షవాతము ఒక ప్రక్క వచ్చినదానిని నివారించి బాధలు తగ్గించుటకుగాను, గొప్పగుణము నివ్వక తప్పదు. కొరుకు వ్యాధి అను సిఫిలిస్ మేహసంబంధమగు వ్యాధులయందు కూడ యిది బాగుగా పనిజేయును. వారములో మూడు నాలుగు సార్లు ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని సిప్లా కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 151. ఫెర్రియెట్ అర్సినీ.
Ferriet Areseni I. M.
కండరములో జేయు ఇంజక్షన్.

1 CC ఔషధముగల అంపుల్సు లభించుచుండును. కలరాను వాంతి భేదులయందును కాలా అజార్ అను వ్యాధిపైనను, పాండువ్యాధులయందును, మలేరియా (చలి జ్వరము) యందును, రక్తస్రావములయందును, ఋతుస్రావములయందును యీ ఇంజక్షన్‌ను ప్రయోగించిన బాగుగా గుణము నిచ్చుచుండును. దినముతప్పిదినము ఇంజక్షన్ చేయవచ్చును. ఆరు లేక పన్నెండు ఇంజక్షన్ల వరకు కోర్సుగా వాడుకజేసిన పై వ్యాధులనన్నిటిని తప్పక

నివారించును. దీనిని సిప్లా కంపెనీవారే తయారు జేయుచున్నారు.

## 152. గ్రేప్ సుగర్ సొల్యూషన్.

## Grape Sugar Solution I. V.

రక్తనాళములో చేయు ఇంజక్షన్.

10 CC, 25 CC అంపుల్సులు లభించుచుండును. ఏ వ్యాధిచేనైనను వాంతులు కలుగుచుండిన యెడల దీనిని ఉపయోగించినచో వెంటనే వాంతులు అరికట్టును. వాంతులు నివారించుటకు యిది గొప్పగా పేరుపొందిన ఔషధము. యేకారణముతో వచ్చిన వాంతులైనను నివారించకతప్పదు. గర్భవతులకు కలుగు వాంతులయందు కూడ ప్రకృతి నిదానము గ్రహించి ఇంజక్షన్ చేయవచ్చును. సన్నిపాత జ్వరములయందు కలుగు వాంతులకున్ను చలిజ్వరముల యందు కలుగు వాంతులకున్ను యిది బాగుగా గుణము నిచ్చును. అవసరమును బట్టి ఇంజక్షన్ చేయవచ్చును. సిప్లా కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 153. హమోసైటిన్.

## Hamocytin S. C. & I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

ఈఔషధముయొక్క 5CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది రక్తక్షీణతగల పాండువ్యాధులయందును, శరీ

రము తెలుపుబారుట, శరీరమునందు రక్తము లేకయుం డుట, నీరువాపులు కలుగుట ఈ వ్యాధులు గలవారికిచ్చిన మిక్కిలి ఉపయోగకారిగా యుండును. మఱియు జీర్ణశక్తి లేక యుండువారలకున్ను, మలేరియా (చలిజ్వరము)లయం దును, చలిజ్వరము తగ్గిన తర్వాత కూడ వాడుక జేయ వచ్చును. నీళ్ళవిరేచనముల యందును, ఋతుస్రావము అధికముగా అగుట, శ్వేతప్రదరము, బలహీనముచే కలుగు చుండెడి వ్యాధులయందు, బలహీనముచే కల్గు శ్వాసల యందును యిది గొప్ప గుణము నిచ్చుచుండును. ప్రతి దినము ఒక ఇంజక్షన్ గాని, దినముతప్పి దినముగాని చేయవచ్చును. మొత్తం కోర్సుగా పది ఇంజక్షన్‌లవరకు ఒక నెలరోజులలోపు చేయవలయును. పై చెప్పిన వ్యాధుల యందు మాత్రము అనుభవపూర్వకముగా గుణమునిచ్చును. ఈ ఔషధమును సిప్లా కంపెనీవారు తయారుచేసి మన కందించుచున్నారు.

## 154. హమో సైటిన్ విథౌట్ ఐరన్.

## Hamosytin S. C. I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

5 సిసి అంపుల్సు లభించుచుండును. ఈ ఔషధము మలేరియా అను చలిజ్వరములయందును, జిగట విరేచన ములు, నీళ్ళవిరేచనములయందును, చాలకాలమునుండి

బాధించుచున్న విరేచనములు, గ్రహణి వ్యాధులయందును, లుకోరియా అను శ్వేతప్రదరములయందును నమ్మకముగా గుణము నిచ్చును. ప్రతిదినముకాని లేక దినము తప్పి దినముగాని ఇంజక్షన్ చేయవచ్చును. పది ఇంజక్షనులు జేసిన కోర్సు అవును. దీనిని సిప్లా కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 155. హిపఫోలిన్.

## Hepa Folin I. M.

### కండరములో జేయు ఇంజక్షన్.

ఈ ఔషధముతో నింపబడిన 1 సిసి అంపుల్సులు దొరకుచుండును. ఇయ్యది పాండు వ్యాధుల యందును, రక్త క్షీణత గల వ్యాధులయందును, జీర్ణించిన మలేరియా జ్వరములయందును, ఇంకా అన్ని విధముల జ్వరములు వచ్చిన తర్వాత కల్గు బలహీనమునకున్ను, రక్త వృద్ధి జీర్ణశక్తిని కలిగించి, ఆరోగ్యముగా నుంచుటకున్ను నల్లజ్వరములకున్ను, రక్తములేక కల్గు నీరువాపులయందును, రక్తస్రావము, ముట్టుశూలల యందును, మూల వ్యాధులయందును, కొరుకు పుండ్లయందును, శ్వాసల యందును, మశూచికా వ్యాధులయందును, న్యూమోనియా అను శ్లేష్మవాత జ్వరముల యందును, రక్తము శుద్ధి లేక

క్లు రుగ్మతల యందును, తిరిగి రక్తశుద్ధి జేయుటకును, రక్తవృద్ధి కలిగించుటకును, ప్రసవానంతరముకలుగురక్త క్షీణతలకున్ను ఉపయోగించిన బాణముగాగుణమునిచ్చును. వ్యాధి ప్రకృతిని, దేశకాలపరిస్థితిని గమనించి నిదానముగా ఇంజక్షన్ చేసిన పై రుగ్మతలు తప్పక నివారించును. పాండు రుగ్మతల యందు మాత్రము దీనిని కోర్సుగా వాడవలెను. అట్లు వాడుటచే పాండువ్యాధి తప్పక నివారించును. రెండురోజులకొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనినికూడా సిప్లా కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 156. లాకోలాన్.

## Lakolan I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 CC & 5 CC అంపుల్సులు లభించును. ఈ ఇంజక్షన్ మేహవాతముల యందును, మేహవాతపు నొప్పుల యందును, నరముల నొప్పులయందును బాగుగా గుణమునిచ్చును. శ్వాస, రాచకురుపులు, మూగగజ్జి, యితర విధముల మేహ సంబంధమగు పుండ్లయందు యిది బాగుగా పనిజేయును. మూడు నాలుగు దినముల కొకసారి ఇంజక్షన్ జేయవచ్చును. సిప్లా కంపెనీవారిచే తయారు చేయబడినది.

## 157. అయిడో లాకోలాన్.

## Iodolakolan I. M.

## కండరములో చేయు ఇంజక్షన్.

5 సిసి అంపుల్సు లభించుచుండును. ఈ ఔషధము కూడ లాకోలాన్ మాదిరిగానే గుణము నిచ్చును. లాకోలాన్‌కన్న రెండింతల అధికగుణము నిచ్చును. మూడు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. సిప్లా కంపెనీ వారు తయారు చేయుచున్నారు.

## 158. న్యూట్రోటోన్.

## Nutrotone I. V.

## రక్తనాళములో చేయు ఇంజక్షన్.

ఈ ఔషధముతో నింపబడిన 10 సిసిల అంపుల్సు మనకు లభించును. ఇయ్యది జీర్ణశక్తి లేనివారలకు జీర్ణశక్తిని కలిగించుటకు మిక్కిలి యుపయోగకారి. న్యూమోనియా అను శ్లేష్మవాత జ్వరములయందును, ఇన్‌ఫ్లూయింజా విషపడిసెములయందును, సన్నిపాత జ్వరములయందును, విషజ్వరములయందును, క్షయవ్యాధులయందును, క్షయవ్యాధులయందు కలుగు జ్వరము తగ్గుటకున్ను, అన్నివిధముల జ్వరములు తగ్గడానికిన్ని ఈ ఇంజక్షన్ ప్రయోగించవచ్చును. మధుమేహవ్యాధులయందును, సూతికాజ్వరములయందును, బాలింతలకు కల్గు జ్వరములయందును, జీర్ణం

చిన మలేరియా జ్వరమునందును, పాండు వ్యాధుల యందును, చిన్నబిడ్డలకు కల్గు గుణములయందును యీ ఇంజక్షన్ నీయవచ్చును. చిన్నబిడ్డలకు రక్తనాళములో నీయరాదు. కండరములో నివ్వవచ్చును. దీనినికూడ సిప్లా కంపెనీవారే తయారు చేయుచున్నారు.

### 159. ఒపాసోడిన్.

### Opsodin S. C. I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

2 సిసి ల ఔషధముతో నింపబడిన అంపుల్సు లభించును. సన్నిపాత జ్వరములయందును, విషపడిసెములయందును, న్యూమోనియాయందు కలుగు రొమ్ము నొప్పులయందును, "టాన్‌సిల్సు" గొంతులో కండలు పెరుగుదానికిన్ని, యితర విధముల జ్వరములయందును, దద్దురుల రోగములయందును, రాచకురుపుల యందును, ఈ ఇంజక్షన్ యిచ్చినచో బాగుగా గుణము నిచ్చును. రెండు మూడు దినముల కొక ఇంజక్షన్ చొప్పున నీయవచ్చును. సిప్లా కంపెనీవారే తయారు చేయుచున్నారు.

### 160. ఫోస్‌ఫోటోన్.

### Phosphoton S. C. I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

2 CC ల అంపుల్సులు లభించుచుండును. ఇయ్యది నరములయొక్క పోటుయందును, నిస్సత్తువలయందును,

పండ్ల నొప్పులయందును, పాండు వ్యాధుల యందును, శ్వాసలయందును, నరములకు బలము కలిగించి, నిస్సత్తువ లను నివారించుటకుగాను బాగుగా గుణము నిచ్చును. రెండు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. మొత్తం పది ఇంజక్షన్‌లు చేసినచో కోర్సు అగును. దీనిని కూడ పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

161. క్వినో కాల్షిమా.
Qino Calcima I. M. V.
కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 CC & 5 CC అంపుల్సు దొరకు చుండును. రొమ్ము పడిసెముల యందును, రొమ్ము నొప్పుల యందును, న్యూమోనియా అను శ్లేష్మవాత జ్వరములయందును సన్నిపాత జ్వరములయందును, సూతికా జ్వరములయందును, విషపడిసెములయందును, క్షయ వ్యాధిచే వచ్చెడు జ్వరములయందును, ఈ ఇంజక్షనిచ్చిన బాగుగా గుణము నిచ్చును. రెండు దినముల కొక ఇంజక్షన్ చొప్పున నీయ వచ్చును. దీనినికూడ పై కంపెనీవారే తయారు చేయు చున్నారు.

162. సెప్టొసిల్ అల్బమ్.
Septocil Album S. C. I. M. I. V.
చర్మముక్రిందను, కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. ఈ ఔషధము గనేరియా అను అంటుజాడ్యములయందు నమ్మకముగా గుణము నిచ్చుచుండును. దద్దు రోగముల యందును, సూతికా వ్యాధి యందును, అన్ని విధములైన గనేరియా వ్యాధులను రూపుమాపు ననుటకు సందేహములేదు. ప్రతి దినమొక ఇంజక్షను చొప్పున నీయవచ్చును. దీనిని కూడ పై కంపెనీవారే తయారుచేసి మనకందించుచున్నారు.

163. స్ట్రామిటిన్.

Stremetine I. M.

కండరములందు చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది జిగట విరేచనములు, నీళ్ళ విరేచనములు, అజీర్ణముచే నగు విరేచనములు, లీవర్ వ్యాధులు, లీవర్‌నందు పుండు ఈ మొదలగు వ్యాధులను మాన్పుటకున్ను, గ్రిహణి, ఆమాతిసారములను తగ్గించుటకున్ను, యీ ఇంజక్షన్ యిచ్చిన వెంటనే గుణము నిచ్చును. ఇయ్యది సిప్లా కంపెనీవారే తయారు చేయుచున్నారు.

164. టొటాలిన్ బి-కాంప్లక్స్.

Totalin B-Complex I. M.

ఈ ఔషధముతో నింపబడిన 10 సిసి బుడ్డి లభించును. అవసరముకొద్ది వాడుక జేయవచ్చును. ఇయ్యది

కండరములో చేయు ఇంజక్షన్. తిమురు వాతముల యందును, వాతపు నొప్పులయందును, నరముల బలహీనములయందును, నరముల నొప్పులయందును, పాండు వ్యాధులందును, రక్తక్షీణతలయందును, శరీరమునందు రక్తము లేక యేర్పడుచుండెడి నీరు వాపులయందును, వ్యాధులు కలిగిన తరువాత యేర్పడు బలహీనతల యందు పై ఇంజక్షన్‌ను ప్రయోగించినచో వ్యాధులన్నింటిని నివారించి బలము, జీర్ణశక్తి కలిగించును. మరియు శరీరమునందు నొప్పులు గలవారలకున్ను రక్తము లేనివారలకున్ను రక్త వృద్ధి కలిగించుటకున్ను పనికి వచ్చును. దీనిని ప్రయోగించిన యేవ్యాధి రాకుండకాపాడి ఆరోగ్యవంతులుగా జేయుటకు దీనియందు మంచిశక్తి కలదు. పాండువ్యాధులయందు మొత్తం ఒక కోర్సువాడి వ్యాధి నివారించిన తర్వాత కూడ వాడుక జేయవలసియుండును. దినము తప్పి దినము ఇంజక్షను చేయవచ్చును. దీనిని పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 165. యిస్టోరైడ్.

## Estorid I. M.

### కండరములందు చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. ఈ ఇంజక్షన్ ఋతు స్రావములయందును, ఋతుశూలలందును గుణము నిచ్చును. రక్తస్రావములను అరికట్టును. రక్త వాంతుల

యందుకూడ ఉపయోగించవచ్చును. గర్భక్షయ వ్యాధుల యందు యిది బాగుగా గుణమునిచ్చును. దీనిని యూనికమ్ లేబొరేటరీస్ బొంబాయివారు తయారు చేయుచున్నారు.

166. మాస్సివ్ డి. ఐ. యం.

Massive D. I. M.

కండరములో చేయు ఇంజక్షణ్.

1 CC అంపుల్సు లభించుచుండును. క్షయవ్యాధుల యందును, ఎముకల బలహీనముల యందును, క్షయ వ్యాధిచే గల్గు బలహీనములయందును, యిది గొప్ప గుణ కారి. చిన్నపిల్లలకు ఎముకలు ఎదుగుటకుగాను ఈ ఇంజక్ష నిచ్చిన తప్పక గుణమునిచ్చును. దీనిని యూనికమ్ లేబొ రేటరీస్‌వారు తయారు జేయుచున్నారు.

167. పాపకోడిణ్.

Papacodein I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. శూలనొప్పుల కును, శ్వాసకాసలకును, గుండెనొప్పులకును, గుండెపోటు నొప్పులకును, రొమ్ముపడిసెములకును, రాచకురుపులకును ఈ ఇంజక్షను నమ్మకముతో ప్రయోగించ వచ్చును. ఇప్పుది యూనికమ్ లేబొరేటరీస్ వారిచే తయారు చేయ బడుచున్నది.

### 168. పాపఫైలిన్.

### Papaphylin I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. ఈ ఇంజక్షన్ యిచ్చినచో గుండెపోటును నమ్మకముగా నిర్మూలించును. శ్వాసలయందు కూడ ఫలమిచ్చును. ఆమ్లపిత్త వ్యాధులను బాగుపరచును. దీనిని కూడ యూనికమ్ లేబొరేటరీస్‌వారే తయారు చేయుచున్నారు.

### 169. యూని బి, కాన్‌సెన్‌ట్రేటెడ్.

### Uni B. Concentrated I. M. I. V.

### కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

10 సిసి బుడ్డి లభించుచుండును. ఇయ్యది తిమురు వాతములయందును, శరీరమునందు గల నొప్పులను నివారించుటకుగాను, పాండు వ్యాధులయందును, నంజువ్యాధులయందును, రక్తక్షీణతల యందును బాగుగా గుణమునిచ్చును. యూనికమ్ లేబొరేటరీస్‌వారు తయారు జేయుచున్నారు.

### 170. యూనిఫెరోన్.

### Uni Feron I. V.

### రక్తనాళములో చేయు ఇంజక్షన్.

5 సిసి అంపుల్సు దొరుకుచుండును. ఇది పాండు

వ్యాధులయందు ప్రత్యేకముగా గుణము నిచ్చును. అన్ని విధముల రక్తములేని వ్యాధులయందు కూడ దీనిని ఉపయోగించవచ్చును. రక్తవృద్ధి జేయుటకున్ను, పాండు వ్యాధిని నివారించుటకున్ను యిది గొప్ప ఔషధము. కొన్ని దినముల వరకు ఇంజక్షన్లు చేయవలసి యుండును. యూనికమ్ లేబరేటరీస్‌వారు తయారు చేయుచున్నారు.

## 171. యూని పైరిడవోక్సిన్.

## Uni Pyridoxin I. M. I. V.

రక్తనాళములోను, కండరములోను చేయు ఇంజక్షన్.

2 సిసి, 10 సిసి దొరుకుచుండును. ఈ ఇంజక్షన్ పక్షవాతములను తగ్గించుటకు బాగుగా తోడ్పడుచుండును. కాళ్ళు చేతులు స్వాధీనము లేనివారలయందును, వాతపు నొప్పులయందును గొప్ప గుణకారి. వాంతులు తగ్గించుటకుగాను బాగుగా తోడ్పడును. దీనిని కూడ యూనికమ్ లేబొరేటరీస్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 172. యూని పెతాడిన్.

## Uni Pethidin S. C. I. M. I. V.

చర్మముక్రిందను, కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. అన్నివిధములైన నొప్పులను నివారించుటకును, నరముల నొప్పులు,

వాతపునొప్పులు, శూలనొప్పులు, కొరుకుపుండ్లు, మరి యే యితరవిధముల నొప్పులయందును యిది బాగుగా గుణము నిచ్చును.

## 173. యూని పన్టోటాణ్.

## Uni Pantothin I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. నరములయొక్క బలహీనముల యందును, శరీరపటుత్వము లేనివారికిని, తిమురువాతముల యందును, శరీరమందలి నొప్పులకును యింకా ఇతర విధముల వాతపునొప్పులయందును ఈ ఇంజక్షణ్ను ప్రయోగించిన నమ్మకముగా గుణము కనుపించును. యూనికమ్ లేబొరేటరీవారే తయారుచేయుచున్నారు.

## 174. యూ ని రై జ్.

## Uni Progestine I. V.

రక్తనాళములో చేయు ఇంజక్షణ్.

5 CC అంపుల్సు లభించుచుండును. ఇది స్త్రీలకు సంభవించెడి రక్తస్రావములయందు బాగుగా గుణము నిచ్చును. చిరకాలమునుండి రక్తస్రావము గలవారలకు దీనిని ఉపయోగించిన తప్పక రక్తస్రావము నివారింపజేసి రక్తమును వృద్ధిగావించును. కొన్ని దినములవరకు నీ ఇంజక్షణ్లు వాడుచుండ వలయును.

## 175. యూనిసోడిలక్టు
## Unisodilact I. V.
రక్తనాళములో చేయు ఇంజక్షన్.

10 CC అంపుల్సు లభించుచుండును. ఇది జలోదరములయందు బాగుగా గుణమునిచ్చును. జలోదరమును తగ్గించి మరల రాకుండ జేయుటకు బాగుగా తోడ్పడుచుండును. పై కంపెనీవారే తయారుచేయుచున్నారు.

## 176. హైపారిన్.
## Hyperin.
చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. దవుడలు కదులకపోవుట (ఇది ఒక వాతమునకు సంబంధించిన వ్యాధి) దవుడలు కదుపకపోవు వారలకు ఈ ఇంజక్షన్ ప్రయోగించిన వెంటనే గుణము నిచ్చును. నరముల వ్యాధులయందును, నరములనొప్పులయందును, నరములకు, బలము కలిగించుటకున్ను, ఇది బాగుగా తోడ్పడుచు అన్ని విధముల వాతపు నొప్పులయందును, బాధలయందును, ధనుర్వాతములయందును, కీళ్ళవాతములయందును, వాతము ప్రకోపించుటచే కల్గు అన్ని లక్షణములయందును యిది గొప్ప గుణకారి. బాధలు తగ్గించివేయుటకుగాను యిది బాగుగా తోడ్పడుచుండును. ధనుర్వాతములయందు దీనిని

చాలాకాలము ఉపయోగించవలసి యుండును. పూర్తిగా వ్యాధి నివారించిన తర్వాత కూడ నాలుగైదు ఇంజక్షన్లు వాడుక జేసినచో మరల వ్యాధిని రాకుండా కాపాడుశక్తి దీని యందు కలదు. ప్రతిదినము ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనిని లక్సిన్ లేబొరేటరీసువారు తయారు జేసి మనకందించుచున్నారు.

## 177. లెక్సిన్.

## Lexin I. V.

### రక్తనాళములో చేయు ఇంజక్షన్.

ఇయ్యది పాము కరచినవారి కిచ్చినవెంటనే విషమును దించి గుణము నిచ్చును. రక్తనాళములో చేయవలెను. పామువిషము శరీరమునకు పారునప్పుడు ప్రాణాపాయము గానీయకుండ ఈ ఇంజక్షన్ కాపాడగలదు. పాముకరచి మరణావస్థలో నుండువారలకుకూడ ఇంజక్షన్ చేసినవెంటనే దీని ప్రభావము కనబరచును. అన్నివిధముల పాము కరచినవారలకు దీనిని ఇంజక్షన్ చేసిన తోడనే విషమును విరచివేయును. పొరపాటున నల్లమందు తినిన వారలకు నల్లమందు విరుగుడుగా యిది పనిజేయును. సమస్త విషజంతువుల కాటులయందు కూడ గుణము నిచ్చును. ఆదుర్దను తగ్గించును. కలరా వ్యాధులయందు కూడ దీనిని వాడుక జేయవచ్చును. కలరాను వెంటనే

తగ్గించివేయును. కలరాయందు 1CC వాడవలయును. దీనిని కూడ లక్ప్మణ్ లేబొరేటరీస్‌వారు తయారు చేయుచున్నారు.

178. మైక్రోకోప్రమ్.

Microcuprum I. M. S. C.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. పాండువ్యాధుల యందును, రక్తక్షీణతలయందును, శూలనొప్పుల యందును, చిన్నబిడ్డలకు కలుగు పిడికిలి వాతములయందును, ధనుర్వాతముల యందును, చిరకాలమునుండి బాధించునట్టి ధనుర్వాతములయందును, పక్షవాతముల యందును, కాళ్ళు చేతులు స్వాధీనమునందు లేని వాత వ్యాధులయందును, మూర్ఛలయందును, కలరా అను వాంతి బేధులయందును పై ఇంజక్షను యిచ్చిన తోడనే వ్యాధిని నిర్మూలము గావించును. కోరింతదగ్గు యేమందుచేచే తగ్గనిది ఈ ఇంజక్షన్‌తో తగ్గును. మొండి వాతములయందును దీనిని క్రమేణ వాడుచుండిన తప్పక వ్యాధి నివారించక తప్పదు. ప్రతిదినము లేక రెండు దినముల కొకతూరి ఒక ఇంజక్షను చొప్పున వాడుక జేయవచ్చును. దీనినికూడ లక్ప్మణ్ లేబొరేటరీసువారే తయారు చేయుచున్నారు.

179. మైక్రోఫెర్రంఫాస్.

Micro Ferrumphos S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC మరియు 2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది అన్నివిధముల జ్వరములయందును గుణము నిచ్చుచుండును. క్షయవ్యాధులయందును, కల్గు జ్వరముల యందును, రాత్రిపూట వచ్చు జ్వరములయందును, దొంగ జ్వరములయందును, వరుస జ్వరములయందును, శ్లేష్మ వాత జ్వరములయందును, సన్నిపాత విషమ జ్వరముల యందును, నవజ్వరములయందును, ప్రయోగించిన తప్పక గుణము నిచ్చును. ప్రథమావస్థలో గల ముట్టు శూలల యందును, వాపులు గలవారలయందును, విషపడిసెముల యందును ఈ ఇంజక్షన్ బాగుగా ఉపయోగపడుచుండును. చిన్నపిల్లలకు మాత్రము 1 CC ఔషధము వాడుక జేయ వలెను. ఎక్కువ మోతాదు వాడుటచే ప్రమాదము సంభ వించును. వయస్సు ననుసరించి వాడుట మంచిది. జ్వరము యెక్కువగా యున్నచో పన్నెండు గంటల కొకతూరి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 180. మైకోప్రుట్ క్లోరైడ్.

Micropot Chloride (k. c. l.) S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 సిసి, 2 సిసి అంపుల్సు లభించుచుండును. మేహ వాతముల యందును, వాత రుగ్మతల యందును, వాత

జ్వరములయందును, శ్లేష్మ వాత జ్వరముల యందును, కీళ్ళ నొప్పులయందును, ప్రథమ దశల వాపునొప్పులు గల వాత రుగ్మతలయందును, బాధతో కూడిన వాతపు నొప్పుల యందు ఈ ఇంజక్షన్ యిచ్చిన వెంటనే బాధలు నివారించును. శ్లేష్మ వాతజ్వరములయందు రొమ్మునొప్పుల కున్ను, ప్రక్కనొప్పులకున్ను దీనిని ఉపయోగించవచ్చును. వాతపు నొప్పులు రాకుండ జేయుటకు దీనిని చాల దినములు వాడుకజేయవలసియుండును. ప్రకృతిని గమనించి ఈ ఇంజక్షన్ యిచ్చుచుండవలెను. వాతమునకు సంబంధించిన అన్ని నొప్పులయందు దీనిని వాడుక జేయవచ్చును. తప్పక గుణము కనుపించును. దీనినికూడ లక్ష్మీ లేబొరేటరీసువారు తయారు చేయుచున్నారు.

## 181. మైక్రో కాల్షియమ్ పాస్.

## Micro Calcium Phos S. C.

## చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC, 2 CC అంపుల్సు లభించుచుండును. దీర్ఘ వ్యాపితమగు అతిసార విరేచనముల యందును జీర్ణించిన వాత రుగ్మతలయందును, అన్నివిధముల వాతముల యందును, కీళ్ళనొప్పులు, నరముల నొప్పులు, నడుము నొప్పులు, కాళ్ళు చేతులయందు నొప్పులు, కండరముల యందు కలుగు నొప్పులయందును, నరముల బలహీనతల

యందును, తలనొప్పుల యందును, రొమ్ము నొప్పుల యందును, చిన్నబిడ్డ గుణములయందును, చిన్నబిడ్డలకు కలుగు సమస్త వాతములయందును, పక్షవాతముల యందును, క్షయవ్యాధిచే యేర్పడు బలహీనతల యందును, యీ ఇంజక్షను నమ్మకముగా గుణమునిచ్చును. చిరకాలము బాధించుచున్న అతిసార విరేచనములను నివారించుటకు యిది బాగుగా తోడ్పడుచుండును. రెండు దినముల కొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనినికూడ పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 182. మైక్రో ప్లంబమ్.

## Micro Plumbum S. C.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. పక్షవాతముల యందు మిక్కిలి అమోఘముగా గుణము నిచ్చును. పక్షవాతముచే కలుగు బాధలు శమింప జేయుటకున్ను, సుఖనిద్ర పట్టించుటకున్ను, పక్షవాతముచే కాళ్ళు చేతులు స్వాధీనము లేక యుండునప్పుడు ఈఔషధప్రయోగమున రోగియొక్క కాళ్ళు చేతులు స్వాధీనపరచి, మరల వ్యాధి రాకుండ కాపాడును. శూలనొప్పులయందుకూడ ఇది మంచి గుణమునిచ్చును. శూలనొప్పులబాధ అయాసమునుతగ్గించి వేయును. శూలలయందు చాలాఇంజక్షనులు వాడవలసియుం

డును. అంతరవృద్ధిని నివారించుటలోను పేరుగాంచిన ఇంజక్షను ఇదియే. శూలలయందు అవసరమునుబట్టి బాధలు నివారించేవరకు గంటకొక ఇంజక్షన్ యివ్వవచ్చును. దీనినికూడ పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

183. మైక్రో మేగ్నీషియమ్ ఫాస్.
Micro Magnesium phos S. C.
చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 సిసి, 2 సిసి అంపుల్సు దొరుకుచుండును. ఇయ్యది గర్భకోశ వ్యాధులయందు ముఖ్యముగా గుణమునిచ్చును. ముట్టు శూలలను నివారించుటకు గాను దీనియందు మంచి శక్తికలదు. ముట్టుశూలల బాధలు వెంటనే నివారించి తిరిగి శూలరాకుండ కాపాడగలదు. గర్భకోశమునకు సంబంధించిన వ్యాధులయందు కూడ గుణము నిచ్చుచున్నది. కడుపు నొప్పులయందు కూడ యిది బాగుగా గుణము నిచ్చును. కోరింత దగ్గులయందు, మరి యే ఇతరవిధముల దగ్గులయందుకూడా దీనిని వాడుక జేయవచ్చును. కలరా వ్యాధులయందు వెంటనే గుణము కనుపించును. కలరా వ్యాధిని నివారించుటకు యిది బాగుగా తోడ్పడుచుండును. ముట్టుశూలలు కడుపునొప్పులయందు నొప్పులుగలప్రాంతమున యిది తిమ్మిరి కలిగించి నొప్పిలేక యుండునట్లు జేయును. ఆరుగంటల కొకసారి గాని పన్నెండు గంటల కొకసారిగాని ఒక ఇంజక్షన్ చేయవచ్చును.

## 184. మైక్రో స్టానుమ్.

## Micro Stannum S. O.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 సిసి, 2 సిసి అంపుల్సు లభించును. యిదికూడ శూలనొప్పులయందే గుణము నిచ్చును. సమస్త శూల నొప్పులయందు దీనిని వాడుక జేయవచ్చును. శూలలను నివారించుటకు యిది బాగుగా తోడ్పడును. ఆవలింతలతో కూడుకొని వచ్చు శూలనొప్పులయందును యితరవిధముల శూలలయందు ఉపయోగకారి. నాల్గు అయిదు దినముల కొకసారి ఇంజక్షను చేయవచ్చును.

## 185. మైక్రో అయాడుమ్.

## Micro Iodum S. C.

1సిసి, 2సిసి అంపుల్సు దొరుకును. చర్మముక్రింద చేయు ఇంజక్షన్. ఇది శరీరమునందు అచ్చటచ్చట గాని గొంతు భాగమందు గాని యేర్పడు కణుతుల పైనను, గండమాలలయందును గొప్ప గుణమునిచ్చును. అయిదు దినముల కొక ఇంజక్షను చేయవచ్చును.

## 186. మిజ్ కో.

## Mezko I. M. S. C.

చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షన్.

1 సిసి 2సిసి అంపుల్సు లభించుచుండును. ఇయ్యది కుష్ఠువ్యాధులయందు నమ్మకముగా పనిజేయును. కుష్ఠును

నివారించుటకు బాగుగా తోడ్పడుచుండును. బొల్లి శ్వేత కుష్ఠులయందును అన్నివిధముల కుష్ఠువ్యాధుల యందును దీనిని ఉపయోగించవచ్చును. చిన్నపిల్లలకు 1 సిసి చర్మము క్రిందను పెద్దవారికి 2 సిసి కండరములోను వారమున కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును.

## 187. పైరోల్.

## Pyrol S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. సూతికా వాత జ్వరముల యందును, లోజ్వరములయందును, జీర్ణించిన జ్వరములయందును, సన్నిపాత జ్వరములయందును, దీర్ఘ వ్యాపితమగు అతిసార విరేచనముల యందును యిది గొప్ప గుణమునిచ్చును. రెండు దినముల కొకసారి ఇంజక్షను చేయవచ్చును. దీనినికూడ లక్ష్మీన్ లేబొరేటరీసువారే తయారు చేయుచున్నారు.

## 188. రైనాక్సిన్.

## Rynoxin I. M. S. C.

కండరములోను, చర్మముక్రిందను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది వ్రణములు, పుండ్లు, కొరుకుపుండ్లు, బాధతోకూడిన పుండ్లు,

విషపుండ్లు మొదలగు పుండ్లయందు గొప్ప గుణకారిగా పనిజేయును. రక్తస్రావమును తగ్గించుటకు, క్రిములను నశింపజేయుటకును, మరియు మాంస గ్రంథులయందు కల్గు పుండ్లయందును, పుండ్లు కల్గినప్పుడు నొప్పులచే బాధ పడువారలయందును, కొరుకుపుండ్లు మాన్పుదల లేనప్పుడును, కొరుకుపుండ్లను మాన్పుటకున్ను, చర్మసంబంధమైన గజ్జియందును, రక్తము శుద్ధిలేక కల్గు చర్మవ్యాధుల యందును రక్తము శుద్ధిజేసి మరల చర్మవ్యాధులు రాకుండ కాపాడుటకును ఇది బాగుగా గుణము నిచ్చును. రెండు దినములకొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని పై కంపెనీ వారే తయారు చేయుచున్నారు.

## 189. స్ట్రామోజిన్.

## Stramogen I. V.

### రక్తనాళములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది టైఫాయిడ్ అను సన్నిపాత జ్వరములయందు గొప్ప గుణకారి. సన్నిపాత జ్వరములయొక్క అన్ని లక్షణములయందు దీనిని ఉపయోగించవచ్చును. వెర్రికుక్క కరచిన విషమునకున్ను యిది విరుగుడుగా పనిజేయును. దినముతప్పి దినము ఇంజక్షన్ చేయవచ్చును.

## 190. టారన్ టొలిన్.

Tarantulin S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. కాళ్ళు చేతులు స్వాధీనమునందుండి కూడ గంతులు వేయువారలకున్ను, వ్రణములు పుండ్లు కురుపులయందును, రాచకురుపులు, మాంసమును క్రుళ్ళింపచేయుట లేక తినివేయునట్టి పుండ్ల యందును, యితర విధముల విషపుపుండ్లయందును ఇది బాగుగా గుణము నిచ్చుచుండును. నాలుగు దినముల కొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును.

## 191. థియొజిన్.

Thio Gen I. M.

కండరములలో జేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. సెగవ్యాధుల యందును, సెగ గడ్డలయందును, వ్రణములు, కురుపులు, గనేరియా క్రిములను సంహరించుటకున్ను, జీర్ణించిన వ్రణములు పుండ్లయందును, యితర విధములగు పుండ్ల యందును యిది బాగుగా ఉపయోగపడుచుండును. రెండు దినముల కొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును.

## 192. టుబర్కులిన్.

Tuberculin (G.B.B.) S. C. I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు దొరకుచుండును. ఇది రాజయక్ష్మ అను క్షయ వ్యాధులయందు బాగుగా గుణము నిచ్చును. క్షయవ్యాధిని నివారించుటకుగాను దీనియందు మంచి శక్తికలదు. కుష్ఠ వ్యాధులయందును, మూగగజ్జి యందుకూడ పనిజేయగలదు. గమనించి ఇంజక్షన్ చేయవలెను.

## 193. టైఫోల్.
## Tyfol S. C.
### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు దొరకుచుండును. ఇయ్యది సన్నిపాత జ్వరములయందు గొప్ప గుణకారి. సన్నిపాత జ్వరములయందు కల్గు లక్షణములయందు దీనిని ఉపయోగించవచ్చును. విషజ్వరములయందును, అధిక జ్వరములయందును, జీర్ణించిన జ్వరములయందును, త్రాగుబోతులకు కల్గు సంధి గుణములయందును యిది గొప్ప గుణకారి. ప్రతిదినము ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనిని పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 194. వెర్లిన్.
## Verlin S. C. I. M.
### కండరములోను, చర్మముక్రిందను చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. రక్తక్షీణతగల వ్యాధులయందును, పాండు వ్యాధులయందును, పుపుస

వేష్ట్రపు వాపులయందును, క్షయ వ్యాధులయందును, క్షయ వ్యాధులచే కలుగు అన్ని లక్షణములయందును, పాండు వ్యాధిని నివారించి మరల రాకుండ కాపాడుటకును యీ ఇంజక్షను వారమునకు ఒకటి చొప్పున వాడవచ్చును.

## 195. విర్లిన్ పర్పల్.

## Verlin Purple I. M. I. V.

### రక్తనాళములోను, కండరములోను చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది క్షయ వ్యాధికొరకు మాత్రమే ముఖ్యముగా తయారు చేయబడిన ఔషధము. క్షయవ్యాధిచే గలుగు జ్వరము, దగ్గులయందును యిది బాగుగా గుణము నిచ్చును. అవసరమునుబట్టి ఇంజక్షన్ చేయవలెను.

## 196. విపార్ వినూమ్బి.

## Vipervenomb S. C.

### చర్మముక్రింద చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. సెగ గడ్డలకును, వ్రణములకును, పుండ్లకును, రుదరివాతమునకును, ఎముకలు బలహీనముగా గల చిన్నపిల్లలకును, రొమ్ము నొప్పులకును, మూర్ఛవ్యాధులకును, రక్తస్రావములకును, ఈ ఇంజక్షను బాగుగా గుణమిచ్చును. వారమునకు ఒక ఇంజక్షన్ మాత్రమే చేయవలెను.

## 197. విటోన్.

## Viton I. M.

### కండరములో జేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించును. బాధించునట్టి మలేరియా వ్యాధులకు, సర్వ జ్వరములకు, రక్తవాంతులకు, మూత్రములో రక్తము వెడలునందులకు, యితర విధములచే గలుగు వాంతులకును, స్ప్లీన్ లీవర్ వ్యాధులకును యిది గొప్ప గుణకారి. అయిదు దినముల కొక ఇంజక్షన్ చేయవచ్చును. లక్ష్మీన్ లేబొరేటరీస్ కంపెనీవారిచే తయారు చేయబడుచున్నది.

## 198. బారాఫోల్.

## Barafol I. M.

### కండరములందు చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు, 10 CC వైల్సు లభించుచుండును. ఇయ్యది రక్తక్షీణతవల్ల గలుగు పాండువ్యాధులయందును, వ్యాధి జీర్ణించి బాధలు కలిగించెడి జ్వరములయందును, శరీరమునందు రక్తములేక శరీరమంతయు శ్వేతవర్ణముగా మారిపోవుదానియందును, రక్తములేక నీరువాపులు యేర్పడు వాటియందును, శరీరమునందు నొప్పులు బలహీనము గలవారలకు తిరిగి బలము కలిగించుటకున్ను, రక్తము వృద్ధి గావించుటకున్ను, వ్యాధులచే బాధపడి

తగ్గిన తర్వాత రక్తమును వృద్ధిపరచి జీర్ణశక్తిని కలిగించుటకున్ను, పాండువ్యాధులను నివారించి తిరిగి రాకుండ జేయుటకున్ను ఇందు గొప్పగుణము కలదు. 1 CC నుండి 3 CC వరకు దినము తప్పి దినము వాడుక జేయవలసియుండును. దీనిని ఆంగ్లో ఫ్రెంచి డ్రగ్ కంపెనీ లిమిటెడ్ బొంబాయివారు తయారు చేయుచున్నారు.

## 199. బిప్లక్సు.

## Beplex I. M.

## కండరములో చేయు ఇంజక్షన్.

2CC అంపుల్సు లభించుచుండును. ఇయ్యది తిమురు వాతములయందు మిక్కిలి అమోఘముగా గుణమునిచ్చును. తిమురువాతములను నివారించుటేగాక మరల రాకుండ కాపాడును. జీర్ణశక్తిలేక బాధ పడువారలకు క్రిమేణ జీర్ణశక్తి నిచ్చి ఆకలి పుట్టించి ఆరోగ్యవంతులుగా జేయుటకు ఇది మిక్కిలి ప్రయోజనకారి. శరీరమునందు రక్తము లేక యేర్పడు నంజు వాపులను నివారించి రక్తమును వృద్ధిజేయును. శరీరమునందు బలహీనముచే యేర్పడు నొప్పులను నిర్మూలము గావించును. నరముల నొప్పుల యందును, అన్నివిధముల వాతపు నొప్పులయందును పని జేయును. ప్రతిదినము ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని ఆంగ్లోఫ్రెంచి డ్రగ్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 200. బిప్లెక్సు ఫోర్టు.

Beplex Forte I. M.

కండరములందు చేయు ఇంజక్షన్.

1సిసి అంపుల్సు 10 సిసి వైల్స్ దొరుకుచుండును. ఇది పాండు వ్యాధులయందు మిక్కిలిగుణమునిచ్చి వ్యాధిని తప్పక నివారింపజేయును. లీవర్ వ్యాధులయందు కూడ యిది బాగుగా గుణమునిచ్చును. జీర్ణశక్తి పుట్టించి అజీర్ణమును నివారింపజేయును. బలహీనముగా యున్నప్పుడు దీనిని వాడి తిరిగి బలము పొందవచ్చును. వాంతుల యందును, పుల్లని త్రేపులయందు కూడ యిది మంచి గుణము నిచ్చును. యే దశలోనున్నను పాండువ్యాధి కొరకైనను దీనిని తప్పక వాడుక జేయవచ్చును. రక్తము లేనప్పుడు కలుగు లక్షణముల యందును, నీరు వాపుల యందును, శరీరము తెలుపుబారినప్పుడున్ను, లీవర్ వ్యాధులచే బాధ పడు చిన్నవారలకున్ను యిది వాడిన మంచి గుణము నిచ్చును. రక్తవృద్ధికిగాను బాగుగా గుణమునిచ్చును. వారములో రెండుసార్లు ఇంజక్షను చేయవచ్చును. దీనిని కూడ A. F. D. వారు తయారు చేయుచున్నారు.

## 201. కార్డియను.

Cardeon S. C.

చర్మముక్రింద చేయు ఇంజక్షను.

1 సిసి అంపుల్సు దొరుకుచుండును. ఈ ఇంజక్షను

గుండెపోటు వ్యాధులయందు నమ్మకముగా గుణము నిచ్చును. గుండెపోటును తగ్గించి మరలరాకుండ కాపాడును. గుండెకు బలము కలిగించుటలో యిది మిక్కిలి పేరుపొందినది. అవసరమునుబట్టి వాడుక జేయవలయును. A. F. D. వారు తయారు చేయుచున్నారు.

## 202. నియోఫిల్లిన్.

## Neophyllin I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. యిది కూడా గుండెపోటు వ్యాధులయందు పనిజేయును, రొమ్ము పడిసెము రాచకురుపులు, శ్వాసలయందును నమ్మకముగా గుణమునిచ్చును. అవసరమునుబట్టి వాడవలసియుండును. దీనినికూడ పై కంపెనీవారే తయారు జేయుచున్నారు.

## 203. అమినోఫారమ్.

## Amino Form I. M.

### రక్తనాళములో చేయు ఇంజక్షన్.

10 CC అంపుల్సు లభించుచుండును. ఇది రొమ్ము పడిసెము గుండెదడ గుండెనొప్పి శ్వాస అజీర్తిని నివారించి గుండెకు బలము కలిగించును. గుండె వ్యాధుల యందు యిది బాగుగా గుణమునిచ్చును. రెండు దినములకొకసారి ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. కాంటినెంటల్ డ్రగ్ వారు తయారు చేయుచున్నారు.

## 204. బివిమిన్.

Bvimin I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు దొరకుచుండును. తిమురువాయువులయందును, శుద్ధనాళములయొక్క వాపుదలలయందును, వాంతులయందును, అతిసార విరేచనములయందును ఈ ఇంజక్షనును ప్రయోగించినచో బాగుగా గుణము నిచ్చుచుండును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 205. కొలోకాల్.

Colo Kal S. C. I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. నిస్సత్తువలయందును, నరముల బలహీనతలయందును, ఋతుస్రావములయందును, పండ్లు వచ్చునప్పుడు కల్గు బలహీనములయందును, ఎముకల బలహీనములయందును, చిన్నపిల్లల అన్నివిధముల బలహీనములయందును, ధనుర్వాతములయందును యిది బాగుగా గుణము నిచ్చుచుండును. దినము తప్పి దినము ఒక ఇంజక్షన్ యివ్వవచ్చును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 206. కొలోకాల్ ఫోర్టు.

Colokal Farte S. C. I. M.

కండరములోను, చర్మముక్రిందను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇదికూడ ధను ర్వాతములయందును, నిస్సత్తువలయందును, ఎముకలకు బలము కలిగించుటకున్ను, నరముల బలహీనములయందును, పైదాసివలెనే వాడుక చేయవలెను. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 207. కోర్ పోలుటిన్.

## Corpolutin I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు దొరకుచుండును. ఇది స్త్రీలకు సంభవించెడి రక్తస్రావముల యందును, ఋతుశూలల యందును, ఋతుస్రావములయందును గొప్ప గుణము నిచ్చును. దీనిని పైకంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 208. డైయురినా.

## Diurina I. M. I. V.

కండరములోను రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించును. గుండె వ్యాధుల యందు యిది మిక్కిలి అనుభవపూర్వకముగా గుణము నిచ్చును. గుండె నొప్పికిన్ని, గుండె బలహీనములకున్ను రొమ్ముపడిసెములయందును, శ్వాస వ్యాధులయందును, ఒగర్పు అతిస్థూలతలయందు అనుభవముతో దినముతప్పి దినము ఒక ఇంజక్షన్ చేయవచ్చును. పై కంపెనీవారు మాత్రమే తయారు చేయుచున్నారు.

## 209. హిమొరాల్.

## Hemoral S. C. I. M.

కండరములోను, చర్మముక్రిందను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు దొరకుచుండును. ఇది పాండు వ్యాధులయందు బాగుగా గుణము నిచ్చును. రక్తక్షీణత గలవారికి, రక్తవృద్ధి కలిగించుటకున్ను, నరముల వ్యాధుల యందును, నరముల నొప్పులయందును, నిద్ర లేనివారల యందును ఇది బాగుగా గుణము నిచ్చును. దినము తప్పి దినము ఇంజక్షన్ చేయవచ్చును. పయి కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 210. హిపోరాల్ ఫోర్టు,

## Heporal Forte I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది రక్తక్షీణ తలయందును, పాండువ్యాధులయందును, మిక్కిలి గుణము నిచ్చును పాండువ్యాధి అన్ని లక్షణములయందును యిది బాగుగా గుణమునిచ్చి వ్యాధిని మరల రాకుండజేయును. దినముతప్పి దినము ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 211. హిపోరల్ కోమ్ విటామిన్ సి. యిట్. బి. కాంపులక్సు.

## Heporal Cum vitamin C. Et. B. Complex I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు దొరకుచుండును. పాండువ్యాధులను నివారించుటకుగాను దీనియందు మంచి శక్తి గలదు. అన్నివిధముల రక్తక్షీణతగల పాండువ్యాధిని నివారించును. శరీరమునందు రక్తములేక యేర్పడుచుండెడి వ్యాధులయందును, సీరువాపులయందును, శరీరమునందు అన్నిచోట్లగల నొప్పులకును తిమురువాతములయందును బలహీనతలయందును, నరముల పట్టులేక యుండువారలకును దీనిని ఉపయోగించిన నరములకు చురుకుదనమును, బలమును కలిగించును. రక్తములేక శరీరమంతయు తెలుపు బారిన వారలయందు కూడ యిది మంచిగుణము నిచ్చును. వ్యాధులు తగ్గినతర్వాత దీనిని సేవించి ఆరోగ్యవంతులు గావచ్చును. జీర్ణశక్తి పుట్టించి నిస్సత్తువలను నివారించుటకును, మూర్ఛవ్యాధులయందుకూడ యిది బాగుగా గుణము నిచ్చును. దినము తప్పి దినము ఒక ఇంజక్షన్ చేయవచ్చును దీనిని కాంటినెంటల్ డ్రిగ్ కంపెనీ బొంబాయి వారు తయారు చేయుచున్నారు.

## 212. మిటిజిన్.

## Matizin I. V. I. M.

రక్తనాళములోను, కండరములోను చేయు ఇంజక్షన్.

5 CC అంపుల్సు లభించుచుండును. ఇది మేహవాతముచే సంభవించు అన్ని రుగ్మతలయందును బాగుగా గుణము నిచ్చుచున్నది. కండరములోని నొప్పులయందు

కూడ ఉపయోగపడుచుండును. ఇతర విధముల వాతరోగ ములయందు ఇది అనుభవ పూర్వకముగా పనిజేయును. కీళ్ళ నొప్పులబాధలు నివారించుటకున్ను, నడుము నొప్పుల యందును, నరములకు బలముకల్గించుటకున్ను, నరముల నొప్పులు నివారించుటకున్ను, వాతముచే కల్గు నొప్పులకు, యిది రామబాణమువలె గుణము నిచ్చును. వాతమును హరించివేయును. రెండు మూడు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. కాంటినెంటల్ వారు తయారు చేయుచున్నారు.

213. మెన్‌స్ట్రోనా.
Menstrona I. M.
కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి మరియు 5 సిసి వైల్స్ లభించుచుండును. స్త్రీలయొక్క గర్భకోశమునకు సంబంధించిన వ్యాధులలో ముఖ్యముగా శూల, ఋతుశూల, ఈ ఋతుశూలను తగ్గించు టకుగాను దీనియందు మంచి శక్తికలదు. వారముదినము లలో మూడు ఇంజక్షనులు చేయవచ్చును. ముట్టుశూల మరల రాకుండ పోవును. కాంటినెంటల్ వారు తయారు చేయుచున్నారు.

214. న్యూహిపోరాల్.
Neo Heporal I. M.
కండరములో చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది అన్నివిధముల పాండువ్యాధుల యందు నమ్మకముగా గుణము నిచ్చును. రక్తవృద్ధి కలిగించి పాండును నివారించుటకు గాను బాగుగా తోడ్పడు చుండును. నోటియందు కలుగు వ్యాధులయందు కూడ గుణమునిచ్చును. దినము తప్పి దినము ఒక ఇంజక్షన్ చొప్పున వాడవచ్చును. పైకంపెనీ వారే తయారుచేయుచున్నారు.

## 215. టెస్టో ప్రోపెన్.

## Testo Propan I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు దొరకుచుండును. ఇది ఎదురు గుండెనొప్పులయందు బాగుగా గుణమునిచ్చును. గుండెకు బలము చురుకుదనము కలిగించి గుండె వ్యాధులను నివారించుటకు గాను యిది బాగుగా తోడ్పడుచుండును. అవసరమునుబట్టి వాడుక జేయవలసి యుండును.

## 216. టినోక్సిల్.

## Tinoxyl I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 CC అంపుల్సు లభించుచుండును. ఇది గనేరియా వ్యాధియందును క్రిమి అంటుజాడ్యములయందును సెగ గడ్డలు, పుండ్లు, కురుపులు, ఘూగగజ్జి, కొరుకు వీటిపైన

బాగుగా గుణము నిచ్చును. గనేరియా వ్యాధిని నివారించి మరల రాకుండ జేయుటకు దీనియందు మంచి శక్తి కలదు. దినముతప్పి దినము ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని కాంటినెంటల్ వారే తయారు చేయుచున్నారు.

## 217. యురాక్సల్.

## Uroxyl I. M.

కండరములో జేయు ఇంజక్షన్.

5 సిసి అంపుల్సు లభించుచుండును. మేహవాతపు నొప్పులయందు యిది బాగుగా గుణము నిచ్చుచుండును. మేహవాతముచే బాధపడువారలకు బాధలు నివారించుట కున్ను, వాతరోగముల నొప్పులకున్ను, నడుము నొప్పుల కున్ను యిది ఉపయోగపడుచుండును. ప్రతిదినం ఇంజక్షన్ చేయవచ్చును. కాంటినెంటల్ వారు తయారు చేయుచున్నారు

## 218. విటలైన్ బి. సి.

## Vitalyn (B. C.) I. M.

కండరములో జేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. నరముల బలహీనతల యందును, రక్తనాళముల వాపుదలయందును, శరీర తూకము తగ్గిపోయిన వారలకున్ను, శరీరములో రక్తము లేనివారలకున్ను, బలము, జీర్ణశక్తి పుట్టించి, పాండువ్యాధులను నివారించుటకుగాను, నొప్పులను తగ్గించు

టకుగాను యిది బాగుగా తోడ్పడును. దినముతప్పి దినము చేయవచ్చును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 219. సిబాల్జిన్.

## Cibalgin I. M.

### రక్తనాళములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. శరీరమునందు గల అన్ని విధముల నొప్పులయందు దీనిని ఉపయోగించవచ్చును. తలనొప్పులయందును, పండ్లనొప్పులయందును, చెవిపోటులయందును, నరముల నొప్పులయందును, కటి ప్రదేశమున నరములపోటుయందును, ముట్టుశూలను తగ్గించుటకుగాను ఆపరేషన్ చేసినతర్వాత కల్గుబాధలు, నొప్పులు నివారించుటకున్ను, కీళ్ళనొప్పులు, వాతపు నొప్పులయందును ఇది రామబాణమువలె గుణము నిచ్చును. శరీరమునందు గల అన్నివిధముల నొప్పులు, బాధలు తగ్గించివేయుటకుగాను యిది బాగుగా పనిజేయును. కండరములోనికి కూడ ఉపయోగించిన యేమి ప్రమాదముకాదు. నిర్భయంగా ఇంజక్షన్ చేయవచ్చును. అతి ప్రమాదకరమైన నొప్పులు కలిగినప్పుడు దీనిని వెంటనే ఉపయోగించిన మేలు కలిగించును. అవసరము ననుసరించి ఇంజక్షన్ చేయవచ్చును. సిబా కంపెనీవారు తయారు జేయుచున్నారు.

## 220. కోయాలిన్.

## Coagulen I. M. I. V.

### కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

5 సిసి అంపుల్సు లభించును. ఇయ్యది రక్తస్రావములయందును, ఋతుస్రావములయందును రామబాణమువలె పనిజేయును. చిరకాలమునుండి తగ్గక బాధించునట్టి రక్తస్రావములకు యిది బాగుగా ఉపయోగపడును. అతిమూత్రము, మూత్రములో రక్తము పడువారలకును, సూతికా వ్యాధిచే కలుగు రక్తస్రావములకున్ను, ముక్కు బెదరి కారుచుండెడి రక్తస్రావములకున్ను యిది నమ్మకముగా గుణము నిచ్చును. ఋతుస్రావము అధికముగా వెడలునప్పుడు తగ్గించివేయుటకున్ను యిది బాగుగా పని జేయును. చాలకాలమునుండి కలుగుచుండెడి రక్తస్రావములకు దీనిని చాలదినములవరకు వాడుచుండిన పూర్తిగా వ్యాధి నివారించును. అధిక రక్తస్రావములయందు ప్రతిదినము ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనిని సిబా కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 221. డిజిఫోలిన్.

## Digifoline I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు గల సీసాలు లభించుచుండును. గర్భవతులుగా నుండునప్పుడు కల్గు నంజు శరీరమంతయు

వాపు నీరు కలిగియుండు గర్భవతులయందు యిది నమ్మక ముగా గుణము నిచ్చును. ఇతర విధముల నంజు వ్యాధుల యందుకూడ దీనిని ఉపయోగించవచ్చును. న్యూమోనియా అను శ్లేష్మవాత జ్వరములయందు కలుగు ఆయాసము, రొమ్మునొప్పి మరియు ఇతర విధముల నొప్పులకున్ను యిది బాగుగా నుపయోగపడును. గుండె బలహీనముగా నున్నవారలకు తిరిగి గుండెకు బలము కలిగించుటకున్ను యిది బాగుగా గుణమునిచ్చును. మేహవాతముచే కలుగు అన్నివిధముల నొప్పులయందును బాధలు తగ్గుటకున్ను దీనిని ఉపయోగించవచ్చును. గర్భిణీస్త్రీలకు యిది వాడుక జేసిన యేమాత్రము ప్రమాదము కాజాలదు. నిర్భయంగా వాడవచ్చును. ప్రతిదినము ఒక ఇంజక్షన్ చొప్పున వాడ వచ్చును. దీనిని కూడ సిబా కంపెనీవారే తయారుచేయు చున్నారు.

## 222. పర్కోర్టిన్.

## Percorten I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

అన్నివిధముల సీసీలు దొరకును. వాతమునొప్పుల యందు యిది బాగుగా గుణము నిచ్చును. మేహవాతము నకు సంబంధించిన అన్ని నొప్పులయందు యిది ఉప యోగ పడుచుండును. అడ్రినల్ బలహీనముల యందు కూడ దీనిని వాడవలయును. బలహీనము నివారించి బలము

కలిగించుటకు మిక్కిలి ఉపయోగకారి. వారమునకు రెండు సార్లు చేయవచ్చును.

## 223. ప్రిస్ కోల్.

## Pris Col I. M. I. V. S. C.

### కండరములోను, చర్మముక్రిందను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. పీనస, పక్ష వాతము, అన్నివిధముల వాతవ్యాధుల యందును యిది బాగుగా గుణమునిచ్చును. దినము రెండుసార్లు ఇంజక్షన్ చేయవచ్చును. సిబా కంపెనీ స్విడ్జర్‌లాండువారు తయారు చేసి మనకందించుచున్నారు.

## 224. రెసైల్.

## Resyl I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి, 3 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది క్షయవ్యాధులయందు గొప్పగుణకారి. క్షయవ్యాధులయందు కలుగు దగ్గులయందును, రొమ్ముపడిసెముల యందును, న్యూమోనియాలయందు కలుగు రొమ్ముపడిసెము, రొమ్ము నొప్పులయందును, యితర వ్యాధులయందు కలుగు కొసల యందును, కోరింత దగ్గులయందును, యిది బాగుగా గుణమునిచ్చును. ప్రతిదినము ఒక ఇంజక్షన్ చేయవచ్చును.

## 225. సిస్టోమెన్సిన్.

Sistomensin I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. రక్తస్రావములయందును, ఋతుస్రావములయందును, గర్భాశయవ్యాధులయందును యిది నమ్మకముగా గుణము నిచ్చును. ప్రతిదినము ఒకసారి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని సిబా కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 226. ట్రాసిన్టిన్.

Trasentin S. C. I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

7 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది శూలలయందు, ఋతుశూలలయందు నమ్మకముగా గుణము నిచ్చును. పుండ్లు, కురుపులు వీటియందుకూడ బాగుగా ఉపయోగపడును. ప్రతి దిన మొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. సిబా కంపెనీవారు తయారుచేయుచున్నారు.

## 227. ఆర్సోక్విన్.

Arsoquin I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 సిసి, 2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇయ్యది జీర్ణించిపోయి మాటిమాటికి వచ్చెడి చలిజ్వరములయందు

బాగుగా గుణమునిచ్చును. చలిజ్వరమును రాకుండ జేయుటకు దీనియందు మంచిశక్తి కలదు. విషపడిసెములయందు కూడ బాగుగా గుణమునిచ్చును. ఛర్దులయందు కూడ పని జేయును. రెండుదినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. సనిటేక్సు కెమికల్ బరోడా వారు తయారు చేయుచున్నారు.

## 228. ఫోలికోబిన్.

## Folicobin I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది పాండువ్యాధులయందును, నోటి వ్యాధులయందును, యితర విధముల రక్తక్షీణతలు గలవారలకున్ను, రక్తవృద్ధి జేయుటకున్ను, పాండును నివారించుటకున్ను బాగుగా గుణమునిచ్చును. రెండు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 229. హిపాటిస్.

## Hepatis I. M.

### కండరములో జేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది కూడ పాండువ్యాధియందు బాగుగా గుణము నిచ్చుచుండును. పాండువ్యాధియొక్క అన్నితరగతులయందు కూడ దీనిని

వాడుక జేసిన వ్యాధిని నివారించి రక్తవృద్ధి కలిగించును. నోటివ్యాధుల యందు కూడ బాగుగా గుణమునిచ్చును. లీవర్ వ్యాధులయందును, వాతపునొప్పుల యందును శూల నొప్పులయందును గుణమునిచ్చును. దినము ఒకసారి ఇంజక్షన్ చేయవచ్చును. పై కంపెనీవారు తయారుచేయు చున్నారు.

### 230. పల్మోక్విన్.
### Pulmoquin I. M.
### కండరములందు చేయు ఇంజక్షన్.

1 సిసి 2సిసి అంపుల్సు లభించుచుండును. రొమ్ము పడిసెముల యందును న్యుమోనియా అను శ్లేష్మవాత జ్వరములయందును ఇది బాగుగా గుణమునిచ్చుచుండును. ప్రతిదినము ఒక ఇంజక్షను వాడవచ్చును. దీనిని సనిచేక్సు కెమికల్ బరోడావారు తయారు చేయుచున్నారు.

### 231. విటమిన్ కె.
### Vitamin K. S. C. I. M.
### చర్మముక్రిందను కండరములోను చేయు ఇంజక్షన్.

1 CC అంపుల్సు లభించుచుండును. యకృత్ప్లీహ లీవర్ వ్యాధులయందు కామిలలయందును, పచ్చ తెలుపు కామిల వ్యాధులయందును, ఋతుస్రావములను అరి కట్టుటకున్ను, అమ్లపిత్తముల యందును, ఇది మిక్కిలి ఉపయోగకారి. రెండుదినముల కొకసారి ఇంజక్షన్ చేయ

వచ్చును. దీనిని కూడ సనిపేక్సు బరోడావారు తయారు చేయుచున్నారు.

## 232. నివాక్విన్.

## Nivaquine I. V. I. M.

రక్తనాళములోను కండరములోను చేయు ఇంజక్షన్.

5 సిసి అంపుల్సు లభించుచుండును. ఈ ఇంజక్షన్ చలిజ్వరముల యందు రామబాణమువలె గుణమునిచ్చును. జీర్ణించిపోయి మాటిమాటికి తిరిగివచ్చు చలిజ్వరములయందును దినముతప్పి దినమువచ్చు చలిజ్వరములయందును, యిది నమ్మకముగా గుణమునిచ్చును. ఆరు ఇంజక్షనుల వరకు పూర్తికోర్సు అవును. దీనిని మే & బేకర్‌వారు తయారు చేయుచున్నారు.

## 233. టిబిజైడ్.

## Tibizide I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. యిది క్షయ వ్యాధులయందు మాత్రము ముఖ్యముగా గుణమునిచ్చును. క్షయ కాసలయందును, బాధగల కాసలయందును యిది నమ్మకముగా గుణమునిచ్చుచుండును. క్షయ అన్ని లక్షణములయందు యిది గుణము నిచ్చుచుండును. క్షయ వ్యాధిగల వారలు దీనిపై ఆధారపడవచ్చును. క్షయను

నివారించి మరల రాకుండ కాపాడగలదు. దీనిని అల్బర్టు డేవిడ్ లిమిటెడ్ కలకత్తావారు తయారు చేయుచున్నారు.

### 234. నికోలాన్.

### Nicolan I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి, 5 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది గనేరియా అను అంటువ్యాధులయందు బాగుగా గుణము నిచ్చుచుండును. గనేరియా పుండ్లయందును, సెగలు పచ్చ తెల్ల దబ్బ అడ్డకర్రలయందును యిది బాగుగా గుణము నిచ్చును. పుండ్లు కురుపులయందు కూడ దీనిని వాడుక జేసిన గుణమునిచ్చును. జ్వరములయందు కూడ గుణము నిచ్చును. దీనిని కలకత్తా క్లినికల్ రిసర్చ్ అసోసియేషన్ వారు తయారు చేయుచున్నారు.

### 235. అనురక్సిన్.

### Anuroxin I. M. I. V.

### కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు దొరకును. శుద్ధ రక్తనాళము యొక్క వాపుదలయందును, నరముల పోటుయందును, నరముల బలహీనములయందును, పాండు వ్యాధులయందును, క్షీణగతిగల పాండువ్యాధులయందును, రక్తమును వృద్ధిజేసి పాండువ్యాధిని నివారించుటకున్ను, పక్షవాతముల

యందును, పక్షవాతముయొక్క అన్ని లక్షణములను బాధలను నివారించుటకున్ను, మూర్ఛ వ్యాధులయందును, నిస్సత్తువల యందును, శరీరపు తూకము తగ్గిపోయిన వారలయందును యిది బాగుగా గుణము నిచ్చుచుండును. దీనిని ఓరియంటల్ ఫార్మ్యాటికల్ వర్క్సు ఇండస్ట్రీస్ లిమిటెడ్ బొంబాయివారు తయారు చేయుచున్నారు.

236. వివిలీన్.

Vibelan I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు దొరుకును, శరీరమునందు పట్టుదల లేనివారలయందును, నిస్సత్తువలయందును, నరములకు బలము కలిగించి, పాండు వ్యాధిని నివారించుటకున్ను, జీర్ణశక్తిని కలిగించుటకున్ను, రక్తవృద్ధికిన్ని, తిమురువాతములను నివారించుటకున్ను, వ్యాధులు వచ్చిన తర్వాత కలుగు బలహీనము గలవారలను ఆరోగ్యవంతులుగా జేయుటకున్ను, నొప్పులను నివారించుటకున్ను యిది బాగుగా ఉపయోగపడుచుండును. రెండు మూడు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని బ్రిటిష్ డ్రగ్ హౌస్ లిమిటెడ్ లండన్‌వారు తయారు చేయుచున్నారు.

237. లివాడెక్సు.

Livadex I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు దొరకును. పాండు వ్యాధుల యందు యిది బాగుగా తోడ్పడుచుండును. పాండువ్యాధి గలవారికి రక్తవృద్ధి కలిగించుటయేగాక జ్వరము, నీరసము, బలహీనము నివారించును. వాతపు నొప్పులను యరికట్టును. మలేరియా సన్నిపాతజ్వరము వచ్చిన తర్వాత శరీరము నందు రక్తము లేనివారలకున్ను యిది టానికు మాదిరిగా ఉపయోగపడుచుండును. రెండుదినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. B. D. H. వారు తయారు చేయుచున్నారు.

### 238. అనామిన్.

### Anahaemin I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది శరీరము నందు రక్తమును పుట్టించుటకుగాను బాగుగా గుణము నిచ్చుచుండును. శరీరమునందు రక్తము లేనివారలయందు కలుగు అన్ని లక్షణములయందు కూడ యిది బాగుగా గుణము నిచ్చును. ముఖ్యముగా పాండువ్యాధిని నివారింప జేసి, మరల వ్యాధిని రాకుండజేయు శక్తి దీనియందు కలదు. రక్తములేక శ్వాస పొడి ఉబ్బసములయందును, శరీరమంతయు శ్వేతవర్ణముగా మారినప్పుడున్ను, రక్తము లేని అన్ని జబ్బులకున్ను యిది రామబాణమువలె గుణము నిచ్చుచుండును, జీర్ణశక్తిని పుట్టించుటకున్ను, వ్యాధులు వచ్చి

పోయిన తరువాత కలుగు నీరసము, బలహీనము, రక్త క్షీణము వీటియందుకూడ బాగుగా గుణమునిచ్చును. రెండు దినముల కొకటిగాని, మూడుదినముల కొకటిగాని ఇంజక్షన్ చేయవచ్చును. B. D. H. వారు తయారు చేయుచున్నారు.

## 239. థైహడోక్సిన్.

## Thiadoxine I. M.

## కండరములో జేయు ఇంజక్షన్.

10 సిసి వైల్సు లభించుచుండును, ఇది తిమురువాతములయందును, వాతపు నొప్పులయందును, యితర వాతముచే కలుగు వాపులయందును బాగుగా గుణము నిచ్చుచుండును. నరములయొక్క బలహీనతలయందు నరములకు బలమునిచ్చుటకున్ను, చిన్నపిల్లలకు కలుగు తిమురు వాతములయందును, నరముల నొప్పులయందును, తల నొప్పులయందును, పక్షవాతములయందును, పక్షవాతముయొక్క అన్ని లక్షణములయందేగాక, నొప్పుల బాధలు నివారించుటకున్ను, కండరములయొక్క నొప్పుల యందును, శరీరమునందు గల అన్ని నొప్పులయందును యిది నమ్మకముగా గుణము నిచ్చును. చిన్నపిల్లల వాతవ్యాధులయందు కూడ అనుభవపూర్వకముగా గుణము నిచ్చును. చర్మముల జబ్బులు అన్నివిధములైన వాటిపైనను దీనిని

ఉపయోగించి ప్రయోజనము పొందవచ్చును. దీనిని T. C. F. వారు మాత్రమే తయారు చేయుచున్నారు.

## 240. అనాకోబిన్.

## Anacobin I. M.

### కండరములో జేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. ఇదికూడ రక్త క్షీణతలు గల అన్నివ్యాధులయందు బాగుగా గుణము నిచ్చును. పాండువ్యాధులయందును, పాండుచే గలుగు రక్తక్షీణతలయందును, శరీరమంతా వాపులు కల్గినప్పుడు నీరు లాగివేయుటకున్ను, రక్తవృద్ధి కలిగించుటకున్ను, యిది బాగుగా గుణము నిచ్చుచుండును. శరీరమునందు గల కీళ్ళ నొప్పులు, వాతము నొప్పులయందును, చిన్న పిల్లల వాతవ్యాధులయందును, యిది నమ్మకముగా గుణము నిచ్చును. నరముల పట్టుదల లేనివారలయందును, నరములకు బలము కలిగించుటకున్ను, అన్నివిధముల పాండులు నివారించి బలము, పుష్టి, జీర్ణశక్తి నిచ్చుటకున్ను యిది బాగుగా తోడ్పడి ఆరోగ్యవంతులుగా జేయును. రెండు దినముల కొక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. దీనిని B. D. H. వారు తయారు చేయుచున్నారు.

## 241. అనాఫోలిన్.

## Anafolin I. M.

### కండరములో చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది కూడ

పాండు వ్యాధులయందు రామబాణమువలె పనిజేయును. పాండు వ్యాధులను నివారించుటకుగాను దీనియందు మంచి శక్తికలదు. పాండు వ్యాధియందు కలుగు నీరు వాపులను నివారించి రక్తవృద్ధి కలిగించి జీర్ణశక్తినిపుట్టించి పాండును నివారించి ఆరోగ్యవంతులుగా నుంచును. అన్నివిధముల నరముల జబ్బులను నివారించి నరములకు బలము ప్రసాదించును. లీవర్ వ్యాధులయందు, శరీరమందలి నొప్పుల యందును రక్తములేక యేర్పడు చుండెడి నీరు నంజు వ్యాధులయందు ఇది తప్పక గుణము నిచ్చును. వ్యాధులు తగ్గిన తర్వాత కల్గు నీరసము బలహీనములయందు కూడ వాడుక జేసిన ఆరోగ్యవంతులుగా జేయును. రెండు దినముల కొకసారి ఇంజక్షన్ జేయవచ్చును. దీనిని కూడ బ్రిటిష్ డ్రిగ్‌హౌస్ లిమిటెడ్ లండన్ వారు తయారు చేయుచున్నారు.

## 242. చినోపిల్.

## Chinopil I. M. I. V.

రక్తనాళములోను, కండరములోను చేయు ఇంజక్షను.

1 సిసి, 2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇయ్యది చిరకాలమునుండి బాధించునట్టి (మలేరియా) చలిజ్వరముల యందు, ముఖ్యంగా అనుభవ పూర్వకంగా గుణము నిచ్చును. అహిక జ్వరమును అరికట్టును. చలిజ్వరముతగ్గి నట్లు తగ్గి మరల తిరిగి తిరిగి వచ్చునట్టి చలిజ్వరముల

యందును, మొండికిబడిన జ్వరములయందు, నెలనెలకు ఒకతూరి చలి వచ్చునట్లు యుండు చలిజ్వరములయందును యిది రామబాణమువలె గుణము నిచ్చుచుండును. రక్తనాళములో చేయవలసినచో నెమ్మదిగ ఇంజక్షన్ చేయవలయును. కండరములోచేసిన చాల మంచిది. దినముగాని దినముతప్పి దినముగాని చేయవచ్చును. ఛర్దులయందును విషపడిసెములయందు కూడ గుణకారి.

## 243. స్టిబినాల్.

## Stibinol I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 సిసి, 2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది బోదకాలు అను శ్లీపద వ్యాధులయందు గొప్ప గుణము నిచ్చును. శ్లీపద వ్యాధులను క్రిమేణాతగ్గించుటకు గాను దీనియందు మంచిశక్తి కలదు. కుష్ఠు వ్యాధులయందుకూడ యిది బాగుగా గుణము నిచ్చుచుండును. దినం తప్పి దినం ఒక ఇంజక్షణ చొప్పున వాడుక జేయవలయును. దీనిని బ్రిహ్మచారి రిసర్చ్ ఇన్‌స్టిట్యూటు కలకత్తావారు తయారు చేయుచున్నారు.

## 244. ఒపికాల్జిమ్.

## Opicalzim I. M. I. V.

కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

5 సిసి, 10 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది

శరీరమునందు కాల్షియం తగ్గినవారలయందును, ధనుర్వా తములయందును, క్షయవ్యాధులయందును గొప్ప గుణ కారి. క్షయవ్యాధుల అన్నిలక్షణములయందు యిది బాగుగా గుణము నిచ్చును. నరముల బలహీనతలయందు కూడ బాగుగా గుణము నిచ్చును. రక్తమును వృద్ధిజేయును. మూడుదినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. ఓపిల్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 245. డిజోక్సిన్.

## Digoxin I. V.

రక్తనాళములో చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు, 10 సిసి వైల్సు లభించును. ఇది కాళ్ళు చేతులు చల్లబడినప్పుడున్ను, శరీరము చల్వాలు గ్రమ్మినప్పుడున్ను, నాడి మందగతిగా యుండునప్పు డున్ను, వేడి కలిగించుటకున్ను, గుండెకు చురుకుదనము కలిగించుటకున్ను, తరుణవ్యాధులయందు కలుగు అన్ని లక్షణములయందును ఇది వాడినచో గొప్పగా గుణము నిచ్చును. ప్రాణాపాయస్థితిలో గలవారలకు సంజీవిగా పని జేయును. 1 సిసి ఔషధము వాడవచ్చును. దీనిని బరూస్ వెల్కం కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 246. అమినోఫైలిన్.

## Aminophylline I. M. I. V.

కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు, 10 సిసి వైల్సు లభించుచుండును. ఎదురు గుండెనొప్పియొక్క అన్ని యవస్థలయందును, నొప్పిని నివారించుటకుగాను ఇది రామబాణమువలె గుణము నిచ్చును. నరముల బలహీనతలయందు రక్తము సరిగా ఆడునట్లు చేయుటకున్ను, గుండెకు బలము కలిగించుట కున్ను, గుండెవ్యాధులను నివారించుటకున్ను, దీనియందు మంచి గుణము కలదు. రొమ్ము పడిసెములయందు కూడ గుణమునిచ్చును. బలహీనముచే కలుగు శ్వాస వ్యాధుల యందును నమ్మకమైన ఔషధరాజము. శ్వాసలయందు వెంటనే గుణమునిచ్చి బాధలు తగ్గించివేయును. అజీర్ణ వ్యాధులయందు కూడ యిది మంచి గుణము నిచ్చును. అజీర్ణము తగ్గించివేయును. 2 సిసి కండరములోను, 10 సిసి రక్తనాళములోను అవసరమునుబట్టి ఇంజక్షను చేయ వచ్చును. దీనిని కూడ బరూసు వెల్కం కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 247. ఫ్లొరోసిడ్.

## Florocid S. C.

### చర్మముక్రింద చేయు ఇంజక్షను.

1 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది ఏనుగు కాలు రోగము (శ్లీపద వ్యాధుల యందు) గ్యారంటీగా గుణము నిచ్చును. శ్లీపద వ్యాధి చాలవరకు కాళ్ళయందే

వచ్చుచుండును. కాళ్ళయందేకాక చేతులయందును స్త్రీలకు రొమ్ములయందు కూడ వచ్చుచుండును. శ్లీపద వ్యాధి నివారించుటకు ప్రత్యేకంగా ఈ ఇంజక్షన్ ఈ కంపెనీవారు కనిపెట్టియున్నారు. ఈ ఇంజక్షన్ కొన్ని దినములవరకు పూర్తి కోర్సు చేయవలసి యుండును. వారము దినముల కొకసారి ఇంజక్షన్ చేయవలసియుండును. ఈ ప్రకారం నాలుగు అయిదు నెలలవరకు చేయవలయును. దీనిని యీస్టు ఇండియా పర్మ్యాటికల్ వర్క్సు కలకత్తావారు తయారు చేయుచున్నారు.

## 248. సల్ఫో కెడిన్ అల్‌బమ్.

## Sulpho Cidine Album S. C. I. M. I. V.

చర్మముక్రిందను, కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది అంటు సంబంధమైన వ్యాధులయందు బాగుగా గుణము నిచ్చును. గనేరియా అను సెగ సంకటములయందు అనుభవపూర్వకముగా ఉపయోగపడుచుండును. గనేరియా వ్యాధివల్ల మూత్రములోని మంటలు, పచ్చగ తెల్లగనగు స్రావములు, యితర లక్షణములయందును, అడ్డగడ్డలయందును ఇది బాగుగా గుణము నిచ్చును. చాలకాలమునుండి బాధించునట్టి అంటురోగములందును, దద్దురోగ మను వీటియందున్ను, మచ్చలు, పుండ్లు, కురుపులు, యితర లక్షణము

లతో కూడుకొనియుండు దద్దు రోగముల యందును, గొంతులో కండలు పెరుగునట్టి టాన్సిల్స్ అను వ్యాధియందును, గొంతుకండలు కరగించుటకున్ను దీనియందు మంచి ప్రభావముగలదు. న్యూమోనియా అను శ్లేష్మ వాత జ్వరములయందుకూడ ఇది ఉపయోగకారి. గనేరియాయందు దీనిని తప్పక వాడవలసి యుండును. ప్రతి దినము ఇంజక్షన్ చేయవచ్చును. బ్రిహ్మచారి కలకత్తావారు తయారు చేయుచున్నారు.

## 249. సాలురిన్.

## Salurin I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. మూలవ్యాధుల యందు అనుభవపూర్వకముగా గుణము నిచ్చును. మూలవ్యాధిని నివారించుటకుగాను ఇది సదా తోడ్పడుచుండును. మూలవ్యాధికి గల అన్ని లక్షణములయందును, అన్ని తరగతులవారికిన్ని దీనిని ఉపయోగించవచ్చును. శూలనొప్పులయందును, ఋతుశూలలయందు కూడ బాగుగా గుణము నిచ్చును. నాలుగు దినముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. బ్రిహ్మచారి కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 250. కార్డిమొన్.

## Cardimon S. C. I. M.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షన్.

5 సిసి అంపుల్సు లభించుచుండును. నరముల జబ్బుల యందును, ఆదుర్త బలహీనముచే వచ్చునట్టి శ్వాసలయం దును యిది నమ్మకముగా గుణము నిచ్చును. రెండు దిన ముల కొకసారి ఇంజక్షన్ చేయవచ్చును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 251. అంటిసన్.

Anthisan I. M. I. V.

కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు లభించుచుండును. ఇది పొడి ఉబ్బసములయందు అనుభవ పూర్వకముగా గుణము నిచ్చును. మూత్రకృచ్ఛ్ర వ్యాధులయందును కల్లు అన్ని లక్షణముల యందును యిది అనుభవ పూర్వకముగా గుణము నిచ్చును. అవసరమునుబట్టి ఇంజక్షన్ చేయ వచ్చును. మే & బేకర్ లండన్‌వారు తయారు చేయు చున్నారు.

## 252. పెతడిన్ హైడ్రోక్లోరైడ్.

Pethidine Hydrochloride. I. M.

కండరములో చేయు ఇంజక్షన్.

2 సిసి అంపుల్సు దొరకును. నరములయొక్క పోటుయందును, నరముల బలహీనతలయందును, నరము లకు చురుకు కలిగించుటకున్ను, వాతపునొప్పులయందును, వాతరోగములయందును, వాతముచే సంభవించెడి అన్ని

విధముల శరీర నొప్పులయందును, రొమ్ము నొప్పులయందును, రొమ్ముపడిసెము, శ్వాసవ్యాధులయందును యిది నమ్మకముగా గుణమునిచ్చి శరీరమునందు గల నొప్పులను వెంటనే నివారించుటకుగాను బాగుగా ఉపయోగ పడుచుండును. అవసరమునుబట్టి ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని బర్‌గౌపుస్ వెల్‌కం కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 253. ఫైసిప్టోన్.

## Physeptone I. V. I. M.

రక్తనాళములోను, కండరములోను చేయు ఇంజక్షన్.

1 సిసి అంపుల్సు లభించుచుండును. నరముల నొప్పులయందును, నరముల జబ్బులయందును, అన్నివిధముల శరీరనొప్పులయందును, పుపుసవేష్టపు వాపులయందును, శూల నొప్పులయందును, దగ్గులయందును యిది బాగుగా గుణము నిచ్చును. దినమునకు ఒక ఇంజక్షన్ చొప్పున చేయవచ్చును. బాధలు నివారింపజేయును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 254. ఫొల్బిసైన్.

## Folbesyn I. M. I. V.

కండరములోను, రక్తనాళములోను చేయు ఇంజక్షన్.

ఒక బల్బు ఒకసారికే పనికివచ్చునది లభించును. శరీరమునందు రక్తములేక యేర్పడుచుండెడి నీరువాపుల యందును, బలహీనముల యందును, పాండు వ్యాధుల

యందును, రక్తక్షీణతలను నివారించి మరల రక్తమును వృద్ధిగావించుటకుగాను, నరముల బలహీనతలను తగ్గించుటకుగాను, శరీరము పాలిపోయిన వాటిని తిరిగి వృద్ధి గావించుటకున్ను, జీర్ణశక్తి నిచ్చుటకున్ను, యేకారణముచేతనైన శరీరమునందు రక్తము లేనివారలకున్ను, ప్రసవానంతరము కలుగు బలహీనమునకున్ను, వ్యాధులు వచ్చిన తర్వాత కలుగు రక్తక్షీణతకున్ను యిది బాగుగా గుణము నిచ్చును. రక్తము లేనివారలకును రక్తము వృద్ధిగావించి పై వ్యాధులను నివారించుటకుగాను యిది అనుభవపూర్వకముగా గుణము నిచ్చును. దినము తప్పి దినము ఒక ఇంజక్షన్ చేయవచ్చును. దీనిని లేడర్‌లీ లేబొరేటరీస్‌వారు తయారు చేయుచున్నారు.

## 255. ట్రియోలాన్‌డ్రెన్.

## Triolandren I. M.

1 సిసి అంపుల్సు మనకు లభించును. ఈ ఇంజక్షను కేవలము పురుషులయందు సంభవించెడు కొన్ని వ్యాధులను నిర్మూలించుటకున్ను, కేవలము స్త్రీలయందే సంభవించెడు కొన్నివ్యాధులయందు పనిచేయుటకును, స్త్రీ పురుషుల యందుకూడ కొన్ని పరిస్థితులయందు పని చేయుటకు సయితము వీలుగా యీ ఇంజక్షనులు తయారు చేయబడి యున్నవి.

పురుషులకొరకు:— పురుషాంగము యొక్కయు పురుషాండముల యొక్కయు అశక్తత దౌర్బల్య లక్షణములు లేపనశక్తి తగ్గియుండుట లేపనశక్తి కలిగియున్నను కొన్ని నిమిషములయందు శీఘ్రముగా వాలిపోవుట మొదలగు పెక్కులోపములను సవరించి మంచి పుంసత్వమును ప్రసాదించును.

స్త్రీల కొరకు:— రొమ్ముకుంపటి, స్తనములకు సంబంధించిన "క్యాన్సరు" ఇట్టి సందర్భముల యందు రోగికి చేయబడిన శస్త్రచికిత్స పిదపగాని పైవ్యాధియందు చేయబడు "రేడియం" చికిత్స మొదలగు పరిస్థితులయందు సయితము అద్భుతముగా తోడ్పడి ఆరోగ్యము కలిగించును.

స్త్రీ, పురుషులకొరకు:— అస్థిభంగాదుల యందు ఎముక అతుకు బడకయుండుట రక్తనాళములకు సంబంధించిన అశక్తత మొదలకు అనేక పరిస్థితులను చక్కపరచును. పై ఇంజక్షను తైలసంబంధమైన ద్రవరూపమున లభించును గావున ఉపయోగించుట సులభము.

రోగియొక్క పరిస్థితిని అవసరమును గమనించి 1 సిసి వరకు లోతుగా పిరుదుల కండరములందు ఇంజక్షను చేయవలయును. ఒక్క ఇంజక్షనుయొక్క శక్తి

సుమారు 4 మొదలు 6 వారములకైన శరీరమున నిలచి మహాద్భుతముగా పనిజేయును. ప్రతి ఒక్క అంపులునకు 250 M. G. శక్తిగల్గియుండును. ఈఇంజక్షనులు క్రొత్తగా సిబా కంపెనీవారు తయారుజేసి మనకందించుచున్నారు.

## 256. వి. డి. 3.

## V. D. 3 I. M.

1 సిసి అంపుల్సు లభించును. ఈ ఔషధమును సూపర్ కాంసంట్రేటడ్ వి. డి. 3 అని కూడ వ్యవహరింతురు:—

ఇందు విటామిన్ (డి. 3.) 1 సిసికి 600000 యూనిట్లు చేర్చబడి అధిక శక్తివంతంగా తయారు చేయబడినది. రికెట్సు వ్యాధి అరికట్టుటకున్ను, గర్భిణీ స్త్రీలయందు గర్భమున గల పిండముయొక్క ఎముకలు సక్రమముగను, దృఢముగను, అభివృద్ధి పరచుటకును, తల్లియొక్క శరీరమున ముఖ్యావసరమైన విటామిన్ 'డి. 3' లోపమును సవరించి రక్తమున కు త్తేజముకలిగించుటకును, ఎదుగునట్టి పిల్లల అస్థిపంజర నిర్మాణము దృఢతర మొనర్చుటకును, పెద్దవాండ్రయందు యేర్పడు ఆస్టోమలాషియ రక్తమున కాల్షియం క్షీణించుట వలన ఏర్పడెడు

కురుపులు, గజ్జి, అతిసారము, ప్లూరసీ (పుపుస వేష్టిపు వాపు) లసికవాహి గ్రంధులయందు వాపు, ధమనులకు సంబంధించిన క్షయ లవణములు, పిల్లలయందు సంభవించు ధనుర్వాతము, పారాథైరాయిడ్ గ్రంధి (Parathyroid glandsin sufficiency) స్రావ లోపముచే యేర్పడు నక్కిళ్ళ (కొంకర) వాతము, ఎండుగజ్జి సంబంధముగా ఏర్పడు చర్మవికారము (Psoriasis) చర్మ సంబంధమైన క్షయ, పులినీరు కారుచు బహునాళ్ళుగా మానక వేధించెడు సరిఫి గజ్జి, పుండ్లు మొదలగువాటిని అద్భుతముగా నివారించుటకు నుపయోగించును.

సామాన్యమైన దుస్థితులయందు రోగియొక్క వయసును గమనించి 1 సిసి వరకు వారమునకు ఒకపర్యాయము వాడుచు, ఇట్లు 12 వారములవరకు ప్రయత్నించవచ్చును. మొండికిబడిన సొరయాసీస్ మరియు లూపస్ క్షయ (చర్మ క్షయ) వ్యాధులకొరకు షుమారు ఒక సంవత్సరమైనను చికిత్సజేసి పూర్తి ఆరోగ్యమును కల్పించవచ్చును. మిక్కిలి సామాన్యమైన విటామిన్ విటామిన్ 'డి' 3 లోపములను సవరించుటకు 0-5సిసి చొప్పున వారమునకు రెండుసార్లుగాని, 3 రోజులకు రెండుసార్లుగాని వాడవలసిన కేసులు సహితము అనేకము గలవు. ఈ ఇంజక్షనులు వాండర్సు కంపెనీ స్విడ్జర్లాండువారు తయారు చేయుచున్నారు.

## 257. టోల్సిరాల్.

## Tolserol I. V.

5 సిసి ల అంపుల్సు లభించును. మొండికిబడి పెక్కుదినములుగా వేధించుచు, అనేక ఔషధ చికిత్సలకు లొంగక బహువిధములుగా బాధించునట్టి కీళ్ళ వాతము, సంధివాతము, కటివాతము, కండరములు పట్టుకొనుట, వెన్నుపట్టెకు సంబంధించిన నొప్పి, కండరములకు సంబంధించిన పొరలు, సంధి బంధములు, కండరముల బిగువు, బాధ, వీటివలన అవయవములు కదలించినప్పుడు అమితముగా తపించుట మొదలగు పెక్కు బాధలను పోద్రోలి శరీరమునకు, కీళ్ళకు సుళువు వీలు కలిగించి ఆరోగ్యము ప్రసాదించుటకు అద్భుతముగా తోడ్పడును.

పై ఇంజక్షనులు 50 సిసి ల పరిమాణము ఒక సీసీకి 20 M. G. శక్తిగలవి మనకు లభించును. రోగియొక్క పరిస్థితి, వయసు, బాధయొక్క తీవ్రత మొదలగు విషయములను జూచి 20 సిసి లు మొదలు 50 సిసి ల వరకు కడు నిదానముగా రక్తనాళమునందు ఇంజక్షను చేయవలయును. తీవ్రమైన పరిస్థితులయందు 2 రోజుల కొక ఇంజక్షను చొప్పున వాడవచ్చును. సామాన్యమైన పరిస్థితులయందు వారమునకు 2 ఇంజక్షనులు వాడిన చాలును. ఈ ఇంజక్షనులు స్క్విబ్బ్ కంపెనీవారు తయారుచేయుచున్నారు.

## 258. కొమైసైన్.
## Comycin I. M

1 గ్రాము ఔషధ ద్రవముతో నింపబడిన వయల్సు లభించును. ఈ ఔషధమునందు స్ట్రెప్టొమైసిన్ 0.5 గ్రాము డి హైడ్రో స్ట్రెప్టొమైసిన్ 0.5 గ్రాము చేరియుండును. ముఖ్యముగా పుపుసములకు సంబంధించిన క్షయ రోగము మినప గింజలవంటి గడుములు యేర్పడి బాధించెడు క్షయ వ్యాధులయందు రోజు ఒక గ్రామువరకు తగిన మోతాదుతో డిస్టిల్డు వాటరు చేర్చి లోతుగా కండరములయందు యీయవలయును. క్షయయొక్క ప్రారంభ దశయందు యేర్పడు దుష్టలక్షణములను తొలగించి రోగికి ఆరోగ్యము కల్పించుటకు 1 లేక 2 గ్రాములు పై ఔషధమును రెండు మోతాదులుగా విభజించి, రోజు రెండు పర్యాయములుగాని ఒకేసారిగాని వాడవచ్చును. ప్లేగువ్యాధి, తీవ్రమైన ఇన్‌ఫ్లూయింజా, క్రిమి సంబంధమైన దోషములచే యేర్పడు రుగ్మతలయందు పొడచూపిన జ్వరాదులను, హృదయపు పొరల యందు క్రిమి సాంక్రమిక దోషములచే యేర్పడిన వాపు లక్షణములను తొలగించుటకును, పెన్సిలిన్ ప్రయోగమునకు లొంగని క్రిమి వ్యాధులను నిర్మూలించుటకును మహా అద్భుతముగా పనిజేయును. పై విధమగు రోగములు అకస్మాత్తుగా సంభవించి బాధించునపుడు 1 నుండి 3 గ్రాములవరకు ప్రతిరోజు విభాగించిన మోతాదుతో

ఇంజక్షను చేయుచు, ఇట్లు 3 మొదలు 10 రోజులవరకు అవసరమునుబట్టి చికిత్స పొడిగించవచ్చును. ఈ ఇంజక్షనులు గ్లాక్సొకో కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 259. లా ర్ గా క్ టి ల్.

## Largactil I. M.

1 సిసి, 2 సిసి మరియు 5 సిసి ఔషధ ద్రవముతో నింపబడిన అంపుల్సు మనకు లభించును. "కార్సినొమొ" "క్యాన్సరు" మొదలగు దుష్ట రోగాదులయందు ఏర్పడుచుండెడు నిద్రాభంగము, బాధవలన నిద్రపట్టకుండుట, ఇట్టి సమయమున వైద్యులు నిద్రకొరకు వాడియున్నట్టి 'నర్కొటిక్' ఔషధ ద్రవముల వికారమువలనను, రోగ తీవ్రతవల్లను, రోగియందు సంభవించెడు వాంతి భ్రాంతి, ఓకరింత లక్షణములు అడంచి రోగికి నిద్ర కల్పించి విశ్రాంతి యొసగుటకును, "కాన్సరు" దుస్థితియందు సంభవించెడు బాధను యుపశమింపజేయుటకు వాడిన ఔషధ ప్రయోగములచే గాని, "రేడియం" చికిత్సవలన గాని సంభవించెడు ఒడుదుడుకులను తగ్గించుటకును, రోగియందు సంభవించిన విపరీతమైన వాంతుల మూలమున ఎట్టి ఔషధ చికిత్సయును చేయుటకు వీలుపడక యున్నట్టి పరిస్థితులను చక్కపరచి రోగికి బాధాహర ఔషధముగను, నిద్ర కల్పించి విశ్రాంతి యొసగుటకును "లార్గాక్టిల్" ఇంజక్షనులు అద్భుతముగా తోడ్పడును.

పై వ్యాధులయందు విశ్రాంతి యెరుగక కేవలము చికిత్సాలయమున వివిధ విధములైన వుపశమౌషధము లను వాడుచు నిద్రకొరకు, విశ్రాంతికొరకును అవస్థపడు నవసరములేకయే రోగికి యింటివద్దనే విశ్రాంతి కల్పింప వీలగురీతిని పై ఇంజక్షనులు తయారు చేయబడియున్నవి. పై ఇంజక్షనులు 1% బలముతో తయారుచేయబడిన 5 సిసి అంపుల్సును, 2.5% బలముతో తయారుచేయబడిన 1 సిసి మరియు 2 సిసి అంపుల్సు సయితము కలవు. రోగియొక్క పరిస్థితిని అవసరమును గమనించి 25 మొదలు 50 M.G.M. శక్తిగల ఇంజక్షను ద్రవమును లోతుగా పిరుదులయొక్క కండరములందు ఇంజక్షను చేయవలసియుండును. తీవ్ర మైన పరిస్థితులయందు అవసరమును గమనించి 25 గంటల కాలములో రెండు లేక మూడు పర్యాయములు ఇంజక్షనులు చేయుటకూడా కలదు.

### 260. బి. ఐ. కోర్డిన్.

### B. I. Cardin I. M. & S. B.

2 సిసి అంపుల్సు లభించును. శ్వాసకోశమునందును, హృదయమునందును యేర్పడెడు అసాధారణ స్థితులను స్వాధీనములోనికి తెచ్చును. నిమోనియా, 'డిప్థీరియా' అమ్మవారు మొదలగు వ్యాధులయందు పుపుసములకును, గుండెకును సంభవించెడి లోపములు, యెగరొప్పు బాధ, శ్వాస తీసుకొనుటకు కష్టముగా నుండుట, సారాయి, కల్లు

వంటి నిషావస్తువులను అధికముగా వాడినప్పుడు గుండెకు గాని, పుపుసములకుగాని సంభవించిన దురవస్థచే రోగికి సంభవించు యవస్థను తొలగించుటకును, పుట్టిన పిల్లలు ఊపిరి తీయలేని అవస్థయందును, నిద్రకొరకు వాడబడిన "బార్బిటురేట్" వంటి ఔషధములచే యేర్పడిన శ్వాసావరోధము, గుండెయొక్క నీరసస్థితి తొలగించుటకున్ను అద్భుతముగా తోడ్పడును. రోగియొక్క పరిస్థితిని, యవసరమును గమనించి, చర్మముక్రిందగాని, కండరముల యందుగాని 1 మొదలు 2 సిసి వరకు ఇంజక్షను చేయవచ్చును. మిక్కిలి తీవ్రమైన పరిస్థితులయందు ఎక్కువ మోతాదు వాడవలసి యున్నచో 5 మొదలు 10 సిసి ల వరకు కడు నిదానముగ రక్తనాళములయందు ఈయవచ్చును. పై ఇంజక్షనులు బెంగాల్ ఇమ్యూనిటీ వారు తయారు చేయుచున్నారు.

## 261. హిస్టోస్ట్యాబ్.
## Histostab I. M.

M I. ద్రవముతో నింపబడిన ఆంపుల్సు లభించును. ఆహార దోషము, తత్వాదోషముచే సంభవించెడి చర్మవికారము, గజ్జి, దురద, శరీరముపై దద్దులు పోగొట్టును. ఔషధ దోషములచే సంభవించునట్టి చర్మవికారముల సహితము నణచును. ఆహారము గిట్టక యేర్పడునట్టి వాంతులు, వికారముల నణచును. గర్భిణీ స్త్రీలయందు

సంభవించు ఓకలింతల సహితము నెమ్మదిపరచును. అల వాటు పడిన గర్భపతనములను కలుగనీయదు. కందిరీగ, కాళ్ళజెఱ్ఱి, తేనెటీగ మొదలైనవాటి కాట్లచే సంభవించిన వాపు, చర్మవికారము నణచును.

వాతావరణమునందు ఏర్పడిన మార్పుచే సంభవించెడు పొడిదగ్గు, కండ్లు ఎఱ్ఱబడుట, ముక్కువెంట నీరు కారుట, శరీర చర్మమున నవ, దద్దులేర్పడుట ఇటువంటి లక్షణములను తప్పక నివారించును. రోగియొక్క పరిస్థితిని అవసరమును గమనించి రోజు ఒక ఇంజక్షనుగాని వారమునకు రెండు లేక మూడు పర్యాయములు గాని రోగ తీవ్రత ననుసరించి వాడవలసి యుండును. పై ఇంజక్షనులు బూట్సు కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 262. పరాల్డిహైడ్.

## Paraldehyde I. M.

2 సిసి, 5 సిసి అంపుల్సు సహితము లభించును. మానసిక సంబంధమైన చింత, భయము, ఆవేదన మొదలగు కారణమువలన గాని, శరీరమునకు యేర్పడిన అభిఘాతము, కత్తివంటి ఆయుధములచే శరీరము గాయపడుటచే సంభవించెడు బాధలు, పోటు, మున్నగువాటిచే నిద్ర పట్టకుండుట, మూర్ఛలు, శ్వాసావరోధము, మితిమీరిన యెక్కిళ్ళు, ఊపిరి సలుపని దగ్గు దమ్ము, టయిఫాయిడ్ మున్నగు జ్వరములయందు విశ్రాంతి లేక యుండుట,

హృదయ సంబంధమగు బాధలు, కీళ్ళవాతముచే ఏర్పడెడు బాధ మొదలగు అనేక లక్షణములందు రోగికి నిద్రి గల్పించి విశ్రాంతి యొసగుట యవసరము అని తోచినపు డంతయును పై ఇంజక్షను అనుభవముతో వాడవచ్చును. క్యాన్సరు, కొరియా వంటి దుష్టమైన వ్యాధులయొక్క తీవ్రిదశయందు రోగి నిద్రాహారములు మాని తపించు నప్పుడు సహితము ఈ ఇంజక్షను తాత్కాలిక విశ్రాంతి కల్పించి, బడలిక తీర్చుటకై యుపయోగించ వచ్చును. రోగియొక్క పరిస్థితిని, అవసరమును గమనించి 4 మొదలు 6 సిసి ల వరకు కండరములందు వాడవలసి యుండును. పై ఇంజక్షనువలన ఏర్పడు వ్యతిరేక చర్యను ఈ క్రింద గమనింపుడు. 1 ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులు కాలేయమునకు సంబంధించిన వ్యాధులు, జీర్ణకోశమునకు సంబంధించిన వ్యాధులు మొదలైన వాటియందు వాడ కూడదు వాడినచో అపాయము తప్పదు. ఈ ఇంజక్షనులు ప్రొఫెసర్ గజ్జర్ స్టాండర్డు కెమికల్‌వర్క్సు లిమిటెడ్ కంపెనీవారు తయారుచేయుచున్నారు.

## 263. క్యాల్సిఫర్.
## Calcefor I. V.

10 సిసి ల ఔషధద్రివముతో నింపబడిన అంపుల్సు లభించును. ఈఔషధమునందు కాల్షియం షాకోగ్లూకోనేట్ తో 500 M. G. ల విటామిన్ 'సి' మరియు స్వచ్ఛమైన

జలభాగముచేర్చి యద్భుతముగా తయారు చేయబడినది. ఈ ఇంజక్షనులు వాడి శరీరమున ఏర్పడియున్నట్టి కాల్షియం కొరతను తొలగించి అప్పుడప్పుడు ఏర్పడుచుండు రక్త వమనము, ముక్కు బెదరుట, గజ్జి పొక్కులు, చర్మము గదుములు గట్టుట, దగ్గుదమ్ము, క్షయ, దుష్ట ఔషధ దోష ములు మొదలగువాటిని నిర్మూలించి శరీరమునకు మంచి ఆరోగ్యము చేకూర్చును.

పై ఇంజక్షనులు రోగియొక్క వయస్సును గమ నించి యవసరమునుబట్టి వారమునకు రెండు పర్యాయము లుగాని, సామాన్యమైన కేసులయందు వారమునకు ఒకటి గాని కడు నిదానముగా రక్తనాళములందు ఈయవలసి యుండును. ఈ ఇంజక్షనులు విఫర్ లేబరేటరీస్ స్వీడ్జర్ లాండువారు తయారు చేయుచున్నారు.

264. క్యాలిసిబ్రోమి విఫర్.

Calcibromivifor I. V.

రక్తనాళములో చేయు ఇంజక్షన్.

10 సిసి అంపుల్సు లభించును. నిద్ర నాశనము (నిద్ర లేకయుండుట), నరములకు సంబంధించిన ఉద్రే కము, ఆహార విహారాది దోషములు, నంజు, గుండెనంజు, దగ్గుదమ్ము, చర్మవ్యాధులు, కోరింతదగ్గు, చిడుము, గజ్జి, రక్తపుపోటు మొదలగు పెక్కువ్యాధులను నిర్మూలించి శరీరమునకు ఆరోగ్యమును చేకూర్చును. రోగియొక్క

పరిస్థితిని గమనించి ప్రతిరోజు ఒక యాంపిలు చొప్పున గాని, సాధారణమైన కేసులయందు రెండు లేక మూడు రోజుల కొక పర్యాయముగాని 10 సిసి లు పై ఔషధద్రవ మును ఇంజక్షను చేయుచుండవలయును. పై ఇంజక్షనులు 10 సిసిల ద్రవము ఒక యాంపిలునందు నింపియున్నది లభించును. 5 అంపుల్సుగల పెట్టెలును, 100 అంపిల్సు గల పెట్టెలుకూడా లభించును. ఈ ఇంజక్షనులు విఫర్ లేబ రేటరీస్ స్విడ్జర్లాండువారు తయారు చేయుచున్నారు.

## 265. డాసికాల్.
## Dacecal I. M.
### కండరములో జేయు ఇంజక్షన్.

1 సిసి మరియు 10 సిసి అంపుల్సు లభించును. ఈ ఇంజక్షను ద్రవమునందు అద్భుతమైన కాల్షియం షాక్రో గ్లూకోనేట్ విటామిన్ 'సి', విటామిన్ 'డి' 2, విటామిన్ 'ఎ' మొదలయినవి నవీనపద్ధతిన చేర్చి తయారు చేయ బడినది. కాల్షియం లోపమువలన యేర్పడిన రోగలక్షణ ములను తొలగించి రక్తమునకు మంచి శక్తిని ప్రసాదించి రికెట్సు, ధనుర్వాతము, దంతములు యాలస్యముగా వచ్చుట మొదలగు లక్షణములను తొలగించి ఎముకల అభివృద్ధికి తోడ్పడుటకును, విరిగిన ఎముకలు త్వరలో యతుకుకొనుటకును, క్షయవ్యాధియొక్క ప్రారంభ దశ యందు యేర్పడు దుర్భర లక్షణములను తొలగించుటకును,

శరీరమున యేర్పడుచుండెడి రక్తస్రావాది దోషములను అరికట్టుటకును, ఆహార దోషములను రూపుమాపుటకును తోడ్పడుటయేకాక ఇందు చేరియున్న ఇతర విటామినులు ఆరోగ్యాభివృద్ధికి తోడ్పడుచుండును.

ఈ ఇంజక్షనులు చేయుటకుపూర్వము రోగియొక్క వయస్సు, దౌర్బల్యము, అవసరము మొదలగు విషయములను విచారించి 2 లేక 3 రోజులకొకఇంజక్షను చొప్పున అవసరమైనన్ని రోజులు చికిత్స పొడిగింపవచ్చును. పై ఇంజక్షనులు విఫర్ లేబరేటరీస్ స్విడ్జర్లాండు వారు తయారు చేయుచున్నారు.

## 266. కాల్గ్లూక్వియిన్.

## Calgluquine I. V. & I. M.

2 సిసి, 5 సిసి మరియు 10 సిసి అంపుల్సు సహితము లభించును. ఈ ఔషధ ద్రవమునందు 'కాల్షియం గ్లూకోనేట్'తో క్వినైన్ గ్లూకోనేట్ ద్రవము చేర్చి అత్యద్భుతముగా తయారు చేయబడినది. క్రిమి సాంసర్గక దోషములవలన, సంక్రమించిన కొన్ని వ్యాధులు మలేరియా క్రిమితోజేరిన 'నిమోకోకస్' మొదలైన క్రిమి సాంసర్గిక దోషములు శరీరమున నిలచి, సల్ఫా సంబంధమైన ఔషధముల చికిత్సకు లొంగని కొన్ని పరిస్థితులయందును, యిట్లే ఇన్ఫ్లూయింజా, నిమోనియా, మలేరియా మొదలగు రుగ్మతాది దోషములు శరీరమును బహువిధములుగా

పీడించునట్టి దుస్థితులయందు యీ ఇంజక్షనులు అద్భుత ముగా తోడ్పడును.

రోగ తీవ్రతను, వ్యాధియొక్క లక్షణమును, అవ సరమును గమనించి పెద్దవారికొరకు 5 సిసి మొదలు 10 సిసి ల వరకు ప్రతిరోజు రక్తనాళములయందు గాని. లోతుగా పిరుదుల కండరములయందు గాని వాడవలసి యుండును.

పిల్లలకొరకు 0.5 సిసి అనగా ½ సిసి లోతుగా కండరములయందు వాడవలసి యుండును. ఈ మోతాదు ఒక యేడాది యీడుగల పిల్లవానికి అని ఎరుగవలెను. ఇంతకుమించిన ఈడుగల పిల్లలకు సంవత్సరమునకు ½ సిసి వంతున పెంచుచు అనగా 3 సంవత్సరముల పిల్ల వానికి 1½ సిసి యీయవలసియుండును.

N.B. రక్తనాళమునందు పై ఔషధము మిక్కిలి నిదానముగా ప్రయోగింపవలసి యుండును. తక్కువ మోతాదు కండరములయందును, ఎక్కువ మోతాదు రక్త నాళములయందు వాడుట యుచితము. ఈ ఇంజక్షనులు శాండోస్ కంపెనీవారిచే తయారు చేయబడుచున్నవి.

## 267. లివోటెల్వ్.

## Livotelv I. M.

10. సిసి వయల్స్ రబ్బరు మూయబడిన సీసాలలో లభించును. ఈ ఔషధమునందు ప్రతి సి సి కిని తగిన

పరిమాణముతో విటామిన్ బి 12, ఫోలిక్ ఆమ్లము, లివర్ యెక్స్ట్రాక్టు, ఫినాల్ మొదలగు ద్రవములు చేర్చి అద్భుతముగా తయారుచేయబడినది. రక్తక్షీణత, పాండు రోగము, దౌర్బల్యము, నరముల నిస్సత్తువ, అతిసారము, ఎదుగునట్టి పిల్లలయందు యేర్పడునట్టి రక్తక్షీణత, సోమరి తనము, కాళ్ళుచేతులు వణకుడు మొదలగు అనేక దుర్భర లక్షణములను తొలగించి, తగిన శక్తిని ప్రసాదించుటకును, అవసరమైన రక్తవృద్ధి గావించుటకును బాగుగా ఉపయో గించును. ఈ ఔషధము స్త్రీ పురుష లను భేదము లేక ఎవ్వరికైనను రక్తవృద్ధికొరకు ఈయవచ్చును. పై ఇంజ క్షను రోగియొక్క పరిస్థితి, అవసరము ఈ మొదలగు విషయములను చక్కగా గమనించి రోజు విడచి రోజు 1/2 CC మొదలు 1 CC వరకు లోతుగా కండరములందు వాడినప్పుడు అద్భుతముగా పనిజేయును. ఈ ఔషధ ద్రవ మున 2 CC లకు 1 CC 'కొలైడయిల్ కాల్షియం' చేర్చి వాడినప్పుడు నొప్పి యేమాత్రము కాన్పింపకుండుటయే గాక శరీరమున ఏర్పడియున్న 'విటామిన్ డి' లోపము సహితము తీర్చి చక్కబరచును.

మిక్కలి తీవ్రమైన పరిస్థితులయందు 1 CC మొదలు 2 CC ల లివోసెల్స్ ఔషధ ద్రవముతో 2 CC మొదలు 3 CC ల 'కొలైడయిల్ కాల్షియం డి' చేర్చి లోతుగా పిరు దుల కండరములయందు వాడుటయు కలదు. ఈ ఇంజ

క్షనులు యునైటెడ్ ఫార్మటికల్ కంపెనీవారిచే తయారు చేయబడుచున్నవి.

## 268. మల్టిమిక్స్.

## Multimix S. C.

1 సిసి ఔషధ ద్రవముతో నింపబడిన 12 అంపుల్సు గలపెట్టె లభించును. వాతావరణమునం దేర్పడిన మార్పు వలనను, ఆహార విహారాది దోషములవలనను, తత్వజనితమై ఎలర్జిక్ దుస్థితి మొదలగు ఏ కారణముచేతనైనను సంభవించెడి దగ్గుదమ్ము, ఉబ్బసము, కన్నులెర్రబడుట, కన్నులవెంట ముక్కులవెంట నీరుకారుట, ఈ లక్షణము లలో వేసవికాల ప్రారంభమున మరియు ఋతువులమార్పు సమయమునకు యేర్పడునట్టి 'హే ఫివర్' వంటి దుస్థితుల నన్నింటిని అణచివైచి శ్వాస క్రియకు అద్భుతముగా తోడ్పడును.

ఈ ఔషధమునందు 'లోబలిన్' 5/1000 M. G. అడ్రీనలీన్ హైడ్రోక్లోరైడ్ 0,00025 G. M. ఎఫిడ్రిన్ హైడ్రోక్లోరైడ్ 0.01 G. M. జలభాగము 1 CC చేర్చబడి నది. ఈ ఇంజక్షను 1 CC వరకు పరిస్థితిని గమనించి పిరుదుల చర్మముక్రింద కడు నేర్పుతో ఇంజక్షను చేయ వలసియున్నది. ప్రసిద్ధి బొందిన ఈ ఇంజక్షనులు ఇండో ఫ్రెంచి ఫర్మాటికల్ కంపెనీ ఫ్రాన్సు వారిచే తయారు చేయబడుచున్నవి.

## 269. డెరీఫైల్లిన్ - యన్.

## Deriphyllin N. — I. V. S. C. I. M.

1 సిసి, 2 CC ల అంపుల్సు లభించును. రుద్రవాత సంబంధమైన తీవ్రతచే మెదడునందు రక్తనాళము భిన్నమగుటచే సంభవించెడు ఘాత (రుద్రవాత ఘాత), గుండె యొక్క కార్యక్రమమునకు చాలినంత రక్తప్రసరణము లభింపక హృదయముపై యేర్పడియుండు కోరినరీ రక్తనాళములయందు రక్తము పక్కగట్టి రక్తప్రసరణమునకు అవరోధము ఏర్పడుట, యిట్టి కారణమున రొమ్మునొప్పి (ఎదయందు నొప్పి) బాధించెడు 'అంజైనాపెక్టోరీస్' దుస్థితులను తొలగించుటకును, గుండెయొక్క నడకకు అవసరమైన స్థాయిని పటుత్వము ప్రసాదించుటకు అద్భుతముగా తోడ్పడును.

రోగియొక్క పరిస్థితి, అవసరము మొదలైన లక్షణములు చక్కగా గమనించి వారమునకు 1 CC మొదలు 3 CC ల వరకు విభాగించిన మోతాదులుగా పరిస్థితికి తగినట్లు వాడవచ్చును. పై ఇంజక్షనులు సామాన్యమైన పరిస్థితులయందు కండరములయందుగాని, చర్మముక్రిందగాని వాడవచ్చును. తీవ్రమైన పరిస్థితులయందు అనుభవముతో రక్తనాళములందు ప్రయోగింపవచ్చును ఈ ఇంజక్షనులు తెలిసి వాడినప్పుడు అమృతమువలె పనిచేయును. వీటిని కేమీవెర్క్ హ్యాంబర్గ జర్మనీవారిచే తయారు చేయబడి

జర్మన్ రెమిడీస్ అండ్ ట్రేడింగ్ కంపెనీ బొంబాయి వారిచే సప్లయి చేయబడుచున్నది.

270. బిటాప్లెక్సిల్.

Betaplexil I. M. & I. V.

1 CC అంపుల్సు, 10 CC ల బల్బులు సహితము లభించును. ఈ ఔషధమునందు కాలేయ రసము, విటామిన్-సి. మరియు విటామిన్-బి కాంప్లెక్సు చేర్చి మిక్కిలి శక్తివంతముగా తయారుచేయబడినది. ఈ ఇంజక్షనులు వాడి రక్తహీనత, పాండు, ఉబ్బు, విటామిన్స్ లోపము వలన యేర్పడియున్న అనేక దుర్భరలక్షణములను తొలగింప వీలగును. అతిసారాదులచే పీడింపబడి స్ప్రూ వంటి వ్యాధికి లోనై రక్తహీనతలచే కళ్ళు తెల్లబారుట, దోనె కడుపు, చేతులు కాళ్లు సన్నబడుట, ఆకలి మందగించుట, నోరు కారమును పట్టనీయకుండుట, నంజు, ఉబ్బు, గుండె యొక్క దౌర్బల్యము, గర్భిణీస్త్రీలయందు కలుగు దుర్భర లక్షణములు, పాలిచ్చు తల్లులయందు ఏర్పడియున్న రక్త హీనతాది అజీర్ణ వికారములు, ఇట్టివే అనేక విధములైన దురవస్థలను, స్త్రీ. పురుషుల శరీరములనుండి తొలగించి వారికి తగిన రక్తమును, జీర్ణశక్తిని నరముల పటుత్వమును ప్రసాదించుట కెంతయు తోడ్పడును. రోగియొక్క పరిస్థితిని గమనించి సాధారణమైన అనేక పరిస్థితుల యందు 1 CC మొదలు 2 CC ల వరకు కండరముల

యందు ఈయవచ్చును. రక్తనాళములందు ఈఇంజక్షన్ యిచ్చుట అవసరమైన యెడల మొదట 2 సిసి లు కండరములయందు ఇచ్చి అలర్జిక్ సంబంధమైన వికారములు ఏమియు కాన్పించని యెడల మరుసటి దినమునుండి 1 సిసి పై-ఔషధద్రవమును 10 సిసిల గ్లూకోస్ ఇంజక్షన్ ద్రావముతో మిశ్రమము గావించి, రక్తనాళమునందు యిచ్చుచు యిట్లు ప్రతిరోజు 1 సిసి చొప్పున హెచ్చించుచు యిట్లు 6 సిసిల వరకు చిటాల్లెక్సిల్ ఔషధ ద్రావమును రోగికై వాడి ఆరోగ్యము చేకూర్చవచ్చును. ఈ ఇంజక్షనులు, గజ్జర్స్ స్టాండర్డు కెమికల్ వర్క్సువారు తయారుచేయుచున్నారు.

## 271. ఫ్లోరోసిడ్.
## Florocid S. C.

1 CC అంపుల్సు ఒకవంతు బలముగల ఔషధద్రవముతోడను 1 సిసి యాంపులునకు 2 వంతులు బలము గల ఔషధ ద్రవముతోడను నింపబడినవి మనకు లభించును. ఫైలేరియా సంబంధముగా యేర్పడిన బోదకాలు బోదచేయి, బోదయేర్పడిన స్తనములు మొదలైన వాటియొక్క బోదవాపు లక్షణములను చర్మముయొక్క మోటుతనమును తొలగించి ఆరోగ్యమును ప్రసాదించుటకును,

ఒకవంతు బలముతో లభించిన ఫ్లోరోసిడ్ ద్రావమును 2 వంతుల బలముతో లభించిన ప్రొకేన్ హైడ్రో

్లైరెడ్ ద్రవమును ఒకే సిరంజిలోనికి గుంజుకొని నెమ్మదిగా చేతియొక్క లేక తొడయొక్క చర్మమునందు వారమునకు ఒకసారి యిచ్చుచూ యిట్లు 4 వారములు చికిత్స పొడిగించవలెను. దీనికి పిదప 15 రోజుల కొకసారి ఇంజక్షను యిచ్చుచూ రోగియొక్క క్షేమమును ఆరోగ్యాభివృద్ధిని తప్పక విచారించుచుండవలయును. ఇట్లు చేయబడిన స్వల్పకాలపు చికిత్సవలన రోగికి తప్పక ఆరోగ్యము చేకూరును. ఇట్లు కానియెడల మిక్కిలి అనుభవముతో మఱియొక కోర్సు ప్రారంభించవలసియుండును.

N. B. పై ఇంజక్షనులు కొందరి తత్వములకు గిట్టని కారణమున ఇంజక్షను యిచ్చిన స్థలమున వాపు మొదలైన లక్షణములు యేర్పడి యాప్రాంతపు గ్రంధులకు సహితము బాధ యేర్పడవచ్చును. గాన యిట్టి యవస్థ యేర్పడిన పరిస్థితిని గమనించి సల్ఫా సంబంధమైన ఇంజక్షనులు యేవియైనను వాడిన మొదటిచికిత్స పొడిగించ వీలగును పై ఇంజక్షనులు ఈస్టు ఇండియా ఫార్మాటికల్ వర్కుస్సువారు తయారు చేయుచున్నారు.

## 272. థయోమెరిన్.

## Thiomerin S. C.

10 సిసి అంపుల్సు లభించును. గుండెనంజు, మూత్రపిండములకు సంబందించిన నంజు కాలేయమునకు సంభవించి దురవస్థలచే సంభవించిన శోఫ మూత్రపిండముల

యందు బహునాళ్ళుగా వృద్ధినొందిన జబ్బు లక్షణములు మొదలైనవాటియందు మూత్రమును అధికముగా జారీచేసి శోఫ లక్షణములు ఉపశమింపజేయుటకు మహా అద్భుతముగా తోడ్పడును.

N. B. ఈ ఇంజక్షను కేవలము మూత్రపిండములకు సంబంధించిన నెఫ్రటిస్, మూత్రావరోధము, ఇట్టి అవస్థలయందు వాడినచో అనేక విపరీత లక్షణములు పొడచూపవచ్చును. సామాన్యమైన గుండెనంజు, మూత్ర పిండముల దుస్థితివలన సంభవించిన నంజు లక్షణములను తొలగించుటకు మహా అద్భుతముగా తోడ్పడును. రోగి యొక్క పరిస్థితి, శోఫ యొక్క తీవ్రత మొదలగు లక్షణములను గమనించి అవసరమునుబట్టి 0.5 సిసి మొదలు 2 సిసి వరకు చర్మముక్రింద వాడవచ్చును. ఈ ఇంజక్షను చికిత్సకు అలవడి యున్నవారికొరకు 0.5 సిసి మాత్రము వాడుచుండుట చాలును.

N. B. పై ఇంజక్షను ద్రవము 1.4 M. G. గల వయలును, 10 సిసి ల డిస్టిల్డు వాటరు గల యాంపులుతో సహా మనకు లభించును. గనుక పై ఔషధ ద్రవ్యపు పొడిని 10 సిసి ల ద్రవముతో కరగించి పై మోతాదు ప్రకారము వాడుకొనవలసి యుండును.

## 273. టెటానస్‌టాక్సాయిడ్ బి. పి.

## Tetanustoxoid B. P.—I. M. S. C.

1 సిసి ద్రవముతో నింపబడిన యాంపుల్సు మనకు లభించును. దెబ్బలవలన గాయములు యేర్పడి యుండుట వలనను, గాయమునుండి లోనికి ప్రవేశించిన క్రిమి సంబంధ దోషములవలన సంభవించెడు ధనుర్వాతము, చిన్న బిడ్డ చేష్టలు, మెడ కాళ్ళు చేతులు వంకరలు పోవుచు శరీరము విల్లువలె వంగి బిర్రబిగుసుకొని పోవుటవంటి అనేక లక్షణములను రానీయకుండుటకు ముందుగానే జాగ్రత్త పడి ఆరోగ్యమును రక్షించుకొనుటకై పై ఇంజక్షనులు తయారు చేయబడియున్నవి.

శరీరమున సామాన్యమైన వ్యాధి నిరోధకశక్తిని నెలకొల్పుటకు తడవకు 1 సిసి చొప్పున కండరములందు గాని, చర్మముక్రిందగాని మొత్తము 3 ఇంజక్షనులు తీసుకొనియుండుట యవసరము. మొదటి ఇంజక్షనుకు, రెండవ ఇంజక్షనుకు మధ్య కనీసము 4 వారముల వ్యవధియైనను యివ్వవలసియుండును. 2వ ఇంజక్షనుకు, 3వ ఇంజక్షనుకు మధ్య 2 మొదలు 6 మాసముల వ్యవధి అయినను అవసరము. తర్వాత అవసరమునుబట్టి 5 సంవత్సరములకు పిదప యెప్పుడైనను వాడుట ఉత్తమము.

N. B. శరీరమునకు తాకిన గాయముల వలన అనేకులయందు దీర్ఘకాల వ్యవధితో కూడా ధనుర్వాతము

యేర్పడుచుండుట కలదు. గాన ఈ ఇంజక్షనులు పై విధముగా ధనుర్వాత స్థితికిలోనై యున్న వారికి అద్భుతముగా ఉపయోగపడును. ఈ ఇంజక్షనులు గ్లాక్సోకో కంపెనీవారు తయారుచేయుచున్నారు.

## 274. గ్రాస్టా - పిథాడ్రిన్.

## Gasta - Pythadrin I. M.

2 సిసి అంపుల్సు లభించును. గర్భిణీ స్త్రీలయందు సంభవించెడు ఓకరింతలు, వాంతి, భ్రాంతి, మొదలగు లక్షణములు ఉపశమింప జేయుటకును, నరముల యొక్క అశక్తత దౌర్బల్యముచేతను, కాలేయముయొక్క అశక్తత దౌర్బల్యము చేతను, సంభవించిన నరముల బలహీనత, నోటిపూత, నాలుకపూత, శరీరచర్మమునందుపొడలవలెను, వల్లకలవలెను ఏర్పడి చేతులయందును, కాళ్ళయందును, పలుచని చర్మములు ఊడుచుండుట మొదలగు అనేక దుస్థితులను తొలగించి శరీరముయొక్క ఆరోగ్యతను అభివృద్ధి పరచును. శరీరమునకు యేర్పడి విడచిన పెక్కు రోగాదులకు పిదప సంభవించు కండరముల దుస్థితి, రక్తము కూడుకొనక యుండుట, ఆకలి లేక యుండుట, చల్లని చెమటలు పోయుట వంటి లక్షణములను సహితము నివారించుటకై తోడ్పడును. రోగియొక్క పరిస్థితిని, వయస్సును గమనించి తీవ్రమైన పరిస్థితులయందు 1 సిసి మొదలు 2 సిసి వరకు రోజు 1 లేక 2 పర్యాయములు

ఇంజక్షను యిచ్చుచు మిక్కిలి అనుభవముతో అవసరమై నన్నిదినములు చికిత్స పొడిగించవచ్చును. ఈ ఇంజక్షనులు గజ్జర్స్ స్టాండర్డు కెమికల్ వర్క్సువారు తయారు చేయు చున్నారు.

## 275. గ్యాస్టా - మినోఫిల్.
## Gasta - Minophy I. V.

10 సిసి అంపుల్సు మనకు లభించును. ఎదయందు గుండెయందు యేర్పడు బాధ, నొప్పివంటి పరిస్థితులతో సంభవించు 'అంజైనా పెక్టోరీస్' ధమనులకు సంబంధించిన దుస్థితిచే సంభవించు 'ఆర్టిరియోస్కాలరోసీస్' ఊపిరి తిత్తులకు సన్నని శ్వాసనాళములకు సంబంధించియు హృదయముయొక్క దుస్థితిచే తలయెత్తి పీడించెడి దగ్గు దమ్ము (ఉబ్బసము) వంటి అనేక పరిస్థితులయందు అద్భుతముగా తోడ్పడును. "కొరొనరిథ్రోంబోసీస్"వంటి వ్యాధులచే రక్తనాళములయందు రక్తము కూడుకొనునట్టి దుస్థితిని తొలగించుటకును శ్వాస పట్టి పట్టి వచ్చుట, ఎగ రొప్పువంటి అవస్థ తొలగించుటకును గుండెనంజు చేత మూత్రము తగ్గియుండుట, మూత్రపిండముల శోఫచే మూత్రము వెడలక బాధించునట్టి యవస్థను, తొలగించి మూత్రవిసర్జనమునకు కడు అద్భుతముగా తోడ్పడును. గర్భిణీ స్త్రీలయందును, దుర్బలులయందును సంభవించెడు దొమ్మరోగము శ్వాసావరోధమువంటి అనేక పరిస్థితులను

తొలగించుటకు అనేక విధములుగా తోడ్పడును. రోగ పరిస్థితులను గమనించి తగినవిధమున 10 సిసి వరకు రక్తనాళములందు మిక్కిలి యనుభవముతో వాడవలసియుండును. గజ్జర్స్ స్టాండర్డు కెమికల్స్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 276. టి. ఎ. బి. వ్యాక్సిన్ బి. పి.
## T. A. B. Vaccine B. P.—S. C.

5 సిసి వయల్స్ లభించును. క్రిమిసాంక్రమికమైన రోగములందు ముఖ్యముగా టైఫాయిడ్, ప్యారా టైఫాయిడ్ వంటి వ్యాధులు తీవ్రముగా వ్యాపించియున్న ప్రాంతములందు వ్యాధినిరోధకశక్తిని, శరీరములందు నెలకొల్పి పై జ్వరాదులనుండి తప్పించుకొనుటకు అద్భుతముగా తోడ్పడును. వ్యాధి కలిగిన పిదప పెక్కు చికిత్సల పొంది అవస్థ పడుటకంటె పై ఇంజక్షనుచే శరీరమున వ్యాధి నిరోధకశక్తిని కల్పించుకొని జీవించుటకు పై ఇంజక్షను కనిపెట్టబడి యున్నది.

ఈ ఇంజక్షను మొదటిసారిగా 0.5 సిసి చర్మము క్రిందనిచ్చి 2 వ మోతాదు 1 సిసి వరకు 7 మొదలు 28 రోజులలోపు ఎప్పుడైనను వాడవచ్చును. పిల్లలకొరకు పెద్దవారి మోతాదులో 1/3 మొదలు 1/2 వరకు తగ్గించి వాడవలసి యుండును. పిల్లలకొరకు ఈ ఇంజక్షనులు

మిక్కిలి అనుభవముతో వాడవలసియుండును. ఈ ఇంజక్షనులు గ్లాక్సకో కంపెనీవారు తయారు చేయుచున్నారు.

277. ఎన్టరోమైసిటిన్.

Enteromycetin I. M.

125 M. G. ల శక్తిగల ఔషధ ద్రవముతోడను, 250 M. G. ల శక్తిగల ఔషధ ద్రవముతోడను నింపబడిన 2 సిసి మరియు 5 సిసి ల పరిమాణముగల అంపుల్సు లభించును. టైఫాయిడ్ జ్వరము (ఆంత్రిక జ్వరము), ప్యారా టైఫాయిడు జ్వరము, క్రిమి సాంసర్గిక కారణమువలన సంభవించెడు అనేక విధములైన జ్వరాదులను తొలగించుటకును, మొండికి బడిన నిమోనియా, ఎంఫీమా వంటి దుస్థితులయందును, డిప్టీరియా వంటి అవస్థ యందును, నోటిద్వారా ఔషధమును వాడుటకు వీలుపడని అనేక పరిస్థితులయందు పై ఇంజక్షను ప్రయోగించి వ్యాధిని కడు శీఘ్రకాలములో అరికట్ట వీలగును.

నోటిద్వారా వాడిన ఔషధముయొక్క చేదు వికారము వాసన మొదలైనవి గిట్టక ప్రతిసారి వాంతిగావించుకొనుచు అవస్థపడునట్టి ఆంత్రిక సంబంధమైన జ్వర రోగులకు ఈ ఇంజక్షను వాడినంతనే అమృతమువలె పనిజేయును.

రోగతీవ్రతను, రోగియొక్క పరిస్థితిని గమనించి అవసరమైన బలముగల ద్రవమును లోతుగా పిరుదుల

యందు ఇంజక్షను 6 మొదలు 8 గంటల కొకసారి యీయ వచ్చును. పై ఇంజక్షను జి. జాంబన్ అండ్ కంపెనీ ఇటలీవారిచే తయారు చేయబడుచున్నది.

## 278. ఏస్కార్బి కాల్.

## Ascorbcal I. M I. V.

5 సిసి లు, 10 సిసి లు ద్రవముతో నింపబడిన ఆంపుల్సు లభించును. శరీరమునకు ఏర్పడియున్న శక్తి హీనత కాల్షియం లోపము విటామిన్ సి, లోపము వలన వ్యాధి నిరోధక శక్తులు కొన్ని శరీరమునందేర్పడిన కొద్ది మార్పు లక్షణములచేత గాని వాతావరణమునందు ఏర్ప డిన మార్పువలనగాని శరీరమున ఏదో ఒక విధమగు అస్వస్థత తలయెత్తుచు రోగియందు కడు నీరసస్థితి కల్పిం చుట కలదు. గర్భిణీ స్త్రీలయందు సహితము పైవిధముగా జీవాంశ సముదాయ లోపము యేర్పడుటచే పిండము యొక్క అస్థిపంజరము అసాధారణ లక్షణములతో వృద్ధి యగుటగాని అస్థి నిర్మాణక్రమమున లోపము యేర్పడుట గాని తల్లియొక్క శరీర రక్తమునందును, సున్నితమైన పొరలయందును హీనస్థితి యేర్పడి అనేక విధములగు అనారోగ్య లక్షణములు కాన్పించుచు రోగము నిర్ణయించు టకు వీలుగాని పరిస్థితులు యేర్పడుట ఇట్టి లక్షణములు పూర్తిగా తొలగించి తగినశక్తి కల్పించుటకును,

వయసు ముదిరినవారి యందును, బలహీనులయం

దును, ఊపిరి తిత్తులకు సంబంధించిన పెక్కు దుర్భర లక్షణములు తొలగించుటకును, దగ్గు దమ్ము శరీరమునకు సరిపడని ఔషధములు సేవించి యుండుటవలన సంభవించెడు చెడ్డ లక్షణములు, నీరసస్థితి, శ్లేష్మము, దగ్గు లక్షణములు మొదలగు అనేక దురవస్థలకు తొలగించి ఆరోగ్యమును ప్రసాదించుటకు నూతన పద్ధతితో పై ఇంజక్షను తయారు చేయబడినది. రోగియొక్క పరిస్థితి, అవసరము మొదలగు విషయములను బాగుగా పరిశీలించి 5 సిసి ల వరకు లోతుగా పిరుదుల కండరములయందును, 10 సిసి ల వరకు కడునిదానముగా రక్తనాళములయందును యిచ్చుచు అవసరమైనన్ని దినముల చికిత్స పొడిగింప వచ్చును. ఈ ఇంజక్షనులు రప్టాకొన్‌స్ట్రెట్ అండ్ కంపెనీవారు నేడు క్రొత్త పద్ధతితో తయారు చేయుచున్నారు.

## 279. సోల్ పిరాన్.

## Solpyron I. M.

5 సిసి ల అంపుల్సు మనకు లభించును రక్త సంబంధమైన దోషములచేతను, క్రీళ్ళ వాత సంబంధమైన రుగ్మతలు తిరుగబెట్టుట చేతను, సంధులయందు బాధతో యేర్పడు వాత లక్షణములు, కండరముల వాతదోషముచే బిగిసి తీవ్రమైన బాధతో వేధించునట్టి పరిస్థితులను, కటి వాతమున నరములపట్టు పిరుదులనుండి పిక్కవరకు వ్యాపించి యుండు 'సయేటికా' నరము బిగియుట, దీనిచే సంభవించు

బాధ నడచుటకు వీలు గలుగక పోవుట, నరములకు సంబంధించిన బాధలు, నరములయందేర్పడిన వాపుల కారణమున అంగములు కదలించుటకు వీలు పడకుండుట మొదలగు లక్షణములను తొలగించ కలుగుటయే గాక పుపుస వేష్టనమునందేర్పడు దురవస్థ (ప్లూరసి) స్వల్పమైన జ్వరముతో అంటువ్యాధిగా వ్యాపించు ఇన్ఫ్లూయింజా మొదలగు పెక్కు దురవస్థలను తొలగించి త్వరలో ఆరోగ్యము చేకూర్చును.

రోగియొక్క పరిస్థితిని, వయస్సును గమనించి 5 సిసి వరకు నిదానముగా పిరుదుల కండరములయందు లోతుగా ఇంజక్షను ఈయవలసియుండును. సామాన్యమైన పరిస్థితులయందు రోజు ఒక ఇంజక్షను చొప్పున గాని, కడు తీవ్రమైన పరిస్థితులయందు రోజు రెండు ఇంజక్షనుల వరకు వాడవలసిన కేసులు యెన్నియేని గలవు. పై ఇంజక్షనులు వుల్ఫింగ్ కంపెనీ జర్మన్ వారిచే తయారు గావింపబడినది.

## 280. స్ట్రోఫోసిడ్.

## Strophosid I. V.

1 సిసి అంపుల్సు మనకు లభించును. దీనియందు 0.25 శక్తిగల ఔషధముచేర్చబడియుండును. హృదయమునకు సంబంధించిన వ్యాధులయందును, హృదయము అకస్మాత్తుగా క్షీణగతికి లోనగుట, గుండె యొక్క

అశక్తత, శస్త్రచికిత్సలకు పిదప హృదయమున యేర్పడు నట్టి క్షీణగతి, "డిప్థీరియా" వంటి క్రిమిసాంక్రామిక రోగాధులయందు గుండెకు సంబంధించిన కండరములు వాపెక్కి రక్తప్రసరణ కార్యక్రమమునకు అవరోధము కల్పించెడు "మయోకార్డిటీస్" వంటి దుస్థితి తొలగించు టకును, "అంజైనా పెక్టోరీస్" వలన సంభవించెడు బాధాది లక్షణములు తొలగించుటకును, శరీరమునకు సంబంధిం చిన రోగాదుల వలన రక్తపు యొత్తిడి (బ్లడ్ ప్రెషర్) వంటి లక్షణములు లేకున్నను యేర్పడునట్టి గుండెదడ గాని, గుండెయొక్క నడక మందగించుట గాని మొదలగు అనేక లక్షణములను తొలగించి రోగికి ఆరోగ్యము చేకూర్చగలదు.

గుండెనంజు హృదయ నాళములకు సంబంధించిన అస్వస్థతవలన సంభవించెడు ఎగూపిరి, దగ్గుదమ్ము, శ్వాసావరోధమువంటి కారణములవలన గుండెకు యేర్పడ నున్న క్షీణగతి ప్రమాదము మొదలగు సందర్భముల యందు రామబాణమువలె పనిచేసి రోగి కారోగ్యము చేకూ ర్చగలదు. రోగియొక్క పరిస్థితి, అవసరము, వయస్సు మొదలగు విషయములను చక్కగా గమనించి 0.25 శక్తి గల 1 సిసి ఔషధ ద్రవమును నెమ్మదిగా రక్తనాళముల యందు వాడవలసియుండును. అవసరమైనచో 24 గంట లలో రెండవ ఇంజక్షను సయితము వాడవలసిన కేసులు

కూడా తటస్థించవచ్చును. సామాన్యమైన పరిస్థితులయందు రోజు ఒక ఇంజక్షను చొప్పున కొన్నాళ్ళు చికిత్స పొడిగింపవచ్చును. ఈ ఇంజక్షనులు శాండోజ్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 281. రిపసోన్.

## Ripason I. M. I. V.

10 CC ఔషధ ద్రవముతో నింపబడిన వయల్స్ మనకు లభించును. ఇది నూతన పద్ధతితో "కాలేయ" రసమును సమకూర్చి తయారు చేయబడి యున్నది. కాలేయమునకు సంబంధించిన వాపు, కాలేయమునకు రక్తము చేరవేయునట్టి రక్తనాళములకు సంబంధించిన దుస్థితిచే యేర్పడిన రక్తహీనత, ఇట్టికారణమున కాలేయము గట్టిపడి యేర్పడునట్టి "సిరోసిస్" వ్యాధి లక్షణములు నివారించుటకును, కాలేయముయొక్క తమ్మెలు ఉబ్బుట, ఇట్టిస్థితిచే తమ్మెలు యెత్తుకొనుట (ConcoMitant Liver) దీనిచే కాలేయము క్రమముగా క్షయించుటకు ప్రారంభించిన దుస్థితి, కాలేయమునకు సంబంధించిన అస్వస్థత ఏదియైనను అప్పుడప్పుడు యేర్పడుచు బాధించుచుండుట మొదలుగాగల పెక్కు దుష్ట లక్షణములను తొలగించి రక్తవృద్ధికి బాగుగా తోడ్పడును. ఈ ఇంజక్షనుయొక్క శక్తిని రోగి భరించగలడో లేదో ముందు తెలిసికొని చికిత్స పొడిగించుట ఉచితము. గావున మొదట 1 CC

ఔషధ ద్రవమును మాత్రము లోతుగా పిరుదులయొక్క కండరమునందు యిచ్చి, రెండవ ఇంజక్షను సయితము 5 లేక 6 రోజులకు పిదప పైమోతాదుతో పిరుదుయొక్క కండరమున వాడి రోగియొక్క పరిస్థితిని స్వయముగా పరీక్షించి రోగియందు వికారలక్షణము లేవియు గానుపించనియెడల రోగియొక్క వయసు, అవసరము విచారించి ప్రతిరోజుగాని, రెండురోజులకొక్కసారిగాని 2 CC మొదలు 4 CC ల వరకు కడు నెమ్మదిగా రక్తనాళములయందు వాడవలసి యుండును.

పూర్తిగా ఆరోగ్యము చెడియున్న రోగికొరకు పై విధమున ఇంజక్షనులు షుమారు ఒక్క మాసముగాని ఇంతకుమించి మూడు మాసములవరకుగాని అవసరమును గమనించి వాడుచు రోగికి పూర్తిగా ఆరోగ్యమును చేకూర్చుటకు వీలగును. ఈ ఇంజక్షనులు రోచ ఫార్మా లేబొరేటరీస్ స్విడ్జర్లాండు వారు తయారు చేయుచున్నారు.

## 282. మొనోక్యాల్సిన్.

## Monocalcin I. M.

2 CC, 3 CC మరియు 5 CC అంపుల్సు సహితము లభించును. ఈ ఔషధమునందు చేరియున్న విటామిన్-బి, విటామిన్-సి, 'నికొటనమైడ్' 'మెధినైన్' లివర్ యెక్స్ట్రాక్టుయొక్క అద్భుతమైన సంయోగముచే గొప్ప ఫలితములు కలుగుట నిజము. క్షయరోగముయొక్క ప్రా

రంభ స్థితియందు ఊపిరితిత్తులకును, మజ్జనమునకును, ఆంత్రిములకును సంభవించి యుండెడి అశక్తత, దుర్బలము, నీరసము మొదలగు లక్షణములను తొలగించుటకును, శ్వాస సంబంధమైన రుగ్మతలయందు రొమ్ము పడిశము, ఊపిరితిత్తులకు సంబంధించిన నిమోనియా, పుపుస వేష్టిపు వాపు, దగ్గు దమ్ము విటామినుల (జీవరేణువుల) లోపము వలన సంభవించెడు అనేక పరిస్థితులయందును, మొండికి బడిన అతిసారము, శరీర చర్మమున దద్దులు మొదలైనవి యేర్పడి బాధించెడు అర్టికోరియా నోటివెంట రక్తము పడు దుస్థితులు, ముక్కునుండి గాని ఆంత్రములనుండి గాని అప్పుడప్పుడు యేర్పడుచుండెడు రక్తస్రావాది లక్షణముల మలేరియా జ్వరమునకు పిదప ఏర్పడు అశక్తత వంటి అనేక దుష్టలక్షణములకు పూర్వము గాని పిదప గాని ఈ ఇంజక్షనులు వాడి రోగికి తగినశక్తి చేకూర్చవచ్చును.

రోగ పరిస్థితి, అవసరము మొదలైన విషయములు బాగుగా విచారించి 3 CC మొదలు 5 CC ల వరకు వారమునకు 2 లేక 3 పర్యాయములు లోతుగా పిరుదుల కండరములందు యీయవచ్చును. పిల్లలకు వారి వయసును గమనించి 1 సిసి మొదలు 2 సిసిల వరకు కండరములయందు వాడవచ్చును.

ఈ ఇంజక్షనులు మ్యాండాస్ డ్రిగ్స్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 283. డై హైడ్రొయిడ్ యలగాట్.

## Dihydergot S. C. I. M.

1 సిసి ద్రవముతో నింపబడిన అంపుల్సు మనకు లభించును. ఈ ఇంజక్షనునందు 1 సిసి కి 1 M. G. బలము గల ఔషధ ద్రవము చేర్చబడియున్నది. స్త్రీలయందు ఋతుదోషమువలన గాని, గర్భాశయ దోషాది అశక్తత వలనగాని యేర్పడు తీవ్రమైన శిరోవేదనము, చంకదాడి, ప్రసవ సమయమున యేర్పడు నరముల దుస్థితి, ఆంత్ర ములకు సంబంధించిన అశక్తత, ఆంత్రములు సడలుట వంటి దుస్థితి లక్షణములవంటి అనేక పరిస్థితులను చక్క బరిచి రోగికి సంభవించిన బాధను ఉపశమింపజేయును. బాధయొక్క తీవ్రత, యవసరము ననుసరించి 1/2 సిసి మొదలు 1 సిసి వరకు చర్మముక్రింద గాని, కండరముల యందుగాని ఇంజక్షను చేయవలసియుండును.

నేత్రములయందు అకస్మాత్తుగా బాధ యేర్పడి నేత్ర దృష్టికి భంగము కలిగింప 'జాలుగ్లయికోమా' యొక్క దుస్థితి తీవ్రముగా బాధించునట్టి రోగులకొరకును ఈ ఇంజక్షను వాడి బాధ నివారింపవచ్చును. మిక్కిలి అను భవముతో ఈ ఇంజక్షను అనేక పరిస్థితులయందు వాడి రోగికి సంభవించిన సంకటములను తొలగింప వీలగును. ఈ ఇంజక్షనులు నూతన పద్ధతితో శాండోజ్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 284. పెటేన్.

### Petein

1 సిసి అంపుల్సు మనకు లభించును. కోరింతదగ్గు (కుక్కదగ్గు) పసిపిల్లల యందు వ్యాపించి కొందరిని షుమారు మూడు మాసములైనను వేధించి బలహీనత, రక్తిహీనత ఆయాసము మొదలగు లక్షణము లెన్నియైనను కల్పించి కొందరియందు నిమోనియావంటి వ్యాధులు సులభముగా ప్రవేశించుటకు వీలుకల్పించుటయు కలదు. ఇందుచే ఈ వ్యాధి ప్రవేశించుటకు పూర్వమే వ్యాధినిరోధక శక్తిని శరీరమునందు నెలకొల్పి ఆరోగ్యమును కాపాడ వీలగునట్లును, వ్యాధి అంటుజాడ్యముగా ప్రబలి బాధింపబడుచున్న రోగుల చికిత్సకొరకును పై ఇంజక్షను అద్భుతముగా తోడ్పడుచున్నది. రోగపరిస్థితి ననుసరించి వ్యాధియొక్క ప్రారంభమునగాని వ్యాధి నవరోధించుటకుగాని 3 ఇంజక్షనులు 5 రోజులలో తడవకు 1 సిసి చొప్పున కండరములం దీయవలసి యుండును. పై ఇంజక్షనులు స్కేరింగ్ ఎ. జి. బెర్లిన్ జర్మనీ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 285. సైలోట్రొఫిన్.

### Cylotropin I. V.

5 సిసి ఔషధ ద్రవముతో నింపబడిన అంపుల్సు లభించును. మూత్రపిండములకు సంబంధించిన శోఫ

బాధ మూత్రి నాళములకు సంబంధించిన నొప్పి, కండర ములందు పట్లు, కీళ్ళయందు నొప్పులు యీ మొదలగు అవస్థలయందు గాని మూత్రము సరిగా వెడలక బాధించెడు సందర్భములయందు గాని పై ఇంజక్షను అద్భుతముగా పనిచేసి బాధలను తగ్గించి మూత్రము జారీయగుటకు తోడ్పడును. "సైలొట్రొఫిన్" ఇంజక్షనునందు 2 జి. హెక్సామిన్, 0 72 జి. సోడియం శాలిస్‌లేట్స్, 0.2 జి. కాఫియన్ సోడియం శాలిస్‌లేట్స్ చేర్చి కడు శక్తివంతముగా తయారు చేయబడి యుండుటచే యీ ఔషధము (ఈ మిశ్రిమ) ఔషధము మూత్రము జారీచేయుటకు మూత్రిమునందలి బాధ నివారణమునకు ఉపశమనౌషధముగను ఉపయోగపడును.

రోగియొక్క పరిస్థితి, యవసరము మొదలగు విషయములను బాగుగా విచారించి 5 సిసి ఔషధ ద్రవమును కడు నిదానముగా రక్తనాళమునందు యీయవలసి యుండును. వ్యాధియొక్క తీవ్రిత ననుసరించి వారమునకు రెండు లేక మూడు పర్యాయములు అనుభవముతో వాడుట కలదు. ఈ ఇంజక్షనులు స్కెరింగ్ ఎ. జి. బెర్లిన్ జర్మనీ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 286. ఫెరోసిటాల్.

## Ferrocytol I. M. I. V.

5 సిసి ల అంపుల్సు లభించును. నంజు రోగము

వలనను, యితర విధములైన దీర్ఘ రోగాదులయందును సంభవించెడు రక్తహీనత, కొంకెపురుగు, అజీర్ణ విరేచనములు, వాంతులు (చర్ది) మొదలగు కారణములవలన శరీర రక్తమున కవసరమైన లోహద్రవ్యము క్షీణించుట, గర్భవతులయందు సంభవించెడు పాండురోగము, అనేక విధములుగా రక్తవృద్ధికి భంగము కలిగించే పాండు, మలేరియా, ఇన్ఫ్లూయింజా, గ్రహణి, సంగ్రహణి, జీర్ణకోశము, ఆంత్రములయందు కలిగెడు క్రిమిసాంక్రమిక వ్యాధులు ఈ మొదలగు అనేక రుగ్మతలకు పిదప సంభవించెడు రక్తహీనత మొదలగు దుస్థితులను తొలగించి రక్తవృద్ధికి తోడ్పడుటకై అద్భుతముగా తయారు చేయబడియున్నవి. రోగియొక్క పరిస్థితి, రక్తహీనత, పాండు రోగములయొక్క లక్షణములు, రోగియొక్క వయస్సు ఈ మొదలగు విషయములను విచారించి పై ఇంజక్షను 5 సిసిల వరకు లోతుగా కండరములయందు గాని, రక్తనాళములయందు గాని వాడవలసి యుండును. మిక్కిలి అవసరమైన కేసులయందు మాత్రమే (రక్తనాళములయందు) వాడుట ఉచితము. సామాన్యమైన కేసులయందు వారమునకు 2 లేక 3 పర్యాయములు వాడుట చాలును. పై ఇంజక్షనులు ఆంగ్లో ఫ్రెంచి డ్రగ్ కంపెనీ వారిచే తయారు చేయబడుచున్నవి.

## 287. రిబోవిట్.

## Ribovit I. M.

2 సిసిల ఔషధ ద్రవమునకు 10 M. G. ల బలము గల ఔషధ ద్రవ్యము చేర్చబడియున్న 5 అంపుల్సులు గల పెట్టె మనకు లభించును. నోరు పొక్కుట, నోటి పూత, నాలుక పెట్లుట, కారము పట్టనీయకుండుట, శరీరమున దురద, కండ్లయందు మండుట, ఎరుపుబడుట, దురద, కళ్ళు మెరమెరలాడుట, నాలుకపై తెల్లని పొరలవంటివి యేర్పడుట మొదలగు అనేక లక్షణములను తొలగించి త్వరలో ఆరోగ్యమును చేకూర్చును.

రోగియొక్క పరిస్థితిని, అవసరమును గమనించి ప్రతిరోజు 10 M. G. ల ఔషధ ద్రవమును కండరముల యందు ఇంజక్షను చేయవలసియుండును. పిల్లలకు వయస్సునుబట్టి మోతాదును తగ్గించి వాడవలసి యుండును. ఈ ఇంజక్షనులు ఈస్టు ఇండియా ఫార్మటికల్ వర్క్సు వారు తయారు గావించుచున్నారు.

## 288. ఈస్టోడిన్.

## Eastodin I. M. & S. C.

2 సిసి ల అంపుల్సు, 3 అంపుల్సుగలవి, 6 అంపుల్సు గలవి, 12 అంపుల్సు గలవి, 100 అంపుల్సుగల పెట్టెలలో మనకు ప్రత్యేకముగా లభించును.

కొన్ని వ్యాధులు సామాన్యముగనే శరీరమున ప్రారంభించి తీవ్రమైన పరిణామము చెందుట కలదు. ఇట్టి వ్యాధులయందు చికిత్సకంటెను వ్యాధి నిరోధక శక్తిని శరీరమున నెలకొల్ప బడినప్పుడు వ్యాధి లక్షణములు తగ్గించుటకును, రోగికి ఆరోగ్యము కల్పించుటకును యీ ఇంజక్షనులు అద్భుతముగా నుపయోగపడును. సామాన్య స్థితితో ప్రారంభించిన ఇన్ఫ్లూయింజా, నిమోనియా మొదలగు యేవ్యాధులకొరకైనను ప్రారంభమున 2 CC లు పై ఔషధ ద్రవము లోతుగా కండరములయందు గాని, చర్మముక్రిందగాని ఇంజక్షను చేయవచ్చును. పై ఇంజక్షనులు ఈస్టిండియా ఫార్మాటికల్ వర్క్సు వారిచే తయారు గావింపబడుచున్నవి.

## 289. నియామైన్.

Niamine I. V. I. M. & S. C.

2 CC ల ఔషధ ద్రవముగల 6 అంపుల్సుల పెట్టెలు 2 CC ల ద్రవముగల 100 అంపుల్సులుగల పెట్టెలు మనకు లభించుచున్నవి. హృదయముయొక్క దౌర్బల్యత, రక్తప్రసరణ కార్యక్రమమునకు యేర్పడిన లోటు నీరస స్థితి శ్వాసక్రియ సంబంధమైన అస్వస్థలయందును, శ్వాసక్రియకు యేర్పడిన అసాధారణ స్థితులయందును ఇట్టివే యితర విధములైన లోపము లనేకములు సవరించి తగిన శక్తిని కల్పించుటకు అద్భుతముగా ఉపయోగపడును. రోగి

యొక్క పరిస్థితి వ్యాధియొక్క తీవ్రత మొదలగు అన్ని విషయములు చక్కగా విచారించి అవసరమునకు తగినట్లు 1 మొదలు 2 అంపుల్సువరకు రక్తనాళము నందుగాని, చర్మముక్రిందగాని కండరములందుగాని వాడి మిగిలిన చికిత్సాభాగమునకై 4 మొదలు 6 గంటలకొకసారి వాడుచు రోగియొక్క ఆరోగ్యాభి వృద్ధిని గమనించవలసి యుండును. పై ఇంజక్షనులు ఈస్టు ఇండియా ఫార్మాటికల్ వర్క్సు వారిచే తయారుగావింపబడుచున్నవి.

## 290. న్యోఫిలిన్

## Neophllin I. M. & I. V.

2 CC ల ద్రవముతో నింపిన 6 అంపుల్సుగల పెట్టెలలోను 10 సిసి ల ద్రవముతో నింపిన 6 అంపుల్సు గల పెట్టెలలోను సహితము లభించును.

దగ్గుదమ్ము, ఉబ్బసముయొక్క యేస్థితి యందైనను అద్భుతముగా ఉపయోగపడును. హృదయ సంబంధమగు దుస్థితులయందును, మూత్రము జారీచేయుట కొరకును, గుండెయందు పట్టుకొన్నయట్లు యేర్పడు నొప్పి 'అంజైనా పెక్టోరిస్', 'ఆర్టిరియో స్క్లెరోసిస్' వంటి నరముల దుస్థితి రక్తపు యొత్తిడిచే సంభవించు అపస్మారమువంటి దుస్థితి మొదలగు లక్షణములను అడంచుటకు అద్భుతముగా తోడ్పడును. రోగియొక్క పరిస్థితిని అవసరమును గమనించి 2 సిసిల ఔషధ ద్రవమువరకు లోతుగా కండరముల

యందును, తీవ్రమైన పరిస్థితులయందు 10 సిసి ల ఔషధ ద్రవమువరకు రక్తనాళమున కడు నిదానముగా వాడవలసి యుండును. ఈ ఇంజక్షనులు ఆంగ్లో ఫ్రెంచి డ్రగ్ కంపెనీవారు తయారు గావించుచున్నారు.

## 291. లివిటెక్సు.

## Livitex I. M.

10 సిసి ల ఔషధ ద్రవముగల వయల్సు లభించును. ఈ ఔషధ ద్రవమునందు క్రొత్త పద్ధతితో విటామిన్ బి 1, బి 2, బి 6, విటామిన్ సి, ఫోలిక్ ఆమ్లము, క్యాల్షి యం, నికోటోనిక్ ఆమ్లముచేర్చి అత్యద్భుతముగా తయారు చేయబడినవి. ఇట్టి వివిధ జీవరేణువుల సమ్మేళనములతో తయారు చేయబడిన ఈ ఔషధము రక్తవృద్ధికొరకును, ఆకలికొరకును, గర్భిణీ స్త్రీలయొక్కయు, పిల్లలయొక్క ఎముకలు దృఢముగా నుండుటకొరకును, క్రమపద్ధతితో పరిణామము నొందుటకును తోడ్పడును. ఈ పై ఔషధము నందు 'లివర్ యెక్స్ట్రాక్టు' సహితము చేర్చబడి ఔషధ ద్రవము కొన్నాళ్ళు నిలవయుంచినను శక్తి క్షీణించకుండు టకు దీనిలో 0.5% ఫినాల్ కూడా మిశ్రమము గావింపబడి యున్నది. దీనిచే అన్ని విధములైన పాండురోగ లక్షణ ములను, రక్తహీనతను, నంజు, తిమురువాతము, పిలిగ్రా మొదలగు రోగలక్షణములు సంభవించి బాధించెడు యే పరిస్థితులయందైనను అద్భుతముగా పనిజేయును.

ఈ ఇంజక్షనుయొక్క అవసరమును గమనించి పెద్దవారికి 2 సిసి ల వరకు లోతుగా కండరములయందు ఇంజక్షను చేయవలసియుండును. పై ఇంజక్షనులు గరుత్మాన్ యిండస్ట్రీస్ వారిచే తయారు గావింపబడుచున్నవి.

## 292. హ్రియూమినాల్.

## Rheuminol I. M.

5 సిసిల ఔషధ ద్రవముతో నింపబడిన 6 అంపుల్సులు గలవి 5 సిసిల ఔషధద్రవముతో నింపబడిన 100 అంపుల్సులు గలవి పెట్టెలలోను సహితము మనకు లభించుచున్నవి.

కీళ్ళవాత జ్వరము, వాతరక్తము, కీళ్ళవాతము, నరముల దుస్థితి, కండరములవాతము, 'సయేటికా' సంధుల చుట్టు యేర్పడు బాధ, నొప్పివంటి అవస్థలు, నడుము నొప్పి, నరములు గుంజుట మొదలగు అనేక అవస్థలను తొలగించి త్వరలో ఆరోగ్యము కల్పించుటకు ఎంతయు తోడ్పడును. రోగియొక్క పరిస్థితి, బాధయొక్క తీవ్రత విచారించి అవసరము ననుసరించి 5 సిసి ల ఔషధ ద్రవమును లోతుగా పిరుదుల కండరములయందు ప్రతిరోజు వాడవచ్చును. ఈ ఇంజక్షనులు ఈస్టు ఇండియా ఫార్మాటికల్ వర్క్సు వారిచే తయారు గావింపబడుచున్నవి.

## 293. వ్యాలోక్సిలిన్.

## Valoxylin I. M.

1 సిసి అంపులునకు 50 M. G. ల శక్తిగల ఔషధ

ద్రవముతోడను 1 సిసి అంపులునకు 100 M. G. ల శక్తి గల ఔషధ ద్రవముతోడను నింపబడిన అంపుల్సు మరియు ప్రతి సిసి కి 100 మైక్రోగ్రాముల (M. G.) శక్తిగల ఔషధ ద్రవముతో నింపబడిన వయల్సు సహితము మనకు లభించును. కేవలము లివర్ ఎక్స్‌ట్రాక్టు చికిత్సచే రక్త వృద్ధియు, ఆరోగ్యాభివృద్ధియు లభింపక మొండికి బడి యున్న పాండువ్యాధులు నంజుతో గూడియున్న పాండు ఆంత్రములకు సంబంధించిన అవస్థలతో గూడుకొన్న పాండురోగము పెక్కు వ్యాధులకు పిదప ఎట్టి ఆహారముచేతగాని, ఔషధముచేతగాని అభివృద్ధి కానరాక మొండికిబడి బాధించెడు పెక్కువిధములైన పాండురోగ దుస్థితులను తొలగించి అద్భుతమైన రక్తవృద్ధికి తోడ్పడుట కొరకు యిందు విటామిన్ బి—12 తో కాలేయ రసము చేర్చబడియున్నది. రోగ పరిస్థితి రోగియొక్క వయస్సు మొదలైన విషయములను విచారించి వారమునకు 1 సిసి చొప్పునగాని, నాలుగు రోజులకు 1 సిసి చొప్పునగాని లోతుగా కండరముల యందు ఇంజక్షను యీయవలసి యుండును. ఈ ఔషధమును ఆక్సొ లిమిటెడ్ లండన్ మెడికల్ డిపార్టుమెంటువారు తయారు చేసియున్నారు.

## 294. రోబుడెన్.

## Robuden I. M.

1 సిసి ఔషధ ద్రవముతో తయారు చేయబడిన

అంపుల్సు మనకు లభించును. ఈ అంపుల్సు 2 విధములు. 1. రోబుడెన్; ప్రొయు వెంటిర్. 2. రోబుడెన్; ప్రొయు డ్యూయొడ్. (1) రోబుడెన్ వెంటిర్ అను అంపుల్సును ప్రయోగించి గుండెయందు, జఠరికలయందు సంభవించిన కురుపును నిర్మూలింపజేయుటకును, (2) వ దగు రోబు డెన్ ప్రొయుడ్యూయోడ్ ఖాడి జీర్ణకోశ సంబంధమైన కురు పును నిర్మూలింపజేయుటకును వీలగును. కురుపుయొక్క పరిస్థితిని స్థానమును గమనించి పై విధమగు ఇంజక్షనుల యందు అవసరమైనదానితో దినము 1 ఇంజక్షను గాని, 2 దినముల కొక ఇంజక్షనుగాని లోతుగా కండరముల యందు నీయవలసి యుండును.

మిక్కిలి తీవ్రమైన పరిస్థితులయందు పై మోతా దుకు యిబ్బడిగల మోతాదుతో కొన్నాళ్లు చికిత్సజేసి, పిదప సామాన్యముగా పై ప్రకారము చికిత్స పెరిగించుచూ, రోగియందు యేర్పడు బాధను, లక్షణములను గుర్తించుచు 12 మొదలు 16 ఇంజక్షనుల వరకు ఒక కోర్సుగా యిచ్చి చికిత్స చేయవలసియుండును. పై ఇంజక్షనుల చికిత్సా సమయమున రోబుడెన్ బిళ్ళలు నోటిద్వారా వాడునట్టివి కూడ తగిన మోతాదుతో ఉపయోగించవలసి యుండును. పైన తెల్పబడిన రోబుడెన్ ఇంజక్షను ప్రొయు వెంటిర్, అంపులుపైన ఎర్రటి కాగితమును ప్రొయో డ్యూయెడ్ అంపులుపై ఆకుపచ్చని కాగితమును గుర్తుకొరకు అంటింప

బడియుండును. లోకప్రఖ్యాతిగాంచిన ఈ ఇంజక్షనులు రోఛా ఫార్మ లేబొరేటరీస్ వారు తయారు గావించు చున్నారు.

## 295. థిలెస్ట్రిన్.

## Thelestrin I. M.

1 సిసి అంపుల్సు మనకు లభించును. ప్రతి సిసి కిని 10000 యూనిట్ల శక్తిగల ఔషధ ద్రవమును చేరియుం డును. మరియు 10 సిసి లతో నింపబడిన వయల్సు కూడా లభించును. స్త్రీలకు అండాశయములందు సంభవించెడు వాపు, దౌర్బల్యము మొదలగు దుస్థితులయందేర్పడి బాధిం చెడు ఆర్తవబద్ధము, ఋతుదోషమువంటి పెక్కు దుర వస్థలను తొలగించుటకు ముఖ్యముగా తోడ్పడును.

రోగియొక్క పరిస్థితి, అవసరము మొదలగు విషయ ములను గమనించి 1 సిసి వరకు లోతుగా కండరములందు ప్రయోగింపవచ్చును. వ్యాధియొక్క క్రొత్త పాత పరిస్థితు లను, ఆరోగ్యాభివృద్ధిని గమనించుచు వారమునకు ఒకటి గాని, అవసరమైనచో రెండుగాని ఇట్లే చికిత్సకు తగినట్లు వాడుచు అవసరమైనంతకాలము చికిత్స పొడిగింపదగును. పై ఇంజక్షనులు జి. డబ్ల్యు. క్యార్నరిక్ అండ్ కంపెనీ యు. యస్. ఎ. వారు తయారు జేయుచున్నారు.

## 296. ప్రొగెస్టిరోన్.

## Progesterone I. M.

10 CC ఔషధ ద్రవముతో నింపబడిన వయల్సు మనకు లభించును. ఇందు ప్రతి CC ఔషధ ద్రవమునకు 2 M. G. శక్తిగల ఔషధద్రవము చేరియుండును. స్త్రీలకు సంభవించెడు ఋతుదోషములయందును, అలవాటు పడి యున్న గర్భపాతము, గర్భస్రావమువంటి లక్షణములు తొలగించి గర్భము నిలచుటకును, ఋతుస్రావము క్రమముగా యగునట్లు చేయుటకును తోడ్పడును. రోగియొక్క పరిస్థితి, అవసరము మొదలగు విషయములను విచారించి సామాన్యమైన పరిస్థితులయందు 1 CC ఔషధ ద్రవమును లోతుగా కండరములందు వాడవలసియుండును. పై ఔషధమును జి. డబ్ల్యు. క్యార్నరిక్ అండ్ కంపెనీ యు.ఎస్.ఏ. వారు తయారు చేయుచున్నారు.

## 297. మైయోస్టిబిన్.

## Miostibin I. M.

40 M. G. లు శక్తిగలవి 2 CCల ద్రవముతో నింపబడిన 6 అంపుల్సుగల పెట్టెలు, 5 CC ల ద్రవముతో నింపబడినవి. 6 అంపుల్సుగల పెట్టెలు 2 CCల ద్రవముతో నింపబడినవి 100 అంపుల్సులుగల పెట్టెలు; 5 CC ల ద్రవముతో నింపబడినవి 100 అంపుల్సులుగల పెట్టెలు; 30 CC ల ద్రవముతో నింపబడిన RC వయల్సులును

మనకు లభించుచున్నవి. ఇంకను 100 M. G. లు శక్తి గలవి 1 CC ద్రవముతో నింపబడినట్టియు, 6 అంపుల్సులు గల పెట్టెలు, 2 సిసి ల ద్రివముతో నింపబడినవి 6 అంపుల్సులుగల పెట్టెలు, 5 సిసి ల ద్రవముతో నింపబడినట్టివి 6 అంపుల్సులుగల పెట్టెలు 1 సిసి ద్రివముతో నింపబడినట్టివి 100 అంపుల్సులుగల పెట్టెలు, 2 సిసి ల ద్రవముతో నింపబడినట్టివి 100 అంపుల్సులుగల పెట్టెలు, 5 సిసి ల ద్రవముతో నింపబడినట్టివి 100 అంపుల్సులుగల పెట్టెలు, 30 సిసి ల ద్రవముతో నింపబడిన RC వయల్సుల పెట్టెలు సహితము మనకు లభించుచున్నవి.

"కాలా అజార్" జ్వరము, ఫైలేరియా క్రిమివలన సంభవించెడి దురవస్థల యందు అద్భుతముగా పని చేయును. ఫైలేరియా మొదలైన దుస్థితులచే సంభవించిన లక్షణముల కొరకు 100 M. G. ల శక్తిగల 2 సిసి ల యాంపిలులోని ఔషధ ద్రివమును మొదటి రోజు కండర ములలోనికి వాడి ఇదే విధముగా 3 సిసి లు రెండవరోజు, 5 సిసి లు మూడవరోజు ఈ విధముగా అనగా రోజు 5 సిసి ల చొప్పున 19 రోజుల వరకు వాడుచు చికిత్స చేయవలసియుండును.

పిల్లలకొరకు 1 సిసి కి 100 M. G. ల బలముగల ద్రవముతో ప్రితిదినము ఇంజక్షన్ యివ్వవలెను. ఇట్లు మొత్తము 25 సిసిల వరకు మాత్రిము 25 రోజులు వాడ

వలపిన కేసులు సహితము కలవు. కాలా అజార్ జ్వరముతో ప్లీహము గట్టిపడి కడుపు బానబారి నరములుతేలి వెక్కు విధముశైన అవస్థలతో నుండు రోగులకొరకు 40 M. G. ల శక్తిగల 2 CC ల ద్రవమును కండరముల యందు మొదటి దినము వాడి అదేవిధముగా 5 CC లు మొదలు 10 CC ల వరకు వాడుచు మొత్తము 100 CCల ద్రవమునకు మించక చికిత్స చేయవలసి యుండును.

1 CC కి 100 M. G. శక్తిగల ద్రవముతో ఇంజక్షను నొసంగి రక్తపు యొత్తిడి (రక్తపు పోటు) వంటి ఉద్రృతములేవియు రోగియందుకానరాకున్న యెడల, ప్రతి దినము 5 CC ల వరకు వాడుచు మొత్తము 40 సిసి ల పరిమాణమునకు మించనీయక అవసరమైనచో తక్కువ మోతాదు ఎక్కువ కాలపరిమితితో చికిత్స అనుభవపూర్వకముగా చేయవలసియుండును. ఈ ఇంజక్షనులు ఈస్టు ఇండియా ఫార్మటికల్ వర్క్సు వారిచే తయారు చేయబడుచున్నవి.

### 298. న్యూయోకెయిన్ కోర్బిరి.
### Neocaine Corbiere I. S. & I. V.

0.12 G. M. (గ్రాములు శక్తిగలవి) 12 అంపుల్సులుగల పెట్టెలలోను, 0.15 G. M. (గ్రాములు శక్తిగలవి 12 అంపుల్సులు గల పెట్టెలును లభించును.

బ్రిహ్మాదండి నాళములోనికిచ్చి సంజ్ఞాహరముగా నొనర్చుటకును, తుంటియందు యేర్పడు తీవ్రాతితీవ్రమైన బాధలను తొలగించుటకై ఆ భాగమును మొద్దుబార జేయుటకును, గుండెలో నొప్పి యేర్పడి తీవ్రముగా నొక్కినట్లు బాధించెడి "అంజైనా పెక్టొరీస్" దుస్థితినుండి తప్పించుటకును, కార్బనుమొనాక్సైడు ఆవిరి సోకి మూర్ఛనొంది యున్న రోగియందు సంభవించెడు శ్వాసబద్ధము మొదలగు దుస్థితులను తప్పించుటకును, వికల సంధులందు యేర్పడు వాతపు నొప్పులు, సంధులవద్ద వాపుచే యేర్పడు నొప్పులు మొదలగు వాటి బాధను రోగికి తెలియనీయకుండా చేసి విశ్రాంతి యొసగుటకును అద్భుతముగా తోడ్పడును. వెన్నుపూసయందు యిచ్చి సంజ్ఞాహరముగా నొనర్చుటకు 0.12 యమ్. జి. లు యున్న అంపులులోని ద్రవమును వెన్ను నాళములోనికి మిక్కిలి అనుభవముతోను ఓర్పుతోను, స్థాన మెరింగి యీయవలసి యుండును. ఇట్టి ఇంజక్షన్ తీసికొనవలసిన రోగి 150 పౌనుల బరువుకంటెను మించి యుండరాదు. బాగుగా కొవ్వుతో బలసినట్టియు, స్థూలముగానున్న యట్టి రోగికొరకు 0.15 యమ్. జి. ల అంపులులోని ద్రవమును వాడవలసియుండును. రక్తనాళములోనికి పైఔషధ ద్రవము ఇంజక్షను యొసగుటకు 1 కె. జి. (కిలోగ్రాము) శరీర తూకమునకు 4 యమ్. జి. యమ్. ల పై ఔషధ ద్రవమును 0. 1 శక్తిగల 'ఐసోనికాటోనిక్

సెలైన్' ద్రవముతో 20 నిమిషములు అయినను నెమ్మది నెమ్మదిగా వాడవలసి యుండును.

N. B. తక్కువ రక్తపు ఒత్తిడిగల రోగులకును, రక్తహీనతగల రోగులకును 'అంజైనా' 'కొరొనరీత్రోంబొసీస్' నరముల నిస్సత్తువ రక్తప్రసరణ కార్యక్రమము నందు యేర్పడిన లోటు, బ్రహ్మదండి నాళమునందు యేర్పడియున్న సేప్టిక్ స్థితి మొదలగునట్టి దుస్థితులయందు ఈ ఇంజక్షను వాడిన ప్రమాదము సంభవించును.

ఈ ఇంజక్షనులు ఆంగ్లో ఫ్రెంచి డ్రగ్ కంపెనీ వారిచే తయారు చేయబడుచున్నవి.

### 299. అంబ్రామైసిన్ ఇంజక్షన్.

### Ambramycin (I. M.)

కండరములందు మాత్రము ప్రయోగింపదగిన ఇంజక్షను 100 M. G. లు శక్తిగల ఔషధముతో నింపబడి యుండు వయల్ (Vial) మనకు లభించును.

క్రిమిసాంక్రమిక దోషమువలన సంప్రాప్తించునట్టి నిమోనియా, (ఇందులో బర్‌నిమోనియా, బ్రాంకేలే నిమోనియా) వంటి పరిస్థితులనుగాని, క్రిమిసాంక్రమిక దోషము లేకయే సంభవింపగల విషపడిశము, ఊపిరితిత్తులకు సంబంధించిన దుస్థితివలన సంప్రాప్తించు జ్వరాదులు, ప్రమేహ సంబంధమైన దోషములవలన సంప్రాప్తించునట్టి దుస్థితులు గనొకోకిక్ "క్రిమి" స్ట్రెప్టోకోకిక్, క్రిమి, నిమో

కోకికు క్రిమి మొదలగు సూక్ష్మజీవులు సాంక్రమికముగా చేరి జ్వరము, చీము, వాపు మొదలగు పెక్కు దోషములు కల్పించి బాధించునట్టి అనేక దుష్టరోగాది లక్షణములను తొలగించి రోగి కారోగ్యము చేకూర్చుటకును పెనిసిలిన్ మొదలగు క్రిమివిషదోషహరములగు ఇంజక్షనులుగాని క్యాప్సెల్సుగాని పనిచేయని కొన్ని పరిస్థితులయందు సయితము కడు అద్భుతముగా పనిచేసి రోగి కారోగ్యము కల్పించుట నిజము.

రోగపరిస్థితి, అవసరము మొదలగు అంశములను పరిశీలించి మిక్కిలి అనుభవముతో పెద్దవారికి 100 M. G. ల వరకును గల ఔషధ ద్రవమును లోతుగా కండరము లందు వాడవలసియుండును. తీవ్రమైన పరిస్థితులయందు 24 గంటల కాలము పై ఇంజక్షనులు 2 మొదలు 4 వరకు సయితము ప్రయోగింపవలసిన కేసులు సయితము గలవు. పై ఇంజక్షనులు విఖ్యాతిగాంచిన లిపిటిడ్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 300. యాక్రోమైసిన్.

## Achromycin (I. M.)

లోతుగా కండరములందు మాత్రము వాడునట్టి ఇంజక్షన్ 100 M. G. లు పొడిరూపమున నింపబడి ఇంజక్షన్ ప్రయోజనమున కుపయోగపడు వయల్ (Vial) మనకు లభించును.

నిమోనియా, (క్రిమి సాంక్రమిక మైనట్టిదిగాని, సామాన్యమైనట్టిదిగాని); కుత్తుకలో ఊర్ధ్వభాగమున వాపు బాధతో సంభవించెడు "పైరింజిటిస్"; ఊపిరితిత్తులందును, శ్వాసనాళములయందును వాపు, చీము, క్రిమి మొదలగు దుస్థితులేర్పడి బాధించుట, విషపడిశము టాన్సిల్ (గొంతులో యేర్పడునట్టివి) కోరింతదగ్గు యీ కారణములవలన సంభవించెడు పులకరము (జ్వరము) చెవియందు చీము దుష్టద్రవము వాపు లక్షణము లేర్పడి బాధించుట మూత్ర పిండములందు చీము, వాపులక్షణము లేర్పడి బాధించెడు దుస్థితులు, స్కార్లెట్ జ్వరము, ద్వివిధ క్రిమిసాంక్రమిక దోషములచే బాధించెడు దుష్టజ్వరములు, క్రిమిసాంక్రమిక దోషములచే సంప్రాప్తించి బాధించెడు గ్రహణి సంగ్రహణి బాధలు క్రిమివిషదోషాదులవలన శరీరముయొక్క యే భాగమందైనను సున్నితమైన పొరలయందు యేర్పడి బాధించెడు వాపు చీము, అసాధారణస్థితి; ఎముకలయందు మజ్జమునం దేర్పడు కురుపుదోషము, శరీర చర్మాంతరగతముగా ఉద్భవించెడు గడ్డలు, వృక్కకమునకు సంబంధించిన పొరలయందు యేర్పడి బాధించెడు వాపు, చీము లక్షణములు, మూత్రనాళమునకు మూత్రాశయమునందును వాపు, చీము మొదలగు లక్షణములతో బాధించెడు వివిధ రోగలక్షణములు, శస్త్రచికిత్సలకు పిదప యా భాగముల యందు చీము, వాపు లక్షణము లేర్పడి బాధించెడు అవ

స్థలు గనేరియా, కొరుకు మొదలగు అనేకవిధములైన దుష్టలక్షణములను, రోగములను నివారించుటలో అద్భుత మైనది.

ప్రతి 100 M. G. ఔషధమునకును 2 సిసి డిస్టిల్డు వాటరు మిశ్రి మొనర్చి యింజక్షను ప్రయోగమునకు సిద్ధ మొనర్చుకొనవలసి యుండును. ఇట్లు తయారు గావించు కొనిన ఔషధద్రవము మిక్కిలి చల్లగానుండు గదియందు నిలువయుంచి 24 గంటల కాలములో వాడవలయునేగాని యింతకుమించిన కాలము నిలువయుంచరాదు.

రోగియొక్క పరిస్థితిని గమనించి నోటిద్వారా ఔషధములు ప్రయోగించుటకు వీలుగాని పరిస్థితులయందు మాత్రము "యాక్రోమైసిన్" ఇంజక్షనులు వాడుట ఉచితము. రోగతీవ్రత అవసరము గమనించి పెద్దవారికి 100 మొదలు 300 M. G. ల ఔషధ ద్రవమును 24 గంటల కాలములో 3 విభాగించిన మోతాదులుగా వాడుట వుచితము. మొదటి మోతాదు వాడిన పిదప కనీసము 8 మొదలు 12 గంటల కాలము వ్యవధిలేనిదే రెండవ మోతాదు వాడుట మంచిదికాదు. అకస్మాత్తుగా సంభవించిన అంటుసంబంధ మైన రోగలక్షణములందు పైన దెల్పియున్న మోతాదుల వలన అట్లే గుణము గాన్పింపనప్పుడు మిక్కిలి అనుభవ ముతో తడవకు 100 M. G. లు శక్తిగల ఔషధ ద్రవ

మును 4 మొదలు 6 గంటలకు ఒక్కమోతాదు చొప్పున మిక్కిలి అనుభవముతో వాడుచు రోగియొక్క ఆరోగ్యాభి వృద్ధిని జాగరూకతతో పరిశీలించవలసి యుండును.

N. B. పైఇంజక్షన్ లోతుగా పిరుదుల కండరము లందు వాడుట చాలా అవసరము. పొరపాటున యించుక చర్మములోనికి యివ్వబడినచో ఇంజక్షనువలన మిక్కిలి బాధ సంభవించుట నిజము ఇట్టిబాధను తొలగించుటకు అచ్చోట "ఐస్‌తో" (మంచుగడ్డతో) కాపడమిచ్చుట వుచితము. ప్రొకేను ఔషధద్రవము శరీరతత్వమునకు గిట్టని వారియందు పై ఇంజక్షను వికారాది దుస్థితులను కల్పించును. యాక్రోమైసిన్ ఇంజక్షనులు కండరములందు వాడుటకును రక్తనాళములందు వాడుటకును ప్రత్యేక ప్రత్యేకములుగా "లెదర్‌లి" (Lederle) కంపెనీవారు కడు నిపుణతతో తయారు చేయుచున్నారు.

## 301. అడ్రినాల్ కోర్‌టెక్స్ యెక్స్ట్రాక్టు ఇంజక్షన్.

## Adrenal Cortex Extract Injection
(I. V. I. M. & S. C)

మిక్కిలి అనుభవముతో రక్తనాళములందుగాని, కండరములందుగాని, చర్మము క్రిందగాని వాడుట కుపయోగపడునట్టిది.

10 సిసి ఔషధద్రవముతో నింపబడిన వయల్సు (Vials) మనకు లభించును. దీనిని "రిఫ్రిసిరేటర్" నందు

గాని చల్లని వాతావరణము కల్పింపబడిన స్థానమునగాని భద్రపరచవలసి యుండును.

అడ్రినాల్ గ్రంధిస్రావ లోపమేర్పడు చుండెడు కొందరియందు శరీరకండరములకు మిక్కిలి నీరసస్థితి యేర్పడి బాధించుట, కండరముల పటుత్వమునందు అసాధారణస్థితి కలిగియుండుట "ఆస్థమా" (దగ్గుదమ్ము, ఉబ్బసము) వంటి లక్షణములు సహజమై యుండుటేగాక దీనికి తోడుగా కొందరియందు "అడిసన్స్‌డిసీస్" (సూప్రారీనాల్ గ్రంధియొక్క క్షయము) మొదలగు పెక్కు లక్షణము లేర్పడుట కలదు. ఇట్టి దోషముల నన్నింటిని తొలగించుటకు పైఇంజక్షన్ అద్భుతముగా తోడ్పడును. ముఖ్యముగా "అడిసన్స్‌డిసీస్" దుస్థితియందు గ్రంధిస్రావ లోపముయొక్క పరిస్థితికి తగినట్లు మోతాదులు నిర్ణయించి వాడుట యెంతయు అవసరము.

రోగియొక్క పరిస్థితి అవసరము మొదలగువిషయములు చక్కగా గుర్తెరిగి పెద్దవారికి ప్రతిరోజు 1 మొదలు 10 సిసి ల వరకు రక్తనాళమునందుగాని కండరములందుగాని వాడవలసియుండును. క్షారద్రవ్యములు లవణము ఆహారము మొదలగు విషయములు అడిసన్స్ వ్యాధికి తగినట్లు గమనించుచు మిక్కిలి అనుభవముతో చికిత్స పొందింపవలసి యుండును. పై ఇంజక్షన్లు జగత్ విఖ్యాతిగాంచిన అప్‌జాన్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

302. ఎస్కార్బిక్ ఆసిడ్ స్టెరిల్ సొల్యూషన్ ఇంజక్షన్.

Ascorbic Acid Sterile Sollution (I. M. & I. V.)

కండరములందును అవసరము ననుసరించి రక్తనాళమునందును వాడుటకు ఉపయోగపడునట్టిది.

100 M. G. ల శక్తితో 2 CC అంపుల్సును, 500 M. G. ల శక్తితో 5 సిసి అంపుల్సును మనకు లభించును.

శరీరముయొక్క సున్నితమైన పొరలయందును, రక్తనాళములయందును యేర్పడెడు దుస్థితి, రక్తస్రావము, చిగుళ్ళనుండి రక్తము స్రవించుట, టయిఫాయిడు మొదలగు జ్వరాదులయందు అంత్రిములకు సంబంధించిన సున్నితమైన పొరలయం దేర్పడి యుండునట్టి దుస్థితి, రక్తస్రావాది లక్షణములు ఇట్టి లక్షణములు క్షయరోగమునందు సంభవించినప్పుడు తొలగించుటకును స్వర్ణము, సీసము మొదలగు లోహసంబంధమైన ఔషధములను సేవించియున్నట్టి కొందరు రోగులయం దేర్పడెడు ఔషధ గుణదోషముల తొలగించుటకును, శరీరము అస్వస్థత జెంది యున్నట్టి అనేక పరిస్థితులయందు రక్తాణువులకును, జీవాణువులకును సంభవించెడు శిథిలావస్థలనుండి కాపాడి శారీరక శక్తులకు క్షేమము కలిగించుటకును, విషపడిశము నిమోనియా, కురుపులు, వాంతి, భ్రాంతి మొదలగు రోగ లక్షణములందు రోగియొక్క ఆరోగ్యమును కాపాడి విటా

మిను సి. ద్రవ్యము లోపించకుండ కాపాడుటకు పై ఇంజె క్షను అద్భుతముగా వుపయోగపడును.

రోగపరిస్థితి, అవసరము మొదలగు విషయముల విచారించి పై అంపుల్సునుండి తగిన శక్తిగల (అవసర మైన M. G. లు శక్తిగల) అంపుల్సును దీసికొని అందుండి అవసరమైన ద్రవమును గ్రహించి కండరములందుగాని రక్తనాళములయందుగాని అనుభవముతో వాడుచు చికిత్స జేయవలసియుండును. పై ఇంజక్షనులు సయితము అప్ జాన్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

### 303. సెట్టిక్విన్ ఇంజక్షన్.
### Shetty Quin (I. M.)

లోతుగా కండరములందు మాత్రము ప్రయోగింప దగిన ఇంజక్షను.

2 CC ఔషధ ద్రవ్యముతో నింపబడిన అంపుల్సు మనకు లభించును. పై ఔషధ ద్రవమునందు క్వైనుతో తగినరీతిచే కొద్ది పరిమాణముతో పాషాణము (Arsenic) మిశ్రమ మొనర్చి కడు యుక్తియుక్తముగా తయారు చేయ బడుచున్నది.

మొండికి బడినట్టి మలేరియాజ్వరము (చలిజ్వరము) మొదలగువాటిని అద్భుతముగా తొలగించుటకు వుపయోగ పడుచున్నది.

N. B. రక్తహీనత మిక్కిలి బలహీనత గలవారికి చిన్నపిల్లలకు యీ ఇంజక్షన్ అనుభవము లేనిదే వాడరాదు. పెద్దవారికొరకు రోగపరిస్థితి, అవసరము గమనించి 1 మొదలు 2 CC ల వరకు లోతుగా కండరములందు వాడవలసి యుండును.

పై ఇంజక్షనులు సెట్టి ఫార్మాస్యూటికల్స్‌వారు తయారు చేయుచున్నారు.

### 304. కొలోక్యాల్డైన్.

### Collocaldin (I. M. & S. C.)

కండరములందును, చర్మముకిందను మాత్రము వుపయోగించు ఇంజక్షన్.

10 CC లు ఔషధద్రవముతో నింపబడిన అంపుల్స్ మనకు లభించును. ప్రతి అంపుల్సునందును మిక్కిలి శక్తి వంతమైన క్యాల్షియమ్ 1.5 M. G. లును విటామిన్ డి. 10,000 అంతర్జాతీయ యూనిట్ల శక్తితోడను చేర్చి ప్రశస్తముగా తయారు చేయబడుచున్నది.

పై జీవపోషక ద్రవ్యములు బాగుగా లోపించి మిక్కిలి దుర్బలలక్షణములతో కృశించు గర్భవతులకును, ప్రసవించియున్న స్త్రీయొక్క శిశువునందును, పాలిచ్చు తల్లియందును దుర్బలలక్షణములు ముఖ్యముగా ఎముకలకు సంబంధించిన దుర్బలము, అసాధారణస్థితి, బిడ్డయందు "రికెట్స్" చర్మవికార లక్షణములు, "అర్థికోరియ"

పిల్లలయందుగాని పెద్దలయందుగాని సంభవించి బాధించెడు గజ్జికురుపులు, చీడ, వృద్ధాప్యమునందుగాని వాతావరణ దోషము మార్పువంటి పరిస్థితులందు పీడించెడు దగ్గు దమ్ము, ఉబ్బసము, ఆస్టియొమెలిషియ ప్రారంభస్థితియందుండెడు క్షయరోగ లక్షణములు, అకస్మాత్తుగా సంభవించినట్టి దగ్గుపడిశము రొంపవంటి లక్షణములేగాక "ఇన్ఫ్లూయంజా" వంటి దుష్ట పరిస్థితులను సయితము తొలగించి రోగికారోగ్యము ప్రసాదించుటకు అద్భుతముగా తోడ్పడగలదనుట యదార్థము.

రోగపరిస్థితి అవసరము మొదలగు విషయములను చక్కగా పరిశీలించి పెద్దవారికి 1 మొదలు 2 CC ల వరకు కండరములందుగాని చర్మముక్రిందగాని రోజువిడచి రోజుగాని యెక్కువకాలము వ్యవధితోగాని వాడవలసియుండును. పిల్లలకొరకు సయితము వారి వయస్సు ననుసరించి తగిన మోతాదు నిర్ణయించి వాడవలసియుండును. పై ఇంజక్షన్లు సెట్టీస్ ఫార్మ్యాటికల్ లిమిటెడ్ కంపెనీ వారు తయారు చేయుచున్నారు.

## 305. కార్బకోల్.

## Carbachol (I. M. S. D.)

కండరములందుగాని చర్మముక్రిందగాని వాడుటకు మాత్రము పుపయోగపడును.

1 సిసి ఔషధద్రవముతో నింపబడిన ఆంపుల్స్

మనకు లభించును. రక్తపుపోటువలన సంభవించెడు గుండె దడ, గుండెయొక్క నడకయందు గలిగెడి త్వరితగతి, పొగాకు మొదలైనవాటిని సేవించుట (పొగత్రాగుట) వలన గుండెయొక్క నడకయం దేర్పడునట్టి దుడుకుస్థితి తొలగించుటకును, రక్తనాళములయం దేర్పడెడు సంకోచ దుస్థితిలక్షణములను తొలగించుటకును శస్త్రచికిత్సలకు పిదప రక్తనాళములయందు రక్తస్రావము సక్రమముగా యేర్పడుటకును, యంత్రములయందేర్పడిన అవరోధము బాధ, మూత్రావరోధమువంటి పెక్కు దుస్థితులను తొల గించి రోగికి ఆరోగ్యము ప్రసాదించుటకు తోడ్పడును.

శస్త్రచికిత్సాదుల యనంతరము అవసరమునుబట్టి వాడవలసి వచ్చినప్పుడు 1 సిసి ఔషధము (అనగా 1 సిసికి 0.25 M. G. M. శక్తిగలది) చర్మము క్రిందగాని, కండర ములందుగాని వాడవలసియుండును. తీవ్రమైన పరిస్థితుల యందు అవసరము ననుసరించి పైవిధముగా 24 గంట లలో 3 సార్లు యివ్వవచ్చును. హృద్రోగములయందు (అనగా గుండెయొక్క తీవ్రగతియందు) ఒక్కదినములో 0.75 M. G. M. కంటెను యెక్కువ వాడుటకు అనుభవ మెంతైన యవసరము. పై మోతాదును విభాగించి ప్రతి సారి 0.25 M. G. M. శక్తికి మించిన ఇంజక్షన్ యీయ రాదు. పై ఇంజక్షన్‌లు బరూస్ వెల్‌కం కంపెనీవారు తయారు చేయుచున్నారు.

306. ఫోల్‌విట్ సొల్యూషన్.
Folvite Solution (I. M. I. V. & S. C.)

కండరములందుగాని, రక్తనాళముల యందుగాని, చర్మము క్రిందగాని ప్రయోగింపబడు ఇంజక్షన్ ద్రవము.

10 CC లు ఔషధద్రవముతో నింపియుండు వయల్ (Vial) మనకు లభించును. ఇందు ప్రతి ఒక్క 1 CC యందు 15 M. G. లు శక్తిగల పరిశుద్ధమైన 'ఫోలికామ్లు' ద్రవ్యము చేర్చబడియుండును.

రోగియొక్క రక్తపరీక్షయందు రక్తాణువుల లోప మేర్పడియుండు దుస్థితిని తొలగించుటకును, దీర్ఘకాలము బాధించియుండునట్టి "అతిసారము" (స్ప్రూ) వ్యాధి లక్షణములు నివారించుటకొరకును, గర్భవతులయందు యేర్పడి బాధించెడు పాండు, రక్తహీనత, అనేక విధములైన అస్వస్థతకు పిదపగాని పూర్వముగాని శారీరక శక్తులతో పాటు రక్తహీనత యేర్పడి కృశించు బలహీనులకొరకును పెక్కువిధములైన రోగాదులకు పిదప పాండులక్షణములతో యనేకులయందు రక్తహీనత యేర్పడ్ బాధించునట్టి "మైక్రొసైటికు యెనిమియ" (Macrocytic Anemia) దుస్థితిని తొలగించి రక్తాభివృద్ధి గావించి ఆరోగ్యమును ప్రసాదించుటకు అద్భుతముగా తోడ్పడును.

రోగియొక్క పరిస్థితి, అవసరము మొదలగు సందర్భములు విచారించి పెద్దవారికి రోజుగాని, రోజువిడచిరోజు

గాని కండరములందో రక్తనాళములందో వాడుట మంచిది. పిల్లలకు వారి వయస్సు ననుసరించి మోతాదు నిర్ణయించి కేవలము కండరములందు మాత్రము వాడుట క్షేమకరము.

పై ఇంజక్షను చికిత్సాసమయమున రోగియందు తగిన రక్తాభివృద్ధి యేర్పడినట్లు రక్తపరీక్షవలన నిర్ణయించిన వెంటనే పై మోతాదు నిలిపి కనీసము 5 M. G. ల శక్తికి తగ్గని ఔషధ ద్రవమును రోజువిడచి రోజుగాని వాడవలసియుండును.

N. B. పైవిధమగు ఇంజక్షన్ చికిత్సాసమయము రోగియొక్క అభివృద్ధిని అన్నివిధముల వైద్యుడు పరీక్షించుచు యవసరమునుబట్టి చికిత్స పొడిగింపవలయునే గాని అనవసరముగా చికిత్స పొడిగింపరాదు. పై ఇంజక్షణ్లు లెడర్ లి కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 307. ఫాల్బిసైణ్ ఇంజక్షణ్.
## Folbesyn Parenteral (I. M. I. V.)

కండరములందును పరిస్థితిని గమనించి అనుభవముతో రక్తనాళములందును సయితము ప్రయోగించుటకు తగినది.

పై ఇంజక్షన్ ద్రవ్యము పొడిరూపమున ఒక మోతాదుతో నింపబడిన రబ్బరు మూతగల "వయల్"

(Vial) ఒకటి దీనిని కరగించుటకు అవసరమైన 'ద్రవము' (Diluent) 2 CC గల అంపులు ఒకటి సప్లయి చేయబడు చుండును.

తీవ్రతరమైన రోగపరిస్థితులయందును. మిక్కిలి అవసరమైన శస్త్రచికిత్సలకు పూర్వముగాని, పిదపగాని రోగియొక్క శక్తి మిక్కిలి నీరసించియున్నప్పుడును రోగియొక్క శరీరపోషణమునకు ముఖ్యావసరమైయున్న విటామినులు మిక్కిలి లోపించి రోగియొక్క పరిస్థితి తారు మారుగా నున్నప్పుడు రోగికి అవసరమైన శారీరక శక్తిని కల్పించుటకును, శరీరపోషక ద్రవ్యములచే శారీరకస్థితికి పుత్తేజము కల్పించి ఆరోగ్యాభివృద్ధి గావించుటకును అద్భు తముగా తోడ్పడును.

రోగి పరిస్థితి, అవసరము మొదలైన విషయము లను పరిశీలించి పెద్దవారికి పొడిరూపమున నుండు వయల్ లోని ఔషధ ద్రవ్యమును కరగించుటకు ప్రత్యేకముగా సప్లయి చేయబడిన అంపులులోని ద్రవముతో కరగించి వెంటనే లోతుగా కండరములందుగాని, మిక్కిలి అనుభవ ముతో రక్తనాళములయందుగాని ప్రయోగించవలసి యుం డును.

N.B. పైవిధముగా పొడిని ద్రవముతో వయలు నందు మిశ్రిమ మొనర్చి కరగించిన వెంటనే కాలయాపన

ముగావింపక యా ద్రవమును 1 గంటలోపుగనే వాడవలసి యుండును. ఇంతకు యెక్కువకాలము నిలువయుంచినది ఇంజక్షన్ ప్రయోగమున వాడరాదు. పైఇంజక్షన్లు కొందరి తత్వములకు గిట్టనప్పుడు చర్మవికారములు, దద్దులు మొదలైన అలర్జీ లక్షణములు యేర్పడవచ్చునుగాన యిట్టి పరిస్థితిని గమనించి వైద్యుడు అలర్జీస్థితికి యీ గ్రంథమున తెల్పియున్న యే ఇంజక్షనుగాని యితర ఔషధములుగాని వాడవలసియుండును. ఫాల్బిసైన్ ఇంజక్షన్ "లెడర్లీ" కంపెనీవారు కడుయుక్తిగా తయారు చేయుచున్నారు.

### 308. లివోజిన్ ఇంజక్షన్.

### Livogen For Injection (I. M.)

కండరములందు వాడుట కుపయోగపడు ఇంజక్షన్ 10 ML (అనగా 10 CC ల) ఔషధద్రవముతో నింపబడిన వయల్స్ లభించును. క్రొత్తగా నేడు ఇంజక్షన్ రూపమున తయారు చేయబడుచున్న పై ఔషధమునందు విటామిన్ బి 1 బి 2 బి 6 బి 12, పిపి లివర్ యెక్స్ట్రాక్టు లివర్ వ్యాధులందు అద్భుతముగా పనిచేయగల కొలిన్ క్లోరైడ్ మరియు శరీరపోషణమున కవసరమైనట్టి నితర ద్రవ్యములు చేర్చి మిక్కిలి శక్తివంతముగా తయారు చేయబడియున్నది.

నరముల నిస్సత్తువ, రక్తహీనత, పాండు, కామిల, శ్వేతకామిల, ఆహార లోపమువలన సంభవించెడు అతి

సారము స్ప్రూ, యీకారణమున సంభవించెడు దౌర్బ ల్యము రక్తహీనత మొదలగు లక్షణములు తొలగించి శరీ రాంగములకు శక్తిని ఉత్తేజమును ప్రసాదించుటకును టయిఫాయిడ్ జ్వరమునందుగాని, జ్వరమునకు పిదపగాని రోగియం దేర్పడియుండెడు అతినీరసస్థితిని తొలగించి, శరీర కృశత్వము, రక్తహీనత యేర్పడనీయక రక్షించుట కును కడుపు జీర్ణాశయము మొదలగు భాగములం దేర్ప డిన కురుపు, బల్ల మొదలగు రోగాదులకొరకు గావింప బడిన శస్త్రచికిత్సలకు అనంతరమున రోగియం దేర్పడి యుండెడి అజీర్ణము రక్తహీనత మొదలగు దుష్టలక్షణములు తొలగించుటకును, నానావిధ రోగలక్షణములచే కృశించి రక్తహీనత, శక్తిహీనత, మందాగ్ని, నంజు, అతిసారము వంటి పెక్కులక్షణము లేర్పడియున్నప్పుడు వాటిని తొల గించి రోగికారోగ్యభాగ్యము ప్రసాదించుటకు అద్భుత ముగా ఉపయోగపడును.

రోగపరిస్థితి అవసరము గమనించి పెద్దవారికి 1CC వరకు కండరములందు వారమునకు రెండు లేక మూడు పర్యాయములు వాడవలసియుండును. పిల్లలకొరకు వారి వయస్సు అవసరము విచారించి తగిన మోతాదు నిర్ణయించి వాడవలసియుండును. పై ఇంజక్షనులు బి. డి. హెచ్. కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 309. మెర్కార్డాన్ ఇంజక్షన్.

## Mercardan (I. M. S. C.)

కండరములందుగాని అవసరమును గమనించి చర్మము క్రిందగాని వాడునట్టిది.

1 సిసి మరియు 2 సిసి ల ఔషధద్రవముతో నింపి నట్టి అంపుల్స్ మనకు లభించును. ముఖ్యముగా ఇది మూత్రల ఔషధముగా (Diuretic) ఉపయోగించినప్పుడు అద్భుతముగా పనిచేయును. అనేక పరిస్థితులయందు నీరు శోఫ మొదలగు లక్షణములచే హృదయమువద్ద యేర్పడి నట్టి అసాధారణస్థితి ఆయాసమువంటి లక్షణములను తొల గించి మూత్రమును జారీచేయుటకును స్వేదము నిరభ్యం తరముగా వెడలుటకును తోడ్పడుచు రోగికి ఆరోగ్యాభి వృద్ధి గావించుట కుపయోగపడుచుండును. "మెర్క్లోరెన్" బిళ్ళల చికిత్స (ఇదికూడా మూత్రల ఔషధమే) నిలిపి నప్పుడుగాని దానికి బదులుగా అవసరమును బట్టి వాడుటచే అద్భుతముగా సహాయపడును.

రోగి పరిస్థితి, అవసరము మొదలగు విషయములు చక్కగా పరిశీలించి పెద్దవారికి 1 సిసి మొదలు 2 సిసి ల వరకు కండరములందుగాని, కొన్ని పరిస్థితులయందు చర్మముక్రిందగాని వాడవలసియుండును. పై ఇంజక్షన్లు ప్రఖ్యాతిగాంచిన పార్కుడేవిడు కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 310. మెథిడ్రిన్.

## Methedrin (I. M. & I. V.)

కండరములందు అవసరమునుబట్టి రక్తనాళము నందును సయితము వాడవలసియుండును.

1.5 ఔషధద్రవముతో నింపబడిన అంపుల్సు మనకు లభించును. ప్రతిఒక్క అంపులునందు 30 M. G. M. ల శక్తిగల ఔషధ ముండును. నిద్రమత్తువంటి దుస్థితితో రోగి పడియుండుట తొలగించుటకుగాను, నిద్రకొరకును మత్తుకొరకును వాడబడిన మాదక (నిద్రాకారి) ఔషధములు వాడుటవలనగాని సారాయి, బ్రాండి మొదలగు నిషావస్తువు లధికముగా సేవించియుండుటచే సంభవించియుండు మబ్బు, మగతవంటి లక్షణములను తొలగించుటకును సయితము పై ఇంజక్షను అద్భుతముగా తోడ్పడును. మరికొన్ని సమయములందు రక్తప్రసరణ కార్యక్రమమున యేర్పడియున్న నీరసలక్షణములను తొలగించి వుత్తేజము కలిగించుటకు సయితము వుపయోగింపవచ్చును.

నిద్రాకర ఔషధములు వాడియుండుటవలన సంభవించియున్నట్టి దోషమును మత్తును తొలగించుటకొరకు రోగియొక్కస్థితిని గమనించి అవసరమునుబట్టి పెద్దవారికి 15 మొదలు 20 M. G. M. ల శక్తి గలిగిన ఔషధద్రవమును తీసికొని లోతుగా కండరములందు వాడవలసి యుండును. అవసరమైనయెడల ఇంతటి మోతాదు అనుభవముతో

వాడుచు రోగికి ఆరోగ్యము కల్పించవచ్చును. శస్త్రచికిత్సల యందు అవసరమును గమనించి 15 M. G. M. ల శక్తి గలిగిన ఔషధద్రవము మొదలు 40 M. G. M. ల శక్తి గల ఔషధద్రవమువరకు లోతుగా కండరములందుగాని మిక్కిలి అనుభవముతో రక్తనాళములందుగాని రక్తపు యొత్తిడి నిగమనించి వాడుటయును కలదు. పైఇంజక్షనులు బరూస్ వెల్‌కం కంపెనీవారు తయారు జేయుచున్నారు.

## 311. మెర్సాలైల్.

## Mersalyl (I. V. & I. M.)

రక్తనాళములందుగాని, లోతుగా కండరములందు గాని వాడవలసియుండును.

2 సిసి ల ఔషధద్రవముతో నింపబడిన అంపుల్స్ మనకు లభించును. శోఫ, గుండెనంజు, కార్జమునకు సంబంధించిన నంజు, మూత్రపిండములకు సంబంధించిన నంజు, జలోదరము మొదలగు రోగలక్షణములందు దీనిని మూత్రాల ఔషధముగా (అనగా మూత్రమును అధిక పరిమాణముతో జారీచేసి నంజు శోఫ లక్షణములను తొలగించుటకు) అద్భుతముగా ఉపయోగపడును.

రోగపరిస్థితి, అవసరము మొదలగు విషయములను పరిశీలించి పెద్దవారికి 0.5 సిసి (అనగా ½ సిసి) మొదలు 2 సిసి ల వరకు కండరములందుగాని, రక్తనాళమునందు గాని ప్రయోగించవలసియుండును.

పిల్లలకొరకు వయస్సును గమనించి అవసరమును బట్టి తగిన మోతాదులు నిర్ణయించి వాడవలసియుండును. పై ఇంజక్షణాలు బరూస్ వెల్కం కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 312. డిస్టావిట్.

## Distavit (I. M.)

కండరములందు మాత్రము వాడవలసియుండును.

1 CC అంపుల్ మనకు లభించును. 1 CCకి 100, మరియు 1000 మైక్రోగ్రాముల శక్తిని కల్పించి తయారు చేయబడినట్టివికూడా లభించును.

వివిధ విధములైన రోగములకు పిదప రోగియం దేర్పడి బాధించెడు రక్తహీనత, పాండు యిట్టి కారణమున సంప్రాప్తించు అతిసారము, శిరోవేదనము, శ్వేత కామిలవంటి పెక్కు దుష్టలక్షణములు తొలగించుటకు అవసరమైన రక్తమును వృద్ధిపరచి తగిన శక్తిని ఉత్సాహమును ప్రసాదించుటకు అద్భుతముగా తోడ్పడును.

తీవ్రాతితీవ్రమైన పరిస్థితులయందు పెద్దవారికి అవసరమును గమనించి వారమున 100 మొదలు 1000 మైక్రోగ్రాముల శక్తిగల ఒక అంపులును వాడవలసిన కేసులు సయితము యెన్నేని కలవు. అనుభవముతో చికిత్స పొంది

గింపవలసియుండును. ఈ ఇంజక్షన్‌లు ఐ. సి. ఐ. కంపెనీ వారు సప్లయి చేయుచున్నారు.

## 313. నియోగ్లయికోకాల్.

## Neo-Glucacal (I. M. & I. V.)

లోతుగా పిరుదుల కండరంబులందుగాని, రక్తనాళమునందుగాని వాడుటకు పనికివచ్చును.

10 CC ల ఔషధద్రవముతో నింపబడిన అంపుల్స్ మనకు లభించును. క్షయరోగముయొక్క ప్రారంభస్థితియం దేర్పడెడు పెక్కు లక్షణములను, దుర్బల స్థితిని తొలగించుటకును, అంత్రములకు సంబంధించిన క్షయరోగలక్షణములు క్షీణగతి, మొండికిపడి మానకయున్న కురుపులు, వ్రణములు మాన్పుటకును అస్థిభంగమునకు పిదప చాలాకాలమువరకు అతుకుబడకయుండు యెముకల యొక్క దుస్థితిని తొలగించి అతుకు త్వరలో యేర్పరచుటకును, పుపుసములకు సంబంధించిన దౌర్బల్యలక్షణము వలన రోగియం దేర్పడుచుండెడు నిస్త్రాణ తొలగించి శ్వాసయొక్క క్రియాశక్తి నధికపరచుటకును అద్భుతముగా తోడ్పడును.

రోగియొక్క పరిస్థితి, అవసరము మొదలగు అన్ని విషయములు చక్కగా విచారించి అవసరమునుబట్టి ప్రతి రోజు ఒక అంపులు (10 CC) వరకు అనువైన మార్గ

మున వాడవలసియుండును. పిల్లలకు వారి వయస్సు అవసరము గమనించి తగిన మోతాదు నిర్ణయించి వాడవలసియుండును. పై ఇంజక్షనులు కెమోఫార్మా కంపెనీ లిమిటెడ్‌వారు తయారు చేయుచున్నారు.

## 314. ఫిసెప్‌టోన్.

## Physeptone (I. M.)

### కండరములందు వుపయోగించు ఇంజక్షన్.

1 సిసి అంపుల్స్ లభించును. ప్రతి సిసి ద్రవమునకు 10 M. G. M. శక్తిగల ఔషధద్రవ్యము చేర్చబడియుండును. శరీరమునందేర్పడెడు పలువిధములగు నొప్పులను తాత్కాలికముగా వుపశమింపజేయుటకు అద్భుతముగా తోడ్పడును. కీళ్ళనొప్పులు, మూత్రనాళములకు సంబంధించిన రాయి మొదలగు అవస్థలచే సంభవించెడు బాధలు, కాన్సర్ సంబంధముగా యేర్పడి బాధించెడు "కార్‌సినిమో" బాధలు, ఎముకల సంధులందు యేర్పడు నొప్పులు (ఆస్టియో మెలిటిస్) మొదలగు పెక్కు పరిస్థితులయం దేర్పడు నొప్పులను ఉపశమింప జేయుటకు తోడ్పడును.

N. B. ఈ ఇంజక్షన్‌లు, ప్రసూతివేదనచే తపించువారికి వాడుట ప్రమాదకరము. మరియు దెబ్బలు, గాయములు తగిలినవారికి సయితము వాడరాదు.

పై ఇంజక్షన్‌ను అవసరమును గమనించి తాత్కాలిక బాధాహార ఔషధముగా 5 మొదలు 10 M. G. M. ల శక్తిగల ఔషధమువరకు కండరములందు వాడవలసియుండును. అవసరమునుబట్టి 3 గంటలకు పిదప మరియొక మోతాదు వాడవచ్చును. పై ఇంజక్షన్లు బరూస్ వెల్‌కం కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 315. పెథిడైన్ హైడ్రోక్లోరైడ్.
## Pethidine Hydrochloride (I. M.)

లోతుగా కండరములందుగాని, అవసరమునుబట్టి రక్తనాళములందు గాని వాడుట కలదు.

1 సిసి మరియు 2 సిసి పరిమాణముతో నింపబడిన అంపుల్స్ మనకు లభించును. ప్రతి 1 సిసి 50 M. G. M. ల శక్తిగల ఔషధద్రవ్య మందు చేర్పబడియుండును.

శస్త్రచికిత్సలకు పిదప సంభవించెడు బాధ, నొప్పి మొదలగు లక్షణముల నుపశమింపజేసి బాధాహారముగ నుండుటకును, ఇట్లే పిత్తకోశ సంబంధమైన శూల, మూత్ర పిండములకు సంబంధించిన శూల, బాధ, నొప్పి, ముట్టు శూల, కీళ్ళు మొదలైనవాటియం దేర్పడు నొప్పి, బాధ, పెద్దపేగుకు సంబంధించిన బాధ, నొప్పి, ప్రసూతిసమయ మునకు యించుక పూర్వము యేర్పడు నొప్పి, బాధ మొద

లైనవాటిని రోగికి తెలియకుండునట్లు సంజ్ఞాహర ఔషధ ముగా వాడుట కలదు.

సాధారణమైన అనేక పరిస్థితులయందు సంభవించెడు వివిధ బాధలు తెలియకుండు నట్లొనర్చుటకు 100 M. G. M. ల శక్తిగల ఔషధ ద్రవమును కండరములందు ప్రయోగింపవలసి యుండును. అవసరమునుబట్టి 3 గంటల పిదప మరల ఒక ఇంజక్షన్ పైవిధముననే వాడుట కలదు. ప్రసూతికి పూర్వము అవసరమునుబట్టి మిక్కిలి అనుభవముతో ఒకగంట పూర్వము 1 ఇంజక్షన్ వాడుట కలదు. అనుభవరహితముగా యీ ఇంజక్షన్‌లు వాడుట ప్రమాదకరము. పై ఇంజక్షనులు బరూస్ వెల్‌కం కంపెనీ వారు తయారు చేయుచున్నారు.

316. ప్లాస్‌మెక్స్.

Plasmex (I. V.)

రక్తనాళములోనికి చేయు ఇంజక్షన్.

500 సిసి పరిమాణముతో నింపబడిన గాజుబుడ్డీలు మనకు లభించును. గాయములు, వ్రణములు, తీవ్రతరమైన వాంతులు, విరేచనము, శస్త్రచికిత్స మొదలగు యే కారణముల చేతనైనను యేర్పడినట్టి రక్తస్రావాది కారణములు రోగియొక్క శరీరమునం దేర్పడిన అతినీరసస్థితిని తొలగించి శారీరక శక్తులను వృద్ధిపరచి రక్తస్రావలక్షణ

ముల నతికట్టుటకు సంజీవివలె వుపయోగపడును. శరీరము కాలిన కారణమున దగ్ధవ్రణములనుండి అతిగా బయటికి వెడలిపోయిన ద్రవభాగమును మరల శరీరమున కిచ్చి రక్తములోని ద్రవపదార్థమునకు క్షేమస్థాయిని కల్పించుటకు యింతకుమించిన చికిత్స మరియొకటి కానరాదు.

రోగియొక్క పరిస్థితి అవసరము వయస్సు మొదలగు విషయములను పరిశీలించి పెద్దవారికి 500 మొదలు 1000 CC ల ద్రవమువరకు వాడవలసియుండును. పై ఔషధద్రవముగల సీసాను ఒక యెత్తుప్రదేశమున తల క్రిందుగా వేలాడగట్టి సీసాకు అమర్చబడియుండు రబ్బరు గొట్టముయొక్క రెండవకొనకు అమర్చబడియుండు ఇంజక్షను సూదిని రోగియొక్క రక్తనాళమునందు యెక్కించి కనీసము 25 నిమిషముల కాలమైనను కడునెమ్మదిగా పై ఔషధమును యెక్కించవలసియుండును.

పిల్లలకొరకు షుమారు 100 CC ల ఔషధద్రవము వరకు పైవిధముగా నెక్కించవలసియుండును.

పై ఔషధద్రవముగల గాజుసీసాలను కెమోఫార్మా లిమిటెడ్ కంపెనీవారు తయారుచేసి సప్లయిచేయు చున్నారు.

## 317. ప్లిబెక్స్.

## Plebex (I. M. & I. V.)

కండరములందును, రక్తనాళములందును వాడుటకు వుపయోగపడునట్టి ఇంజక్షన్.

100 సిసిల ఔషధద్రవముతో నింపబడిన "వయల్" (Vial) మనకు లభించును. ఇందు ప్రతి 1 సిసి యందును ముఖ్యముగా విటామిన్ బి 1, 10 M. G. ల విటామిన్ బి 2, 2 M. G. లు నోకోటోని కామ్లము (విటామిన్ పి.పి.) 100 M. G. లు పైరాక్సిడాన్ 5 M. G. లు కాల్షియం ప్యాంథొనేట్ 5 M. G. లు మిక్కిలి సూక్ష్మ పరిమాణము తో (0.5%) "క్లోరోబుటనాల్" సయితము మిశ్రమము గావింపబడి యుండును.

శరీరమున పై విటామినులు, జీవపోషక ద్రవ్యములు లోపించియున్న వ్యక్తులయందు (రోగులయందు) యేర్పడి బాధించెడు అగ్నిమాంద్యము, అజీర్ణాతిసార లక్షణములు, నంజు శోఫ లక్షణములు, రక్తహీనత, శరీర చర్మమునందు యేర్పడెడు అసాధారణ స్థితి, చర్మము పొరలుపొరలుగా ఊడిపోవుట మొదలగు అనేక దుస్థితుల తొలగించుటకును, గర్భిణీస్త్రీలయందును బాలురయందును యేర్పడి బాధించెడు పెక్కు అజీర్ణలక్షణములు వాంతులు అన్నమునందు హితవుదప్పి యుండుటవంటి పెక్కు పరిస్థితులను చక్కపరచి రోగికారోగ్యము ప్రసాదించుటకీ ఇంజక్షనులు కడు అద్భుతముగా తోడ్పడును.

రోగపరిస్థితి అవసరము మొదలగు అంశములను పరిశీలించి పెద్దవారికి 1 మొదలు 2 సిసి వరకు ప్రతిరోజు

గాని, రోజువిడచి రోజుగాని కండరములందు వాడుట వుచితము. మిక్కిలి తీవ్రమైన పరిస్థితులయందును, యెక్కువ మోతాదు అవసరమైన కేసులకొరకును మిక్కిలి అనుభవముతో తగిన మోతాదు రక్తనాళములందు వాడుట కలదు. పై ఇంజక్షణాలు జాణవెత్ అండ్ బ్రదర్స్‌వారు తయారు చేయుచున్నారు.

## 318. సిల్లారీణ.
## Scillaren (I. V.)

రక్తనాళములందు మాత్రము ప్రయోగింపదగినట్టిది.

1 సిసి అంపుల్స్ మనకు లభించును. ప్రతి సిసి కి (అనగా ప్రతి ML నకు) 0.5 M. G. శక్తిగల ఔషధ ద్రవ్యము చేర్చబడియుండును. హృదయ సంబంధమైన దుస్థితియందు "డిజిట్యాలీస్" (Digitalis) కంటెను యుక్తి యుక్తముగను చురుకుగను పనిచేయును. అనేక పరిస్థితులయందు యేర్పడియుండెడు గుండెనంజు, మూత్రపిండములు, మూత్రనాళములకు సంబంధించిన నంజు, కాలేయముయొక్క ఒకభాగము గట్టిపడుటవలన సంభవించినట్టి జలోదరము మొదలగు దుస్థితులయందు మూత్రమును అధికపరచి హృదయమునకు మంచి స్థితిని కల్పించుటకు అద్భుతముగా తోడ్పడును. రోగపరిస్థితి అవసరము బాగుగా పరిశీలించి పెద్దవారికి ½ మొదలు 1 ML (అనగా 1 CC) వరకు మిక్కిలి అనుభవముతో మెల్లగా రక్తనాళ

ములందు ప్రయోగింపవలసి యుండును. వ్యాధియొక్క తీవ్రతయందు పై మోతాదు ప్రతిదినము అనుభవముతో వాడవచ్చును గాని వ్యాధియొక్క తీవ్రత వుపశమించినపిదప యీ చికిత్స మానివేసి అవసరమైనయెడల "డిజిట్యాలీస్ బిళ్ళలు" అనుభవముతో వాడవలసి యుండును.

పై ఇంజక్షనులు పిల్లలకు వాడవలసివచ్చిన యెడల అన్నివిధముల రోగిని పరిశీలించి అవసరమునుబట్టి కొంచెము యెదిగిన పిల్లలకొరకు 1/4 మొదలు 1/2 వరకుగాని, యింతకుమించిన మోతాదుగాని పిల్లారీన్ ట్యాబ్లెట్స్ అనుభవముతో వాడుట మంచిది. పై ఇంజక్షనులు శాండోస్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

319. శాన్డోస్టెన్ + క్యాల్షియం, శాండోస్.
Sandosten + Calcium, Sandoz (I. V.)
రక్తనాళములందు మాత్రము ప్రయోగింపదగినట్టిది.

5 CC మరియు 10 CC అంపుల్ మనకు లభించును. ఆహారదోషమువలనగాని, వాతావరణమునందు ప్రకృతి సిద్ధముగా యేర్పడిన మార్పులవలనగాని, కొన్ని పరిస్థితులయందు అకస్మాత్తుగా ఆహార విహారములందు మార్పు కలుగుటవలనగాని శరీరతత్వమున మార్పుగలిగి సంభవించెడు పొడిదగ్గు, కన్నులెర్రబడి కన్నులవెంటను, మరియు ముక్కులవెంట సయితము నీరుకారుచు విసుకెత్తించు అవస్థలను, శరీరమున దద్దులు, పొక్కులు, నవ,

దురద లక్షణము లేర్పడుట, కొన్ని సందర్భములందు శరీరమునకు సరిపడని ఆహారము, ఔషధము మొదలైనవి సేవించినప్పుడు శరీరచర్మమున మితిమీరిన దురద లక్షణము లేర్పడి రోగి గీకినకొలది బాధించెడు గుల, గీకుడు కొన్ని వ్యాధులందు రోగియొక్క ప్రాణము కాపాడుట మరియొక వ్యక్తియొక్క మంచిరక్తమును రోగికి యెక్కించిన పిదప కొంత తత్వభేద మేర్పడి శరీరమున క్రొత్త నెత్తురు కారణమున సంభవించెడు అసాధారణస్థితి ఒడుదొడుకులు, హృదయసంబంధముగా యేర్పడెడు నంజుస్థితి "లూత" (సాలెపురుగు) జెఱ్ఱి, కందిరీగ, తేనెటీగ మొదలగువాటి కాట్లవలన శరీరస్థితియం దేర్పడిన అసాధారణస్థితి చర్మరోగము దద్దులు, తీవ్రమైన యెండవేడిమివలన చర్మస్థితియందుగాని, తత్వమునందుగాని సంభవించిన మార్పు, ముసురు వడగళ్ళవాన మొదలగు కారణములవలన సంభవించెడు దగ్గుదమ్ము, ఉబ్బసమువంటి అనేక లక్షణములను తొలగించి (ఉపశమింపజేసి) రోగికి ఆరోగ్యము ప్రసాదించుటకు కడు అద్భుతముగా వుపయోగపడును.

అకస్మాత్తుగా సంభవించిన దుస్థితిని గమనించి అవసరమునుబట్టి పెద్దవారికి 5 మొదలు 10 CC లు (అనగా 10 ML) ఔషధద్రవమువరకు కడునెమ్మదిగా రక్తనాళము లందు ప్రతిరోజు 1 మొదలు 3 పర్యాయములు నయితము

వాడవలసిన కేసులు సయితము కలవు. ఇట్టి చికిత్స 3 మొదలు 4 రోజులలో ముగించుట ఉత్తమము. పై ఇంజక్షనులు శాండోస్ కంపెనీవారు తయారు చేయుచున్నారు.

## 320. సయోట్రాట్ ఫోర్టు.
## Siotrt Forte (I. M.)

లోతుగా కండరములందు మాత్రము వాడుటకు వుపయోగపడునట్టి ఇంజక్షన్.

2 CC అంపుల్స్‌ను మరియు 10 CCల వయల్స్‌ను సయితము లభించును. పై ఇంజక్షనునందు శుద్ధమైనట్టి లీవర్ యెక్‌స్ట్రాక్టుతో విటామిను "బి" కాంప్లక్స్, ఫోలికాష్లము, విటామిన్ బి 12 మిశ్రమము గావించి తయారు జేయబడుచున్నది.

శరీరరక్తము క్షీణించి, ఆకలి మందగించి, నంజు లక్షణములు, శరీరచర్మముయొక్క రంగు మారి యుండుట పెదోలు పగిలిపోవుట, ఊడిపోవుచుండుట, నిస్త్రాణ, నిరుత్సాహము, విసుకు, అలసట, అజీర్ణము, అతిసారము వంటి లక్షణము లేర్పడి రక్తవృద్ధిలేక పీడింపబడునట్టి రోగులకును, పసివారికిని, గర్భిణీస్త్రీలకును పై ఇంజక్షను చికిత్సవలన ఆరోగ్యము చేకూరి రక్తాభివృద్ధి కల్పించుటకు పై ఇంజక్షను అద్భుతముగా పనిచేయును.

అనేకవిధములైన రోగాదులకు పూర్వమును రోగములచే బాధింపబడి స్వస్థత కలుగుచున్నప్పుడు రోగి

యొక్క ఆరోగ్యమును అనేకవిధముల కాపాడి రక్తాభి వృద్ధి కల్పించి పాండులక్షణములను పోదోలుటకిది రామ బాణము వంటింది.

రోగియొక్క పరిస్థితి అవసరము మొదలగు అంశ ములను పరిశీలించి పెద్దవారికి 1 మొదలు 2 CCల వరకు లోతుగా కండరములందు వాడుచు రోగియొక్క ఆరోగ్యాభి వృద్ధిని గమనించుచు చికిత్స పొడిగింపవలసి యుండును. పై ఇంజక్షనులు ఆల్‌బర్టు డేవిడ్ కంపెనీ లిమిటెడ్‌వారు తయారు చేయుచున్నారు.

### 321. ప్లాసెన్‌టా యెక్‌స్ట్రాక్టు.
### Placenta Extract (I. M.)

కండరములందు మాత్రము ప్రయోగింపదగిన ఇంజక్షను.

1 CC ఔషధద్రవముతో నింపబడిన అంపుల్సు మనకు లభించును. నేత్రముయొక్క కాచబింబము (శుక్ల మండలము) నందేర్పడిన బాధించెడు కురుపు దుస్థితిని తొలగించుటకును శుక్లమండలమునకు తాకిన అభిఘాతము (దెబ్బ) యొక్క దుష్టలక్షణములను తొలగించుటకును మయోపియ (హ్రస్వదృష్టి) అస్వస్థతలను చక్కబరచుట కును కర్ణములందు హోరు, ఇట్టి దుస్థితియందు సంభవించెడు లక్షణములు చెవియందేర్పడెడు కురుపువంటి దుస్థితులను సయితము రూపుమాపుటకు మిక్కిలి ఉపయోగపడును.

రోగిపరిస్థితి అవసరము మొదలగు అంశములను గమనించి మిక్కిలి అనుభవముతో కండరములయందు

వాడవలసియుండును. తీవ్రమైన పరిస్థితులయందు ప్రతి రోజును 1 CC ఇంజక్షను ఇవ్వవలసి యుండును. సామాన్యమైన పరిస్థితులయందు రెండురోజులకు ఒక ఇంజక్షను చొప్పున వాడుట మంచిది. రోగియొక్క ఆరోగ్యాభివృద్ధిని గమనించుచు దీర్ఘకాల చికిత్స అవసరమైనప్పుడు 10 మొదలు 15 ఇంజక్షనులు ఒక కోర్సుగా యేర్పరచి చికిత్స చేయవలసియుండును. పై ఇంజక్షనులు అల్బర్టు డేవిడ్ లిమిటెడ్ కంపెనీవారు తయారుచేయుచున్నారు.

---

# ఇంజక్షన్ గైడ్

## ఆయుర్వేదిక్ ఇంజక్షనులు.

## AYURVEDIC INJECTIONS

అనుభవపూర్వకముగా సిద్ధపరుపబడినట్టి ఆయుర్వేదిక్ ఇంజక్షనులన్నియు నిరపాయకరమైన మంచి గుణముల నిచ్చుచున్నవి. అన్ని ఇంజక్షనులు చర్మముక్రిందను కండరములలోనికిగాని యివ్వవచ్చును. ఇంజక్షనులన్నియు వ్యాధి యొక్క బలమును అవసరమును తత్వమునుబట్టి 1/2 CC మొదలుకొని 2 సిసి వరకు వాడుకొనవచ్చును. రసౌషధములతో తయారైన ఇంజక్షనులు విషమూలికలతో తయారైన ఇంజక్షనులు నాలుగుదినముల కొకసారిగాని వారమురోజుల కొకసారిగాని అవసరమునుబట్టి చేయవలసియుండును.

# గమనిక



ఈ ఇంజక్షనులను గాలిగాని, వెలుతురుగాని తగులు చోట నుంచరాదు. గ్యారంటీగా మూడు సంవత్సరములు పనిజేయును. ప్రతి వైద్యుడు మొదట ఇంజక్షను చేయునపుడు వ్యాధి బలతత్వములను, దేశకాల శీతోష్ణస్థితిని గమనించి వారి స్వకీయానుభవముతో వ్యాధికి తగిన ఇంజక్షను అంపుల్సును బాగుగా కదలించి, సిరంజీయొక్క సూది మొనతో మందును లాగుకొనవలయును. ఆయుర్వేద ఇంజక్షను "అంపుల్సు బాక్సు" పై దాని వివరమంతయు వ్రాసియుండును. దాని ప్రకారము జాగ్రతగా ఇంజక్షను చేసినయెడల యేబాధలకైనను, నొప్పికైనను మంచి గుణమిచ్చుటయేగాక ఆంగ్లేయ ఇంజక్షణాలతో సమానమైన గుణమివ్వగల వనుటకు సందేహములేదు. ఈ ఆయుర్వేదిక్ ఇంజక్షణాలు వనమూలికలతోను, రస, విష, గంధక, భస్మాదులతోడను చేయబడినవి. వీటికి శరీరమున చాలాకాలము నిలచి రోగులను ఆరోగ్యవంతులుగా జేయుటయందు మంచి శక్తి గలదు.



1. అమృత ఇంజక్షన్.
Amritha Injection.
కండరములో చేయు ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుట గలదు. పైత్యమును తగ్గించి జీర్ణశక్తి నిచ్చును. మలేరియా, చలిజ్వరములను నివారించును. మూత్రము జారీచేయును. పురాణ జ్వరములను నివారించుటలో పెట్టినదిపేరు. వాత పైత్యములను వజ్రాయుధమువలె ద్రుంచివేయును. క్షయవ్యాధిని రక్తస్రావములను నివారించును. రెండుదినముల కొకసారి ఇంజక్షన్ యివ్వవచ్చును. క్వైనైను బై హైడ్రోక్లోరైడు మాదిరిగా పనిజేయుటయందు మంచి శక్తిగలది.

2. టి. బి. ఇంజక్షన్.
T. B. Injection.

క్షయవ్యాధులకు ఈ ఇంజక్షన్ చాలా గొప్పగుణము గలుగజేయును. రక్తమును వృద్ధిపరచి జీర్ణశక్తి నిచ్చును. క్షయక్రిములను సంహరించునట్టి శక్తి దీనికి గలదు. క్షయ వ్యాధులవలన కలుగు అతిసారము నివారించును. దగ్గువలన కలుగు బాధల నడచును. జీర్ణకోశమును బాగు చేయును. ఒకవేళ ఇంజక్షన్లు చేయుటలో లోపమున్ననే తప్ప ఈ ఇంజక్షన్ సరిగా వాడిన గొప్పగుణము నిచ్చును.

3. అశోక ఇంజక్షన్.
Ashoka Injection.

1 సిసి, 2 సిసిలు వాడుట గలదు. రక్తప్రదరములు

శ్వేత ప్రదరములు (అనగా) యెఱ్ఱబట్ట, తెల్లబట్ట, ఋతు శూల నివారించును. గర్భకోశసంబంధమైన అన్నిరకముల స్రావములు తగ్గును. మూడు ఇంజక్షనులకే గుణము కను పించును. (అశోకారిష్ట) గుణములు కలిగి ఉండును. దీని కన్న ఇంజక్షను త్వరగా పనిచేయును.

### 4. బ్రినాల్ ఇంజక్షన్.

### Brinol Injection.

1 CC, 2 CC వరకు వాడవచ్చును. మూత్రమును జారీచేయును. స్వరభంగము కలవారికి, పిచ్చిచేష్టలు కల వారికి, జ్ఞాపకశక్తి సరిగా లేనివారికి, చిన్నపిల్లలకు జ్ఞాపక శక్తినిచ్చి మంచిబలము ఆరోగ్యము కలిగించి, చురుకును బుట్టించి మేధావంతులుగా జేయును. దీనిని బ్రహ్మి (అనగా) సరస్వతీ ఆకునుండి తయారు జేయుదురు.

### 5. దశమూల ఇంజక్షన్.

### Dashmool Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. వాత వ్యాధులు నివారించును. జ్వరములను హరించును. బలవర్ధ కమును గలుగజేయును. వంధ్యాది స్త్రీరోగ హరము. జ్వరము, నంజు, క్షయవ్యాధులు, పాండు వ్యాధులు, కామిల, ప్రమేహము నివారించును. సూతికా జ్వరముల యందు మంచిపనిజేయును. హృదయశూల తగ్గించును. నరములకు బలమును కలిగించును.

## 6. కుమారి ఇంజక్షన్.
## Kumari Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. గర్భకోశముయొక్క స్థితిని చక్కపరచి రక్తప్రసారమును వృద్ధిజేసి మైలను చక్కగా వెడలింపజేయును. గర్భకోశమునకు మంచి బలము నిచ్చును. తెల్ల కుసుమవ్యాధి నివారించును. జీర్ణశక్తినిచ్చును. పైత్యము తగ్గించును. బహిష్టు సరిగా కానివారికిచ్చిన సకాలమునకు బహిష్టు యగునట్లు చేయును. తెల్లకుసుమకు గ్యారంటీగా పనిజేయును.

## 7. ఎనెస్టాల్ ఇంజక్షన్.
## Anesthol Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. గడ్డలు వగైరాలకు శస్త్రచికిత్స చేయవలసినప్పుడు కావలసిన మోతాదుతో గడ్డపై రెండు మూడు ఇంజక్షన్‌లు చేసిన పిదప శస్త్రచికిత్స చేసినయెడల రోగికి యేమాత్రము బాధకలుగదు. కదలుచున్నట్టి పండ్లు అవసరమైతే చిగుళ్ళకు యిచ్చిన యేమాత్రము బాధలేకుండ పండ్లు తీయవచ్చును.

## 8. యాంటి ఓపియమ్ ఇంజక్షన్.
## Anti Opium Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. ఇది నల్లమందుకు విరుగుడుగా నల్లమందు తినినవారికి విరు

గుడుగా ఈ ఇంజక్షను యిచ్చిన మత్తును పోగొట్టును.
గంటకు ఒకసారి ఇంజక్షన్ చేయుచుండవలయును.

9. యాంటి సిఫిలిస్ I. M. I. V.

Anti Syphilis Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. సవా మేహవ్యాధులకు మంచి గుణమిచ్చును. శరీరమందు గాని చర్మముయొక్క సన్నని పొరలయందు చేరి వృద్ధినొందు చుండు సవాయి రోగమునకు గల క్రిములను చంపి రక్తమును వృద్ధిచేయును. రక్తమునందుగల రోగక్రిములను గూడ చంపును. చిన్నబిడ్డలకుకూడ యివ్వవచ్చును. శరీరమున కనిపించేడి బుగ్గలు, కురుపులు, గజ్జి, దురదలు నివారించును. అవసరమునుబట్టి దినము తప్పి దినము రక్తనాళములోనికి గాని, కండరములోనికి గాని చేయవచ్చును. సిఫిలిసు వ్యాధికి మంచి పనిజేయును.

10. అర్శరిపు ఇంజక్షన్.

Arsha Ripu Injection.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడవచ్చును. మూలశంక వ్యాధులకు గొప్పగ పనిజేయును. రక్తస్రావములను నివారించును. మొలలకు మాత్ర మీ ఇంజక్షన్ యివ్వరాదు. ఇచ్చిన ప్రమాదము సంభవించును.

11. అర్జున ఇంజక్షన్.

Arjuna Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును.

హృద్రోగము (హార్టు డిసీజ్) నివారించుటకు మంచి పని జేయును. గుండెకు బలమిచ్చును. గుండెదడ తగ్గించును. గుండెయొక్క బలహీనత నడంచి మంచి పనిచేయుట యందు దీనికి మించినదిలేదు. మంచిశక్తి గలదు.

### 12. బర్త్ ఎట్ ఈజి ఇంజక్షన్.

### Birth at Ease Injection.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడవచ్చును. ప్రసవమునకు పూర్వము శిశువు వెడలుక నొప్పులు ఆగినయెడల ఈ ఇంజక్షనిచ్చిన వెంటనే అమితమగు నొప్పులు కలిగి సుఖప్రసవమగును. నొప్పులున్న సమయమందు ఈ ఇంజక్షన్ చేయరాదు. చేసినయెడల అపాయము కలుగును. నొప్పులు ఆగినసమయమందు శిశువు ప్రసవమార్గము తిన్నగా వున్నప్పుడు మాత్రమే యీ ఇంజక్షను యీయవలసియుండును. లేనియెడల ప్రమాదము కలుగును.

### 13. కాల్కులిన్ ఇంజక్షన్.

### Calculin Injection.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడవచ్చును. మూత్రాశ్మరి వ్యాధులకు ఈ ఇంజక్షన్ చేసెదరు. మూత్రాశయము నందుగల రాళ్ళను కరుగదీయును. అశ్మరీ నివారించుటకు పనికివచ్చును.

## 14. దీప్య ఇంజక్షన్.
## Dipya Injection.

1 సిసిమొదలు 2 సిసివరకు వాడవచ్చును. మెదడు నరములకు బలము నొసంగి నిద్రపట్టించును. మూర్ఛ ఉబ్బసము కంపవాతముః పక్షిలాపసంధులు నివారించును. గుండె శ్వాసకోశములకు బాధ కలుగకుండ సుఖముగా నిద్రపట్టించును.

## 15. గానోగాన్ ఇంజక్షన్,
## Ganogane Injection.

1 సిసి మొదలు 2 సిసివరకు వాడుక చేయుదురు. మూత్రకోశమునందును మూత్ర నాళమునందును గాని సంభవించెడి గనేరియా క్రిములను జంపి, మూత్రనాళము నందుండు పుండును మాన్పి మూత్రమును శుద్ధపరచి మంట తగ్గించును. ప్రారంభదశ యందు ఆరు ఇంజక్షనులు చేసిన పూర్తిగా గనేరియా వ్యాధి నివారించును. జీర్ణించిన వ్యాధికి యెక్కువ ఇంజక్షనులు చేయవలయును. యిట్లు చేసినచో పూర్తిగా తగ్గిపోవును.

## 16. గుల్మాంతక ఇంజక్షన్.
## Gulmanthaka Injection.

1 సిసి మొదలు 2సిసి వరకు వాడుక చేయుదురు. ఈ ఇంజక్షన్ సమస్త గుల్మ రోగములందు, అజీర్ణ వ్యాధు లందు నుపయోగింతురు. మంచి పనిజేయుచు, ఆకలి

పుట్టించును. జీర్ణశక్తి వృద్ధిజేయును. ప్రేగులరుచునప్పుడు, వాయువుచే కడుపు వుబ్బునపుడును, నొప్పి బాధ యేర్పడి శ్రమ గలిగించునట్టి లక్షణముల నరికట్టి కడుపునొప్పులు నివారించును. ప్రేగులు నరముల నొప్పి తగ్గించును. విరేచనము గావించును.

## 17. కంటకారి ఇంజక్షన్.

## Kantakari Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుట గలదు. కాసవ్యాధులకు గొప్ప గుణము కలుగజేయును. కాసలు త్వరితముగా నివారించును. కఫము పలుచబరచి వెడలింపజేయును. శ్లేష్మజ్వరముల నివారించును. క్షయ సంబంధమైన దగ్గులకు మంచి పనిజేయును. విరేచనము గావించును. జీర్ణశక్తిని వృద్ధిగావించును. శ్వాసకోశములను శుద్ధిపరచి బలము నిచ్చును. ఊపిరితిత్తులను గూడా శుద్ధి జేయును.

## 18. కాసాంతక ఇంజక్షన్.

## Kasantaka Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుటగలదు. చిర కాలము నుండి బాధించుచున్న కోరింత దగ్గుపై పని జేయుటయే గాక సర్వవిధ కాసశ్వాసలకు వాడుటచే మంచి పనిజేయును.

## 19. హార్టానికు ఇంజక్షన్.
## Hertonic Injection.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుకగలదు. గుండె దడను తగ్గించును. అన్నిరకముల హృదయ వ్యాధుల మీదను ప్రత్యేకముగా పనిజేయును. నీరసమును పోగొట్టును. గుండెకు చురుకుదనము కలిగించును.

## 20. జ్వరాంతక ఇంజక్షన్.
## Jwarantaka Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుకగలదు. జ్వర వేగమునందు ఈ ఇంజక్షన్ చేసినవెంటనే చెమట బుట్టించును. జ్వరమును తగ్గించును. సాధారణమైన అన్ని రకముల జ్వరములందు బాగుగా పనిజేయును. టెంపరేచరు హెచ్చనీయక కాపాడును. విషపడిశ జ్వరములకు బాగుగా పనిజేయును.

## 21. హిరణ్య ఇంజక్షన్.
## Hiranya Injection.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుక కలదు. ఉబ్బసపు వ్యాధులకు మంచిపని జేయును. సాధారణముగా పది నిమిషాలకే బాధ నివారించును. దమ్మును తొందరగా నివారించును. శ్వాసవ్యాధులకు గొప్ప గుణము కలుగజేయుటయందు మంచి శక్తిగలదు.

22. కుర్చి ఇంజక్షన్.
Curchi Injection.

1 CC మొదలు 2 సిసి వరకు వాడుకగలదు. ఆమాతి సారములు, బంకవిరేచనములు, నీళ్ళవిరేచనములు కట్టును. మూడు లేక అయిదు ఇంజక్షన్‌లకే వ్యాధి పూర్తిగా తగ్గిపోవును. రోగియొక్క వయస్సు, వ్యాధియొక్క తీవ్రతను బాగుగా విచారించి వాడవలెను.

23. కుష్టాంతక ఇంజక్షన్.
Kustantaka Injection.

1 CC మొదలు 2 CC వాడుక జేయుదురు. అన్ని రకముల కుష్టువ్యాధుల నివారించును. రక్తమును శుద్ధి జేయును. చర్మవ్యాధులకు మంచి పనిజేయును. కుష్టు వ్యాధుల నివారించుటకు మూడు మాసములవరకు రోగిని పరీక్షించుచు ఇంజక్షనులు యిచ్చుచుండవలయును.

24. లెక్టెస్ ఇంజక్షన్.
Lactus Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవలయును. ఈ ఇంజక్షన్ పాలతో తయారు చేయుదురు. సూతికా జ్వరములు నివారించుటకు వాడవచ్చును. రక్తశుద్ధిలేక కలిగెడు గజ్జి, దురదలు నివారించును. గనేరియా వ్యాధి నివారించును. తెల్లకుసుమరోగముకూడా నివారించును. పొత్తికడుపునొప్పి నివారించి ప్రమేహకారణమువల్ల యేర్పడిన వాపు, చీము నివారించుటలో మంచి శక్తిగలది. కీళ్ళనొప్పు

లకు బాగుగా పనిజేయును. ఈ ఇంజక్షనును అల్లోపతి వైద్యములో మిల్కు ప్రొటన్ అని అందురు.

### 25. మధుశిలా ఇంజక్షన్.
### Madhushila Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయవలయును. అతిమూత్రవ్యాధులు నివారించును. మధుమేహ వ్యాధులకు గ్యారంటీగా పనిజేయును. మూత్రములోచక్కెర పోవుదానిని వెంటనే తగ్గించును. శరీరమునకు నరములకు మంచి బలము కలుగజేయును. మంచి పుష్టినిచ్చును. మూత్రమునందు గల మంట నివారించి మూత్రమును శుద్ధి పరచును.

### 26. నక్సువామికా ఇంజక్షన్.
### Nuxvamica Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. చచ్చువాతములకు మంచి పనిజేయును. అజీర్తి, అతిసారములు నివారించును. నరములకు ఉత్తేజము కలిగించి శరీరమునకు అంగములకు బలము నొసంగును. నడుము నొప్పులు, కడుపునొప్పులు నివారించును. తలనొప్పులకు కూడ బాగుగా పనిచేయును. పక్షవాతములను కంప వాతములను పారద్రోలుటయందు గొప్ప గుణము గలిగియుండును. రోగబలము రోగిబలము అవసరముల నెరింగి మోతాదు నిర్ణయించవలసి యుండును.

27. ల్యూనేక్యూర్ ఇంజక్షన్.

Lunecure Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. ఉన్మాదము, భ్రమ, చైతన్యము లేకపోవుట, రక్తపుపోటు, తలనొప్పి మొదలగు వ్యాధులపై మంచి పనిజేయును.

28. పునర్నవ ఇంజక్షన్.

Punarnava Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. మూత్రమును జారీ చేయుటలో మంచిగుణము గలదు. హృద్రోగము మూత్రపిండముల యొక్కయు యకృత్ వ్యాధులవల్ల కలిగిన నీటి ఉబ్బులను, జలోదరములను తగ్గించును. నంజులను నివారించుటలో మంచిపని జేయును. రక్తము శరీరమున ధారాళముగా ప్రసరించి ఆడునట్లు జేయును.

29. ఏరండ ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుదురు. సర్వ వాతములను నివారించును. వాతమువలన కలిగిన శూలల నివారించును. మలబద్ధకమును హరించును. వాతపునొప్పులకు మంచి పనిజేయును. వాతప్రకోపమువల్ల యేర్పడిన అనేక పరిస్థితులయందు బాగుగా ఉపయోగపడును.

30. అగ్నిమందర ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుక గలదు. పిత్తా

ధిక్యతచే యేర్పడిన అనేక వికారములను నివారించును. శీతపిత్తములకు మంచి పనిజేయును. జ్వరములను కూడా తగ్గించును. చెమటలు కలుగజేయును.

31. కుటజా ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుకగలదు. వాత జ్వరములకు బాగుగా పనిజేయును. జ్వరాతిసారములు నివారించును. నీళ్ళవిరేచనములకుకూడా బాగుగా పనిజేయును, సాధారణమైన అనేక వాత వ్యాధులను కుదుర్చును.

32. లివర్ క్యూర్ ఇంజక్షన్.
Liver Cure Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. యకృత్ ప్లీహావృద్ధులవలన యేర్పడు అనేక వికారముల నడంచును. పచ్చకామిల నివారించుటలో మంచి ప్రజ్ఞగలది. యకృత్ ముడుచుకొనిపోయి సంకోచస్థితివల్ల యేర్పడు క్లిష్టస్థితిలో కూడ బాగుగా పనిచేయును.

33. రెజువినాల్ ఇంజక్షన్.
Rejuvinol Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుకగలదు. వీర్య వృద్ధిని కలిగించును. నపుంసకత్వమును నివారించును. పలుచబడిన వీర్యమును గట్టిపరచును. మూత్రముతో కలసి పోవు వీర్యమును (ధాతువును) కట్టును. నరములయొక్కయు, పురుషాంగము యొక్కయు దుర్బలమువలన సంభోగానంత

రము కలుగు నీరసమును బోనడంచి అధికోత్సాహమును గలుగజేయును.

### 34. రక్తదోషాంతక ఇంజక్షన్.
### Raktadoshanṭaka Injection.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడవచ్చును. ఇది మూత్రమును జారీచేయుటలో మంచి గుణము కలదు. రక్తమును శుద్ధిజేయును. చర్మవ్యాధులను నివారించుటలో మంచి శక్తిగలదు. సవామేహమువలన కలుగు వ్రణము లను మాన్పును. చర్మవ్యాధులకు మంచిపనిచేయును. ముఖ్య ముగా రక్తమునందు గలుగు సాధారణమైన అన్ని దోష ములను పోదోలి రక్తమును శుభ్రపరచును.

### 35. బనాప్షా ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడవచ్చును. సన్ని పాత జ్వరములు నివారించుటలో మంచి శక్తిగలదు. జ్వర మును తొందరలో నివారించును. దప్పి, తాపము, దగ్గులు, తరుచు మాటలాడుట (ప్రలాపము), ఉబ్బసము, శోష, అరుచి నడంచి దీపనపాచనములు కలుగజేయును. సన్ని పాత జ్వరములకు బాగుగా పనిజేయును. సాధారణమైన అన్ని పరిస్థితులయందు వారమునకు మూడు ఇంజక్షనులు చాలును.

### 36. స్తన్యవృద్ధి ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడవచ్చును. స్తన్య

మును వృద్ధిజేయుటయందు మంచి గుణముకలది. స్తన్య వ్యాధులు నివారించును. ఇది స్త్రీలకుమాత్రిమే వాడవలసి యుండును.

### 37. అజువాన్ ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకగలదు. శరీర మున యేర్పడిన బాధచేతగాని అస్వస్థత చేతగాని రోగికి వ్యాధియందు నిద్రిపట్టకుండుటయేగాక శారీరక మానసిక సంబంధమైన యే వ్యాధిచేనైన నిద్ర పట్టకుండినచో ఈ ఇంజక్షన్ ఇచ్చినవెంటనే రోగికి నిద్రపట్టును. రోగమునకు నిద్ర, విశ్రాంతి ముఖ్యముగా అవసరము.

### 38. నాయీ ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. విషమ జ్వరముగా చలితోగూడి దినము తప్పించి దినము వచ్చునట్టి మలేరియా జ్వరమునందు తలనొప్పి, తలతిరు గుట, అధిక దాహము, వాంతులు, కండ్లుమండుట, మున్న గువాటిని మాన్పి రోగికి ఆరోగ్యము చేకూర్చును.

### 39. సర్పగంధ ఇంజక్షన్.

### Sarpagandha Injection.

1సిసి మొదలు 2 సిసి వరకు వాడుదురు. అధికమైన రక్తపు పోటును తగ్గించును. రక్తపు పోటువల్ల కలిగిన తలతిప్పు ఆయాసము వణుకు దడ మొదలగు బాధలు నివారించును. రక్తనాళముల బిగివును తగ్గించి రక్త

ప్రసారమును చక్కగా జరుగునట్లుచేసి పైన కనబరచిన రోగములను వెంటనే రూపుమాపి నిరోగునిగా జేయుననుట నిస్సందేహము.

## 40. వాసక ఇంజక్షన్.
## Vasaka Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుకలోనున్నది. శ్వాస గొట్టములను శుద్ధిపరచి, కఫమును పలచనచేసి బయటికి వెడలగొట్టును. మూత్రమును జారీచేయును. దగ్గు బాధను శమింపజేయును. క్షయవ్యాధియందు కలుగు దగ్గులను నివారించును. ఉబ్బసము, ఇతరవిధములగు ఊపిరితిత్తుల బాధలు శమింప చేయును.

## 41. వాతరిపు ఇంజక్షన్.
## Vataripu Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుచురు. నరముల సంబంధమైన జబ్బులమీద అమోఘముగా పని చేయును. పక్షవాతము కంపవాతము ముఖవాతము ధనుర్వాతము మొదలగు యెనుబది వాతములను నివారించును. హిస్టీరియా (అపస్మారము) ఆమవాతము కీళ్ళనొప్పులు, గుండెబరువు ఆయాసము శరీరము చల్లబడినప్పుడు వేడిని వృద్ధిపరచి నరములకు ఉత్తేజము కలిగించును.

## 42. సప్తవర్ణ ఇంజక్షన్.
## Sapthavarna Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు.

మలేరియా అను చలిజ్వరమును, తలనొప్పి, శరీరము నొప్పులు, కండ్లమంటలు, దినముతప్పి దినమువచ్చే వరుస జ్వరము, చాతుర్థిక జ్వరము మొదలగు అనేక దోమకాటు జ్వరాదులను నివారించును. క్వినైన్ ఇంజక్షనుకన్న యెక్కు వగా ఉపయోగపడును.

## 43. సువర్ణ ఇంజక్షన్.

## Gold Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. క్షయ వ్యాధులయొక్క ప్రాథమికావస్థలో అమృతమువలె పని చేయును. దగ్గులు, నంజులు, కామిలావ్యాధులను నివారించి శరీరమునకు బలము కలుగజేయును. జ్ఞాపకశక్తిని వృద్ధి చేయును. ధాతువులకు మంచి బలము కలుగచేయును. పుంసత్వమును గలిగించును. ఆరోగ్యమును కలిగించును. శుక్రనష్టమును నివారించును. స్త్రీల వ్యాధులకు మంచి గుణము జేయుటయందు మంచి శక్తిగలదు. సువర్ణభస్మము యొక్క గుణములే యీ ఇంజక్షను వాడినప్పుడు ప్రసా దించును. గాన వైద్యులు సువర్ణభస్మము వాడిన మాది రిగా వ్యాధులను గుర్తెరింగి పై ఇంజక్షను వాడుకొన వలయును.

## 44. చంద్రోదయా ఇంజక్షన్.

## Chandrodaya Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. ఇది వాజీ

కర ఔషధము. ప్రతివారు ఆరోగ్యవంతులుగా నుండుటకు చేయించుకోవచ్చును. అకస్మాత్తుగా గుండె ఆగినవారికి పనిజేయును. క్షయాతిసారములు, క్షయను నివారించును. వీర్యపుష్టి జేయును. ఆరోగ్యవంతులుగా చేయును. పూర్ణ చంద్రోదయము వాడుటవలన కలుగునట్టి సత్ఫలితములే పై ఇంజక్షన్ వాడుటవల్ల సంప్రాప్తించును.

## 45. ప్రవాళ ఇంజక్షన్.

## Pravals Injection.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. క్షయ వ్యాధికి సుద్దకట్టు యెక్కువైన వ్యాధికి మంచి పనిజేయును. గుండెమంట తగ్గించును. గుండెనొప్పులు నివారించును. రక్తపిత్తమును, క్షయకాసలను నివారించును. అన్ని వ్యాధులకుకూడ వాడవచ్చును. శరీరమున కాల్షియం లోపించి యున్నట్టి వ్యాధులపై బాగుగా పనికివచ్చును.

## 46. కస్తూరి ఇంజక్షన్.

## Musk Injection.

1 సిసి మొదలు 2 సిసి వాడుక చేయుదురు. శరీరము చల్లబడిన అనేక పరిస్థితులయందు దీనిని వాడుట వలన శరీరమున వేడి పుట్టించుటకు బాగుగా తోడ్పడును. వాతము నివారించును. గుండెకు బలము కలిగించును, నాడి యొక్క చురుకుదనమును హెచ్చించును. నరములకు బలము కలిగించును.

## 47. మకరధ్వజ ఇంజక్షన్.
## Makaradhwaja Injection.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుక చేయుదురు. ఇది వాజీకర ఔషధము. వీర్యవృద్ధి చేయును. శరీరమునకు మంచి బలము కలుగజేయును. నరములకు పటుత్వము, ముఖమునకు కాంతి, శిరోజములకు నునుపు కలిగించి క్షయ వ్యాధులను నివారించును. క్షయ వ్యాధులయొక్క ప్రారంభ దశయందు బహుమేలు కలుగజేయును. పలుచబడిన వీర్యమును గట్టిపరచును. స్త్రీలకు కలుగు వ్యాధులనుగూడ నివారించి శరీరమునకు మంచి బలము కలిగించుటయందు పేరుగాంచిన ఔషధము. దీనినే సిద్ధమకరధ్వజ మందురు.

## 48. లోహభస్మ ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడవలయును. పాండు వ్యాధులు నివారించును. రక్తశుద్ధి, రక్తవృద్ధి చేయును. జీర్ణశక్తి వృద్ధిచేయును. నంజు వ్యాధులయందు కలుగు నీరు లాగివేయును. బలము, పుష్టి నొసంగును. పాండువ్యాధులను పోగొట్టి రక్తవృద్ధి గావించుటకు బాగుగా ఉపయోగపడును.

## 49. అడ్రిక్ ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుక చేయుదురు. చిరకాలమునుండి బాధించుచున్న అజీర్ణమును నివారించుటలో మంచిశక్తి గలదు. కడుపునిండ అన్నము తినకుండు

టకు అవకాశము లేకుండ చేయునట్టిది అజీర్ణమే. ఇట్టి సకల విధములైన అజీర్ణములను తృటిలో త్రెంచిపారవేసి మలబద్ధకమును నివారించును. అమ్లపిత్తమును గూడా హరించును.

### 50 ఇంద్రవారుణి ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుచుందురు. వాయువుచే నింపియుండు తిత్తిమాదిరిగా యుండు వాత తిత్తికిని, అండవృద్ధికిని మంచి పనిచేయును. మూత్రకృచ్ఛ్రి వ్యాధులయందు కలుగు బాధలు నివారించును. సమస్త అండవృద్ధులందు బాగుగా పనిజేయును.

### 51. జ్యోతిష్మతి ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. ఉదర వ్యాధులు నివారించును. ఉదరవ్యాధిచే గల్గు బాధలుకూడ శమింపజేయును. వారమునకు సాధారణమైన పరిస్థితుల యందు మూడు ఇంజక్షన్లు యివ్వవచ్చును.

### 52. బినౌలా ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుక చేయుదురు. ఉమ్మెత్తవిత్తులు మొదలైనవి తినుటవలన సంభవించెడు తలతిరుగు కంపము, వాంతి, భ్రాంతి, మూర్ఛ, పైత్యము, విషము మొదలగు లక్షణములను నివారించును. ఉమ్మెత్త తినినవారికి విరుగుడుగా పనిచేయును.

53. దత్తూరు భల్లాంతక ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. శ్వాసకాసలు, అగ్నిమాంద్యము, పురాణజ్వరములు, సన్నిపాత జ్వరములు, కఫవాత ప్రకోపములు, ఎక్కిళ్ళు, ఉబ్బు మొదలగు వ్యాధులను పోదోలి ఉబ్బస వ్యాధులు సయితము నివారించును.

54. పిప్పలి ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుకొనవలయును. కఫ జ్వరములను నివారించుటలో దీనియందు మంచిగుణము కలదు. కఫమును పలుచగా చేసి వెడలించును. ఆయాసము బాధ నివారించును.

55. ఖదిరా ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడవలయును. కుష్ఠ వ్యాధులకు గొప్ప పనిచేయును. రక్తశుద్ధిలేక కలిగెడు చర్మవ్యాధులు, గజ్జి, దురదలు, పుండ్లు పొడలు మచ్చలు మొదలగువాటిని నివారించి రక్తమును శుద్ధిజేయును.

56. అనారు ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుదురు. క్రిమి వ్యాధులను నివారించును. క్రిములవలన కలుగు అనేక వ్యాధులను హరించి గొప్పపనిచేయును.

57. బిరోజా తైలముతో ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడవచ్చును. గనే

రియా (అనగా అంటురోగములందును) తెల్లసెగ, రక్త సెగ, పచ్చసెగ, నివారణమగును. మూత్రనాళములోనుండు పుండును, మంటను మాన్పును. గనేరియా క్రిములను సంహారించును. మూత్రము జారీచేయును. గనేరియా మొదలైన ప్రమేహ రోగములకు బాగుగా పనిచేయును.

### 58. అపరాజిత ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుటగలదు. గలగండ రోగములు మేహపిటిక మేహ వికారములను నివారించుటలో మంచి శక్తిగలదు. గండమాలలను కూడ హరించును.

### 59. కంచనార ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుకగలదు. గండమాల రోగములకు మంచి పనిచేయును. కమ్మరేగువలె, ఉసిరి కాయ ప్రమాణముగల గ్రంథులు కంఠమువద్ద యేర్పడి బాధించుచుండు పరిస్థితులయందు బాగుగా పనిజేయును.

### 60. వరుణ ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుదురు. గుల్మ రోగము. యకృత్ప్లీహ వృద్ధులు, ప్రక్కలందు పుట్టు బిల్ల అజీర్ణము శూలలు జలోదరము మహాగుల్మములు మొదలగు కష్టవ్యాధులు నశించును.

### 61. ఉశిరా ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకగలదు. ఓకి

లింతలు, త్రేపులు బయలువెడలకుండుట, నోట నీరూరుట, అన్నపానములయం దిచ్ఛలేకుండుట ఈ లక్షణములతో గూడియుండు మలబద్ధకము, అగ్నిమాంద్యము, చర్దివ్యాధి నివారించును.

## 62. పలాసు ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకొందురు. ప్రమేహ రోగము నివారించుటలో మంచి శక్తిగలదు. ప్రమేహాము నకు సంబంధించిన శ్వేతప్రదర రక్తప్రదరములను నివారించును. ప్రమేహ ఉడుకువల్ల యేర్పడునట్టి మూత్రబంధము, మంట, చురుకు లక్షణములను బోనడంచును.

## 63. పిత్తపాపర ఇంజక్షన్.

1CC మొదలు 2 CC వరకు వాడవచ్చును. పిత్తజ్వరములు, శీతజ్వరములు, వాంతులు, అరుచి, పైత్యములు, అజీర్ణములు హరించుటలో గొప్ప మేటిగుణము గలది. శీతజ్వరములు కూడ నివారించి పై జ్వరములందు యేర్పడు నట్టి వాంతి, భ్రాంతి, అరుచి, వికారముల రూపుమాపును.

## 64. పటోల ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకొనవలెను. కఫము, కఫసంబంధములగు వ్యాధులు మొదలగువాటిని నివారించును. పిత్త కఫములను, జ్వరములను బోనడంచును. పైత్య సంబంధ వ్యాధులకు మంచి పనిచేయును.

## 65. చోఫ్ చీని ఇంజక్షణ్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుకొందురు. భగందరములు నివారించును. గుదస్థలమున రంధ్రములు కలిగి బాధపెట్టుచు అనేక రంధ్రములుపడి అందు చీము, నెత్తురు స్రవించుచుండుదానిని భగంధరమందురు. ఇట్టి పరిస్థితి యందు యేర్పడిన రంధ్రములవెంట మూత్రము సయితము వెడలుట సహజము. ఇట్టి లక్షణముల ప్రాథమికావస్థలో బాగుగా పనిచేయును.

## 66. నైరేయిక ఇంజక్షణ్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకొందురు. మసూరిక రోగమునకు మంచిపనిచేయును. దురద, నొప్పులు భ్రమము, చర్మమున వాపులు, శరీరవర్ణము మారియుండుట, కన్నులు యెర్రగా నుండుట ఇవి మసూరి రోగ లక్షణములు. ఈ లక్షణములతో కూడిన అనేక చర్మరోగములను వెంటనే నశింపజేయును.

## 67. నిర్గుండి ఇంజక్షణ్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుకగలదు. గజ్జల యందును, పొత్తికడుపునందును, మేఢ్రమునందును మిగుల తీక్షణంబగు వేదన, మిగుల కష్టముచే కొంచెము కొంచెముగా మాటిమాటికి మూత్రము విడచుట ఈ లక్షణములు గల మూత్రకృచ్ఛ్ర వ్యాధియందు మంచి పనిజేయును.

### 68. తాళపత్ర ఇంజక్షన్.

1 సిసి మొదలు 2 సిసి వరకు వాడుదురు. మేదో వృద్ధిచే కలుగునట్టి వ్యాధికి పనిచేయును. దప్పి, మూర్ఛ, అతినిద్ర, తుమ్ములు వచ్చుట, బడలిక, చెమట, మేదో వృద్ధిచే కలుగు యితర సంకటములు, బాధలు నివారించుటలో మంచిగుణము చూపును.

### 69. భల్లాతకారి ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక జేయుదురు. విశూచి వ్యాధులకు గొప్ప పనిజేయును. అధికముగా ఆమ విరేచనములగుట, వాంతులు, దప్పి, కడుపునొప్పి కల్గుట, ఆవలింతలు, వాతము, వణుకు, తలనొప్పి, శరీరమంతట నొప్పులు కలిగినట్టి పరిస్థితులయందును, విశూచి (కలరా) వ్యాధులకు బాగుగా పనిజేయును.

### 70. లహాసన్ దూద్ ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుకలో గలదు. శ్లీపదవ్యాధులకు (బోదకాలు) లేక యేనుగుకాలు రోగమునకు మంచి పనిజేయును. ప్రథమముగా జనించిన త్రిదోష చయమువలన గాని, ప్రకోపమువలన గాని సంభవించునట్టి శ్లీపదరోగములు నశింపజేయుటలో మంచి శక్తి గలది. మంచిగుణమును గలుగజేయునట్టిదని గట్టిగా చెప్పవచ్చును.

## 71. రసకర్పూర ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. "సిఫిలిసు" అనగా సవామేహ సంబంధమగు వ్యాధులను నివారించును. పుండ్లు, దురదలను నివారించి రక్తశుద్ధిజేసి సవామేహములను నివారించును. రసకర్పూరముయొక్క గుణము యీ ఇంజక్షనునందు కలిగియుండును.

## 72. వసంతకుసుమాకర ఇంజక్షన్.

1 CC మొదలు 2 CC వరకు వాడుక చేయుదురు. అతిమూత్రము, మధుమేహ వ్యాధులందు పనిచేయుటలో పేరుపొందినది. మూత్రమున చక్కెరపోవుట, దీర్ఘకాలము మధుమేహముతో బాధపడుటవలన రక్తముచెడి శరీరమున యేర్పడు అనేక విధములైన వ్రణములను మాన్పి దేహమునకు ఆరోగ్యమునిచ్చును. మూత్రాశ్మరి, అతిమూత్రము, పాండువ్యాధులు, క్షయలు, రాచకురుపులు, బలహీనము, కుసుమరోగములు, వీర్యము పలుచబడుట, పలుచబడిన వీర్యమును వృద్ధిజేయుట, దేహమునకు మంచి బలము గలుగజేయుట మున్నగు మంచి గుణముల నిచ్చును.

## 73. శతావర్ (I. M. S. C.)

చర్మముక్రిందను, కండరములోను చేయవచ్చును.

ముఖ్యముగా నేత్రవ్యాధులయందు ఉపయోగపడును. నేత్రములు ఎరుపుగానుండుట, మంటలు. నీళ్ళు

కారుట, నేత్రదృష్టి హీనముగానుండుట, వాపు, మంట, పోటు మొదలగు లక్షణములతోకూడిన కొన్ని నేత్రవ్యాధులయందు ఈ ఇంజక్షన్ రామబాణముగా గుణమునివ్వక తప్పదు.

## 74. సోమలత I. M. S. C.

చర్మముక్రిందను, కండరములోను చేయవచ్చును.

కాసజ్వరములయందు బాగుగా గుణము నిచ్చు చుండును. జీర్ణకోశ వ్యాధులయందును, పిత్తకోశ వ్యాధుల యందును, కడుపుబ్బరము వాంతులు ఆమ్లపిత్తము నోట నీరూరుట జీర్ణశక్తి లేకయుండుట వీటియందు బాగుగా పని జేయుచుండును.

## 75. స్వర్ణక్షీరి I. M. S. C.

చర్మముక్రిందను, కండరములోను చేయవచ్చును.

సెగ అను గనేరియా వ్యాధులయందు గొప్ప గుణ కారి. గనేరియాకు కలుగు అన్ని అవస్థలయందును యిది గుణము నిచ్చుచున్నది. గనేరియా వ్యాధికి మూత్రనాళ మున గలుగు పుండును నివారించి మూత్రమునందు గల మంటను శమింపజేయుటయందు దీనిని ప్రయోగించిన మంచి లాభము కలుగును. రక్తశుద్ధులయందును గుణము నిచ్చుచుండును. శుక్ల నష్టములయందును పనిజేయును. స్త్రీలకుకలుగు లుకోరియా వ్యాధియందుకూడ దీనితో అశోక ఇంజక్షన్ కలిపి చేయుచుండిన లాభము తొందరగా కను

పించును. గనేరియా వ్యాధియందు రెండు ఇంజక్షనులకే మంచి గుణము కనిపించును. గనేరియాకు మొత్తం ఆరు ఇంజక్షనులు చేయవలసియుండును.

76. స్పెషల్ నాయి I. M. S. C.

చర్మముక్రిందను, కండరములో చేయుటకుపయోగపడును.

ఇది ప్రత్యేకముగా మలేరియా (చలిజ్వరముల) యందు వాడుటచే బాగుగా గుణమునిచ్చును. మలేరియా యొక్క అన్ని అవస్థలయందు యిది గుణము నిచ్చుచుండును. నాయికన్న అధికగుణము నిచ్చును. జీర్ణించిన మలేరియాను ఆరు ఇంజక్షనులతో తగ్గించివేయును. సాధారణమైన మలేరియా జ్వరమునందు ఒక్క ఇంజక్షనుకే గుణము చూపును.

77. స్పెషల్ కుజ్లీనా I. M. S. C.

చర్మముక్రిందను, కండరములోను ఇంజక్షను చేయవచ్చును.

రక్తము శుద్ధిలేక కలుగు గజ్జికురుపులు, పుండ్లు, చిడుము, దురద వీటియందు బాగుగా గుణము నిచ్చుచుండును. రక్తశుద్ధిలేక కలుగు వికారములయందును, చర్మవ్యాధులయందును నమ్మకముగా గుణము నిచ్చుచుండును.

78. స్పెషల్ లుకోరియా I. M. S. C.

చర్మముక్రిందను, కండరములోను చేయు ఇంజక్షను.

స్త్రీల గర్భకోశ వ్యాధులయందు గుణకారి. శ్వేత

ప్రదర (లుకోరియా) యను వ్యాధిపైన బాగుగా గుణము నిచ్చును. రెండు మూడు ఇంజక్షనులకే గుణము కనుపించును.

79. స్పెషల్ శులారిణ్.

చర్మముక్రిందను, కండరములోను ఇంజక్షన్ చేయవచ్చును.

కడుపునొప్పులయందు బాగుగా గుణము నిచ్చును. కడుపుబ్బరము వలన కలుగు గ్యాసు అను అప్లమును నివారించి శూలను తగ్గించుటకుగాను యిది బాగుగా తోడ్పడుచుండును. దీనితో అడ్రిక్ను కలిపి ఇంజక్షణ్ చేయుచుండిన బాగుగా గుణము కనుపించును.

80. స్పెషల్ రక్తప్రదర I. M. S. C.

చర్మముక్రిందను, కండరములోను ఇంజక్షణ్ చేయవచ్చును.

స్త్రీల రక్తప్రదరమును అరికట్టుటకుగాను యిది ఉపయోగపడును. ప్రారంభస్థితియందు గల రక్తప్రదరమునందు రెండు ఇంజక్షనులతో నివారించును. కొద్దిగా పాతదియైన యెడల చాల ఇంజక్షనులు చేయవలసి యుండును. రక్తప్రదర వ్యాధులను తగ్గించుటకు ఇది బాగుగా తోడ్పడును.

81. స్పెషల్ కలరా I. M. S. C.

చర్మముక్రిందను కండరములోను ఇంజక్షణ్ చేయవచ్చును.

కలరా వ్యాధులయందు కలుగు అన్ని అవస్థలయందును కలరా వాంతులు కట్టుటకు ప్రారంభమున వాడినచో కొద్ది వ్యవధిలో కట్టివేయును. కలరాకు ఆయుర్వేదమున యిది ముఖ్యముగా ఒక్కటియే గుణకారి. కలరావ్యాధియందును, దాని లక్షణములతో గూడిన అన్ని లక్షణములలోను దీనిని ఉపయోగించవచ్చును.

### 82. స్పెషల్ క్షయ I. M. S. C.

చర్మముక్రిందను, కండరములోను ఇంజక్షన్ చేయవచ్చును.

క్షయవ్యాధిని నివారించుటకుగాను క్షయవ్యాధిని రాకుండ జేయుటకుగాను యిది బాగుగా తోడ్పడును. క్షయ, కాస, శ్వాసలయందును జ్వరమును తగ్గించుటకుగాను మంచి గుణము నిచ్చుచుండును. ప్రారంభదశయందు గల క్షయవ్యాధిని మాన్పి ఆరోగ్యవంతునిగా జేయుటకు ఇది మంచి ఇంజక్షన్.

### 83. స్పెషల్ టానిక్ I. M. S. C.

చర్మముక్రిందను, కండరములోను ఇంజక్షన్ చేయవచ్చును.

అన్ని వ్యాధులకు పిదప కలుగు బలహీనతలయందును రక్తము తగ్గినవారలయందును' పాండు వ్యాధుల యందును, శరీరమునందు కొన్ని విటామినులు తగ్గినవారల

యందును యిది బాగుగా గుణము నిచ్చును. వ్యాధి తగ్గిన తర్వాత టానికుగా ఈ ఇంజక్షనులు చేయవచ్చును. మంచి బలము కలిగించును.

## 84. స్పెషల్ మాలతి I. M. S. C.

చర్మము క్రిందను కండరములోను ఇంజక్షన్ చేయవచ్చును.

సాధారణ జ్వరములయందును జీర్ణించిన జ్వరముల యందును, టెంపరేచర్ తగ్గించుటకుగాను యిది బాగుగా సహాయపడును. జ్వరమును తొందరలో నివారింపజేయును. ప్రథమావస్థలో క్షయ జ్వరములయందుకూడ దీనిని ఉప యోగించిన మంచిలాభము కలిగించును.

## 85. త్రిఫల I. M. I. V. S. C.

చర్మముక్రిందను, కండరముల యందును, అవ సరమునుబట్టి రక్తనాళముల యందును కూడ ఇంజక్షన్ చేయుట కుపయోగపడును.

ఉదరశూల ఉదరవ్యాధులందును మూలవ్యాధుల యందును కాసజ్వరముల యందును వాతపిత్త జ్వరముల యందును మలబద్ధక వాతవ్యాధుల యందును కడుపునొప్పి మొదలగు రోగములకు మిక్కిలి గుణకారి. రెండుమూడు ఇంజక్షనులతో దీని గుణము కనుగొనవచ్చును. జ్వరముల యందు మాలతితో కలిపిచేసిన మంచిగుణము కను పించును.

86. స్పెషల్ పైరాలిసిన్ I. M. S. C.

చర్మము క్రిందను కండరములోను ఇంజక్షన్ చేయుట కుపయోగపడును.

పక్షవాత వ్యాధులయందు మిక్కిలి నమ్మకముగా గుణమునిచ్చును. ఏకాంగ సర్వాంగ వాతముల యందును అతిసారము అగ్నిమాంద్యము వీటియందు కూడా పని జేయుచుండును. వాతవ్యాధులకు యిది ముఖ్యావసరము. వాతవ్యాధులందు దీనిని ప్రయోగించిన మంచిగుణము గనుపించును.

87. స్పెషల్ శ్వాసిన్ I. M. S. C.

కండరములోను చర్మము క్రిందను చేయుట కుపయోగపడును.

శ్వాస వ్యాధులయందు "ఏఫిడ్రిన్" మాదిరిగా గుణము నిచ్చుచుండును. దమ్మును తొందరగా శమింప జేయుటకు యిది బాగుగా తోడ్పడును. శ్వాసకోశములను మంచిస్థితికి తెచ్చి ఆరోగ్యవంతుని జేయును. కొన్ని ఇంజక్షనులు వాడినపిదప పూర్తి ఆరోగ్యమును ప్రసాదించును.

88. మహాలక్ష్మి విలాసరస్ I. M. I. V.

లోతుగా కండరములోను రక్తనాళములలోను చేయుటకుపయోగపడును.

అనేక జ్వరముల యందును క్షయ, కాస, నంజు వ్యాధులయందును, బలహీనము జలోదరముల యందును,

హృదయ వ్యాధులు, గుండె బలహీనను వీటియందు మహా లక్ష్మీ విలాసరస ఇంజక్షను బాగుగా గుణము చూపించును.

89. మహావాత విధ్వంసి రస్ I. M. S. C.

కండరములోను, చర్మముక్రింద జేయుట కుపయోగపడును.

సర్వవిధముల వాత వ్యాధులయందు దీనిని వాడుక జేయుదురు. వాతజ్వరము, వాతపునొప్పులు, వాతశూల, వాతరోగముచే కాళ్ళుచేతులు పడిపోవుట, కీళ్ళనొప్పులు, కీళ్ళవాపులు వీటియందు బాగుగా గుణము నిచ్చుచుండును. దీనితో "రాస్నా" ఇంజక్షను మిశ్రితముజేసి, ఇంజక్షన్ చేసిన వాతబాధలు తొందరగా నివారించును.

90. ముక్త పిష్టి I. M. I. V.

కండరములోను, రక్తనాళమునందును వాడవచ్చును.

క్షయవ్యాధి కఫపిత్తములయందు గొప్పగుణకారి. క్షయవ్యాధియొక్క బలహీనము తగ్గించివేయుటకుగాను యిది బాగుగా గుణము నిచ్చును. ఉన్మాదములయందును, పిత్తజ్వరములయందును గుణము నిచ్చుచుండును. రోగి యొక్క హృదయచలనము, నాడి మొదలగునవి బాగుగా వైద్యుడు పరిశీలించి యీ ఇంజక్షను ప్రయోగించవలసి యుండును.

91. రౌప్య భస్మ I. M. I. V.

కండరములోను, రక్తనాళములోను ఈ ఇంజక్షన్ ఇవ్వవచ్చును.

అమ్లపిత్తవ్యాధులయందును, నేత్రవ్యాధులయందును ఉన్మాదము, అపస్మారములయందును, ప్రమేహ వ్యాధుల యందు ఇది గొప్ప గుణకారి. దీనితో బ్రహ్మిగాని, శంక పుష్పిగాని కలిపి ఇంజక్షను చేసిన బాగుగా గుణమిచ్చును.

## 92. శిలాజిత్ I. M. S. C.

చర్మముక్రిందను, కండరములోను ఇంజక్షన్ చేయవచ్చును.

మధుమేహ వ్యాధుల నివారించుటయందు ఇది బాగుగా తోడ్పడును. మేహ ఉడుకులయందును ఇది గొప్ప గుణకారి. దీనితో చందన్ ఇంజక్షన్ కలిపికూడ చేయు చుండిన గుణము కనుపించును.

## 93. స్వర్ణ పర్పటి I. M. I. V.

కండరములోను, రక్తనాళములోను ఇంజక్షను చేయవచ్చును.

పూయమేహము, శ్వాసవ్యాధులు, శరీరమంటలు, క్షయ, కండ్లమంటలు, మేహవ్యాధులు, అతిసారము, గ్రహణి, బలహీనము, రక్తవికారము వీటియందు ఈ ఇంజక్షన్ మంచి గుణముచూపును. దీనితో అభ్రకము ఇంజక్షన్ కలిపి కూడ జేయవచ్చును.

94. వసంత మాలతి I. M. S. C. I. V.

కండరములోను రక్తనాళములోను చర్మము క్రిందను ఇంజక్షను చేయవచ్చును.

క్షయవ్యాధి జ్వరము, ధాతుగత జ్వరము, జీర్ణ జ్వరము, పురాణజ్వరము, వాతజ్వరము, శ్లేష్మజ్వరము, న్యూమోనియా జ్వరము, సన్నిపాత జ్వరములు మొదలగు అనేక విధములైన జ్వరములను నివారించి పుష్టిని శక్తిని ప్రసాదించును.

95. గంధక్ I. M. S. C.

కండరములోను చర్మముక్రిందను ఇంజక్షన్ చేయవచ్చును.

సర్వ విధములైన రక్తదోష వికారములయందు చర్మవ్యాధులయందు సవామేహముల యందును సెగవ్యాధుల యందును కుష్ఠ వ్యాధులయందును గంధక్ మిక్కిలి గుణకారి. దీనితో శిలాజిత్ కలిపి ఇంజక్షన్ చేసిన ప్రమేహ వ్యాధులందు యెక్కువ గుణము కనుపించును. మొండికి పడిన వ్యాధులకొరకు చాలా ఇంజక్షనులు చేయవలసి యుండును.

96. కనకసుందర రస్ I. M. I. V.

కండరములోను రక్తనాళములోను ఇంజక్షన్ చేయవచ్చును.

అతిసారము గ్రహణి వ్యాధులయందు యిది ఉప

యోగపడును. గర్భిణి తగ్గినతర్వాత కూడ దీని నిచ్చు చుండిన బలహీనము నివారించి రక్తవృద్ధి కలిగించి ఆరోగ్యవంతునిగా జేయును.

## 97. జవాహిర్ మొహరా I. M. S. C.

కండరములోను, చర్మముక్రిందను ఇంజక్షన్ చేయవచ్చును.

గుండె ఆగినవారలయందును, గుండెపోటు, గుండె బలహీనములయందు, కాళ్ళుచేతులు చల్లబడినప్పుడున్ను, శరీరమునకు వేడి కలుగుటకును, నాడి సన్నగిలినప్పుడున్ను యిది అమృతమువలె గుణమిచ్చి ఆరోగ్యమును ప్రసాదించును.

## నూతనముగా వచ్చిన మరికొన్ని అల్లోపతీ ఇంజక్షన్లు

### 1. మెథియోకొలైన్ "ఓపిల్".
### (Methiocholine "Opil") I. M.
### కండరములలో చేయు ఇంజక్షన్.

మెథియొనైన్, కోలైన్, ఇనోసిటాల్, బిటాయిన్ హైడ్రోక్లోరైడ్ మరియు విటామిన్ $B_{12}$ లను నోటిద్వారా యివ్వలేనప్పుడు పై ఇంజక్షన్ వాడవలెను.

దీనిని కాలేయమునకు సంబంధించిన వ్యాధులలో (Liver disorders), అతిమూత్రవ్యాధి (diabetes) యందును, hypercholesterolemia, coronary వ్యాధులందును, atherosclerosis, alcoholism, nephrosis, hypertension లందును వాడవలెను.

1 to 2 ml. చొ॥న కండరములలో ఇంజక్షన్ చేయవలెను. ఓరియంటల్ ఫార్మస్యూటికల్స్ వారిచే తయారు చేయబడినది.

N. B:- సిరుప్ మెథియోకోలైన్ కాంపౌండ్ లేక ఎలిక్సిర్ బి. కాంప్లెక్స్ కాని ఇంజక్షన్‌తోపాటు వాడవచ్చును.

### 2. రెటిక్యులిన్ (Reticulin)

(Extract of Liver.)

దీనిని బలహీనత, రక్తములేక శరీరము తెల్ల బారుట (anaemia), అన్నివిధములైన Macrocytic Anaemia ల యందును వాడవలెను. దీనియందు anti-anaemia కు సంబంధమైన గుణములేకాక, Vitamin B. Complex, nicotinamide, lactoflavin, nicotonic acidamide, Vitamin C. కూడా యుండును. మామూలుగా దినమునకు 2 CC చొ॥న ఇవ్వవచ్చును. 2 CC Reticulin ఇంజక్షన్ చేసినచో 2 lbs., స్వచ్ఛమైన కాలేయమునకు సమానము.

2 CC, 10 CC & 30 CC వయల్స్ గలిగిన 5, 25, 100 ఆంపుల్స్ గల డబ్బాలు లభించును.

దీనిని ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబ్స్, వారు తయారు చేయుచున్నారు.

### 3. పైరివిక్ (Pyrivic) I. M.

(Vitamin B, & Vitamin $B_6$).

కండరములందు చేయు ఇంజక్షన్.

సాధారణముగా కలుగు త్రిప్పుట, వాంతులు (Nausea) గర్భిణీసమయమందలి వాంతులు, క్షయ (T. B.) మొద

లగువానియందు వాడుదురు. చిన్నపిల్లలు వణుకుట, కొట్టుకొనుట, వంకరపోవుట, (convulsions) radiation sickness, acne Vulgaries, Seborrheic dermatitis, paresis, chorea, mysthenia gravis, agranulocytosis, beriberi, pellagra, మరియు ariboflavinosis లందు మంచి గుణము నిచ్చును.

1 ml లేక 2 ml ఇంజక్షన్ చేయవలెను. రబ్బరుతో మూసిన 10 ml వయల్సులో దొరుకును. తయారు చేయు వారు ఇంటర్ కాంటినెంటల్ ఫార్మ, బొంబాయి.

4. కాటెమెసిన్ I. M.

Katemesin.

కండరములందు చేయు ఇంజక్షన్

గర్భిణీస్త్రీలయందు వాంతులు రాకుండా వాడవలెను. Morning Sickness, Hyperemesis gravidarum మొదలగు వ్యాధులయందు వాడనగును. ఇంట్రమస్క్యులర్ వల్ల కలుగు బాధ, నొప్పిని 1 CC మందున్ను, benzyl alcohol ను కలిపి వాడుటవలన తగ్గించగలము.

పై రోగములకేగాక, Agranulocytosis, Radiation Sickness, infants convulsions యందు వాడవచ్చును.

మొత్తం 1 లేక 2 ఆంపుల్స్‌వరకు, వ్యాధి ఉగ్రత నుబట్టి ఇవ్వవచ్చును. 3, 6, 25 ఆంపుల్స్ గల డబ్బాలు లభించును. Raptakos, Brett & Co., బొంబాయి వారి తయారీ.

5. కొల్లోబియాన్.

Collobion.

(Colloidal calcium, Vit. D. & Vit. $B_{12}$)

నీరసించుట, పిల్లలు సరిగా ఎదగకపోవుట, రోగములనుండి తిరుగుముఖము పట్టినట్టి బలహీనస్థితులందును, గర్భిణీ సమయములందును, Lactation నందును వాడనగును. చర్మవ్యాధులందుకూడ వుపయోగపడును.

10 CC & 20 CC రబ్బరుమూతగల వయల్సులో లభించును. సిగ్మా కంపనీ, బొంబాయివారు తయారు చేయుదురు.

6. బ్రోమార్సిటోన్.

(Bromarsitone) I. M.

కండరములయందు చేయు ఇంజక్షన్.

నరముల బలహీనత (nervous disorders) యందు వాడినచో బలము గలుగుటయేగాక నాడీ మండలమును క్రొత్తదానిగా చేయగలదు, Hysteria, Hysteroepilepsy,

Neurasthenia, Insomnia, Nervous excitability లందు మంచి గుణము నిచ్చును.

సాధారణముగా దినమునకు లేక రెండు రోజుల కొకతూరి 1 ఆంపుల్ యివ్వవచ్చును. 2 CC గల 12 ఆంపుల్సు, 50 ఆంపుల్స్‌ల డబ్బాలుగా దొరుకును. యునైటెడ్ ఫార్మస్యూటికల్స్, బొంబాయివారిచే తయారు చేయబడినది.

7. నియోఫిల్లిన్.
న్యూట్రల్ A. F. D.
Neophyllin Neutral A. F. D. (I. M.)
కండరములలో చేయు ఇంజక్షన్.

ఉబ్బసము (Asthma), Angina pectoris, aortic or hypertensive disease, chronic myocarditis, cardiac dyspnoea, psychiatric disorders లందు వాడవలెను.

రోజుకు 1 ఆంపుల్ చొ॥న వాడనగును. వలసినచో 10 ml. నార్మల్ సాలైన్ లేక గ్లూకోస్ (Normal Saline or glucose) లతో కలిపి మెల్లిగా Intravenous ఇంజక్షన్ చేయనగును.

6X2 ml. మరియు 25X2 ml. అంపుల్స్ గల డబ్బాలు దొరుకును.

ది ఆంగ్లో ఫ్రెంచి డ్రగ్ కం., వారి తయారీ.

## 8. ఇన్ ఫెరాన్.

## Inferon (I. M.)

దేహమునకు సరిపడు "ఇనుము" లేకపోయినచో (Iron deficiency) బలహీనత, రక్తము లేకపోవుట (anaemia) మొదలగునవి సంభవించును. పాలుత్రాగు పిల్లలలో ఇది ముఖ్యముగా చూడనగును. అటువంటప్పుడు Inferon ఇంజక్షన్ యిచ్చిన, పైవాటినుండి విముక్తికాక, పూర్తి ఆరోగ్యము లభించును. శస్త్రచికిత్సలందు (Surgical cases) ఎక్కువ రక్తము స్రవించినయెడల, దీని సహాయమున త్వరలో ఆరోగ్యవంతులగుదురు. 2 ml. ఆంపుల్స్ 5 లేక 100 గా డబ్బాలలో దొరుకును. Benger Labs., వారు తయారు చేయుదురు.

## 9 మాక్రాబిన్.

## Macrabin.

ఇందు విటామిన్ $B_{12}$ ఎక్కువగా లభించును. కావున రక్తము లేకపోవుట (anaemia), బలహీనతలయందు వాడవలెను.

Glaxo వారు తయారు చేయుచున్నారు.

## 10. పాన్విట్.

## Panvit B-1. (I. M.)

మన శరీరములో విటమినులు లేకపోవుటవల్లనే అనేక రకములగు వ్యాధులు సంభవించుచున్నవి. పై ఇంజక్షన్ అన్నివిధములైన విటమినులు లేకపోవుటయందు (avitaminoses) వాడవచ్చును.

Diarrhoea (అతివిరేచనము), లివర్ (Liver) పనిచేయకపోవుట, మృక్వర సంబంధమైన వ్యాధులందు (Pancreatic disorders), పిత్తసంబంధమైన వ్యాధులందు (Biliary diseases), celiac deseases, sprue, peptic ulcer. Anorexia, nausea, vomiting, peritonitis, high fever, beriberi, neuritis, stomatitis, లందును, శస్త్రచికిత్సకు ముందుగాను, తర్వాతను వాడవలెను. గర్భిణీ స్త్రీలకును, ఎదగని పిల్లలకును వాడవచ్చును.

1-2 CC ఒక్కరోజుకు లేక రెండు రోజులకు కండరములలో చేయవలెను.

రబ్బరుమూతగల 10 CC సీసాలు, 2 CC ఆంపుల్స్ 6, 12, 50 గల డబ్బాలలో దొరుకును.

## 11. క్రులివెక్స్.

## Crulivex.

రక్తము లేకపోవుట (anaemia), Vit. B. కాంప్లెక్స్

లేకపోవుట, బరువు తక్కువగా యుండుట (under weight), గర్భిణీ సమయములందు, శస్త్రచికిత్సల తర్వాత, వ్యాధి తిరుగుముఖం పట్టినతర్వాత, బలహీనతలందు, భోజనములేక చిక్కుట (Malnutrition) యందు వాడినచో వెంటనే గుణము నిచ్చును.

2ml. గల ఆంపుల్స్ 6, 25, 100 గా గల డబ్బాలు లభించును. ది ఫెయిర్ డీల్ కార్పొరేషన్‌వారు తయారు చేయుచున్నారు.

## 12. సిగ్మకాల్-సి.

## Sigmacal-C.

వివిధ రకములగు హెమరేజి (haemorrhage) లందును, నొప్పి, మంటలు (inflammatory) మొదలగు వాటియందును, calcium మరియు Vit. C., లేని పరిస్థితులందును వాడవలెను.

10 CC గల ఆంపుల్స్ 6, 12, 50 గల పెట్టెల్లో దొరకును.

## 13. బై-గ్లు-డాక్స్. (I. V.)

## Bi-Glu-Dox.

గర్భిణీసమయ వాంతులందును; శస్త్రచికిత్సల ముం

దును, తర్వాతను, అతివిరేచనము (Diarrhoea) లందును, చిగుళ్ళు పగులుట, ఉబ్బుట మొదలగువానియందును, రక్త స్రావము (haemorrhage) నందును వాడవలెను.

25 ml. గల ఆంపుల్స్, 5, 10, 50 గల డబ్బాలలో దొరుకును. ది ఫెయిర్ డీల్ కార్పొరేషన్, బొంబాయివారు తయారు చేయుదురు.

## 14. కాంప్లెక్స్ 'B' "గ్లాక్సో". Complex 'B' "Glaxo".

అలసట, బలహీనత, ఆలోచించలేకపోవుట మొదలగునవన్నియు B-Complex లేకపోవుటయే. టైఫాయిడ్, విరేచనములు, లివర్‌కు సంబంధించిన వ్యాధులు వచ్చి పోయినతర్వాత పై బాధలు సాధారణంగా వుంటాయి. సరియగు పదార్థములు తినకపోవుటచేకూడా ఆకలి లేకపోవుట మొదలైనవి ఏర్పడును.

అప్పుడు, పై ఇంజక్షన్ చేయవచ్చును.

10 CC గల రబ్బరుమూత సీసాలలో లభించును.

**Glaxo Labs** వారిచే తయారు చేయబడినది.

## 15. యోడోపిల్ (I. M. or S. C.)

## Yodopil.

బ్రాంకైటిస్ (Bronchitis), ఉబ్బసము, కంటికండరములయందు పక్షవాతము (Paralysis) వచ్చినప్పుడు, actinomycosis, hypertension, మొదలగు వానియందు వాడనగును.

1 ml. to 2 ml. ఒక రోజుకుగాని, రెండు రోజులకుగాని రోగానుగుణముగా యివ్వవలెను. వైద్యకాలమున బీరు, వైన్, మాంసము మొదలగునవి వాడకూడదు.

2 ml. గల 10 ఆంపుల్స్ డబ్బాలు లభించును. Oriental Pharmaceutical Ind., వారిచే తయారుచేయబడినది.

## 16. బెనాపెన్.

## Benapen. (I. M.)

"Penicillin" కు బదులుగా వాడెదరు. రోగి ప్రతి రోజు హాస్పిటల్‌కి వెళ్ళలేకపోయినా, ఎక్కువ ఇంజక్షన్‌లు తీసికొనుటకు యిష్టము లేకపోయినా, 4 రోజుల కొక్క

యింజక్షన్ చొప్పున "Benapen" యివ్వవచ్చును. రోగ ములు రాకుండగను, 'పెనిసిలిన్' చాలా మోతాదులో ఇవ్వ వలసినను (rheumatic fever & syphilis) వాడనగును.

పెద్దలకు 2 CC, పిల్లలకు 1 CC పిరుదుల లేక తొడలయందలి కండరములలో యివ్వనగును.

10 CC సిలికన్ వయల్స్‌లో దొరుకును.

Glaxo Labs. వారి తయారీ.

## 17. బెనాపెన్ ఫోర్టిఫైడ్.

## Benapen Fortified (I. M.)

పై "Benapen" కంటె ఎంతో ప్రతిభావంత మైనది. 96 గంటలకుపైగా పనిచేయును. కాలుట, రాచ పుండు (carbuncle) మొదలగు "బాక్టీరియా"కు సంబంధిం చినవాటికి ఒక్క ఇంజక్షన్‌తో జవాబు చెప్పవచ్చును. శస్త్ర చికిత్సలందుకూడా ఉపయోగింతురు.

పెద్దలకు 2 CC, పిన్నలకు 1 CC చొ॥న పిరుదు లందలి, లేక తొడలంధలి కండరములకు యివ్వవలెను.

సిలికన్ వయల్స్‌లో "Single dose" లభించును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 18. Vic. B. Complex.
## (Liver & $B_{12}$) I. M.

శరీరమునకు Vitamin B. Complex యొక్క ముఖ్యావసరము అందరెరిగిన విషయమే. మనశరీరములో "Enzymes" సరిగా పనిచేయుటకు, కణముల శ్వాస క్రియకు, పుట్టినది మొదలు గిట్టువరకు Vit. B. Complex యొక్క అవసరము కలుగును. అది లేనిచో అనేక రకము లగు వ్యాధులేర్పడును. కాబట్టి ఎల్లప్పుడు ఒకే విధమగు ప్రమాణములో Vit. B. Complex అవుసరమగును.

1 లేక 2 ml. కండరములందు వారములో రెండు లేక మూడుసార్లు ఇవ్వవలెను. 10 ml. వయల్సులో లభించును.

ఇంటర్ కాంటినెంటల్ ఫార్మా వారిచే తయారు చేయబడినది.

## 19. మల్టివిక్.
## Multivic (I. M.)

ఇందులో 9 విటమినులు సరియగు ప్రమాణములో

యుండును. రోగములు రాకుండగను, Vitamins లేక బాధపడు సమయములందును సహాయపడును.

2 ml. కండరములందు ఒక్క వారమునకు 2 లేక 3 సార్లు రోగి పరిస్థితినిబట్టి ఇవ్వవచ్చును.

10 ml. గల రబ్బరు వయల్స్‌లో దొరకును. పై కంపెనీవారే తయారు చేయుచున్నారు.

## 20. బారఫోల్ (I. M.)

## Barafol.

Macrocytic Anaemia కు ముఖ్యకారణములు ఫోలిక్ ఆసిడ్ (Folic acid), Vitamin $B_{12}$ లేకపోవుటయే. Red Blood Cells (ఎఱ్ఱ రక్తకణములు) అభివృద్ధికిగాను Folic acid మరియు Vitamin $B_{12}$ అవసరము. అన్నివిధములైన Macrocytic anaemia లందునూ Barafol ను నిర్భయముగా వాడవచ్చును.

1 నుండి 3 ml. వరకు, వారమునకు రెండుసార్లు చొ॥న కండరములలోనికి ఇంజక్షన్ చేయవలెను.

1 ml. ఆంపుల్స్‌లోను, 10 ml. వయల్సులోను లభించును.

ది ఆంగ్లో-ఫ్రెంచి డ్రగ్ కం., వారు తయారు చేయుచున్నారు.

సమాప్తి.

D. R. D. H. Rao.

---

నోటు:—అల్లోపతి పేటెంటు ఔషధములకొరకు మా ఆంగ్లేయౌషధ మిక్చర్సుగైడును చూడుడు.

